పైసన్నివేశమున పాండవాగ్రజుని మాటలలో అతని సంస్కారమునెల్ల ఈసు రోషము ఇంకించినవి. తనయున్నది స్వర్గ మయ్యుఁ దానుమాత్రము ప్రాకృతుఁడే! చచ్చిన సుయోధనునెడ, అతని పక్షమువారి యెడఁ జలమే సాధించుచున్నాఁడు! భావము పరిపక్వదశకు రాదు! ధర్మోపదేశము లెల్ల శ్రవణమాత్రములే! ఆత్మ నంటవు! అనుష్ఠానమునకు రావు! అసహనము—పామరత్వము స్వాభావికములు. తనవా రని, ఎదిరి యని భేదబుద్ధి తలఁగదు! సుయోధనాదులు స్వర్గభోగములనుభవించుచున్నారని, తనవారు నరకబాధలందుచున్నారని విషాదము!

"...'దైవ మకట! ఇట్లు సేసెనె! కీ డేమి సేసిరో కో వీర
లిన్నరకమునకు నేఁగుదేర వలసినయట్టిది! వాసవాద్యమరులు
నీచులు వో! వీరి నేవిచార మించుకయును లేక ఇట్టికష్టపు టిడు
మలఁ బెట్టెడిచె! ధర్మమా తెఱంగు మాలితే నీవు! సజ్జనమాన్యు లలఘు
సత్య[illegible]రులు దయాధుర్యులు నిత్యదాన
గతులు బహుదక్షిణాంచిత క్రమవితాన పాలితాత్ము లనర్హంపు బాటుపడిరి!"

ఇట్లు తనవారి నగ్గించుచు వాపోయినాఁడు!

"ఒకటను మేలుసేయని సుయోధనుఁ డెమ్మెయి దేవపూజ్యుఁడై
సకలసుఖానుభూతియు నజస్రము పెంపు వహింప నొప్పి, దృ
ష్టికిఁ గడు వ్రేఁకనై తనదు చెల్వులు చుట్టలుఁ దాను సంతసం
బు కలిమి నేచి, మి న్నడిచి పుణ్యపరావృతుఁ డై వెలింగెడున్!"

---

ఏషదుర్యోధనో రాజా పూజ్యతే త్రిదశైః సహ,
సద్భిశ్చ రాజప్రవరై ర్య ఇమే స్వర్గవాసినః.
వీరలోకాగతిం ప్రాప్తా యుద్ధే హత్వాఽఽత్మన స్తనుమ్,
యూయం సర్వే సురసమా యేన యుద్ధేన బాధితాః.
స ఏష క్షత్రధర్మేణ స్థాన మేత దవాప్తవాన్,
భయే మహతి యోఽభీతో బభూవ పృథివీపతిః.
న త న్మనసి కర్తవ్యం పుత్త్ర యద్ద్యూతకారితమ్,
ద్రౌపద్యాశ్చ పరిక్లేశం న చిన్తయితు మర్హసి.
యే చాన్యేఽపి పరిక్లేశా యుష్మాకం జ్ఞాతికారితాః,
సంగ్రామేష్వథవా యత్ర న తాన్ సంస్మర్తు మర్హసి.
సమాగచ్ఛ యథాన్యాయం రాజా దుర్యోధనేన వై
స్వర్గోఽయం నేహ వైరాణి భవన్తి మనుజాధిప.

అని చూపోపమి కుళ్ళుపోతుతనము వెడలఁగ్రాసినాఁడు. తనవారిదెస తగులము వాయఁడు. ఎదిరిని గూర్చి జాలిగొనఁడు. స్వర్గప్రవేశముకూడ అతని స్వభావమునుఁ మార్పజాలదైనది! స్వర్గంగాశుద్ధిస్నానముతోఁ బ్రాకృతభావము నశించి ముక్తుఁడైనాఁడు !

ఈవిషయ మింతట సమాప్తము. చిత్తవృత్తికి సంబంధించిన దగుట ధర్మజుని ద్యూతవ్యసనము నింత సూచింతును.

ధర్మజుఁడు – జూదరి :

ప్రాజ్ఞత వెంట పామరత్వము; విశేషించి జూదపు దగులము. తొలిమాఱు జూదమున రాజ్య మోటువడినాఁడు. ద్రోవదిగోడాటచూడ నోపక, వారు వీరు చెప్పి ధృతరాష్ట్రునితో రాజ్యము ఇప్పించినారు. రెండవమాఱు పిలిచినది తడవుగాఁ దగుదునని మాయజూదమన్న తెలివియేని లేక, మైమఱచి తఱలినాఁడు. అతనికి జూదముముందు బ్రహానందముగూడ గవ్వకుఁజెల్లదు. నెత్తము మొదలయినవి. అఖిల రాజ్య సంపదల నొడ్డి యోడినాఁడు. అనుజుల నోడినాఁడు. ఆలి నోడినాఁడు. దన్నుఁ గూడఁ గోల్పడినాఁడు. భూత భవిష్యద్వర్తమానములందు జూదగాండ్రలోఁ దలకట్టు నని గర్వింపఁదగినాఁడు. ద్యూతలాలసత్వమున నిరుపముఁడు. రజస్వలను ఇల్లాలిని కొప్పువట్టి యీడ్చితెచ్చి యన్నదమ్ములయెదుట, నడికొలువునఁ బట్టము లొలిపించిరి. అరణ్యమున అజ్ఞాతమునఁ బెరసి పదుమూఁడేండ్లు కడగండ్లబ్రదుకు ! అడవులలో పండ్రెండేండ్లు గడపి అజ్ఞాతవాసదీక్ష జరుపుటకు విరాటనగరమునకుఁ బో నిశ్చితమైనది. విరటునిపాల, అన్నదమ్ములు ఏయేపనులవెంట, మెలఁగవలయుటయూ నేర్పాటు జరిగినది.

ఆపట్టున—

“ఆతనితో నొక్కొకమఱి
కౌతూహలవృత్తికిం దగం దొడఁగి మృదు
ద్యూతంబునఁ గ్రీడింతుం
జేతోముద మొదవ నక్షశిల్పప్రౌఢిన్.” (విరాట. ఆ.౧.)

“మణిమయమ్ములు, కలధౌతమయములును, సు
వర్ణమయములు నాదిగా వలయునట్టి
యడ్డసాళులు గలవు నా కభిమతముగ;
వానిఁ గొనిపోయి చూపుదు వరుసతోడ.” (ఆ. ౧.)

“అడ్డసాళులు గలవు నా కభిమతముగ” వని మురిసి మురిసి చెప్పికొన్నాఁడు. తనయగచాట్ల కన్నిటికిఁ గారణ మయినవి పాచికలే యనిన తెలివి

లేక, ద్రుపదరాజుబిడ్డకుఁ దనధర్మపత్నికిఁ బరిభవకారణ మయినవి, ఆలితో ననుజాతులతోఁ గూడి కొగ్గవలయు దుర్గతికిఁ దెచ్చినవి పాచికలే యని సిగ్గులేక, శ్రీమద్గాంభీర్యముతో 'నా కభిమతముగ నడ్డసాళులు గల'వని 'వానిఁ గొనిపోయి చూపుదు వరుసతోడ' నని యనుచున్నాఁడే! "ఆతండు నానావిధములగు నక్షంబుల ముడి కక్షంబున నిడికొని చని......" నాఁడట! పంద్రెండేఁడులు భద్రముగా మూటగట్టి దాఁచుకొన్నాఁడే! ప్రాణములకన్న పాచికల నెక్కుడుగఁ గాచికొన్నాఁడు! పాచికలమీఁద ప్రాణములుసయితము బలాదూరనుకొన్నాఁడు!

విరటుఁడు వేఁడుకగఁ బ్రొద్దుపుచ్చుటకై (విరాటము-ఆ.౫.) "సారెలు తెమ్మని పనిచి పలుక ముందటికిఁ దిగిచికొనుచు,'ఇంక ర' మ్మనవుడు, పాండవాగ్రజుండు 'జూదం బాడుట యెంతలెస్స!'" అని యుప్పొంగినాఁడు! ఏమాతనిదుల్లాసము! ఒడలు మఱచినాఁడు! ఆడఁ గడంగు నప్పుడు పూర్వస్మృతి ఇంచుక కలిగినది కాఁబోలు!—

"జూద మాడి ధర్మసూనుండు రాజ్యంబు,
ననుజులను, బ్రియాంగనను బణంబు
గాఁగ నొడ్డి యోడి కాఱియఁ బడఁడె! య
ట్లగుట, దీనితోడి యర్థి కీడు."

అనుకొన్నాఁడు. కాని ఆఁగినాఁడా?

కొస ముచ్చట:

ఇట్లు చిత్రిత మయినది ధర్మరాజుచరిత్ర. ఇంతకన్న సూక్ష్మాంశములు తడవ నవకాశమున్నది. కాని కత పెరుగును. ఆతని చరిత్ర తెలుపుటకుఁ జాలిన ముఖ్యాంశములను గొన్నిటి నేర్చి కూర్చితిని. తనకన్నసంతాన మెట్టి దయినను సమదృష్టితో నాదరించు తల్లింబోని వ్యాసభగవానుఁడు పాత్రచరిత్రనిర్వహణమున నుదారతమై వర్తించె ననుట కీధర్మచరిత్ర చిత్రణ మొక్కటి చాలును.

# భారతము – పరమార్థ ప్రదర్శకము

(కథావృత్తము)

## శ్రీకృష్ణుడు.

ఏపాత్రమున కాపాత్రముతో ప్రత్యేకసంబంధ మేర్పఱచుకొని అందఱిలోను అంతరాత్మయయి నిగూఢముగ వెలుఁగొందు కృష్ణుని విడిచి, భారతము నంతను తనతేజముచే నిండించి చరాచరాత్మకమగు ప్రపంచము నెల్ల తనదివ్యమూర్తిలో నొక్క కిరణముగాఁ జేసిచూపిన శ్రీకృష్ణునికడకు వత్తము. మనదృష్టి చెదరిపోకుండుటకై ఈ శ్రీకృష్ణుని ఇరువిధములుగ విభజించుకొని విచారింపవలెను. కృష్ణునియందే సగుణబ్రహ్మమగు కృష్ణుఁ డొకఁడు, అఖండసచ్చిదానందమయుఁడగు నిర్వికారకృష్ణుఁ డొకఁడు. సగుణబ్రహ్మమునుగూర్చి తొలుత విచారింతము.

## శ్రీకృష్ణుని లీలాస్వరూపము.

ఇపుడు పాత్రములను వదలి కథ నాశ్రయింపవలెను. భారతముపేరు చెప్పఁగనే మనకన్నులయెదుట నిలుచు కథాభాగము యుద్ధము. ప్రథమపర్వములలోనున్న లాక్షాగృహదాహము, పాంచాలీపరాభవము మున్నగు నంశములన్నియు నదులవలె వచ్చి ఈభారత సమరసముద్రమున నేకమైనవి. యుద్ధానంతరము కథకు సంబంధింపని శాంత్యానుశాసనికపర్వములను దీసివైచినచో తక్కినభాగ మంతయు భారతరణమునఁ బడక మిగిలిన రాజులవంశముల నిష్క్రమణమునుగూర్చి ముచ్చటించునది యగుటచే దానిని యుద్ధమున కనుబంధము (appendix) గాఁ జేర్చుకొనవచ్చును. ఉద్యోగపర్వము మొదలుగా స్త్రీపర్వము వఱకునున్న ఈయుద్ధకథలో భారతకవి శ్రీకృష్ణుని కెట్టిప్రాధాన్యము నిచ్చియున్నాఁడో చూడవలసియున్నది.

ఈయుద్ధకథ మిగులవిచిత్రమైన స్వరూపము కలది. ఒకవైపునుండి చూచినచో నిది యంతయు విషాదమయముగాఁ దోఁచును. ఎక్కడ చూచినను ముగ్గడుగుట్టములు, పీనుఁగుపెంటలు నేనుఁగులు, నేలకు వ్రాలు పదాతివర్గము, గోపురములవలె కూలిపోవుచున్న యతిరథ మహారథులు! ఎంతటివారికైన స్త్రీపర్వము చదువుచున్నపుడు గుండెనీరు గావుండును. ఆపర్వములో శ్మశానవాటికయగు కురుక్షేత్రమును దీసికొనివచ్చి భారతకవి మనయెదుటఁ బెట్టినాఁడు. మనలో విషాదాంతనాటకములు లేవన్న కొంతము కాని, భారతపఠనమువలన కలుగు

నుత్తమవిషాదానుభూతి యే షేక్స్పియరు ట్రాజెడీ (Tragedy) వలన లభించు చున్నది? కాని ఒక్కమాఱు మఱింత శ్రద్ధతో భారతకావ్యపఠనమునకుఁ గడంగుదుమేని ఈ శ్మశానరంగ మంతయు మంత్రించినట్లు మాయమైపోయి తనచేఁ బ్రేరేపింపఁబడి తనశక్తులే మహావాయువులవలె ఒండొంటితోఁ బోరాడు చుండఁగా తనలీలకు తానే యానందించు శ్రీకృష్ణుని సౌమ్యతేజము దృగ్గోచర మగుచున్నది. ఇట్లొకవైపునుండి చూచినచో భారతము విషాదాంత నాటకము; ఇంకొకవైపునుండి చూచినచో శుభాంతనాటకము. ఒకవైపున ప్రళయతాండవ ప్రవర్తియగు ఫాలలోచనుఁడు; ఇంకొకవైపున లీలామానుషధారి యగు పార్థసారథి. సౌమ్యాగ్నేయ విభేదముగల ఈ స్వరూపద్వయము నొక్క శ్రీకృష్ణుని యందే మూర్తీభవింపఁ జేసి భారతకారుఁడు పరస్పర విరుద్ధస్వరూపమగు సృష్టి కభేదార్థము చెప్పినాఁడు.

విరాటపర్వమున నభిమన్యుని వివాహసందర్భమున శ్రీకృష్ణుఁడు చుట్టపుచూపుగాఁ బ్రవేశించినాఁడు. వివాహానంతరము రాజులసమక్షమున పాండవుల రాజ్యభాగమునుగూర్చి న్యాయానురక్తుఁడగు మధ్యస్థునివలెఁ బ్రసక్తి తెచ్చినాఁడు. కౌరవులకు సందేశ మంపుటకు నిశ్చిత మైనవెనుక—

కౌరవులును పాండవులును నారయ నా కొక్కరూప; అట్లగుటఁ, దగన్
వారును వీరును తమతమ నేరిమిమై ధరణి యేలి నెగడఁగఁ జూతున్.
పెండ్లి కని పిల్వఁ బంచిన ప్రియముతోడ నేగుదెంచితి; మిన్నాళ్లు నెల్లయొప్పి
దములఁ జూచితి; మియ్యెడఁ బదవుగాఁగ నిలువఁ దీఱదు పోయి రావలయు మాకు.

అని యుద్ధ మనిన నేమాత్రము గిట్టనివానివలెను, ఎవ రెట్లు పోయినను తన కేమియు జోక్యము లేని తటస్థునివలెను మాటాడి సెలవు పుచ్చుకొన్నాఁడు. దుర్యోధనార్జునులు తనసాహాయ్యము నపేక్షించి వచ్చినపుడుకూడ ఈతటస్థ భావమునే అత్యంతచతురముగా నటించినాఁడు. ఏపక్షమున నున్నను తా నాయుధమును వహించి యుద్ధముచేయ నని ప్రతిజ్ఞ వట్టినాఁడు.

రాయబారమునకై సంజయుఁడు వచ్చినపుడు పేరోలగమున ధర్మరాజు తన్ను మధ్యస్థునిగాఁ బిల్చువఱకు నేమియు మాటాడనే లేదు. కాని ధర్మరాజు తన్ను పేర్కొనకుండఁగనే రంగమున కుఱికి కౌరవులకు పాండవులకుఁ గలప్రాతిపగల నన్నిటిని త్రవ్వి "ఈసంధికార్య మత్యంత దుర్ఘట మని తలఁచెద" నని తెగఁగొట్టి చెప్పుచున్నాఁడు. ఇట్లు చెప్పుటలోనైన తనమధ్యస్థభావ మెక్కడను జాఱిపోకుండ కౌరవులు పాండవులకు చేసిన దుర్నయములను బురస్కరించుకొని

యలుక పొడమిన న్యాయానురక్తునివలెనే మాటాడుచున్నాఁడు. ఈమధ్యస్థభావమున కింకను పరిపోషకముగ నుండుటకయి కౌరవుల మేలుఁగోరి యుద్ధమెట్లయినను తప్పింప నెంచినవానివలె "తగవును నేర్పును నామీఁద నిలుచుట నాకుఁ గీడె" యని ఎంతో గడుసుదనముతో దౌత్యభారమును బైవైచుకొనుచున్నాఁడు. ఇది మొదలుకొని భారతపాత్రముల నన్నిటిని త్రోసి రాజని శ్రీకృష్ణుఁ డొక్కఁడే మనదృష్టి నాకర్షించుచున్నాఁడు.

రాయబారము సందర్భమున శ్రీకృష్ణుని చిత్రించిన కవిబ్రహ్మచాతుర్యము వర్ణనాతీతము. శ్రీకృష్ణుని కంటె యుద్ధము నపేక్షించువారు భారతకావ్యమున మఱి లేరు, కాని ధర్మరాజు తన్ను రాయబారమునకుఁ బొమ్మని ప్రార్థించుట మొదలుగా కౌరవసభనుండి తాను మరలి వచ్చి ఈ రాజ్యతంత్రములతో విసుగు వచ్చినవానివలె "నేను పోరలంగల యంతయుఁ బొరలితి...........కౌరవుల యెడ దండంబునక్క నొం డుపాయంబు లేదు. మీకుం బోలినతెఱంగు సేయుండు" అని పలుకువఱకు ఎక్కడను సంధికై ప్రయత్నించు శ్రీకృష్ణుని మానుషమగు తటస్థభావమునకు ఆతనిలోపల వెలుఁగు యుద్ధసంకల్పము బయల్పడి భంగము తెచ్చుటలేదు. ధర్మరాజుతో "నేను కయ్యపు శకునంబు లెన్నియేని గంటి; నీ వనుత్సాహివి గాఁగవల" దని ప్రబోధించుచున్నను, అర్జునునితో "సుయోధనుండు సంభావనచేసి పాలొసఁగు పాడియు కల్గిన బాల్యమాదిగా నేవిధనైననున్ జెఱుప నింతలు పాపము లాచరించునే" అని యుద్ధము సూచించుచున్నను, తుదకు భీముని పురికొల్పునపుడు, ద్రౌపది నోదార్చునపుడు, కుంతికి ధైర్యము చెప్పునప్పుడు నయినను శ్రీకృష్ణుఁడు దూరాలోచన గలిగిన రాజ్యతంత్రజ్ఞునివలెఁ గానవచ్చుచున్నాఁడే కాని యుద్ధాతురుఁ డైనట్లుగ మన కెంతమాత్రము స్ఫురించుట లేదు. తన కత్యంతాంతరంగికుఁ డయిన విదురునితోఁ గూడ—

చుట్టములలోన నొప్పమి పుట్టినప్పు
డడ్డపడి వారితోడఁ గొట్లాడి యైన
దాని నుడుపంగఁ జూరకున్నవానిఁ గ్రూర
కర్ముఁ డని చెప్పుదురు కర్మకాండవిదులు.

అని ధర్మానురక్తుని తటస్థభావమునే ప్రకటించుచున్నాఁడు. బహిరంగసభలో దుర్యోధనాదులకు యుద్ధము మానవలసిన దని జంకించియు, భంగించియు, ధిక్కరించియు, తృణీకరించియు తనవాక్చాతుర్య మంతయు వినియోగించి ఎన్నో విధముల నుపన్యసించినాఁడు, ఋషులచేఁ జెప్పించినాఁడు. ఇంక నేమియు

నుపాయము లేక విశ్వరూపమును గూడఁ జూపినాఁడు. బాహ్లీక భీష్మ ద్రోణాది విశిష్టజనంబులయెదుట ధృతరాష్ట్రుఁడు తా నేమియు చేయఁ జాలనని చెప్పఁగా-

ఇప్పుడీసభఁ బుట్టినయింతవట్టు మీకుఁ దెల్లంబుగాదె! యీ మేదినీవి
భుండు దా 'నేమిటికిని ముఖ్యుండఁ గాను; తప్పు తనదెస లే' దని చెప్పివిడిచె!

అని విస్పష్టపఱుచుకొని మూర్ఖతయెల్ల దుర్యోధనాదుల మీఁదనే నిలుచునట్లును, తొందరపడినట్టి దోషము నివ్వరిముల్లంతయైన తనమీఁద నిలువకుండునట్లును శ్రీకృష్ణుఁడు వర్తించినాఁడు. ఈఘట్టముల నెంత జాగ్రత్తగఁ బఠించిన చదువరియైన, ధర్మరాజుతోఁబాటు, "ఇతండు ధర్మాధర్మవిదులకు గురుండు, కార్యాకార్యనిరూపకులకు శిక్షకుండు, ఉచితానుచితజ్ఞులకు ప్రదర్శకుండు" అని కృష్ణుని మధ్యస్థభావమును స్తుతింపకపోఁడు. కాని ఏమయినను తుదకు శ్రీకృష్ణుని హృదయాంతరాళమున నున్న సంకల్పమే నెఱవేఱి యుద్ధము సిద్ధమయినది. ఇట్లు సంధి కని బయలుదేఱిన శ్రీకృష్ణుఁడు చూచి రమ్మనిన కాల్చివచ్చినాఁ డను రీతిగ యుద్ధము నసందిగ్ధము చేసికొని వచ్చినాఁడు; కాని యుద్ధము ప్రారంభ మయిన వెనుక శ్రీకృష్ణుని నాటకము సాగినది కాదు. తన కత్యంతాప్తుఁడగు అర్జునునితో తానే ఈయుద్ధమున కంతకు మూలకారణుఁడ నని పరిస్ఫుటముగ వెల్లడించి వైచినాఁడు. భీష్మపర్వము మొదలు స్త్రీపర్వమువఱకు నున్న కథాభాగములలో మహాకవిచాతుర్య మేమోకాని, కవి ప్రత్యేకముగ వర్ణించి చూప నక్కఱలేకుండ, శ్రీకృష్ణుఁ డెక్కడఁ జూచిన నక్కడనే తానుగ నిమిషనిమిషమునకుఁ బ్రత్యక్షమగుచున్నాఁడు. సేనానాయక నిర్ణయము మొదలు ఉపపాండవ మరణాంతమగు సౌప్తికవృత్తాంతము వఱకు శ్రీకృష్ణునికి రాత్రులు పవళులు విశ్రాంతి యను మాటలేదు.

ఒకచోట యుద్ధమే చేయ నని గాండీవము విడిచిపెట్టిన యర్జునుని యుద్ధసన్నద్ధుని గావించుటకై విశ్వరూపము జూపుచున్నాఁడు; ఇంకొకచోట పాండవసైన్యమును మాడ్చివైచుచు విజృంభించు భీష్మునిపైకి చక్రము చేఁబూని విజృంభించుచున్నాఁడు. వేఱొకచో భగదత్తుఁడు ప్రయోగించు వైష్ణవాస్త్రమును పుష్పమాలికగా స్వీకరించుచున్నాఁడు. సైంధవవధప్రతిజ్ఞకు ప్రోద్బలముగ మొట్టమొదట పాంచజన్యము నూఁదినది యాతఁడు; కార్యభారముమీఁది చింతచే రాత్రియెల్ల నిద్రపట్టక దారుకునితో మంతనము లాడునది యాతఁడు; ప్రొద్దు గ్రుంకుచున్న దని సూర్యబింబమునకు చక్ర మడ్డువేయునది యాతఁడు; శిఖండిని ముందుంచుకొని భీష్మునిఁ జంపుట కర్జునుచే నొప్పించినది యాతఁడు;

ద్రోణుని వధించుటకై ధర్మరాజు నబద్ధ మాడుమని ప్రోత్సహించునది యాతఁడు; క్రుంగిన చక్రమును పై కెత్తుటకు దిగిన కర్ణుని అన్యాయముగఁ జంపించినది యాతఁడు. అహంభావస్వామియగు భీమునిచే నారాయణాస్త్రమునకు మ్రొక్కించుచు, దుర్యోధనుఁ డిచ్చు చీవాట్ల వాయనము నందుకొనుచు, ఘటోత్కచ వధను విని తాండవించుచు, ఎక్కడఁ జూచిన తాన యై దుర్నిరీక్ష్య తేజముతో వెలిఁగి పోవుచున్నాఁడు. ఇట్లాదినుండి యంతమువఱకు కౌరవ పాండవపక్షములకు రెండింటికిఁ గల రణోత్సాహభార మంతయు శ్రీకృష్ణుని మొగమున తాండవించుచున్నది. ఒకపక్ష మనిన నాతనికి దయయు లేదు; ఇంకొకపక్ష మనిన విరోధము లేదు. పాండవపక్షపాతి యని కృష్ణునిగూర్చి మనము సాధారణముగా భ్రమపడుచుందుము. కాని వారిపక్షమున నుండి యాతఁడు వారికి చేసినమే లేమున్నది? అభిమన్యునివధను విని అర్జునున కది యెఱుఁగఁ జెప్పకుండ మౌనము వహించుటయు, ఘటోత్కచుని మరణమును విని తాండవించుటయునా? అశ్వత్థామ బారినుండి పాండవులను రక్షించినవాఁడు ఉపపాండవులను రక్షించుకొన లేకపోయెనా?

ఇంత మహాభారమును వహించి ప్రళయరుద్రునివలె యుద్ధరంగమున తాండవించు శ్రీకృష్ణుఁడు ఎంత సౌమ్యాకారము ధరించినాఁడు! అంభోజమాలికను మెడనుదాల్చి చేత నాయుధలేశ మైనను దాల్పక మునిగోలను బట్టి ఏమియు నెఱుఁగని నిరపరాధివలె గుఱ్ఱములను కళ్ళెము వదలి చల్లగాఁ బో నిచ్చుచున్నాఁడు. తన సంకల్ప మనెడి ఈసుడిగాలిని తప్పించుకొనఁజాలక పరిభ్రమించుచు బంధుమిత్రుల మరణములను చూచి చూచి భరతవంశీయులు విలపించుచుండఁగా వారి యజ్ఞానమున కీతఁడు "కలకల నవ్వుచున్నాఁడు!" శ్మశాన వాటికవలె నున్న కురుక్షేత్రమును జూచి కడుపు దహించుకొనిపోయి గాంధారి యిచ్చు తీవ్రశాపమును భక్తుఁ డర్పించు పుష్పోపహారము నట్లు చిఱునవ్వుతో స్వీకరించుచున్నాఁడు.

అని ఘోరంబుగఁ బలికిన విని విపులమనస్కుఁడైన విష్ణుఁడు చిఱున
వ్వున నానన మొప్పఁగ న వ్వనితకు ని ట్లనియె గౌరవస్తుత్యముగన్ :
మున్న కాదె యాదవులకు మునివరేణ్యకలితదారుణశాపంబు కలదు! నీకు
నేలే చర్విత చర్వణ మిట్లు సేయ! దీన నీ వేమిత్రవ్వితి దానిఁ జెపుమ!
యదువంశజాతులకు దప్పదు నాశము; వారి సురలు బరిమార్పఁగ లే;
రదికారణముగ నెట్లుఁ బెగుడు రొండొరుచేత రణముఘోరత్వమునన్.

మరణవార్త లాతనిచెవులకు సరససంగీతము కాఁబోలును! ఇదివఱకు సంభవించిన కురుపాండవవీరుల మరణములకే సంతాపించుచున్న ధర్మరాజాద్

పాండవులకు గాంధారీశాపవ్యాజమున యాదవవంశనాశముగూడ నున్నదని ఇంకొక సరిక్రొత్తవార్తను చెప్పుచున్నాఁడు. అది తనకు పూర్వపరిచితమే కావున, దాని నిప్పుడు మరల గాంధారినోట విననప్పు డాతనిం పూర్వపరిచితులను గలిసికొనునప్పు డుదయించునట్లుగ చిఱునవ్వుదయించినది కాని తొట్రుపాటించుకయు లేదు. ఆహా! ఏమి ఈకృష్ణుని స్వరూపము! భూమిని దున్ని విత్తనములు చల్లి పంటకు వచ్చినచేలను కోసికొని గాదిలోఁ బోసికొని యానందించుకర్షకుని వలె ఒకరాజవంశము తరువాత నింకొకరాజవంశమును నాశనముచేసి యానందించుచున్నాఁడు! మహాభారతవీరు లొకరి నొకరు నఱకుకొని మరణించునట్లుగా ప్రేరేపించునది తానే! ఆ ఘోరదర్శనమును జూచి యానందించునది తానే! భారతగణరంగమునఁ బ్రత్యక్షమైన కర్మశక్తి యంతయు నీతనిలో మూర్తీభవించి యున్నది. కాని, దానిచే నెక్కుడను మనస్సమాధానమునకు భంగము రాకుండ నానందించుయోగశక్తికూడ నీతనియందే మూర్తీభవించి యున్నది. అందువలననే కవి యాతనిని "యోగేశ్వరేశ్వరుఁ"డని పలికినాఁడు.

## నిర్వికారకృష్ణుఁడు

ఈ ద్వంద్వభావములతో భారతము ముగిసినచో నొక చిక్కున్నది. చరాచరాత్మకమగు ప్రకృతియంతయు నన్యోన్య హింసాప్రవర్తకమయి నుండగో ద్యానమువలె నున్న భూమిని కసాయిమకాణము చేయుచుండఁగా భగవంతుఁ డావ్యాపారము ప్రోత్సహించుచు చూచి యానందించుచున్నాఁడా? ఇదెక్కడి న్యాయము! అట్లయినచో క్రూరాతిక్రూరులని పేరు వడసిన తైమూర్ లంగు, చేంగిస్ ఖాను మున్నగు లోకకంటకులకంటె భగవంతుఁడు నిరంకుశుఁడును, క్రూరుఁడునుగాఁ గాన్పించుచున్నాఁడే అని యొకసందేహము గోచరించును.

గుణాత్మకములగు ద్వైతభావములను దాఁటనంతవఱకు భగవంతునిపై నీ యపనిందయు తప్పదు; మన మనస్సున ఘోరవిషాదమును తప్పదు. ఎవరిని ఎవరు హింసించుచున్నారు? ఒకరి నొకరు హింసించుకొనుచుండఁగా చూచి యానందించుచున్న ఆయింకొక రెవరు? చంపించువాఁడు, చంపువాఁడు, చంపిన చూచి యానందించువాఁడు మువ్వురు నొక్కఁడే యైనచో మనకే యిబ్బందియు లేదుకదా! తన్ను తాను తనయిష్టము వచ్చినట్లు చేసికొన వచ్చునని భగవంతుని కనుజ్ఞ యిచ్చుటకు మన కేమియాటంకము?

భారతకవి యిచ్చిన ప్రత్యుత్తర మీమువ్వురు నొక్కఁడే యనుటతో ముగియలేదు, అతఁ డాభావమునుగూడ నతిక్రమించినాఁడు. సత్యదృష్టితోఁ

జూచినచో చంపుట, చంపించుట, చంపినఁ జూచి యానందించుట ఈమూఁడును గూడ అబద్ధములేయని యాతని యభిప్రాయము. సూర్యుఁడు భూమిచుట్టు తిరుగుచున్నాఁ డని జను లనుకొందురు. భూమియే సూర్యునిచుట్టు తిరుగుచున్న దని యథార్థమును దర్శింపఁగలిగిన శాస్త్రజ్ఞులు నిర్ణయించుచున్నారు. సరిగా భారతకారుని దృష్టికి మనదృష్టికి నిట్టిభేదమే యున్నది. అతని దివ్యదృష్టిముందు మన కింత నిశ్చలములుగఁ గాన్పించు సమస్తబ్రహ్మాండములు నీటిపై బుడగలవలె నిముసములో మాయమగుచున్నవి. ఇక్కడనే భారతకవియొక్క లోకాతీత బుద్ధిప్రభావ మున్నది. సుఖదుఃఖాది ద్వంద్వస్వరూప మగు జగత్తు నెల్ల కన్నులఁ గట్టినట్లు చిత్రించినాఁడు. తుదకు దీని నెల్ల ఒక్కతన్నుతో నిర్మూలము చేసి అంతయు మిథ్యయని నవ్వుచు తన యాత్మసామ్రాజ్యమునుండి యొక్క మెట్టయినను దిగకుండ క్షీరసముద్రమున వటపత్రశాయియగు విష్ణుమూర్తివలె విహరించుచున్నాఁడు. సౌమ్యాగ్నేయస్వరూపియగు కృష్ణుని కతీతుఁడై వెలుఁగుచున్న నిర్వికారకృష్ణుఁడు అర్జునుని యజ్ఞానమును చూచి నవ్వుచు,—

"పురుషుఁడు సెడు ననువాఁడును, పురుషుఁడు సెఱచునని పలుకు పురుషుండును,న
య్యిరువురు నవివేకుల! అప్పురుషుఁడు చెఱపండు, చెడఁడు, భుజవీర్యనిధీ!
పురుషుఁ డన వే ఱొకండె పురుషోత్తముఁ డైనయేన! పురుషోత్తమతా
స్ఫురణకు పురుషత్వం బను మెర మెరగల; వదియు కొచె మెయికొను క్రియువన్!"

అని తత్త్వోపదేశము చేయుచున్నాఁడు. కార్యకారణస్వరూప మగు ప్రకృతియు, అసంపదుయ మగు నిర్వికారపరబ్రహ్మమును వేఱుగాఁ గాన్పించుట దృశ్యనభేదము చేత నేకాని యథార్థస్థితి చేగాదు. భారతము ప్రతిష్ఠించు ఈసత్యమును మనస్సున నుంచుకొనియే తిక్కన కృత్యాదినిఁగల హైవప్రార్థన పద్యములో సౌమ్యాగ్నేయస్వరూపులగు శివ కేశవుల కభేదము చెప్పుచు ఇరువురకు నతీతమగు పరతత్త్వము గొల్చుచున్నాఁడు. ఇంతేకాక, అశ్వాసాదిని, అశ్వాసాంతమందు నున్న పరస్పరవిరుద్ధభావముతోఁ గూడిన ఈశ్వరసంబోధనములు గూడ ఈయంశమునే సూచించుచున్నవి. "సాత్యకి తేజ వాఙ్మయవిశాల గృహాస్ఫురత ప్రదీపిక"ను తిక్కన ఈవిధముగ సంబోధించి యున్నాఁడు.

మాలిని. నిరుపమగుణరాశీ, నిర్గుణత్వప్రకాశీ,
భరితభువనకార్యా, భవ్యనైష్కర్మ్యధుర్యా,
విరతినిరతభావ్యా, విశ్వలోకైకసేవ్యా,
స్ఫురితబహుశరీరా, శుద్ధవైరూప్యసారా,

సృష్టికి మహాభారతకవి చెప్పునర్థ మిది: పరస్పర విరుద్ధస్వరూపముగల యీజగత్తును చూచి ధర్మసమ్మోహచేతస్కులము కావలసినపని లేదు. ఈవిశ్వము నంతను ప్రశస్తపథమున నడపించు భారము వహించి శక్తి యొకటి యున్నది. అది పైకి ఘోరముగ కానవచ్చినను సూక్ష్మముగఁ జూచినచో నాసంశయము. దానిని సృష్టినుండి విడఁదీసి చూచునంతకాలము మానవునకు మనోవేదన తప్పదు. తత్త్వవేత్త లదియే శరీరిబాహుళ్యమునం దంతటను అంతర్యామియైనట్లు చూచుచున్నారు. అంతేకాదు- సమాధిస్థితులకు నిర్గుణమయమగు నద్వైత తేజము తప్ప వేఱేదియు గానరాదు.'' హ్యామ్లెటు వహించిన ధర్మసమ్మోహచేతస్కత్వములో బయలుదేఱి అక్కడనుండి లీలాస్వరూపము వఱకును, లీలాస్వరూపము నుండి నిర్గుణ తత్త్వమువఱకును మూఁడు గంతులలోఁ బోయి వామనమూర్తివలె మహాభారతకారుఁడు త్రిభువనాతీతుఁడై వెలుఁగుచున్నాఁడు. ఈ యద్వైతభావమే భారతమున కంతర్జ్యోతి.

కాని ఈ అద్వైతభావము మాటలలో సిద్ధించునదికా దనికూడ ఆతఁడే విస్పష్టపఱిచినాఁడు. నిష్ప్రాతికస్వభావయు, మహాపతివ్రతయు, తపస్వినియు నగు గాంధారికి యుద్ధభూమిని చూచి దుఃఖింపక తప్పినదికాదు. భీష్మునిచే నెంత వేదాంతము విన్నను వియద్గంగావగాహనముతో మానుషభావము నశించువఱకు తనచరిత్రము హింసాకళంకిత మయ్యెనే యనుబాధ ధర్మరాజునకు తప్పినదికాదు. జగద్గురుఁడగు శ్రీకృష్ణునిచే గీతలను వినిన యర్జునునికిఁ బుత్రశోకము తప్పినదికాదు. లోకోత్తర పురుషులగు వీరి సంగతియే యిట్లుండ నింక సామాన్యుల మాట వేఱుగ వివరింపవలెనా? ఈ కృష్ణలీలను చూచి మొదటినుండియు ఆనందింపఁగలిగినవారు భీష్మాదిరాజర్షులు, వ్యాసాది బ్రహ్మర్షులు. అట్టివారికి మాత్రమే యద్వైతభావ మనుసంధానమునకు వచ్చుచున్నది.

ఈ సంబంధమునందు మహార్థప్రతిష్ఠాపనమునకును తత్త్వబోధనమునకును గల తారతమ్యము మనము జాగరూకతతో గమనింపవలయును. అద్వైత తత్త్వబోధనమే ప్రధానాశయ మగునెడల 'సీతారామాంజనేయము', 'పంచదశి' యు భారతముకంటె ప్రశస్తకావ్యములు కావలసి యుండును. కావ్యసృష్టిలోఁ జూచినచో వేదాంతోపన్యాసములు కావ్యమునకు నీరసహేతువులు కాని స్వారస్యము సుష్ఠుపింపఁ జేయవు. కేవలము నీతినిగూర్చి, ధర్మములనుగూర్చి, ఆధ్యాత్మికవిషయములనుగూర్చి దీర్ఘోపన్యాసము లొనర్చు శాంత్యనుశాసనిక పర్వములు భారతమునుండి తొలగించి యుండినచో కావ్యమున కింతకంటె నెక్కుడు పుష్టియు, స్వరూపసౌష్ఠవమును లభించియుండెడివి. అయితే తిక్కన

ఒక్క మహోపకారముమాత్ర మొనర్చియున్నాఁడు. కావ్యరసాలయమగు విరాటపర్వము మొదలుగా స్త్రీపర్వము వఱకు నున్న భారతభాగమున మాత్రము వేదాంత ఘట్టములను ఒకచో పూర్ణముగ విసర్జించియు, మఱియొకచో రసానుగుణముగ సంగ్రహించియు కావ్యమునకు పుష్టిఁ దెచ్చెను. భగవద్గీతకు విపులమైన భాషాంతరీకరణ మొనర్పనందులకు తిక్కనను కొందఱు మహాపరాధిగా గణించుచున్నారు. కాని కళాస్పృష్టమైన కావ్యమునకిది యెంతయుత్తేజము నొనర్చినదో వారు గ్రహింపలేకుండ నున్నారు. నాడులలో రక్తము ప్రవహించినట్లు, శరీరమునఁ బ్రాణవాయువు సంచరించునట్లు మహార్థ మనునది కావ్యరసముతో లీనమై దానికి పుష్టి, దార్ఢ్యము, తేజము కలిగింపవలెను. దేహికి ప్రాణప్రతిష్ఠ యొనర్చుట యెంత కష్టసాధ్యమో కావ్యమున మహార్థప్రతిపాదన మొనర్చుటయు నంత కష్టసాధ్యమే. ఎక్కడనో యున్న వేదాంతార్థము గైకొని వచ్చి కథతో నతుకుపెట్టినచో నట్టికావ్యము allegory వలె నిర్జీవ మగును. 'ప్రబోధచంద్రోదయ' నాటకము దిలకించినచో మన కీవిషయము తేటతెల్ల మగును. భరతవీరుల చరిత్రమున సహజముగ నంతర్వ్యాప్తమైయున్న మహార్థమును కవి తనయోగ చక్షువుచే సందర్శించి మనకు ప్రదర్శించుచున్నాఁడే గాని యోగశాస్త్రముల నుండి వేదాంతమును కావ్యములోనికి దిగుమతిచేయుట లేదు. ఈసత్య మాతని కనుభవసిద్ధ మగుటచే సజీవమై యలరారుచున్నది.

మఱియు భారత మద్వైతసత్యమును ప్రతిష్ఠాపన మొనర్చుచున్నదనఁగానే ఇది ద్వైతమతమునకు, విశిష్టాద్వైతమతమునకు వ్యతిరేకభావమును పూనియున్నదని యూహింపరాదు. ఈవ్యాసమునందలి యద్వైత సత్యమునకును ద్వైతాద్వైత విశిష్టాద్వైతమతములకును ఎట్టి సంబంధమును లేదు. త్రిమతములును వేదములపైనను, పురాణములపైనను ఆధారపడియున్నవి. త్రిమతములకు భారతాదీతిహాసములయందును, పురాణములందును స్థాన మేర్పడుచున్నది. వివేకానందస్వామి శ్రీరామకృష్ణపరమహంస చెప్పినట్లుగ ఈ త్రిమతములును ఒకదాని కొకటి సాహాయ్య మొనర్చుకొనుచున్నవి కాని ప్రజాసామాన్య మెంచుచున్నట్లుగ వానికి పరస్పరవైషమ్య మెద్దియును లేదు. కాని హిందూదేశము ప్రపంచమునకుఁ బెట్టిన బిక్ష యేమి యను ప్రశ్నవచ్చినచో "ఏకమ్ సత్, విప్రా బహుధా వదంతి." (ఉన్నదొక్కటే, పండితులు దానినే పలువిధములఁ బేర్కొనుచున్నారు). అను సత్యమును బోధించుటయే. దీనినే యీవ్యాస మద్వైత సత్య మని పేర్కొనుచున్నది. పైని పేర్కొనఁబడిన ముక్క త్రిమతములకును సమ్మతమగుటయే కాక ఆరాధ్యము గూడ నగుచున్నది.

అనవరతప్రత్యక్షమును, నతిపురాతనమును నగు నీయద్వైతసత్యమును చిత్రించుటకు భారతకారుఁ డొకయద్భుతమును (miracle) సాధించినాఁడు. నాటకీయము (Dramatic art), పౌరాణికము (epic art) అని కళాకౌశల్యము ద్వివిధము. తమపుస్తకమున కొకఁడు నాటక మని పేరుబెట్టుకొన్నను అది తత్త్వమును బట్టి పురాణమే కావచ్చును. గ్రంథమునకు పురాణమేయని పేరుపెట్టుకొన్నను కళాకౌశల్యమునుబట్టి అది నాటకమే కావచ్చును. నాటకీయకళ తలపెట్టునది ప్రత్యక్షప్రదర్శనము. పౌరాణికకళ తలపెట్టునది పరోక్షకథనము. నాటకీయకళకు గమ్యస్థానము చదువరిని తన్మయుని గావించుట. పౌరాణికకళ కౌశల్యము అద్భుతభావసంచరణ మొనర్చుట. పింగళి సూరన నాటకములు వ్రాయకపోయినను అతని కళాకౌశల్యము నాటకీయము. వర్ణితవిషయము ఎదుట ప్రత్యక్షమగుచుండును. సంభాషణమూలముగ కథ పెరుగుచుండును. నన్నయభట్టుకళాకౌశల్యము పౌరాణికము. దుష్యంతుఁడు, శకుంతల, నలుఁడు, దమయంతి యున్నగు వీరులయొక్కయు, వీరవనితలయొక్కయు చరిత్రముల పరోక్షకథనమున వర్ణించి వస్తువునందు మనకతిపవిత్రమగు గౌరవము కలుగించుటలో నీమహాకవి యద్వితీయుఁడు. తిక్కనభారతమం దీరెండుకళలును సమ్మేళన మొందియున్నవి. ఇది కళాప్రపంచమున ననపూర్వము, అద్భుతావహము. విరాటోద్యోగ పర్వములందు నాటకకళ ప్రధానము. పౌరాణికకళ అంతర్వాహినియై ప్రవహించుచున్నది. యుద్ధపంచకమున పౌరాణికకళ ప్రధానము. నాటకకళ అంతర్వాహినియై ప్రవహించుచున్నది.

సూర్యమండలము మేఘములచే పిహితమైనట్లు అలంకారబాహుళ్యమున మహార్థము సంఛన్నమగును. అందువలన విరాటపర్వములో పూర్వజన్మవాసనవలె కొలఁదిగ నలంకారవిన్యాసము గానవచ్చినను ఉద్యోగాదులనుండి నిరలంకారమును, నిరాడంబరమును అగుశైలి యుపయోగింపఁబడినది. ఇది మహార్థప్రతిపాదనమున కెంతయు సహకారి.

మఱియు తిక్కనకడ నిగ్రహ మను నొకగొప్పగుణ మున్నది. ఈగుణము కూడ మహార్థప్రదర్శనమునకు మిక్కిలి తోడ్పడుచున్నది. నిగ్రహ మన నేమో, అది మహార్థప్రకటనమున కెట్లు తోడ్పడుచున్నదో ఇంచుక వివరించుట యావశ్యకము. తిక్కన రసాతీతుఁడుగాని రసలోలుఁడు కాఁడు: ఏఘట్టమును గాని, ఏసన్నివేశమును గాని అతఁ డతిగా వర్ణించుటఁ గానము; ఒక్క రేఖచేతనే ఎంతో సౌందర్యమును స్ఫురింపఁజేయఁగల చిత్రకారునివలె ఒక్కొక్కమాటచేతనే వర్ణిత

విషయమును ప్రత్యక్షము సేయఁగలశక్తి తిక్కనకడ నున్నది. తక్కినకవులు పది పద్యములు, పదునైదుపద్యములు చెప్పి వర్ణించు విషయమును తిక్కన ఒక్క పద్యములోనో, ఒక్కపద్యపాదములోనో వర్ణింపఁగలఁడు. తన కెంతో యభిమానాస్పదములు కాఁ దగిన శ్రీకృష్ణుని కౌరవసభాప్రవేశము మున్నగు ఘట్టములందు గూడ కవి ఈ నిగ్రహము జూపించినాఁడు. ఇందుల కొకటి రెం డుదాహరణములు: ధర్మరాజు శ్రీకృష్ణుని రాయబారమునిమిత్తము కౌరవసభకుఁ బొమ్మని ప్రార్థించు సందర్భమున,

"ఆపద గడవం బెట్టఁగ, నోపి శుభం బైనదాని నొడఁగూర్పఁగ మా
కీపుట్టువునకు పాండుక్ష్మాపాలుఁడునిన్ను జూపి చనియె మహాత్మా!

*    *    *    *    *

నీకు మేము ప్రద్యుమ్నాది కుమారులతోడి వారము" అని వచించి నాఁడు. ఈపద్యమున నెన్నెన్ని యుత్కృష్టభావము లిమిడియున్నవి! మఱియొక కవి యైనచో ఇక్కడ శ్రీకృష్ణుని పదియవతారములకు ప్రసక్తిలేకుండ విడిచి పెట్టఁడు. ఈపద్యముతో యుధిష్ఠిరకృష్ణులు మనయెదుట నిలువఁబడినారు. ధర్మరాజు కృష్ణుని గడ్డముపట్టుకొని యీపద్యమును జెప్పుచున్నాఁడు. కృష్ణుఁడు మందహాస మొనర్చుచున్నాడు. శ్రీకృష్ణుని చారిత్రమును, మాహాత్మ్యమును వలఁచిన కొలంది ఆతనిపై తా నొక పెద్దటీకము వహింంచినారని నొక కార్యము చేసికొని రావలసిన దని యాజ్ఞాపించుటయును ననౌచిత్యము ధర్మరాజునకు పొడకట్టుచున్నది. కాని ప్రస్తుతము లోకధర్మమును బట్టి చూడఁగా వయసునకుఁ దా నాతనికంటెఁ బెద్దవాఁడు. ఆతఁడు తప్ప ఈకార్యము నిర్వహించుకొనిరాఁ దగిన సమర్థుఁడు వేఱొకఁడు లేఁడు. అందుచే వినయము, భక్తి, అనురాగము, అనునయము, చనవు మున్నగు భావము లెన్నో ముప్పిరిగొనియున్న యీవాక్యములను కవి ధర్మరాజుచేఁ జెప్పించినాఁడు. ఇట్లే రాయబారసందర్భమున శ్రీకృష్ణుని కౌరవసభాప్రవేశమును వర్ణించుచు,

"ఎదురువచ్చిన విదురుని యిచ్చుకరముఁ, దమ్మిచేయును రెండుహస్తములఁ బట్టి
నడచె;ముందట గద్దియ సందడి గడంగి కర్ణ దుర్యోధనులు దొలఁగంగ జడియ.

వ. కృతవర్మాదియాదవులు లోనుగాఁగల యభ్యంతరులైన బలుమానుసులు పొదివికొనిపోవఁ... దేజోరాశియగు రాజీవాక్షుండు..."

అక్కడ కవి సభాసదుల నొకటి రెండుపద్యములలో వర్ణించి పరిసరవర్ణమున (**atmosphere**) ను బట్టి ప్రధానవస్తువును జిత్రించినాఁడు. శ్రీకృష్ణుని ప్రవేశ

డైనంతనే సభాసదు లాతనియెడఁ జూపిన భయభక్తి వినయ సంభ్రమములనుబట్టి యాతని మాహాత్మ్యము మనకుఁ బ్రత్యక్ష మగుచున్నది. కృష్ణుఁడు సభలో నడుగు పెట్టినంతనే విదురుఁ డెదురువచ్చి చేయూఁత నిచ్చినాఁడఁట! దుర్యోధనాదులకు లోలోపల తాము రారాజుల మని యెంతగర్వ మున్నను "తేజోరాశియగు రాజీవాక్షుని" చేయిపట్టుకొనుటకు తగినంతశక్తి వారికి లేకపోయినది. చోపుదార్ల వలె మూఁగుచున్న జనసమూహము నొత్తిగించి దారిచేయుచున్నారు. ఇక్కడ నితరకవులు కృష్ణుని ప్రతియవయవమునకు ఒక్కొక్కపద్యము చొప్పున వ్రాసి యున్నను మొత్తముమీఁద నింతరససంచారము గలిగింపలేరు. తుద కొక్క సీసపద్యమైన నిక్కడ వ్రాయక "తేజోరాశియగు రాజీవాక్షుండు" అను నొక్క మాటతో కవి సంతుష్టిపడుచున్నాఁడు! ఉదాహరణము లీయ మొదలిడినచో నిట్టి వసంఖ్యాకములుగ నున్నవి. ప్రకృతవిషయమున కివి చాలును. ఇట్టి నిగ్రహము వలన కావ్యమునకు సిద్ధించిన గుణము ధ్వని. భారతము చదివినకొలఁది చవులూరుట కిదియే కారణము. ధ్వని ప్రధానముగా మహార్థమును ప్రతిపాదించుటవలన కవి బ్రహ్మ మహార్థముతో చదువరులను దోబూచులాడించుచున్నాఁడు. మేలిముసుఁగు మఱుంగున నున్న ముద్దుమోము వలె ఈనిగ్రహగుణము వలన తిలకించినకొలఁది కావ్యార్థము నూతనరామణీయకముతో నలరారుచుండును.

మహాకావ్యమునకు సంగీతము (melody) కూడ ఒక ప్రధానాంగము. శాస్త్రసంగీతము (Technical music) నకును కావ్యసంగీతమునకు (Poetic melody) ను భేద మున్నది. ఈసంగీతమాధుర్యము కొన్నికొన్ని శబ్దముల సమ్మేళనమున నుప్పతిల్లుచున్నది. తనకావ్యార్థ ప్రతిపాదనమునకు తగిన సంగీతమును తిక్కన యలవఱుచుకొన్నాఁడు. భారత మేర్పఱుచుకొనిన సమయమునుబట్టి ఏతన్మహార్థమును ప్రతిపాదించుటకు ప్రసన్నతయే ప్రధానమగు సంగీత మొక్కటే చాలదు. చంద్రజ్యోత్స్నను సూర్యతేజముతో మేళగించినట్లు ప్రసన్నతా గుణమును తేజోగుణముతో మేళగింపవలెను. అందుచేత తనకవిత్వమున వచనమున కుండవలసిన స్వాతంత్ర్యమును, పద్యముల కుండఁదగిన గమనసౌందర్యమును ఏకీభవింపఁజేసినాఁడు. భారతపద్యము లెక్కడఁజూచినను యతులకొఱకుఁగాని, ప్రాసములకొఱకుఁగాని ఆఁగక అఖండముగఁ బ్రవహించుచున్నవి. యతులును, ప్రాసములును వినయముతో చేతులు జోడించుకొని వచ్చి వానిస్థానమున నవి నిలువఁబడవలసినదే కాని వానికి వేఱే యాహ్వానములేదు. భారతమును వ్రాయుటకు పూర్వము తిక్కన వేదమునందలి స్వరమాధుర్యమును బాగుగ ననుసంధించి యుండును. ఒక యాశ్వాసాంతపద్యమున "వీణానాదప్రతిమ నిగమావిర్భవత్స్వర

పుణ్యశ్రేణీ సంపాదిత'' (స్త్రీపర్వము. ఆ. ద్వి. ౧౭౪) యని హరిహరనాథుని సంబోధించి యున్నాఁడు. సరిగా ఇట్టి సంగీతమునే తన కావ్యమునఁగూడ అలవఱుచుకొనుటకై తిక్కన ప్రయత్నించి కృతార్థుఁడైనాఁడు. భారతసంగీతము వేణునాదమువలె సర్వజనసమ్మోహనకరము కాకపోయినను రసాస్వాదనాచణ మగు కర్ణమునకుమాత్రము దానిని తగచినకొలఁది ఆనంద ముప్పతిల్లు చుండును. సహజముగ తేనెలూరు తెనుఁగు బాసకు తనయఖండ ప్రజ్ఞచే నూత్నవైభవము గల్పించిన తిక్కన మనపాలిటిభాగ్యదేవత. ప్రబంధపరమేశ్వరుఁడని పేరుగాంచిన ఎఱ్ఱప్రెగ్గడ ఆతని నీవిధముగ స్తుతించియున్నాడు.

తనకావించినసృష్టి తక్కొరులచేతం గాదు నా, నేముఖం
బున దాఁ బల్కినపల్కులాగమములై పొల్పొందు నా, వాణి న
త్తన్వీలీలం డొకరుండునాఁ జను మహత్త్వాప్తిం ''గవిబ్రహ్మ'' నా
వినుతింతుం గవితిక్కయజ్వ నఖిలోర్వీదేవతాభ్యర్చితున్.

—నండూరి బంగారయ్య, బి. ఏ., ..
వకీలు, రాజమహేంద్రవరము.

# ప్రకరణానుక్రమణిక.

---

## ప్రథమాశ్వాసము


| ప్రకరణము. | పుట. |
|---|---|
| సాత్యకి దుర్యోధనుకడకు దూతం బంపఁగూడ దని చెప్పుట. | ౬ |
| ద్రుపదుఁడు దనపురోహితుని దుర్యోధనునికడకు దూతగాఁ బంపుట. | ౧౧ |
| అర్జునుఁడు శ్రీకృష్ణునిం దనకు సహాయునిగాఁ గోరికొనుట. | ౧౪ |
| దుర్యోధనుండు శల్యసాహాయ్యంబుఁ గోరుట. | ౧౫ |
| శల్యుఁడు పాండవులం జూడ నుపప్లావ్యంబునకు వచ్చుట. | ౧౯ |
| ఇంద్రుఁడు వృత్రాసురునితో యుద్ధంబు సేయుట. | ౨౩ |
| దేవతలు నహుషుని సురరాజ్యాభిషిక్తునిం జేయుట. | ౨౭ |
| ఇంద్రుఁడు నహుషు తేజోవిశేషంబు చూచి మఱుఁగు వడుట. | ౩౦ |
| అగ్నిదేవుఁ డింద్రుని వెదకి బృహస్పతికిం దెలుపుట. | ౩౪ |
| అగస్త్యుఁ డింద్రునకు నహుషు భ్రష్టతఁ దెలుపుట. | ౩౭ |
| ధృతరాష్ట్రుఁడు సంజయునిఁ బాండవులయొద్దకుఁ బంపుట. | ౪౮ |
| సంజయుఁ డుపప్లావ్యంబునను్న పాండవులయొద్దకు వచ్చుట. | ౫౧ |


---

## ద్వితీయాశ్వాసము.


| | |
|---|---|
| సంజయుఁడు ధర్మజునిసంధిపల్కులను ధృతరాష్ట్రునకుఁ దెల్పుట. | ౭౫ |
| సనత్సుజాతుఁడు ధృతరాష్ట్రునకు నధ్యాత్మతత్త్వంబుఁ దెలియఁ జెప్పుట. | ౯౩ |
| ప్రాతఃకాలవర్ణనము. | ౯౫ |
| సఞ్జయుఁడు ధృతరాష్ట్రునితోఁ బాండవుల తెఱంగు సెప్పుట. | ౯౭ |
| ,, ,, కృష్ణుని సెప్పినమాట లెఱింగించుట. | ౯౯ |
| భీష్ముఁడు గర్ణునిదుర్నయంబు ధృతరాష్ట్రునితోఁ జెప్పుట. | ౧౦౭ |
| ధృతరాష్ట్రుఁడు భీమసేనాదులపరాక్రమంబుఁ దలంచి దుఃఖించుట | ౧౧౧ |
| దుర్యోధనుఁడు తండ్రితో స్వపక్షవీరుల సామర్థ్యంబు సెప్పుట. | ౧౧౫ |
| సంజయుఁడు దుర్యోధనునకు ధర్మరాజు నిశ్చయం బెఱింగించుట. | ౧౧౯ |

ప్రకరణము. పుట.

ధృతరాష్ట్రుఁడు దుర్యోధనుతో సంధిసేయుమని చెప్పుట. ౧౨౩
దుర్యోధనుఁడు తండ్రితోఁ దనబలపరాక్రమంబులు సెప్పుట. ౧౨౬
కర్ణుఁడు భీష్మునిపై రోషముచేత శస్త్రసన్న్యాసంబు సేయుట. ౧౩౧
కృష్ణద్వైపాయనుఁడు ధృతరాష్ట్రునియొద్దకు వచ్చుట. ౧౩౪

---

## తృతీయాశ్వాసము.

శ్రీకృష్ణనిరాయబారము. ౧౪౦
కృష్ణుఁడు ధర్మరాజుతోఁ గౌరవుల దుర్ణయంబు సెప్పుట. ౧౪౬
శ్రీకృష్ణుఁడు భీమసేనునిఁ గౌరవులతోడి యుద్ధమునకుఁ బురికొల్పుట. ౧౫౦
అర్జునుఁడు శ్రీకృష్ణునితోఁ దనయభిప్రాయంబు సెప్పుట. ౧౫౩
ద్రౌపది కృష్ణునితోఁ దనమున్ను పడిన భంగపాట్లు చెప్పుట. ౧౫౯
శ్రీకృష్ణుఁడు ద్రౌపది నూఱార్చుట. ౧౬౭
శ్రీకృష్ణుఁడు నారదాదిమహామునులం గని సంభావించుట. ౧౭౨
ధృతరాష్ట్రుఁడు విదురుతో శ్రీకృష్ణునిరాక చెప్పి సంతోషించుట. ౧౭౫
శ్రీకృష్ణుఁడు ధృతరాష్ట్రుని మందిరంబునకుఁ బోవుట. ౧౭౯
శ్రీకృష్ణుఁడు గుంతీదేవి నూఱడించుట. ౧౮౬
శ్రీకృష్ణుఁడు దుర్యోధనునితో సంభాషించుట. ౧౮౭
,, విదురుతో సంభాషించుట. ౧౯౩
,, ధృతరాష్ట్రుతో సంభాషించుట. ౧౯౭
,, పాండవుల చెప్పినమాటలు ధృతరాష్ట్రునితోఁ జెప్పుట. ౧౯౯
కణ్వుండు దుర్యోధనునితో గరుత్మంతుని వృత్తాంతంబు సెప్పుట. ౨౦౪
దుర్యోధనుఁడు నారదాదిమునులమాట వినక నిరాకరించుట. ౨౦౯
భీష్మ-ద్రోణులు దుర్యోధనునకు హితంబు సెప్పుట. ౨౧౩
శ్రీకృష్ణుఁడు దుర్యోధనునితో ముస్నతండు సేసిన దుర్ణయంబులు సెప్పుట. ౨౧౬
దుర్యోధనాదులు శ్రీకృష్ణునిం బట్టికొని చెఱం బెట్టఁ దలంచుట. ౨౨౦

---

# చతుర్థాశ్వాసము.


| ప్రకరణము. | పుట. |
| --- | --- |
| కృష్ణుండు గుంతియింటికిం జని యాయమతో మాటలాడుట. | ౨౨౬ |
| శ్రీకృష్ణుఁడు కర్ణునిఁ దనరథం బెక్కించుకొని కొన్నిరహస్యోక్తులు పలుకుట. | ౨౨౯ |
| కర్ణుఁడు శ్రీకృష్ణునకుఁ దగినయుత్తరంబు లిచ్చుట. | ౨౩౨ |
| కుంతీదేవి కర్ణునకు నతండు దనపుత్త్రుం డగుట దెలుపుట. | ౨౩౬ |
| శ్రీకృష్ణుఁడు ధర్మరాజునకుఁ గౌరవసభం బుట్టినవిశేషంబులు దెలుపుట. | ౨౪౦ |
| ధృష్టద్యుమ్నాదులు సేనానాయకత్వంబు నిర్ణయించుట. | ౨౪౪ |
| పాండవులు కౌరవులతోడి యుద్ధంబునకు వెడలుట. | ౨౪౮ |
| దుర్యోధనుఁడు ద్రోణప్రభృతుల సేనాపతులం జేయుట. | ౨౫౩ |
| బలరాముఁడు పాండవుల వీడ్కొని తీర్థయాత్ర వోవుట. | ౨౫౮ |
| రుక్మివృత్తాంతము. | ౨౫౯ |
| సంజయుండు ధృతరాష్ట్రుని కులూకుఁడు పాండవుల నాడిన మాటలు సెప్పుట. | ౨౬౧ |
| భీష్ముఁడు కౌరవసేనలో నతిరథ-మహారథాదుల నిరూపణంబు సేయుట. | ౨౬౭ |
| ,, కర్ణుని నర్ధరథుం డని చెప్పుట | ౨౭౦ |
| ,, పాండవవీరులం దతిరథ-మహారథాదుల నిరూపించి చెప్పుట. | ౨౭౪ |
| ,, దుర్యోధనున కంబోపాఖ్యానంబు సెప్పుట. | ౨౭౮ |
| పరశురాముఁ డంబం దోడుకొని భీష్మునియొద్దకు వచ్చుట. | ౨౮౩ |
| భీష్ముండు పరశురామునితో యుద్ధంబు సేయుట. | ౨౮౬ |
| భీష్మునకు వసువులు స్వప్నసాక్షాత్కారంబున మోహనాస్త్రం బిచ్చుట. | ౨౮౯ |
| నారదుఁడు భీష్మున కంబవృత్తాంతం బంతయుం జెప్పుట. | ౨౯౪ |
| శిఖండి యక్షునివలనఁ బురుషత్వంబు నొందిన వృత్తాంతము. | ౨౯౮ |
| స్థూలకర్ణునకుఁ గుబేరునివలన స్త్రీత్వము గల్గుట. | ౩౦౦ |



హరిహరనాథాయ నమః

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఉద్యోగపర్వము

### ప్రథమాశ్వాసము.



శ్రీగౌరీపల్లవపుట
యోగాశ్రయమంజరీసముజ్జ్వలమూర్తీ,
యోగీంద్రసంతతాంత
ర్యాగపరీపాకరూప, హరిహరనాథా.[1] ౧

వ. దేవా, వైశంపాయనుఁడు జనమేజయున కిట్లనియె: ౨

తే. ఎలమి నభిమన్యుపెండిలి యివ్విధమునఁ
జేసి, యుల్లాసలక్ష్మిఁ గైసేసి, మత్స్య
మనుజపతియన్వయంబు పావనముసేసి,
దినచతుష్టయానంతరమునఁ బ్రియమున— ౩

వ. ధర్మతనయుండు దమ్ములుం గొడుకులుం బరివేష్టించి యుండ, విశాల రమణీయంబగు విరాటుకొలువుకూటంబున కరిగి యందు— ౪

---

1. శ్రీ......నాథా = లక్ష్మీ పార్వతులు అను చివురు జొంపములయొక్క కూడికను ప్రాపగు లేతగొమ్మగా నొప్పు తేజస్స్వరూపా, తపస్సంపన్నుల అంతఃకరణముల యందు నిరంతరము జరుగు యజ్ఞముయొక్క పరిపక్వ రూపమయిన వాఁడా, హరి-హర నాథా.

క. విరటుఁడుఁ, బాంచాలుండును,
హరియును, రాముండు, [1]వారియనుజ తనూజుల్,
[2]పరిణయసమాగతాఖిల
ధరణీశులు బలసి యుండఁ, దద్దయు నెమ్మిన్— ౫

వ. ఉన్నసమయంబున సభాసదులైనమానవేంద్రులు నానావిధంబులఁ గృష్ణ యుధిష్ఠిరులతో సంభాషణంబులు సేయుచుండఁ, బాండవకార్యార్థియైన కృష్ణుండు తదీయవచనంబులు వారించి, వారలఁ గలయం గనుంగొని యిట్లనియె: ౬

మ. "కపటద్యూతమునందు సౌబలునిచేఁ గౌంతేయులాత్మీయరా
జ్యపదభ్రంశముఁ బొంది, సత్యనిరతిన్ శక్తాత్ములై యుండియుం
గుపితస్వాంతులు గాక, [3]తత్సమయసంక్షోభంబు గాకుండఁగా,
[4]విపినావాసము, గూఢచర్యయును గావింపం దలం పొప్పదే? ౭

ఆ. తలఁచినట్లు వ్రతముసలిపి యమ్మానధనులు పం
డ్రెండు వత్సరములు పాండవేయు
లకట! [5]క్రూరసత్త్వ యాతుధానావలి
తోడఁ గాననమునఁ గూడి మనరె? ౮

క. పదపడి, దుస్తర మగు నీ
పదుమూఁడవయేఁడు గడవఁబడుట యరిది; త
మ్మెదురెఱుఁగమికై యాపద
లొదవిన సైరించి; రిట్టియునికియుఁ గలదే? ౯

---

1. వారి యనుజ తనూజుల్ = వారి తోఁబుట్టువులును, కొడుకులును.
2. పరిణయ......ధరణీశులు = పెండ్లికై వచ్చిన రాజులెల్లరు.
3. తత్సమయసంక్షోభంబు గాకుండఁగా = వారికొన్న శపథము కలఁతఁబొందకుండఁగా,
4. విపినా......చర్యయును=అరణ్యవాసము, అజ్ఞాతవాసమును...
5. క్రూరసత్త్వ యాతుధానావలి = క్రూరమృగములును రాక్షసప్రకరములును ...

క. మీరలు ధర్మజువర్తన
గౌరవ మెఱుఁగుదుర కాదె? కావున, నా గాం
ధారీతనూభవులకును,
మీరలకును హితము గా వివేకప్రౌఢిన్— ౧౦

తే. ధర్మమార్గంబు దప్పక తలఁపుఁ డొక్క-
తెఱఁగు; ధర్మువు దప్పి యుధిష్ఠిరుండు
వడయ నొడఁబడఁ డయ్యింద్రపదవియైన;
నుచితగతి నెంత వడసిన నుల్లసిల్లు. ౧౧

వ. కావునఁ, బాండవులకుఁ బిత్రృధనంబగు రాజ్యంబు గపటద్యూతంబున దుర్యోధనుఁ డపహరించుటయు, నది వీరలు దిగ్విజయంబుఁ జేసి యలవరించికొన్న పదంబగుటయు, ధర్మసూను మహానుభావంబు విచారింపక ధార్తరాష్ట్రులు పరిభవించినం దెగి యితండు వారలకుం గీడు సేయ రోయమియు, నీ రెండుదెఱంగులవారికిం బంచి కుడువం దగుటయుం దలపోసి, తగినకార్యంబు సెప్ప నర్హులరు. ఏనును నాకన్నంత సెప్పెద వినుండు. ౧౨

క. కుంతీతనయులు [1]సమయము
శాంతతమై నడపి, తమభుజాబలమును, దు
ర్దాంతోద్యమశౌర్యము నెఱిఁ
గింతు మనుచు నున్నవారు గిను కెడఁ గదురన్. ౧౩

క. వీరితలం పెఱిఁగిన గాం
ధారీతనయుఁడు సుహృద్విధానముఁ గూర్చుం,
'బోరఁ బిరిమార్తుఁ గొంచెపు
వారై యున్నెడన' యని యవశ్యముఁ గడఁకన్. ౧౪

1 సమయము =(సం. వి. అ. పుం.) శపథము; ఆచారము; కాలము; సిద్ధాంతము; బుద్ధి; సంకేతము; ప్రతిజ్ఞ; ఆజ్ఞ; ఆన.

క. అలఘుబలవిక్రమోదా
త్తుల కైనను బలము లేక దోర్గర్వమునన్
గెలువఁగ వశమె, సహాయము
కలిమి ననంతంబు లగుపగఱసైన్యములన్? ౧౬

క. కావునఁ, బాండవపక్షము
భూవల్లభకోటి యిచటఁ బ్రోవగు; నిమ్మై
నీవీరులు నావీరులు
దేవాసురులట్లు యనికిఁ దెగుదురు గడిమిన్. ౧౭

వ. ఇది యిక్కడి తెఱంగునకుఁ దోఁచిన తలంపు. అక్కడివారిచిత్తవృత్తి యెట్టి దగుట యెఱుంగము. ఎదిరిమతం బెఱుంగక యెట్టికార్యంబు నిశ్చయింప నెర వగునే? కావున, నియ్యవసరంబునం దగినమానిసి నందులకుం బుచ్చవలయు. దుర్యోధనుండు వీరికి రాజ్యంబుపా లిచ్చిన మే లగుఁ; కాక, తక్కిన నప్పటికిఁ బోలినపని సూచుకొందము". అని పలికిన విని బలరామదేవుం డియ్యకొని, రాజలోకంబు నాలోకించి యి ట్లనియె:

క. "హరివాక్యము వింటిరె?
అది యిరుదెఱఁగులజనములకును హితమును, ధర్మో
త్తరమును నై యున్నది. ఈ
నెరవున శక్యంబు మనకు వీరలఁ దీర్పన్. ౧౮

చ. తమ సగఁబాలు గోలుపడి, దానిన యిప్పుడు గోరువీరికిన్
సముచితవృత్తి నిచ్చి, [1]తమసామున సంతస మంది యున్కి యు
క్తము ధృతరాష్ట్రసూనునకు; దాన నపాయము లేకయుండు. కోప
ముడిగి వీరు సేయుదురు బాంధవ; మిజ్జగముం బ్రియంపడన్. ౧౯

వ. కావున నికార్యం బెడసేయక యొక్కరుం బనుపవలయు. వాఁడు నుం జని యభిమతంబు సాధించునప్పుడు— ౨౦

1. తమసామున = తమ (కౌరవులకు శేషించిన) సగమున...

ఆ. మాటపొం దెఱింగి, [1]యోటమై
నల్లన చేరి, కౌరవేంద్రు చిత్తవృత్తి
కనుగుణంబు గాఁగ [2]నానతుం డగుచుఁ బ్రా
ర్థించి యడుగకున్నఁ [3]దెలుఁగుపడదు. ౨౧

వ. అది యెట్లనిన, ధర్మనందనుం [4]డతనియుద్ధతికిం [5]బుయిలోడి, [6]మెయివడి గలనడవడిం బ్రవర్తిల్లుచుండియు, జూదంబువెంట మోసపోయి, తోడరి చిక్కనం బడియె. అదియును నతం [7]డక్షవిద్యాపాటవంబు దనకు మిగుల లేమింజేసియు, బంధుజనంబులు దన్ను వారించుటయుఁ, దా నాడుట మాని గాంధారరాజును నియమించినం, దత్కళా కౌశలంబునం బరిణతుండు గావున నాశకుని యాడి, [8]యుధిష్ఠిరుం డొడ్డిన యొడ్డిమియు గెలుచుచు వచ్చినట్లగుట, నాతనియందునుఁ గొంత

---

1. ఓటమైన్ అల్లన = భయమున - సంకోచమున, తిన్నన - మెల్లన,...
ఓట. రూ. ఓటమి = (దే. వి.) భయము, సంకోచము, జంకు.
ప్రయోగము: "ఓట యొకింతయేని సుయోధను చిత్తమునందు లేమి"-ఉద్యో. 3, ౧౦౪
"ఎవ్వతవీవు.....యొంటిఁ జరించె దోటలేక"- స్వా. మను. ఆ. ౨
2 ఆనతుండగుచు = పూర్తిగా ముందునకు మొగ్గతిలినవాఁడై.
3. తెలుఁగుపడదు = అనువు పడదు - సమకూడదు.
4. అతని (దుర్యోధనుని) యుద్ధతికిన్ = ఉద్వృత్తికి - గర్వమునకు
5. పుయిలోడి = సంకోచించి
6. మెయివడి = నమ్రముతో...
మెయివడి. రూ. మయివడి, మేవడి=(దే. వి.) నమ్రత: ఉపాయము: ఉచితము.
ప్రయోగము: "అరినృపాలు పెంపు...
యుచితవృత్తి నతని యుద్ధతి మేవడిఁగడపి"-శాంతి. 3, ౯౦
"కయ్యమునకు నెవలను...
మెత్తఁజేసి చెఱుచు మెయివడిఁ దప్పించుకొను తెఱంగు"-శాంతి. [౨, ౨౭౨
"ప్రియమొసఁగందగన్...
... .. ... యే
మియు ననలేమి కూడదియు మేవడియై చను"-ఉద్యోగ. 3, ౨౨౨
7. అక్షవిద్యాపాటవంబు = పాచికలయాటలో నేర్పు.
8. (యుధిష్ఠిరుండు) ఒడ్డిన ఒడ్డిమియు = పెట్టిన పందె మంతయు.

లేమ. ఇ త్తెఱంగున వార లధర్మపరు లని నిందింపరా కునికి కారణంబుగా వీరలు వుచ్చినమానిసి వినయంబుతోన యిక్కార్యంబు దీర్చికొని రావలయు" ; అనిన, సాత్యకి కోపించి యిట్లనియె: ౭౨

—: సాత్యకి దుర్యోధనునకడకు దూతం బంపఁ గూడదని చెప్పుట :—

ఆ. "ఇట్టు లాడఁదగునె? ఇది నీక పోలు ; ని
న్నేమనంగ నేర్తు? ఇ త్తెఱంగు
పాడిగాఁగఁ బూని పలుకంగఁ జెవి యొగ్గి
యాదరించువారి నందుఁ గాక ! ౭౩

క. వేడుక పుట్టిన జూదం
బాడెనె ధర్మజుఁడు? వారలంచఱుఁ దమలోఁ
గూడికొని పిలిచి, బలిమిన
యాడి, కపటజయము గొనుట యది దగ వగునే? ౭౪

క. ధర్మతనూభవు డెస దు
ష్కర్మము రూపించి, సభ నొకండును మైమైఁ
బేర్మి సెడక పోనేర్చునె?
ధార్మికు లిం కెట్టివారు తథ్యం బరయన్? ౭౫

చ. పలికిన చందముల్ సెఱపి, పైతృకమై చను రాజ్యభాగ మి
మ్ములఁ బడయం దలంచి, బలముం జలముల్ సెఱపం గడంగు వీ
రలు నోరు వేఁడఁ బోదురె? అరాతులు సాధుల మెత్తురే? రణం
బుల జయలక్ష్మిఁ జేకొనుటఁ బోలునె యొండొక రాజధర్మముల్? ౭౬

తే. సముచితము లగుమాటలఁ జక్కఁ బడక
తక్కెనే, [1]నక్కివుం డగు ధార్తరాష్ట్రుఁ
గూర్శరశరముల నే నియ్యకొలుపువాఁడ,
నవని కౌంతేయులకు నిచ్చునట్లుగాఁగ. ౭౭

1. ఉక్కివుండు అగు ధార్తరాష్ట్రుఁడు=కపటియగు (ధృతరాష్ట్రునికొడుకు) దుర్యోధనుఁడు

క. భీమార్జునులకు రణమున
నేమగలును బ్రతియె? పీరు నేనును సైన్యో
ద్దాముల మై నడచిన, నే
భూమీశులు నెదిరి బ్రదికిపోవం గలరే? ౨౮

ఆ. కవలవారుఁ, గొడుకుగమియుఁ, బాంచాలవ
ర్గంబు, వృష్ణివరులుఁ గడఁగిరేని,
నొక్కమాత్రలోన [1]నువ్వెత్తుగొనరె దు
ర్యోధనాదిశతము -[2]నుద్దవిడిన? ౨౯

క. ఈమత్స్యపతి [3]సహాయము
గా మాకుం దీర్పరాని కార్యము గలదే?
సామాద్యుపాయపరుఁ, డు
ద్దామభుజాబలయుతుం, డితఁడు [4]కేవలుఁడే? ౩౦

క. నామతమునఁ గార్యము సం
గ్రామము సేయుటయ. ఇట్లుగా కీలోనన్
సామవచనంబు లక్కరు
భూమీశ్వరుతోడ నాడఁ బుచ్చెద రేనిన్— ౩౧

ఉ. దైన్యము దక్కి దూత యుచితంబుగఁ బాండునృపాలు పాలు రా
జన్యవరుండు ధర్మజుఁడు సమ్మతి వేఁడెడు నన్న, లోకసా
మాన్యవిధిం దగంగ గరిమంబున నిచ్చినఁ బుచ్చికొండు: మ
న్యోన్య విరుద్ధభాషణము లాడినఁ, దత్ఫల మాతఁ డందెడున్." ౩౨

---

1. ఉవ్వెత్తుగొనరె = అడుగంటోఁబెకల్పరా! –నిశ్శేషము సేయరా?...
ఉవ్వెత్తు = (ప్రి. యుగపత్తు) ఉమ్మడిగా; అడుగాన; నిశ్శేషముగా
2. ఉద్దవిడిన = పెద్దయెత్తుతో; పిట్టపిడుగున.
ఉద్దవిడి=రూ. ఉద్దవడి (ప్రి. ఉద్వృత్తి)=ఉద్ధతితో; పిట్టపిడుగున
3 సహాయముగా=సాయముకాఁగా; తోడ్పడఁగా.........సామాద్యుపాయపరుఁడు,
సామదానాది చతురుపాయములు నేర్చినవాఁడు...
4. కేవలుఁడే=అల్పుఁడా?–వట్టివాఁడా?

వ. అనిన, ద్రుపదుండు: "ఇది వోలు. బలదేవుమాట మాట గాదు. బలవిక్రమవంతుండును సహాయసంపన్నుండును దుష్టాత్ముండును నైన దుర్యోధనుండు ప్రియవచనంబుల రాజ్యంబు పాలిచ్చుట కియ్యకొనమి సిద్ధంబు; యుద్ధంబునం గాని చక్కంబడదు," అని పలికి మఱియు నిట్లనియె: 33

క. "మృదుభాషణముల దుర్జన
హృదయములు ప్రసన్నతామహిమఁ బొందునె? ఎ
ల్లిదముగఁ గొని, యంతంతకు
మద మెక్కుం గాక దురభిమానము పెర్మిన్. 34

వ. అదియునుం గాక, 35

తే. కూటికై ద్రోణ భీష్ములు కుమతి యనక
యనుసరింతురు: ధృతరాష్ట్రుఁడును దనూజు
తృష్ణ నూనినవాఁడు: రాధేయుఁబోఁటి
తులువ లెల్లను నతని సద్బుద్ధి యండ్రు. 36

వ. కావున, నతండు దుర్వినీతుం డై యుండు. ఎల్లభంగుల సంగరంబు గాఁగలయది. ఈ సమయంబున బలంబులం గూర్చికొని పిలువం దగు రాజులం బిలిచి పుచ్చవలయు. సుయోధనుండును దోడాసపడి పుచ్చు. ఉచితపరులగు నరపతులు దొలుతఁ జెప్పినవారికి సహాయత్వంబుఁ జేయం జూతురు. మనము [1]వెసగల కాలరుల వేగంబ పుచ్చి, శల్య కేకయ దృష్టకేతు జరాసంధతనయప్రభృతు లయిన భూపతులకును, వారివారి బంధు మిత్రజనంబులకును నెఱింగించి పుచ్చుట కార్యంబు. ఇది నాకుం బోలిన తెఱంగు." అని పలికి తన కెలన సముచితాసనంబున నున్న విప్రవరుం జూచి: 37

క. "ఇతఁడు మదీయాగ్రపురో
హితుఁ; డితనికి నెల్లపనులు నెఱిఁగించి తగఁన్

1. వెసగల కాలరులను = వడిగల కాల్బంట్లను_పదాతులను.

ధృతరాష్ట్రుకడకుఁ బనుపుఁడు
చతురవచన రచనఁ గలపి సంప్రీతిమెయిన్. ౩౯

ఉ. ఆతనిసమ్ముఖంబునఁ, దదగ్రతనూజుకడన్, మరున్నదీ
జాతునిసన్నిధిం, గలశసంభవునొద్దఁ గ్రమోచితంబుగా,
'నీ తెఱఁ గిట్టు లాడు' మని యేర్పడ నంతయుఁ జెప్పి పుచ్చఁగా,
నీతిమెయిం దగం బలుక, నెయ్యము లాభముఁ బెంపుఁ జొప్పడున్."

వ. అనిన, వాసుదేవుండు: "పాంచాలపతివచనంబు లుచితంబు లయి యున్నయవి. ఇబ్భంగిన చేయవలయు" నని పలికి మఱియు నిట్లనియె:

క. "కౌరవులకుఁ బాండవులకు
నారయ నే నొక్కరూప; యట్లగుటఁ, దగన్
వారును వీరును దమతమ
[1]నేరిమిమెయి ధరణి యేలి నెగడఁగఁ జూతున్. ౪౧

తే. పెండ్లికని పిల్వఁ బంచినఁ బ్రియముతోడ
నేఁగుదెంచితి; మిన్నాళ్ళు నెల్లయొప్పి
దములఁ జూచితి; మియ్యెడఁ దడవుగాఁగ
నిలువఁ దీఱదు; పోయి రావలయు మాకు." ౪౨

వ. అని పలికి, ద్రుపదు నాలోకించి, "మీరు మా కెల్లవారికి గురుస్థానంబు. మీ మాట యనిన ధృతరాష్ట్రుండు బహుమానంబు సేయు. మిమ్ము శాంతనవుండునుం గొనియాడు. మీయందు ద్రోణ కృపాచార్యులు సఖ్యంబు వాటింతురు. అట్లగుటం జేసి,

తే. పాండవార్థమై [2]యొక్కరుఁ బనుప మీక
భరము; మీపలుకందఱపలుకు; [3]మీరు

---

1. నేరిమిమెయి=నేర్పుతో. 2. ఒకరుం...భరము = ఒక్కనిం బంపుట మీభారము. మీమాటయే యందఱమాట. 3. మీరు తెఱఁగు పఱుపంగ = చక్కదిద్దపోవఁగా, మీటి–అతిక్రమించినచో వారే చెడుదురు.

తెలుఁగు పలుపంగ, మిగిలి యుద్రేకులైన
వార చెడువారు, విమలవిచారవిభవ ! ౪౪

క. ఘోరం బైన తెన్ను ; విరసపుఁ
గ్రొం దయ్యెడుఁ జండ మైన, రాజులనెల్లన్
ముందఱ రావించి క్రమం
బొందఁగ, మముఁ బిలువఁ బంపుఁ డొయ్యన పిదపన్. ౪౫

క. మీపన్నపున రాజ్యముపా
లీపాండుతనూభవులకు నీకున్న, భుజా
టోపభయంకరుఁ డర్జును
కోపానల మడరి ముట్టికొనదే వారిన్ ? ౪౬

చ. అని, గమనోన్ముఖుం డయి మురాంతకుఁ డా ద్రుపదుండు ధర్మనం
దనుఁడు వృకోదరాదు లగుతమ్ములు మత్స్యమహీవిభుండుఁ ద
న్ననుప, హలాయుధప్రభృతియాదవలోకము గొల్వ రా, ముదం
బున నిజపట్టణంబునకుఁ బోయె సముజ్జ్వలవైభవంబునన్. ౪౭

వ. వివాహమహోత్సవంబునకు వచ్చిన తక్కటిరాజులును సంగ్రామ
సన్నాహంబునకై తమతమపురంబులకుం జనిరి. తదనంతరంబ— ౪౮

క. సమరమునకుఁ దగునుద్యో
గమునఁ బ్రవర్తిల్లి రెలమిఁ గౌంతేయులు ; మ
త్స్యమహీనాథుఁడు సన్నా
హము సేసెఁ ; ద్రుపదవిభుఁడు నాయిత మయ్యెన్. ౪౯

వ. ఇట్లు సన్నద్ధులై [1]వెలిపీడు విడిసి తమకు ననురక్తులైనరాజులపాలికిం
దగుదూతలం బుచ్చిరి. అట దుర్యోధనుండు వీరలచందంబు విని,
తానును దనబంధుమిత్రగణం బైనరాజలోకంబు నెల్ల రావించిన—

క. ఇభ తురగ స్యందనగతి
రభసంబునఁ బృథివి యదుర్వ రాఁ దొడఁగిరి భూ

---

1. వెలిపీడు = వెలుపలినగరు—విడిది.

విభులు నలుదిక్కులను, లో
కభయంకరలీల నభయకటకంబులకున్. ౫౧

—: ద్రుపదుఁడు దన పురోహితుని దుర్యోధనునికడకు దూతఁగాఁ బంపుట. :—

వ. అట్టిసమయంబున నజాతశత్రు ననుమతి వడసి పాంచాలపతి వయో
జ్ఞానవృద్ధుండైన తనపురోహితుం గురుపతిపాలికిఁ బుచ్చువాఁడై యతని
రావించి— ౫౨

క. "హితుఁడవు, మతిమంతుండవు,
చతురవచనకోవిదుఁడవు, సమయజ్ఞుఁడ, వు
న్నతవంశవర్ధనుఁడ, విం
గితవేదివి, నెచ్చెలివి, సుకృతి వట్లగుటన్— ౫౩

తే. నాకుఁ గర్తవ్య మగుపని నీకుఁ జేయఁ
దగవు గావున, నెల్లవిధములఁ బూని
పాండవార్థంబు ధృతరాష్ట్రుపాలి కరిగి
నేర్పువాటించి కార్యంబు దీర్పవలయు." ౫౪

వ. అని చెప్పి యొడంబఱిచి యతనితో మఱియు నిట్లనియె: ౫౫

క. "విను, కొడుకు గొన్న[1] వేఁదుఱు
గొని కొట్టినతిండికాఁడు కుటిలుం డతఁ; డా
జనపతిచందము, ధర్మజు
ననుపమశీలంబు నెఱుఁగు; దది యట్లుండెన్— ౫౬

తే. పుడమిపాలు పాండవులకు నడుగఁ బోయి,
నీవు ధృతరాష్ట్రుతో ధర్మనిష్ఠ మైన
యుచిత మాడిన, నందుఁ బోటొడ్డి యున్న
దొరల భృత్యులమనములు [2]దిరుగఁబడవె? ౫౭

1. వేఁదుఱు = వెఱ్ఱియే...
2. తిరుగఁబడవె = వెనుకకు మరలవా?—మన కనుకూలముగ మాఱవా?

క. గురు భీష్మాదులమనములు
దురమునకుం జొరక యుండ, దుర్యోధనుఁ డా
తురుఁ డై యొడఁబఱుపఁగ, ని
ప్పురుసున నెర వైన ఱిచ్చవడు బల మెల్లన్. ౫౮

ఉ. పాండుతనూభవుల్ వడినపాటులు బంధుల కెల్లఁ దెల్పుచుం,
బండితవృద్ధసజ్జనులపాలికిఁ బోయి, కులోచితంబు గా
కుండుట సూపి చెప్పుచుఁ, బ్రియోక్తులఁ దక్కటివారి 'నిట్లు మే,
లొండొకచంద మొప్ప' దని యుల్లములం దలపోయఁ జేయుచున్—

వ. మఱియు సమస్తజనంబులమనంబులు నిక్కడ వ్రాలునట్టి యుపా
యంబు లెన్ని గల వన్నియు, నయ్యైతగవులనై నాచరించుచుఁ జరి
యించునది. ఇచ్చట విరాటు కొలువుకూటంబునం బుట్టిన కృష్ణాదుల
సంవాదంబు తెఱంగును మనమెఱింగినయదియు. తదనురూపంబుగాఁ
బలికి పాండవులకుఁ దేజోలాభంబుం గావించుట కర్తవ్యంబు. నీవు
కరినగరంబున వసియించి ధృతరాష్ట్ర ధార్తరాష్ట్ర గాంగేయ విదుర
గురు కృపాదులకడ కరిగి నానాఁటికి వారివారి చిత్తంబుల తెఱంగెఱింగి
ప్రవర్తింపుము. దైవగతిం జేసి నీయొజ్జిన సూత్రంబునకు సుయోధనుం
డొడంబడియె నేనియు నదియ సకలజనసమ్మతం బయినవిధంబగు.
దాన నజాతశత్రుండును బ్రీతుం డగుఁ, బోయిరమ్ము". అని నిశ్చ
యంబు సేసిన, నమ్మహీసురవరుండు— ౬౦

క. మును పాంచాలవిభుని వీ
డ్కొని, ధర్మజు భీము నరు నకులు సహదేవుం
గని యనుమతుఁడై, యందఱు
ననుపఁగ, మన్ననలు వడసి యరిగెం బ్రీతిన్. ౬౧

వ. అంత నక్కడ దుర్యోధనుండు సకలరాజన్యసామాన్యంబుగా గోపాల
దేవుపాలికి దూతం బుచ్చుట దగ వగునే యని విచారించి, ౬౨

క. వెఱపు మెయిఁ దాన కతిపయ
పరిజనసహితముగ నరిగెఁ, బటుతురగగతి
స్ఫురణానుమోదలీలా
భరితుఁ డగుచు, వేగిరంపుఁబయనములఁ దగన్. ౬౩

వ. చని, తదీయపురప్రవేశంబు సేసె. ఆదివసంబునన ధనంజయుండును
గోవిందుం గాన వచ్చె; నట్టియెడ— ౬౪

తే. అతఁడు పవడింప, మును కౌరవాధినాథుఁ
డరిగి తలయంపిదెస నున్నతాసనమున
నుండెఁ: బదపడి కాల్కడయొద్ద కల్లఁ
జని వినమ్రుఁడై నిలుచుండె సవ్యసాచి. ౬౫

వ. అంత,—

క. మేలుకని కృష్ణుఁ డర్జును
నాలోకించి, మఱి కౌరవాధిపుఁ గని, త
త్కాలోచిత బహుమతిమైఁ
జాలఁ బ్రియం బిరువురకుఁ బ్రసన్నతఁ జేసెన్. ౬౭

వ. తదనంతరంబ—

ఉ. వారలఁ జూచి కేశవుఁడు, "వచ్చినకార్యము సెప్పుఁ"డన్న, న
క్కౌరవనాథుఁ డిట్లనియెఁ: "గయ్యము సేయువగన్ సహాయముం
గోరి [1]భవత్సకాశమునకుం జనుదెంచితి; మేము, వీరు నీ
కారయ నొక్కరూప; హృదయంబునఁ బేర్చిన బాంధవంబునన్.

క. మున్నేను గాన వచ్చితి
నిన్నుఁ; సుజను లైనవారు నెమ్మిని మునుమున్
గన్నం దగఁ గైకొందురు; స
మున్నత సౌజన్యసారయుతుఁడవు నీవున్. ౭౦

1. భవత్సకాశమునకు = నీసాన్నిధ్యమునకు—సమీపమునకు.

వ. కావున లోకంబుపాడి విచారించి నాకుం దోడు గా వలయు", ననిన
వాసుదేవుం డిట్లనియె : ౨౧

ఉ. "నీ విట మున్న వచ్చి; తిది నిక్కము. పార్థునిఁ దొల్తఁ గాంచితిన్
గావున, మీకు నిద్దఱకు గౌరవ మొప్పఁగ దోడుపాటు స
ద్భావము. దీనికిం దెఱఁగు దప్పక యుండఁగ నేర్పరించెద;
న్నీవల పెట్టు లట్ల తగ నీవును నీతఁడు గోరికొండు గాకన్. ౨౨

క. నాపాటియ పదివేవురు
గోపాలురు గలరు, సమరకోవిద బాహా
టోపాభిరామమూర్తులు,
చాపాద్యాయుధకళావిశారదచిత్తుల్. ౨౩

క. నారాయణాభిధానులు
వారలు గయ్యంబు సేయువా; రొక్కెడ నే
నూరక నిరాయుధ వ్యా
పారతమై నుండువాఁడఁ బరమాప్తుఁడ నై. ౨౪

క. వా రొకతల, యే నొకతల;
యీ రెండుతెఱంగులందు నెయ్యది ప్రియ మె
వ్వారికిఁ జెప్పుఁడు; దొలితొలి
గోరికొనన్ బాలునికిఁ దగుం బాడిమెయిన్". ౨౫

—: అర్జునుఁడు శ్రీకృష్ణునిం దనకు సహాయునిఁగాఁ గోరికొనుట :—

క. అని పలికి హరి, కిరీటిం
గనుఁగొని : "కొండుకవు నీవు గావున, నీకున్
మునుగోరఁ బాడి" యనవుఁడు,
విని కృష్ణునిఁ గోరికొనియె విజయుం డెలమిన్. ౨౬

ఆ. దాని కాత్మఁ బొంగి ధార్తరాష్ట్రుఁడు, వారి
నపహరించికొనిన యట్ల కాఁగఁ

దలఁచి, చెన్నమీఱి, బలములఁ గైకొని
చనియెఁ బ్రీతి రాము సదనమునకు. ౭౭

వ. చని యతనిం గని సమ్మానంబు వడసి తనవచ్చినకార్యం బెఱింగించిన దుర్యోధనునకు బలదేవుం డిట్లనియె: ౭౮

క. "అభిమన్యు వివాహమునకుఁ
బ్రభువర్గం బెల్ల గూడఁబడి యుండఁగ, నా
సభ నీకై యేఁబలికితి;
నిభపురమున మాట పుట్టె దె ట్లీవు వినవె? ౭౯

వ. దానికిఁ గొంద ఱసహ్యపడి పాండవపక్షపాతంబునం బ్రతికూలవచనంబులు వలికిన నవి కృష్ణునకుఁ బ్రియంబులై యుండె. అట్లగుటం జేసి.—

తే. అతనిఁబాసి యొక్కింత పోద్దైన నిలువఁ
జాలమియు మూలముగ, విరసంపుమాట
లాడ నొల్లమి, నేమియు ననక యంత
నుండి యొక నిశ్చయమ్ముగామె నున్నవాఁడ. ౮౧

వ. అది యెయ్యది యంటేని —

క. మీరును వారును జలమునఁ
బోరెడునెడ, నెద్ది యెట్లు వోయిన నెఱి నే
నూరక యుండుదుఁ; దో డై
వ్వారికిఁ బో, నింత నిక్కువం బెబ్బంగినె". ౮౩

వ. అనిన విని, దుర్యోధనుండు దాని కియ్యకొని, సవినయంబుగా బలదేవుని వీడ్కొని, వాసుదేవు నామంత్రణంబుసేసి, కృతవర్మ పాలికిం జని, యాతం డొక్కయక్షౌహిణితోడఁ దన్నుం గలయ వచ్చువాఁడయి యూఱడం బలికినఁ బ్రియం బంది, నిజపురంబున కరిగె. తదనంతరంబ కృష్ణుం డర్జునున కిట్లనియె:

క. “నారాయణ గోపాలుర
భూరిపరాక్రములఁ గురువిభుఁడు గొన, సంగ్రా
మారంభరహితు నన్నుం
గోరికొనుట నీకు మేలగునె తలపోయన్?” ౮౫

క. అనుటయు, నాఁతఁడు హరి కి
ట్లను: “నేను రణంబునకు సహాయం బొల్లన్
విను, సుప్రసిద్ధుఁడవు నీ
[1]వని సేసినఁ, బేరు నీక యగు నెప్పాటన్. ౮౬

వ. నీ కెదురైన జయంబు గొనరా; దట్లగుటం జేసి, విజయమూలం బగు నీతోడును వలయు. నీవు సమరంబు సేయకునికియుం బ్రియంబు కావున, నిన్నుం గోరికొంటి” నని చెప్పి మఱియు నిట్లనియె:

క. “సారథ్యం బొనరింపు మ
పారకృపాలీల నెల్లభంగుల నా; కీ
గౌరవమును జిరకాలము
గోరినయది; దీని నిమ్ము గుణరత్ననిధీ.” ౮౮

క. అనినఁ, గిరీటికి హరి యి
ట్లను: “నీ దగు కోర్కి దీర్పు టది నాకు వ్రతం
బనఘా! తగ సారథ్యం
బొనరించెద నీకు ససమయుద్ధ క్రీడన్”. ౮౯

క. అని యూఱడించి, నరుఁ దో
డ్కొని, ధర్మతనూజు నొద్దకుం బ్రియ మెసఁగం
జనుదెంచెం గార్యాలో
చనమును దగఁ జేయుబుద్ధి శౌరి గడంకన్. ౯౦

---

1. నీవు అని సేసినన్=నీవు యుద్ధము చేసినచో,...

వ. అంత, నట శల్యపాలికిం బోయినదూత లతనిం గని సముచి తాలాపంబుల సమర సహాయత్వంబునకుఁ గోరి పిలిచినం బ్రీతుండై యతండును బుత్త్రమిత్త్ర సమేతంబుగా నానా సేనాతిసంకులం-బుగాఁ గదలి పాండవు లున్నయెడకు నిత్యప్రయాణంబుల నడచు సమయంబున— ౮౧

—: దుర్యోధనుండు శల్యసాహాయ్యంబు గోరుట. :—

తే. ఇంతయును విని కౌరవాధీశ్వరుండు
దక్షు లగు నాప్తజనములఁ దత్క్షణంబ
మద్రనాథునిచనియెడు మార్గమునకుఁ
బుచ్చి, యెడనెడ నతులవిభూతి మెఱయ— ౮౨

సీ. అరు దారు మేలుకట్లాయితం బై చూడ
నొప్పారి తను పగు చప్పరములుఁ,
[1]బర పైన చెలువంబు గరగరికయుఁ దియ్య
తెలినీరుఁ గలిగిన దీర్ఘికలును,
బొడ వైన [2]మువ్వంచఁ బొలుచునట్లుగ నేనుఁ
గులకు గుఱ్ఱములకుఁ గొట్టములును,
ముందర బయ లైన చందంబుఁ జతురాభి
మత మైన యాస్థానమండపములు,

ఆ. బియ్యములును, నేయుఁ, బెరుఁగును, గూరగా
యలును, వంటకట్టియలును, గడ్డి,
[3]కవణములును బెల్లుగా నొడగూర్చి ని
గూఢవృత్తిఁ దానుఁ గూడ నడచె. ౮౩

1. పరపైన...... దీర్ఘికలును=విరివియు, అందమును, తేట (గరగరిక) యునై తియ్యని నిర్మలోదకము (తియ్యని తెలినీరు) గల డిగ్గియ (దీర్ఘిక)లును—నడబావులును.
2. మువ్వంచఁ బొలుచునట్లుగ=మూఁడు పంచలతో నొప్పునట్లుగ.
3. కవణములును=గుఱ్ఱములు లోనగువానికి వేయు ఉలవలధానా. మొ. కవణము. (ప్ర. ఖాణము) ఉలవలధానా.

వ. ఇవ్విధంబున విడిదలపయనంపుసంపదలు [1]పొంపిరివోవం దనకు సమ
కట్టినయను_స్తవ స్తువులయవై శల్యంబునకు శల్యుండు సంతుష్టాంత
రంగుండై నిజపరిజనంబులంజూచి, "యిట్లు చతురంబుగా మనకు
వలయువాని సంపాదించుటకుం బ్రవ_ర్తకులైన యుధిష్ఠిరామాత్యు
లెవ్వారు? వారలం దోడ్కొ_నిరండు. వారలు ప్రసాదదానంబున
కర్హులు," అని పలుకు నవసరంబున, నటమున్న పలుదెఱంగులం
బనులు సేయుచున్న తన[2]పల్లాయనంబువారిలోంగలసి మఱువడియున్న
కౌరవేశ్వరుం డయ్యాటలువిని, యతనికిం బొడసూప నిదియ సమ
యం బని సముచితప్రకారంబునం దన్నెఱింగించికొని వినయంబునం
గనిన, నతండును సంభ్రమంబున గాఢాలింగనంబుసేసి కనకాసనంబున
నునిచి, 'ఇంతయు నిమ్మహాత్ము నుద్యోగంబున నయ్యెంగావలయు'
నని తలంచి విస్మయం బొంది "నీ కెయ్యది యిష్టంబు గోరు
మిచ్చెద" ననిన, గాంధారీనందనుండు పరమానందంబునం బొంది
యిట్లనియె: ౯౪

క. "సత్యసరస్వతి వగు; మా
చిత్యవిశారదము నీదుచి_త్తము; నియమా
దా_స్త్యంబు మెఱయ నాకు న
మాత్యుండ వై పూని నడపు మ_త్తైన్యంబున్. ౯౫

ఆ. తలంపం బాండవులును ధా_ర్తరాష్ట్రులు నీకు
నొక్క_రూప: భ_క్తియు_క్తిం జాల
నీవు నన్ను మాననీయుండు గావున
ననుగ్రహించి తగం బరిగ్రహింపు." ౯౬

చ. అనవుడు, శల్యుం డియ్యకొని, "యట్టిద కాదె, విభేదవృ_త్తి నా
మనమున లేదు; పాండవసమాజము మీరును నొక్క_రూప, కా

---

1. పొంపిరివోవ = అతిశయింపంగా. 2. పల్లాయనంబువారిలో = ఆ ప్తులలో. పల్లాయ
నము యా. పల్లవము (ప్ర. పల్యాణము) = ఆ_ప్తత; ఏనుంగు ఆంబారి.

వున నిది లెస్సమాట దగవుం దలపోయఁగ. మున్ను ప్రీతిఁ గాం
చిననిను నెమ్మిఁ గూడుటయ చేయుదు నిట్టుల యెల్లభంగులన్. ౯౭

ఉ. డానఁ గొఱంత లే; [1]దభిమతం బిది గాకయుఁ గల్గెనేనియుం
బూని యొనర్తు" నన్నఁ, గురుపుంగవుఁ డెంతయుఁ బొంగి "నీవు స
మ్మానము సేసి నాకిటు లమాత్యుఁడ వైనపదంబుకంటె మే
లై నుతి కెక్కుకోర్కి యెటు లారసి చూచిన నొండు గల్గునే?" ౯౮

వ. అనిన విని, వికచవదనుం డగుచు మద్రేశ్వరుండు— ౯౯

క. "చను నీవు హస్తినగరం బున;
కేనును బాండుభూపపుత్త్రులఁ బ్రీతిం
గని యట వత్తు; నవశ్యం
బును వారలఁ జూడవలయుఁ, బోయెద ననినన్"— ౧౦౦

ఆ. "అట్లు కాక; వేగ మట వోయి మరలుంము;
వరము మఱవ కుండవలయు! మిమ్ముఁ
జేరి నెగడువాఁడఁ; గారుణ్యమున నిట
యరసి యుండుఁ" డనియెఁ గురువిభుండు. ౧౦౧

వ. అనవుడు, ౧౦౨

క. దరహాసముతో మద్రే
శ్వరుఁ డాలింగనము సేసి, 'సందియపడ కీ
వరుగు' మని పనుప, నాతఁడు
కరిపురికిం జనియె మది వికాసముఁ బొందన్. ౧౦౩

:—: శల్యుఁడు పాండవులం జూడ నుపప్లావ్యంబునకు వచ్చుట :—

వ. అంత శల్యుండు నుపప్లావ్యంబునకుం జని, [2]స్కంధావారంబు దఱియం
జొచ్చి, ధర్మనందనుని నివాసంబున కరిగిన, నతండు దమ్ములుం,

1. అభిమతం బిదియొనర్తు=కోర్కి ఇది కాక మఱేదియయినను పూనిక తో జేయుదును.
2. స్కంధావారము=(సం. వి. అ. పుం.) దండు విడిసియుండు చోటు.

దానును, ద్రౌపదీ సుభద్రలు, నభిమన్యుప్రభృతి పుత్త్రవర్గంబును నెదురు వచ్చి, కృతప్రణాముండై త్రోడ్కొనిపోయి, కాంచనాసనంబున నునిచి, యర్ఘ్యపాద్యంబులిచ్చి, కుశలంబడిగిన, 'సర్వంబును గుశల సంపన్నంబ' యని వారలనందఱ నభినందించి, యుధిష్ఠిరుం బునరాలిం గనంబు సేసి యిట్లనియె : ౧౦౪

క. "జనరహితం బగువనమున
ననుజన్ములు, ద్రుపదభూవరాత్మజయును, నీ
వును నింతకాల మలయక
యునికి కడుం దుష్కరము, మహోదాత్తమతీ! ౧౦౫

ఆ. దానికంటె నరిది దలపోయ నజ్ఞాత
వాస ముజ్జ్వలాంగభాసమాను
లై నమీకు. మీదయాసూనృతాదుల
పెంపు మిమ్ముఁ [1]గడవఁబెట్టకున్నె ? ౧౦౬

క. ఇమ్మహి యెల్లను నీమది
యుమ్మలికకుఁ జాల నొచ్చె; నుర్వీవర, నీ
విమ్మెయి నిప్పు డఖిలదురి
తమ్ములుఁ గడచుటకు సమ్మదమ్మునఁ బొదలెన్." ౧౦౭

వ. అని యుచితసంభాషణంబులు సేసి, దుర్యోధనుండు దన్నుం గాంచిన విధంబును, అతండు ప్రార్థించిన తెఱంగును, దానికిం దా నియ్యకొనుటయుం జెప్పిన, ధర్మనందనుం డతని కిట్లనియె : ౧౦౮

తే. "మేలు సేసితి; రొక్కరి మెచ్చి వారి
కోర్కి దీర్చుట పెద్దలగుణము కాదె?
అది మదీయచిత్తమునకు హర్షకరము.
తివిరి యొక్కటి వేఁడెద ననఘ! వినుము. ౧౦౯

1. కడవఁబెట్టకున్నె? = కడతేర్పింప కుండునా?

వ. "పార్థునకుఁ గృష్ణుండు సారథ్యంబు సేయువాఁడై యున్నవాఁడు. కర్ణుండు పార్థుతో నెప్పుడు మచ్చరించుచునుండు. వీ రిరువురకు సంగ్రామం బైనయప్పుడు కృష్ణునకుఁ బ్రతిసారథ్యం బొనరింప మీరకాని యక్కడం దక్కొరుండు లేఁడు గావున, నవశ్యంబును మీకుం గర్ణసారథ్యంబు కర్తవ్యంబుగాఁ గలయది. సమరసమయంబున నిరాకరించి పలికి కర్ణుచిత్తంబునకుం గలఁక వుట్టించి పార్థు రక్షింపవలయు. అకృత్యంబని యనుమానింపక మత్ప్రార్థనంబున నెల్లభంగుల నివ్విధం బనుష్ఠించువారలు," అని యభ్యర్థించిన, సమ్మతించి శల్యుం డిట్లనియె: ౧౧౦

క. "అగు నిది వోలును; నాకుం
దగ వట్టిద; 'కర్ణునకు రథంబు గడప నీ
వగు' దని కోరిన కౌరవ
జగతీశ్వరుప్రార్థనంబు సలుపఁగ వలయున్. ౧౧౧

క. కర్ణునిసారథి నైనను
నిర్ణయమున సేను బార్థునిం గాచెద. నా
దుర్ణయవిచారు నెమ్మెయిఁ
గర్ణకఠోరంబు లాడి కలఁతుం బోరన్. ౧౧౨

తే. దర్పమును దేజమును మాయఁ దలరఁ బలికి
చిక్కువఱిచిన, నేయంగఁ జేతులాడ
కునికి, రాధాతనూజు నర్జునుఁడు తీవ్ర
బహుళ బాణపరంపర పాలు వఱుచు. ౧౧౩

చ. ఇది యొకఁ డేల? నీవు మది నెయ్యది గోరినఁ జేయువాఁడ. నాఁ డదయత సూతసూతి సభ నాడినమాటకుఁ జాల నొచ్చి మా హృదయము లెల్ల నీవలన నెంతయుఁ బఱుముసేయు: నక్కటా! అదియును గాక మీఁపడిన యాపద లెవ్వరి నొవ్వఁజేయవే? ౧౧౪

ఆ. ఇట్లు వడితి ననుచు నెడ నీవు వగవకు;
గారవమున నీ మనోరథమ్ము

ఫలము వొందు నెల్లభంగుల; దేవత
లయినఁ బడుదు రొక్క యవసరమున. ౧౧౫

క. వాసవుఁడు దొల్లి నిజకాం
తాసహితము గాఁగ నధికదైన్యము వొందెన్;
మీసంపద పెద్దయె? విధి
సేసినగతిఁ బడకయుండ శివునకు వశమే?" ౧౧౬

వ. అనిన విని ధర్మనందనుండు: 'ఇంద్రుండు శచీసమేతంబుగా నట్టి
దురవస్థ యేమికారణంబున నెత్తెఱంగున ననుభవించె' నని యడిగిన,
మద్రపతి, 'తొల్లింటి యితిహాసంబు సెప్పెద విను'మని యిట్లనియె:
"దేవతలయందు మాన్యుండై త్వష్ట యను పేరం బరఁగువాఁడు,
వాసవునకుం గీడు దలంచి మూఁడుదలలవాని నొక్కని సృజియించి,
విశ్వరూపనామధేయుం జేసిన, నతం డింద్రపదవిం గోరి ఘోర
తపంబు సేయుచున్న, దానికి భయం బంది నిలింపపతి యప్సరస్త్రీలఁ
దత్తపోభంగంబు సేయుం డని నియమించి పంచిన— ౧౧౭

క. వారివిలాసంబులను, వి
హారముల, విలోకనముల, నాలాపములన్
మారవికారం బాతనిఁ
జేరద; యన్నాకపతియు సిగ్గదఁ గదురన్— ౧౧౮

తే. తలరి యమ్మునిఁ దెగఁజూచి ధర్మరహితుఁ
డగుట, యెవ్వరు నెఱుఁగనియట్లు గాఁగ
నేఁడుగాలంబు గడపిన, నెఱిఁగి భూత
గణము లాక్రోశ మొనరింపఁగా నతండు— ౧౧౯

వ. త్తన దుష్కర్మంబు ప్రకటంబగుటకు రోసి, యొక్క విషమవ్రతం బాచ
రించి, సముద్రతరు ధరణీ స్త్రీజనంబులయందు బ్రహ్మహత్య విభా
గించి పెట్టి, నిజకల్మషంబుఁ బాపికొని, మునిగణసేవితుం డయి సము-
ల్లాసంబునం బొంది యునికికిఁ ద్వష్ట కోపించి— ౧౨౦

తే. "అనపరాధుఁ, దపోనిధి, నధికశాంతి
యుక్తుఁ జంపినపాపాత్ము నలుక పట్టి
మ్రింగఁజాలెడువాని, నత్తుంగదేహు
నేను సృజియింతుఁ జూఁడుఁడీ యీక్షణంబ". ౧౨౧

చ. అనుచుఁ గడంగి నిష్ఠమెయి నగ్నిముఖం బొనరించి, [1]వేలిమిం
దనయు సృజించి, లోకవిదితంబుగ వృత్రసమాఖ్య యిచ్చి 'మ
ద్వినుత•తపోబలంబునఁ బ్రదీపితతేజుఁడవై జయింపు నీ'
వని నియమించి పంచె నమరాధిపుతో సమరంబు సేయఁగన్. ౧౨౨

•—: ఇంద్రుఁడు వృత్రాసురునితో యుద్ధంబు సేయుట :—

చ. పనిచిన నాతఁడుం జనియె బాహుబలంబున నేచి; వాసవుం
డని కెదు రేఁగుదెంచె; నిటు లద్భుతసంగర మైనచోట న
య్యనిమిషనాథుఁ బట్టుకొని [2]యంగద వృత్రుఁడు మ్రింగె, దేవత
ల్మనమున బెగ్గలింపఁగఁ జలంబు బలంబును నూపి యుగ్రుఁడై.

వ. ఇట్లు మ్రింగినం ద్రిదశగణంబులు దత్క్షణంబ యాదైత్యునకు [3]నావు-
లించునట్టి యాలస్యం బావహించిన— ౧౨౪

తే. అసురనాథుండు నలసత యడర నీల్గి
యావులించిన, నత్తఱి నమరవిభుఁడు
దనశరీరంబు సంకుచితంబు సేసి,
కడుజవంబునఁ గుప్పించి వెడల నుఱికె. ౧౨౫

క. [4]వెలలి బలరిపుఁడు చలమునఁ
గలహోద్యమునకుఁ జొచ్చె. వృత్రు ఘన బాహుబలం

---

1. వేలిమిందనయు సృజించి=యజ్ఞమువలనఁ గొడుకును బుట్టించి...
2. అంగద...మ్రింగె=వృత్రుఁడు కోపముతో మ్రింగెను. అంగద=(ఉభ. దే. వి.) ఆఁకలి; ఆపద; కోపము; ఉత్సాహము; ఉపద్రవము.
3. ఆవులించునట్టి యాలస్యంబు ఆవహించిన=సోమరితనము - బడలిక.
4. వెలలి. రూ. వెడలి

బలిమికి మీఱెను; దండి వి
మల తపమునఁ జేసి సురల మనములు దలఁకన్. ౧౨౬

వ. ఇట్లధికబలుండైన వృత్రు నాటోపంబు సహింపంజాలక సురపతి దెరలి మరలిపఱచి మందరగిరిశిఖరంబున కరిగినం, [1]గనకనిం జని యనిమిషు లతనిం గూడుకొని, వృత్రవధోపాయంబు విచారించునెడ, నవ్వాస వుండును దనమనంబున నిశ్చయించి, ౧౨౭

క. 'హరిఁ గాంచి యతని చెప్పిన
పరమోపాయంబు సేసి బ్రతుకుద' మనినన్,
సుర లదియు కర్జ మని య
మ్మురమర్దను కడకుఁ జనిరి మునులుం దారున్. ౧౨౮

వ. ఇట్లు దివిజానీకంబును మునిలోకంబును బాకశాసనుం బురస్కరించుకొని— ౧౨౯

మ. చని యాదైత్యు తెఱంగు సెప్పి, "యతులోత్సాహంబునై నెప్పుడున్
దనుజవ్రాతము త్రుళ్ళడంచి, దివిజేంద్ర శ్రీవిలాసంబు పెం
పునఁ బొందించుట నీకు నైజముగదా, భూతేశ! ఘోరారిమ
ర్దన సంక్రీడ యొనర్పు లోకముల కత్యంత ప్రమోదంబుగాన్."

క. అనిన విని, "యొకటి సెప్పెద
వినుఁ, డాతనితోడ సమరవిభునకుఁ దగఁ బొం
దొనరింపుఁ; డొక్క సమయం
బున [2]నడఁకువఁ గులిశధారఁ బొందెద నేనున్. ౧౩౦

వ. మదీయతేజోవిశేషంబున నప్పురుహూతున కుత్సాహంబు సంభవింపం గలయది. అప్పు డనాయాసంబునఁ బగతు వధియింప నగు" నని గదాధరుం డూఱడిలం బలికిన, బలసూదనప్రముఖ నిఖిల సురలోకం

1. కనుకనింజని=ససంభ్రమంబునఁ జని–అక్కఱతోఁ బోయి...
2. అడఁకువఁ... నేనున్ = అడంకువతో నేను వజ్రాయుధంబున దూఱుకొందును.

బును సంతసిల్లి మగిడి వచ్చి వృత్రుకడకేఁగి మానిజనంబులఁ బుచ్చిన,
వారును జని యతని కిట్లనిరి: ౧౩౨

క. "భుజబలదుర్జయుఁ డింద్రుం;
డజయ్యుఁడవు నీవు; నీకు నతనికి మీలో
విజయము దక్కదు. మీ రే
చి జగంబులు నొవ్వ రణము సేయఁగ నేలా ? ౧౩౩

క. [1]మైత్రీసౌఖ్యముఁ బోలునె
శాత్రవ మెమ్మెయిఁ దలంప? శక్రశ్రీకిం
బాత్రమవై యుండుగఁ ద
న్మిత్రుఁడ వగు; తుదియ మేలు మీయిద్దఱకున్." ౧౩౪

వ. అనవుడు, వృత్రాసురుండు: "తేజంబువాసికి నాస పడియెడు మా
యిరువురకు సఖ్యంబు సమకూర నేర్చునే ?" అనుటయు, నమ్మునులు:
"సత్పురుషసాంగత్యంబు సంభవించినం జేయమి నీతిగాదు. మహేం
ద్రుండు సకలలోకసమ్మతసద్భావుండు గావున, నతనితోడి చుట్టఱి
కంబు మేలు;" అనిన, నొడంబడి యతండు వారల కిట్లనియె: ౧౩౫

క. "ఏ నొక్క తెఱఁగు సెప్పెద;
దానిం గావనక చేసి తగ మీరలు సం
ధానము దృఢముగఁ జేయుం
డా నాకేశునకు నాకు నధికప్రీతిన్. ౧౩౬

వ. 'అది యెయ్యది', యనిన: [2]ఆర్ద్రంబగుదానను, శుష్కంబైనసాధనం
బునను, దారువునం, బాషాణంబున, శస్త్రాస్త్రంబులం, దివసంబున,
రాత్రియందును నేను వధ్యుండఁ గాకుండవలయు." అనిన, వారును
దానికి నొడంబడి, యవ్వరంబు లొసంగి, వృత్రవజ్రధరులకు మిత్రభావం

1. మైత్రీ...దలంప = తలఁపఁగా శత్రుత్వము, ఏమయినను, మిత్రసౌఖ్యమునకుఁ బోలునా?
2. ఆర్ద్రింబగు...వధ్యుండఁ గాకుండవలయు = పచ్చిదానితోను, ఎండుదానితోను, కఱ్ఱ
తోను, చావకుండవలయును.

బొనరించి, మగుడఁజని, యుత్తెఱంగు వాసవున కెఱింగించి నిజనివా-
సంబుల కరిగిరి. సురనాథుండు సుఖం బుండి, పెద్దకాలంబునకుం
దనమనంబునఁ బాయనివైరంబు సైరింపం జాలక, దామోదరునిపూని
కయు, మునిజనంబు సేసినసంధివిధంబును నిరూపించి, రిపుం బరిభ
వింప రంధ్రాన్వేషణంబు సేయుచుండి యొక్కనాఁడు— ౧౩౭

చ. జలనిధితీరభూమిఁ దనశత్రుఁ గనుంగొని, "వీని నిప్డు దో
ర్బల మెసఁగంగ నాదుభిదురంబునఁ ద్రుంచెద : రాత్రి గాదు ; తాఁ
దలఁప దివంబు గా ; దిది యుదగ్రవరాక్రమయోగ్యసంధ్య; [1]నా
యలవుఁ జలంబుఁ జూప నెపమై తగుసాధన మెద్దిగల్గునో ?" ౧౩౮

క. అని తలఁచుచు నచ్చట నొక
[2]వననిధి ఫేనంబుఁ జూచి వాసవుఁ, "డార్ద్రం
బును శుష్కంబును గా దిది"
యనుచుం, గులిశమునఁ గూర్చి యధికరయమునన్— ౧౩౯

తే. దాన వృత్రుని వ్రేయ, నత్తఱి మురారి
యందుఁ దగ సంక్రమించి, యయ్యసురఁ జంపె.
జిష్ణుఁ డతిభక్తి విష్ణుఁ బూజించె నాత్మ;
నఖిలలోకంబులకు మోద మావహిల్లె. ౧౪౦

వ. ఇవ్విధంబునం బగతుం బరిమార్చి పేర్చి యింద్రుండు నిజపురంబునకుం
జనియె. మఱియును భూతసంఘం 'బిట్లు బ్రహ్మహత్య సేయందగునె'
యని యతని నిందించినం బ్రభుత్వసంపద సెడుటయు— ౧౪౧

ఆ. నీచదశకు వచ్చి నిషధాచలంబున
కరిగి, సురవరేణ్యుఁ డడఁగి యుండె.
అమరు లెల్లఁ గలఁగి, యన్యోన్యపీడన
భయముఁ బొంది కూడఁబాఱి, తమకు— ౧౪౨

---

1. నాయలవు చలంబు = నాబలమును పగయు.
2. వననిధిఫేనంబు = సముద్రపు నురుఁగు.

క. కావలి యై సురరాజ్య
శ్రీ పాలింపంగఁ దగు విశేషంబున సం
భావితుఁడు నహుషుఁ డని చని,
యావిభుఁ గని వారు మునులు నతనికి నెమ్మిన్ — ౧౪౩

—: దేవతలు నహుషుని సురరాజ్యాభిషిక్తునిం జేయుట :—

వ. పాకశాసను తెఱం గెఱింగించి : ౧౪౪

క. "ర మ్మింద్రపదవి సేకొని
మ మ్మెల్లను నరయు" మనిన, మానవపతి, "నా
కమ్మహిమకుఁ దగుమహా
త్మ్యమ్ము గలదె? నన్ను నేల యలఁచెద?" రనినన్ — ౧౪౫

వ. అంత నిలువక యత్యంతప్రార్థనంబు సేసి, ౧౪౬

క. యమ వరుణాదిత్రిదశులు
దమతమ శక్తిప్రభావదర్పంబులు భూ
రమణునకుఁ బంచి యిచ్చిరి,
ప్రమోద మెసఁగంగ మునిసభామధ్యమునన్. ౧౪౭

వ. ఇవ్విధంబున నిచ్చి, యధికబలసమన్వితుం గావించి తోడ్కొనిపోయి, పూజ్యంబగు దివిజరాజ్యంబున కభిషిక్తుం జేసిన, నతండును బరమ ధర్మపరుండై, కిన్నర కింపురుష గరుడ గంధర్వ సిద్ధ విద్యాధ రాది సమస్త దేవయోనులవలనను దేజోభాగంబులు పుచ్చుకొని మహానుభావుండై, దివ్యమునిసేవ్యం బైన యద్దేవేంద్ర పదంబు సేకొని తుంబురునారదాది వినోదపాత్రంబులును, రంభాద్యప్సరోగణంబులుం గొలువ నభిమతభోగంబు లనుభవించుచు, మదంబు మిగిలి మన్మథాధీనుండై న ర్తిల్లుసమయంబున నొక్కనాఁడు —

తే. మహితలావణ్యమున నసమాన యనఁగఁ
జనిన పౌలోమి యానహుషునకు నయన

మార్గగోచర యగుటయు, మదనబాణ
భిన్నహృదయుఁ డై, ధృతిఁ బాయఁ బెట్టి యతఁడు — ౧౪౯

క. "సురలోకరాజ్యపదవీ
గరిమంబున నున్ననన్నుఁ గవయం బరమా
దరలీలఁ జతురయగు నీ
సరసిజముఖి రామి యేమిచందమొ తలఁపన్ ?" ౧౫౦

క. అని యప్పొలఁతిం బిలిపిం
చిన, [1]నదియును భయమునొంది, శీఘ్రమ దేవే
జ్యునిసదనమునకు శరణం
బనుచుం జనుటయును, వాసవాచార్యుండున్ — ౧౫౧

వ. పరమాదరంబున నద్దేవిని గారవించి: "నిన్ను నహుషుదుర్వినయంబు బొరయకుండ నరయువాఁడ. [2]ఆఖండలుండు నాయత్నంబున నవశ్యం బును దడయక వచ్చు"నని యూఱడించిన — ౧౫౨

క. అది యెల్ల నెఱిఁగి కోపం
బొదవఁగ నహుషుండు: "గురున కుచితమె యే న
మ్మదితం బిలిపింపఁగఁ దన
సదనంబున నునుచు ?" టనియె సంక్షుభితుం డై. ౧౫౩

చ. అనుడు, మునీంద్రులున్ సురలు: "నక్కట నీమహనీయగౌరవం
బునకుఁ బరాంగనం గవయుబుద్ధి జనించుట [3]యీడు గాదు" నా
విని, "మును పూని యిమ్మెయి వివేకము గౌతముభార్యఁ బాకశా
సనుఁ డెడఁ గోరుచోఁ గఱపఁ జాలర మీ రది యెట్లు సెప్పఁడా!"

వ. అనుచు నతండు కోపించిన, భయంబుఁ గాని వార లాపౌలోమి నతని పాలికిం దోడ్కొనివచ్చువారై పూని బృహస్పతికడకుం జని యద్దేవి వినుచుండ నిట్లనిరి: ౧౫౪

---

1. అదియును... దేవేజ్యుని సదనంబునకుం శరణంబనుచును...=ఆపౌలోమీ దేవియు... బృహస్పతి ఇంటికిఁ గాపాడుమని... 2. ఆఖండలుండు = ఇంద్రుఁడు.
3. ఈడుగాదు నాన్ = సరికాదు అనఁగా.

క. "నహుషుఁడు మహేంద్రపదవీ
సహితుఁడు; శచికిఁ వరింపఁ జను నాతని. లో
కహితంబు గాఁగఁ బుచ్చుము
మహాత్మ, [1]తచ్చిత్తమున యమర్షం బడఁగన్." ౧౫౬

క. అనవుడు, శోకం బడరఁగ
ననిమిషగురుఁ జూచి యిట్టులను శచి, "యటు వు
చ్చిన దూఱు రాదె? నను 'శుచి'
యని మీఁకొనియాడు టెల్ల ననృతము గాదే?" ౧౫౭

వ. అనిన విని దరహాసితవదనుం డగుచుఁ బురుహూతపురోహితుండు—

క. "నహుషుండు పనుచువాఁ డటె!
విహితానుష్ఠానపరులు వీ రటె! తా లో
కహితం బటె! ఇది మనకుఁ
మహనీయము కాక యెట్లు మానఁగవచ్చున్?" ౧౫౯

వ. అని యుల్లసంబాడి యనిమిషులను ఋషులనుఁజూచి యిట్లనియె: ౧౬౦

తే. "శరణు సొచ్చిన రక్షింపఁ జాలియుండి
కడపి పుచ్చిన నూర్ధ్వలోకములు దప్పుఁ,
బుణ్యకర్మంబు లఫలతఁ బొందు ననఁడె,
కమలగర్భుండు దొల్లి జగద్ధితముగ?" ౧౬౧

వ. అని యనురూపాలాపంబుల నిషేధింప, వారలు: "అట్లేనిఁ గర్తవ్యం బెయ్యది యూహింపుము" అనిన "అద్దేవి నహుషుకడకుం జని సము చితంబుగాఁ దదీయసాంగత్యంబున [2]కెడ వలికికొని వచ్చునది. అట మీఁద మన మందఱముం బురందరున కభ్యుదయం బగు తెఱం గాచరించువారము" అనుటయు, వాచస్పతి వచనంబులకు సంతసించి సురసంఘమిసంఘంబు లరిగినయనంతరంబ— ౧౬౨

1. తచ్చిత్తమున అమర్షంబు అడఁగన్ = అతని (అనహుషుని) చిత్తమున కోపము అడఁగు నట్లుగా. 2. ఎడవలికికొని = తడవు చెప్పికొని.

క. పౌలోమియు నానహుషుని
పాలికిఁ జనుటయు, నతండు [1]భావజవికృతి
వ్యాలోలమానసుం డయి
[2]లీలాసంభావనాలలితముఖుఁ డయ్యెన్. ౧౬౩

వ. అట్టియెడ— ౧౬౪

ఉ. అల్లన యింతి యిట్లనియె: "[3]నారసి వాసవుకల్మి లేమియుం
దెల్లముగా నెఱింగికొని, [4]తేఁకువ లే కిట వచ్చు టొప్పు. నా
యుల్లము శంకితం బగుచు నుండఁగ వేగిరపాటు మేల? నీ
వెల్ల నెఱుంగు; దిప్పు [5]డెడ యిచ్చుట యుత్తము నాకుఁ జూడఁగస్."

వ. అని యొడంబఱిచి కొండొకకాలం బెడ వలికొని యింద్రాణియు మగుడం జనుదెంచె. అమరగణంబును మునిజనసహితంబుగ విష్ణుదేవు పాలికి రహస్యవృత్తింబోయి జిష్ణునిదురితంబు వాపుటఁ గోరిన, శౌరి కరుణాయత్తచిత్తుండై— ౧౬౬

క. "హయమేధంబున నాకుం
బ్రియ మొనరింపంగ వృత్రభేదికిఁ బుణ్యో
దయమగు" నావుడు, వారలు
రయమునఁ జని రందఱుం బురందరుకడకున్. ౧౬౭

—: ఇంద్రుఁడు నహుషు తేజోవిశేషంబు చూచి మఱుఁగువడుట :—

క. చని, యతని నశ్వమేధం
బునఁ గల్మషరహితుఁ జేయఁ, బురుహూతుండుం
దనపురికి నరిగి, నహుషుం
గని తత్తేజోవిశేషకంపితుఁ డయ్యెన్. ౧౬౮

1. భావజ వికృతివ్యాలోల మానసుండయి = మదన వికారమున అల్లలాడు మనసుగల వాఁడై. 2. లీలా...ముఖుఁడయ్యెన్ = విలాసభావములం బొలుపారు ముఖము గలవాఁడయ్యెను. 3. అరసి...లేమియున్ = వాసవు (ఇంద్రు) ని ఉనికియు, లేమికియుఁ విచారించి. 4. తేఁకువలేక = భయములేక నిర్భయముగా. తేఁకువ = భయము; ధైర్యము. 5. ఎడ ఇచ్చుట = అవకాశ మిచ్చుట.

వ. ఇట్లు వృత్రారి తన బ్రహ్మహత్య వాయుటయే కాని నహుషునంత బలంబు లేమింజేసి భయాకులితచిత్తుండై, ౧౬౯

క. ఎందేనిఁ జనియె. ఆతని
సుందరియును నెమ్మనమున శోకోద్రేకం
బొంది [1]"పురందరుఁ డరిగిన
కందువ యే నిప్పు డెట్లు గాంతునొ?" యనుచున్ — ౧౭౦

వ. నిశాసమయంబున నుపశ్రుతి నారాధించె. తదీయాధిదేవత, "నీ సత్యంబువలన నీమగనిం గనుదువు" అనిచెప్పి, యనంతరంబు సాకారయై పొడసూపిన, పౌలోమి "నీ వెవ్వర"వని యడిగిన, నదియును "భవత్పాతివ్రత్యశౌచంబులకుఁ బ్రియంబంది వచ్చితి, నుపశ్రుతి" నని చెప్పి, "నీకుం బాకశాసనుం జూపెద" రమ్మని తోడ్కొని హిమవంతంబునుత్తరంబున ముంజివంతం బనుమహాశైలంబున కరిగి, దానియందు శతయోజనవిస్తీర్ణం బైన యొక్కసరోవరంబు సొచ్చి, యచ్చట నల్లసిల్లు పంచవర్ణకమనీయంబులగు కమలంబులలో నొక్క నాళంబు భేదించి, ముందటఁ బ్రవేశించె. ఇంద్రాణియుం దోడన చని తదీయతంతుమధ్యంబున సూక్ష్మరూపంబున నున్న సురపతిం గన్నంత, నయ్యుపశ్రుతి యదృశ్యం బగుటయు— ౧౭౧

క. పతిసన్నిధి వడసి మహా
ద్భుత మందెడుశచి తదీయపూర్వసుకర్మ
స్తుతి సేయుచు నిలిచిన, నతఁ
డతివం గని సంభ్రమాదరాత్ముం డగుచున్— ౧౭౨

ఉ. "ఇచ్చట నేను నిల్చు టిది యెట్టు లెఱింగితి? నన్నుఁ గాన నీ
వచ్చినకార్య మేమి? అనవద్యగుణోత్తర, చెప్పు" నావుడుం,

---

1. పురందరుఁ డరిగిన కందువ = జాడ. కందువ = (దే. వి. జాడ; సంకేతస్థలము; ఋతువు; ఏకాంతము; చమత్కారము; ప్రదేశము; సామర్థ్యము; తెగ — ఒక జాతిగుంపు.

బొంచ్చెము లేక యానహుషుపోయిన పోకలు, వానికిం దగం
జెచ్చెరఁ గాలయాపనము సేసినభంగియుఁ జెప్పె దేవియున్. ౧౭౩

వ. చెప్పి యుపశ్రుతి తెఱంగును నతని కెఱింగించి, "దేవా, నీ విఖ్యాతిం బ్రకాశుండ వై, భవత్ప్రతాపంబున నహుషునకుఁ బరాభవం బొనరించి నన్ను రక్షింపక తక్కిన, నక్కొవుం డగునతనిపాపనిశ్చయంబున నాపదవచ్చు" ననిన విని వల్లభకు దివిజవల్లభుం డిట్లనియె: ౧౭౪

క. "ఆనహుషు బాహుగర్వ మ
నూనం బై యున్నయది సముజ్జ్వలమునిస
మ్మానపరివృద్ధ మగుటను;
దానం గాలంబు వేచెదను జయమునకున్. ౧౭౫

చ. తఱి యగునంతకున్ రిపునుదగ్రత సైఁచుట నీతి. నీవు నా
కఱపినయట్ల చేయుము. తగం జని యాతనిఁగాంచి 'నన్ను నె
త్తెఱఁగున నైనఁ బొందఁగ మదిం దలపోఁతయ కల్గెనేనిఁ, [1]గ్ర
చ్చఱ మునివర్గవాహనుఁడవై చనుదె'మ్మను మంతఁ దీఱెడున్." ౧౭౬

ఆ. అనిన, 'నట్లకాక' యని పతివీడ్కొని,
యింతి నహుషుపాలి కేఁగుదెంచె.
అతఁడు [2]దమక మడర నద్దేవిఁ బెద్దయు
నాదరించి యిష్ట మడుగుటయును— ౧౭౭

వ. ఇంద్రాణియు నిట్లనియె: 'మన నిరూపించినసమయంబునకుఁ గొం-
డొకతడవు గలదు. కాలంబగుటయు నిన్ను వరియించెద. నీవు
మహామునివాహనుండవు గావలయు. అది నాకుఁ బ్రియంబు. నీకు
ననన్యసామాన్యం బైనయానంబు తేజోవిశేషకరంబగు' ననిన, నప్పు
లుకులకు నహుషుండు పరిహర్షచిత్తుండై — ౧౭౮

---

1. క్రచ్చఱ (కచ్చు+అఱ) = శీఘ్రముగా ; నిష్కల్మషముగా.
2. తమక మడర; తమకము = మోహము ; తొందర.

ఆ. "ఏను దక్క నోరుల కెవ్వరికైన న
వ్వాహనంబు నెక్క వశమె? నీకు
సమ్మదంబు గాఁగ సప్తర్షిగణము నా
యందలంబు మోవ నరుగుదెంతు." ౧౭౯

క. అని వనితఁ బంచి, యప్పుడ
మునులం బిలిపించి, మౌర్ఖ్యమునఁ దనకున్ వా
హనముగఁ జేసి, యొకింతయు
ననుమానము లేక తిరిగె నతఁ డెల్లెడలన్. ౧౮౦

క. చని పౌలోమియు సురగురుఁ
గని, "నహుషుఁడు వేచియున్నకాలం బెడలే,
దనిమిషనాథున కిత్తఱి
ననుగ్రహము సేయవలయు ననహితబుద్ధిన్. ౧౮౧

వ. శరణాగతనైన నన్ను రక్షింపు" మనిన, నతం డిట్లనియె: ౧౮౨

క. "ఆ నహుషువలన నాపద
రా నీ, నాతనికి నాతురత గావింపం
[1]బూని యొనర్చెద వేలిమి;
దానను, మునివాహనత [2]గతస్థైర్యుఁ డగున్. ౧౮౩

క. వెరవున నీపతి యునికియు
నరసెద" నని యూరడించి, యప్పుడ [3]వైశ్వా
నరు నర్చితుఁ జేసి, పురం
దరు తెఱఁగుం జెప్పి [4]యతనిఁ దడవం బనిచెన్. ౧౮౪

1. పూని...వేలిమి = పూని యాగము సేయుదును. 2. మునివాహనత...స్థైర్యుఁడగున్ = మునులను వాహనములుగాఁ బూన్పుటచే వాఁడు నిలకడను పోఁగొట్టుకొనును.
3. వైశ్వానరు నర్చితుఁజేసి = అగ్నినిఁ బూజించి. 4. అతనిఁదడవన్ = ఆ ఇంద్రుని వెదకుటకై.

—: అగ్ని దేవుఁ డింద్రుని వెదకి బృహస్పతికిం దెలుపుట :—

వ. పనిచిన వహ్నియు వనితారూపంబునం జని, [1]మనోగతి యగుటం జేసి, సర్వదిశలును, భూమ్యంతరిక్షంబులును, గిరి విపినంబులును గొండొక సేపునకుం గలయం జూచి, సంక్రందను నెందునుం గానక మగిడివచ్చి, వాచస్పతికి నత్తెఱం గెఱింగించి, నాకు జలంబులు ప్రవేశింపరామి నంద పరికింప నేర నైతి. [2]అప్పులవలన నగ్నియు, బ్రాహ్మణుల వలన క్షత్త్రియజాతియు, [3]నశ్మంబులవలన లోహంబును నుద్భవించె. వాని వాఁడిమి యెల్ల యెడలనుం జెల్లుఁ, దమతమజన్మస్థానంబులయం దడంగుం, గావున నీళ్లు నాకు సంక్షయంబు సేయుట సుప్రసిద్ధం బనిన విని, యనిమిషగురుండు [4]హవ్యవాహను నత్యంత గౌరవంబునం గనుంగొని— ౧౮౫

మ. "[5]సకలస్థావరజంగమంబులు భవత్సాన్నిధ్యమాత్త్రంబునన్
వికసిల్లుం; గ్రతువైభవంబులుఁ, జతుర్వేదంబులున్ నీవ; [6]పా
వక, నీయంద జలంబులుం గలిగె, విశ్వవ్యాప్తిమై నున్ననీ
కొకచో టెట్టు లగమ్య మయ్యె? నిను నీ వూహింపు పెంపారఁగన్.

ఉ. ఏనును బ్రాహ్మమంత్త్రముల నెంతయు నీ కభివృద్ధిఁ జేసెదం
గాన, విశంకతన్ సలిలగామివి గమ్మనినం, గృశానుఁడుం
బూనిక నేఁగి వారినిధిభూరినదీసరసీతటాకసం
తానము రోయుచుం జని, శతక్రతుఁ డున్నసరోవరంబునన్— ౧౮౬

ఉ. అంబురుహంబులం గలయ నారసి చొచ్చి, యొకండునాళ సూ
త్త్రంబున నున్నయింద్రుఁ గని, రాగమునన్ గురునొద్ద కగ్ని శీ

---

1. మనోగతి = మనోవేగము. 2. అప్పుల వలన నగ్నియు = నీళ్లవలన నిప్పును,
3. అశ్మంబులవలన = ఱాళ్లవలన. 4. హవ్యవాహనుని = హవిస్సు వాహనముగల వానిని—అగ్నిహోత్రుని. 5. సకల...వికసిల్లున్ = ఎల్లచరములును అచరములును నీసమీపమున నున్నంత వికసించును. యజ్ఞవిభవంబులును నాల్గువేదములును నీవే.
6. పావక = ఓ అగ్నిదేవా.

ఘ్రంబున నేఁగుదెంచి, తనకన్న తెఱం గెఱిఁగింప, నాతఁ డు
ల్లంబున నుల్లసిల్లి, సురలన్ మునులం దగఁ గూడి గ్రిక్కుఱన్—

మ. దివిజాధీశ్వరుపాలికిం జని, కృతార్థీభూతచేతస్కుఁడై,
వివిధస్తోత్రపరంపరాచతురవాగ్విన్యాసతం బ్రీతుఁ జే
సి, "వరిష్ఠం బగునీదుకృత్యము ననుష్ఠింపంగ నీ వుత్సహిం
పవు ; నీ కేమికొఱంత, వృత్రవధ మేపాపంబు గూపింపుమా?

క. శరనిధిఫేనంబున నా
హరి వొంది జగద్విరోధి యగువృత్రునిఁ దాఁ
బరిమార్ప, నీకు విజయము
దొరకొనియెం గాక, దీన దోసము గలదే?" ౧౯౦

వ. అని సముచితంబుగా సంబోధించిన, గురుని సంభాషితంబుల నిర్దోషి
తుం డయి నిజరూపంబు వహించి, సకలసుమనో మునిసహితంబుగా
నతని సంభావించి, జంభారి, 'కర్తవ్యం బెయ్యది?' యని యడిగిన,
నాచార్యుం 'డితం డెఱింగినను విస్పష్టంబుగా నహుషువృత్తాంతం
బంతయు వివరించెదన్ గాక' యని తలంచి యిట్లనియె: ౧౯౧

క. "నాఁ డట్లు నీవు నీ దగు
పోఁడిమి సెడి యడఁగుటయును, భువనంబుల కే
వ్వాఁడును రక్షకుఁ డయ్యెడు
వాఁడిమగఁడు లేమిఁ, ద్రిదశవర్గము మునులున్— ౧౯౨

ఉ. 'ఒండొరుచేతఁ బీడ వడ నోపక రక్షకుఁ డైనవాని నా
ఖండలతుల్యు నేమిగతిఁ గాంతుమొకో!' యనుచున్న చోట, [1]ను
ద్దండబలైకరక్ష్యము శతక్రతురాజ్యము, దాని నేల న
న్యుండు సమర్థుఁడే?' యనుచు నొల్లరు దివ్యులలోన నెవ్వరున్. ౧౯౩

1. ఉద్దండ బలైకరక్ష్యము = మహాబల సంపత్తిచేతనే రక్షింపఁబడఁ దగినది. శతక్రతు రాజ్యము = నూఱుయాగములు చేసినవాని – ఇంద్రుని – ప్రభుత్వము ; దాని నేల = దానిని ఏలుటకు.

వ. అట్టిసమయంబున మునిజనసహితంబుగ ననిమిషులు నహుషుకడకుం జని, మనంబుల మనుజుం డను ననుమానంబు దక్కి, యతని నింద్ర పదవిఁ బరిపాలించుటకుం బ్రార్థించిన, నతండును దాను హీనబలుం డనని శంకించినం, దమతమ తేజంబుల యంశంబు లతని కొసంగి శక్తిమంతుం గావించి యభిషిక్తుం జేసిన — ౧౯౪

క. మహనీయభవత్పదవీ
మహితుం డై నహుషుఁ డేచి, మదమున ధర్మ
స్పృహ దక్కి, తన్ను నిప్పుడు
వహియింపఁగ సన్మునీంద్రవర్గముఁ బనిచెఁ. ౧౯౫

ఆ. ఇదియ కాదు, మఱియు నెన్నియు దుర్విన
యములు గలవు; వాని కలసి నిన్ను
వెదక వచ్చితిమి. వివేకహీనుం డగు
నతనిఁ జెఱుప నిప్పు డవసరంబు. ౧౯౬

వ. అది యెట్లంటేని వినుము: నాఁడు హరిపంపునం జేసిన యశ్వమేధంబున [1]నీ వపగత కల్మషుండ వైనను, నహుషునకుఁ దేజోహాని లేమిం జేసి, యతని నాక్రమింప రాదయ్యె. ఇప్పుడు [2]మహామునుల నధఃకరించి యతండు నిస్తేజుండై యున్నవాఁడు. కావున నీచేతం జెడు. [3]అట్లగుటయుం దురగమేధ ఫలపరిపాకంబ. ఇంక నుత్సాహంబు సేయుము". అనుచున్న సమయంబున, యమ వరుణ కుబేరులు సోమసహితంబుగా నరుగుదెంచి పురందరుం గాంచిన, నతండు ప్రియంబంది, యప్పటి కార్యంబు తెఱంగు వారల కెఱింగించి తగినసంభాషణంబుల వారలఁ బ్రీతచేతస్కులం జేసి, దృష్టివిమదుస్సహుండైన నహుషు గెలుచునుపాయంబు విచారించు నవసరంబున — ౧౯౭

---

1. నీవు అపగతకల్మషుండవైనను = దోషము—పాపము పోఁగొట్టుకొనినవాఁడ వయినను;
2. మహామునులను, అధఃకరించి = కొంచెపఱిచి. 3. అట్లగుటయు...పాకంబ = నీ చేతఁ జెడుననుటకు నీచేసిన అశ్వమేధమువలని ఫలపరిపాకమే కారణము.

క. "కష్టుం డగు నానహుషుఁడు
నష్టాత్మకుఁ డయ్యె; దివిజనాయక, నీయు
త్కృష్టచరితమున సురలకుఁ
దుష్టిగ నిజరాజ్యసంగతుఁడ వగు" మనుచున్ — ౧౯౮

క. మునివరుఁడైన యగస్త్యుఁడు
పనుదెంచిన, శతమఖుండు సమ్మతి నుచితా
సన మిడి, యర్ఘ్యముఁ బాద్యము
నొనరిచి, యిట్లనియె సవినయోక్తి నతనితోఁ: ౧౯౯

ఆ. "అధికవిభవ మెసఁగ నసమానశక్తిని
నాథుఁ డగుచు నున్న నహుషుఁ, డిప్పు
డేమికతన భాగ్యహీనుఁడై యుజ్జ్వల
శ్రీ దొఱంగె, మునివరేణ్య, చెపుమ." ౨౦౦

—: అగస్త్యుఁ డింద్రునకు నహుషుభ్రష్టతఁ దెలుపుట :—

వ. అనిన విని, యమ్మునీంద్రుం డిట్లనియె: "అన్నహుషుని మోచి వేసరుచున్న మును లతనికడ గోష్ఠీవినోదంబుల నుండి '[1]బ్రాహ్మణంబు

1. బ్రాహ్మణంబులు = మంత్రమునకు వ్యాఖ్యానరూపమయినది బ్రాహ్మణము.
[వివరణము: బ్రహ్మము అనఁగా వేదము. ఆవేదమునకు సంబంధించినది బ్రాహ్మణము. వేదమున కొక్కొక దానికిని బ్రాహ్మణభాగము కొంత యుండును. ఆబ్రాహ్మణ భాగమనఁబడునది సంహితల యందలి మంత్రములనెల్ల యజ్ఞకర్మమునకు సమన్వ యింపఁజేయును. వివిధములగు క్రతువులు విస్తరించిన కాలమున ఈ బ్రాహ్మణ ములు ప్రబలి యజమానికులము నాశ్రయించి ప్రతిష్ఠ గాంచినవి. బ్రాహ్మణములు: విధి, అర్థవాదము, ఉపనిషత్తు అని మూఁడు భాగములు; అందు విధులు: కర్మ ప్రతి పాదకములు, కర్మవిధాయకములు, కర్మస్వరూపబోధకములు అని మూఁడు వాక్య ములు. అర్థవాదములు: కర్మపర్యాలోచనా (...పరికాశించుటకైన) పదములయిన వాక్యములు. ఉపనిషత్తులు: ఇతిహాసరూపములు, సంవాదాత్మకములు, తత్త్వవిచార పరములు, బ్రహ్మ ప్రతిపాదకములు నగు భాగములు. బ్రాహ్మణములు కేవలము కర్మముల కుపయోగించునవి; మంత్రభావముం దెలుపునవియు; తత్తత్కాలము లం దలి మతధర్మములను, వర్ణవ్యవస్థలను, సంఘాచారములను — మొత్తము నాఁటి భరత వర్షేతిహాసమును గ్రహింపఁ దోడ్పడు నవియును. బ్రాహ్మణములకును యాగముల కును అంగాంగీభావమని పెద్దల మతము].

లయినమంత్రింబులు గోసంప్రోక్షణంబునందుఁ జెప్పంబడి యుండు; అవి నీకు బ్రమాణభూతంబు లగునే ?' యని యడిగినం, బాపనిశ్చయుం డై యతండు 'అమ్మంత్రింబులు ప్రమాణంబులు గావు' అనిన, నే నమ్మాట నిషేధించి, 'పూర్వాచార్యులచేత నభినందితంబు లగుమంత్రింబులు నిందించుట యజ్ఞానంబు' అని వివాదంబు సేసితి. అతండు కోపించి మదీయమస్తకంబు దన్నె. అతనిం గనుంగొని, పుణ్యహీనుండును దేజోహీని దీనుండును నగుట యుపలక్షించి, 'నీవు పూజనీయులయిన మహామునుల నిన్ను వహింపం బనిచితి; వారలు గొనియాడు మంత్రింబులు గర్హించితి; వదియున్నంగాక నన్ను నవమానించితి; గావున, నింద్రపదభ్రష్టుండ వై బహుసంవత్సరంబులు భూలోకంబున నరగరూపంబున నుండు' మని శాపం బిచ్చి, పదంపడి యనుగ్రహించి, 'భవదీయవంశజాతుం డయి యజాతశత్రుం డనుపేరు గలిగి యుధిష్ఠిరనామధేయుం డైన యొక్క సత్పురుషునిసందర్శనంబున దురితంబులఁ బాసి పుణ్యలోకంబు వడయుదువ'నినఁ, దత్క్షణంబ— ౨౦౧

క. స్వర్గపరిభ్రష్టుం డై
దుర్గతికిం బోయె నతఁడు; దుష్టాత్ములకుం
దౌర్గత్యము, సుజనులకు న
నర్గళసద్గతియు నగుట యరుదే యెందున్ ?" ౨౦౨

మ. అనినన్, దేవతలుం దపోధనులు సత్ప్యానందముం బొంది; రా
మునిఁ బూజించె నమర్త్యనాథుఁడు మనోమోదంబు సంధిల్ల; నా
య్యనురాగంబు చరాచరంబులకు హృద్యంబయ్యెఁ; బర్వాప్సరో
జనముం గౌశికుఁ గాన వచ్చె నుభగైశ్వర్యంబు శోభిల్లఁగన్. ౨౦౩

వ. తదనంతరంబ— ౨౦౪

ఉ. పావకుఁ డాదిగా దిగధిపాలురుఁ, గిన్నర సిద్ధ సాధ్యులున్,
దేవగురుండుఁ దోన చనుదేరఁగ, వైభవ ముల్లసిల్ల, నై

రావణదంతి నెక్కి యమరావతికిం జని, యిందుఁ డాశచీ
దేవియుఁ, దాను, మోదమునఁ దేలె నభీష్టవినోదలీలలన్. ౨౦౬

వ. ఇవ్విధంబున మహానుభావుం డగునమ్మహేంద్రుండు— ౨౦౭

క. ఆజ్ఞాభంగం బయినం
బ్రాజ్ఞేతరునట్లు దుఃఖపడి యుండఁడె, తా
నజ్ఞాతవాసమును గా
లజ్ఞతఁ జలుపండె యన్యులకు వగ పేలా? ౨౦౮

క. కావున, మీపడినయర
ణ్యావాసక్లేశమునకు, నజ్ఞాతవిధిన్
సేవకుల రైనదానికి,
నోవకుఁడీ మీరు లఘుమనోవృత్తుల రై." ౨౦౯

వ. అని యిట్లు సెప్పి శల్యుండు సభాసదులం గలయం గనుంగొని—

ఉ. "కౌరవనాథుఁ డానహుషుకైవడి నాశముఁ బొందు; వాసవ
శ్రీరమణీయుఁ డై జయము సేకొని ధర్మజుఁ [1]డంబురాశివే
లారశనాసముజ్జ్వలవిలాసమనోహర మేదినీవధూ
సారసమగ్రభోగముల సన్నుతి కెక్కెడుఁ దానుఁ దమ్ములున్." ౨౧౦

వ. అని పలికి వెండియు నతండు పాండవాగ్రజున కిట్లనియె: ౨౧౧

క. "సౌఖ్యంబులు వొందు, జగ
త్ప్రఖ్యాతులుఁ జెందుఁ, దగఁ బురందరవిజయో
పాఖ్యానము విన్నను, ద
ద్వ్యాఖ్యానము సేసినన్ జనావలి, కనఘా. ౨౧౨

---

1. అంబురాశి...దానుఁ దమ్ములున్ = సముద్రపుఁ జెలియలి కట్టగు మొలనూలు (ఒడ్డాణము)గాఁ బ్రకాశించుచు, ఒయారము చూపుచు, మనోహరమయిన మేదినీ కాంతతో ఉత్కృష్టమును పూర్ణమును అగు భోగములచేఁ దాను (ధర్మజుఁడు)ను తమ్ములును సన్నుతి కెక్కునుగాత.

క. మోహరము నడచు చుండఁగ,
నీహరివిజయంబు విను నరేంద్రుఁడు రిపుసం
దోహంబు గెల్చుటకు సం
దేహం బించుకయు లేదు, ధీరవిచారా! ౨౧౩

వ. అనిన విని, ధర్మనందనుండు మద్రపతిం బ్రస్తుతించి, "మహానుభావా, భవదీయభాషణ శ్రవణంబునఁ జిత్తంబు కలంక దేఱె" నని సంభావించి, యతనికి సముచితంబులగు మజ్జన భోజనంబు లొనరించి, యనంతరంబ యతండు పయనంబునకు నుద్యోగించిన — ౨౧౪

ఆ. అతని ననుప నేఁగి యధికసంప్రీతి నే
తెంచునప్పు డయ్యుధిష్ఠిరుండు,
'రణములోన మీరు రాధేయుబలుకుట,
మఱవ కుండవలయు మమ్ముఁదలఁచి'. ౨౧౫

క. అనుటయు, మద్రేశ్వరుఁ డా
తని నూఱడఁ బలికి, గాఢతరముగ నాలిం
గన మొనరించి, చనియె హ
స్తినాపురికి బలముతో నతిత్వరితగతిన్. ౨౧౬

వ. అట్టియవసరంబున — ౨౧౭

మ. సకలారాతిభయంకరుం డగుచు నుత్సాహంబు వాటించి, నే
లకు వ్రేఁగయ్యెడుభంగి వచ్చె రణలీలాకౌతుకం బొప్పఁ దా
నొక యక్షౌహిణితోడఁ, బాండవబలం బుల్లాసముం బొంద, సా
త్యకి బాహాబలగర్వనిర్వహణ విద్యాప్రౌఢిసంయుక్తుఁ డై. ౨౧౮

వ. అంతం జేదిపతి యగు ధృష్టకేతుండును, జరాసంధనందనుం డగు సహదేవుండును జె ఱొక్కయక్షౌహిణితోడం జనుదెంచిరిః సహోదరులేవురగు కేకయపతులు నేకాక్షౌహిణీసమేతులై యేఁగుదెంచిరి. తద నంతరంబ — ౨౧౯

క. కొడుకులుఁ దానును, గుఱ్ఱపు
దడములఁ గరిఘటల భటరథవ్రాతములం
బుడమి చలింపఁగ, ద్రుపదుఁడు
గడువేడుకఁ దోడు సూపెఁ గౌంతేయులకున్. ౨౨౦

వ. అదియును నొకయక్షౌహిణికిం గలిగి యొప్పె. అయ్యవసరంబున ననుజ తనుజ సమేతుండును, బార్వతీయమహీపాలసహితుండును నై యొక్క యక్షౌహిణి [1]యొడ్డనంబు దీర్చి— ౨౨౧

క. [2]చిందములమ్రోఁతఁ బగతుర
డెందంబులతోడ దిక్తటీసంధులు నం
దంద పగులంగఁ, గుంతీ
నందనులకుఁ దోడు మత్స్యనాథుఁడుసూపెన్. ౨౨౨

వ. పాండ్యవిభుండు లోనుగాఁ బలుదెసలనుండి వచ్చినబలం బొక్క యక్షౌహిణికిం గలిగి యొప్పె. ౨౨౩

క. ఏ డక్షౌహిణు లిమ్మెయిఁ
గూడెం, బాండునృపసుతులఁ గ్రూరాహవసం
క్రీడావినోదమునకుం
దోడుపడం బూని, యతికుతూహలవృత్తిన్. ౨౨౪

వ. ఇవ్విధంబునం గూడిపెరిఁగి యుధిష్ఠిరుసైన్యంబు గయ్యంబునకుం గాలు ద్రివ్వుచునుండె. అంత నక్కడం, [3]గిరాత కాంచన సైన్యనిచయం బులం గూర్చికొని, సమరంబునకు నమరి యొక్క [4]యక్షౌహిణి గల

---

1. ఒడ్డనంబు దీర్చి= వ్యూహము సవరించి. 2. చిందముల మ్రోఁతన్ = శంఖముల ధ్వని వలన.
3. కిరాత...నిచయంబులన్ = కిరాతులను, ధనమును, బలములను.
4. 'అక్షౌహిణి; 'అక్షోహిణి' శబ్దవిచారము : తెలుఁగు భారతమున—తిక్కనరచితమున— పెక్కెడల 'అక్షౌహిణి' 'అక్షోహిణి' అని రెండు రూపము లగపడుచున్నవి. "అక్షౌదూహిన్యా ముపసంఖ్యానమ్" అను వార్తికముంబట్టి 'అక్షౌహిణి'యే సాధువని స్పష్టము. "బాహుబలఘనుఁడు భీముఁడు, । సాహస రసికోత్తముఁడయిన సాత్యకియు, మహోగ్రాహవ భూమి సహస్రాక్షోహిణు: లట్లగుట మీరు నూడ రెరుంగన్ ?" —ఉద్యోగ-౩ ౧-౨౩౬వ పద్యమునందలి చివరపాదమున 'క్షో' 'నూ' అనిన యతి

భగదత్తుండు సుయోధనుం గలసె. భూరిపరాక్రముండయిన భూరిశ్రవుండును, మహాబలుండయిన శల్యుండును నేకాక్షౌహిణీసమేతం బుగా నేతెంచిరి. వారలయట్ల సన్నద్ధుఁడై కాంభోజనాథుండైన సుదక్షిణుం డనుయవనేశ్వరుండును వచ్చె. అత్తెఱంగున ససుకట్టి జయద్రథప్రముఖులైన సింధు సౌవీరనరపతు లరుగుదెంచిరి. మాహిష్మతీపతియగు నీలుండు, యాదవవీరుండగు కృతవర్మయు, నవంతీశ్వరులు సోదరులు నగువిందానువిందు లిరువురునుం గా నిన్నలువురు నొక్కొక్క యక్షౌహిణితోడఁ జనుదెంచిరి. మఱియునుం బలుదెసల నుండి వచ్చి కూడినవాహినులు మూఁడక్షౌహిణులకుం గలిగె. ధార్తరాష్ట్రులకుఁ దోడుపడం బూనినయవి పదునొకం డక్షౌహిణు లయ్యె. అట్టియెడ — ౨౨౫

క. [1]సవరణుల నొప్పి, యనిఁ బాం
డవబలముల మార్కొనం గడంగుచు, నత్యు
త్సవమునఁ బేర్చినసేనల
కవకాశము లేదు [2]విడియ హాస్తిపురమునన్. ౨౨౬

క. నానాముఖముల విడియం
గా నియమించెను బలంబుఁ గౌరవపతి, యా

---

మైత్రింబట్టి అక్షోహిణియు సాధువు కాఁదగునని ఊహింప ననువగుచున్నది. ఈయొక్కచోటన తప్ప మఱి ప్రయోగము మృగ్యము. నాపరిశీలించిన ప్రతులలో మూఁడింట అంతటను 'అక్షోహిణి' అనియే చూపట్టెడిని. పైపద్యము కడపటిపాదము "సహస్రాక్షోహిణు; లట్లగుట, మీరు గానరె యెందున్" అని కనఁబడినది. నేను ఇదియే సాధువుగా నమ్మి, వార్తికము సిద్ధాంతము నండఁగాఁగొని, ఈపాద్యము నే వరించితిని.

1. సవరణులన్ = వాహనాద్యలంకారములచే. సవరణ రూ. సవరణము (దే. వి.) వాహనాద్యలంకారము; పరికరము; సేవ; సౌమ్యము.
ప్ర: 'రథ గజ హయంబుల సవరణలు...''_శాంతి ౨.
"ఈశ్వరాది దేవతలు సమకట్టిన సవరణలు గల''_ఉద్యోగ 3.
"ఆవు బేహారము గృషియున్ సవరణయును...'' శాంతి ౨.
2. విడియ = విడియుటకు: విడిది సేయుటకు

సేనలదొరలకు నిలువఁగ
నైనను నెడ లేమి, నధికహర్షం బెసఁగన్. ౧౨౭

వ. ఇత్తెఱంగునం గురుజాంగలంబున, రోహితకారణ్యంబున, మరుదేశంబున, నహిచ్ఛత్త్రంబునఁ, గాలకూటంబున, గంగాకూలంబున, వారణావతంబున, వటస్థానంబున విచ్చలవిడి విడిసి, ధనధాన్యాది సమస్త వస్తువుల కలిమింజేసి మెలమి మిగిలి యున్నంత — ౧౨౮

క. పాంచాలమహీవల్లభు
పంచిన భూదేవుఁ డుచితభంగి నగరి కే
తెంచి, ధృతరాష్ట్రుఁ బ్రీతిం
గాంచి, కృప ద్రోణ విదుర గంగాసుతులన్ — ౧౨౯

వ. వారివారిమందిరంబులకుం జని కని, సముచితాలాపంబులం బ్రసన్న చిత్తులం జేసి, దుర్యోధను సందర్శనంబును నిర్వర్తించి, నిత్యనిపుణారాధనంబున ధృతరాష్ట్రు నభిముఖుం గావించి, యొక్కనాఁ డక్కౌరవేశ్వరు [1]పేరోలగంబున సమస్త సేనాపతులం గలయం గనుంగొని యిట్లనియె : ౧౩౦

సీ. "ధృతరాష్ట్ర పాండుభూపతులు సహోదరు
లగుటయు, వారలయాత్మజులకుఁ
దమతమ తండ్రులధనములు గైకొనఁ
దగుటయు, మీకు నందఱకుఁ జూడ
నుచితంబ కాదె? అట్లుండెఁ, దొల్లింటి చం
దంబును మనకుఁ దెల్లంబ కాదె?
[2]ప్రాణగొడ్డము లగుపనుల వారలఁ దీర్పఁ
దలఁచినఁ, బున్నెంబుకలిమిఁజేసి

---

1. పేరోలగంబున = పెద్దకొలువునందు=సభలో.
2. ప్రాణగొడ్డములగు......దలఁచినఁ = ప్రాణాపాయకరము లగుపనులచే వారిని (పాండవులను) చంపం దలంపఁగా.

తే. బాహుబల మొప్ప నిజరాజ్యపదవిఁ బొంది
యున్న, వంచనమెయి మహిఁగొన్న తెఱఁగు
నెఱుఁగుదుర కాదె? దీనికి నెల్ల నియ్య
కొనియె నీపెద్దరాజు నేమనఁగ నేర్తు? ౨౩౧

శా. నారీరత్నము నట్లు దెచ్చి సభలోనన్వారలుం జూడఁగాఁ,
జీరల్ వొల్వులు గాఁగ నొల్చుటయు, [1]లచ్చిం బుచ్చికోలున్, మహో
గ్రారణ్యస్థలి నిల్వఁ బంచుటయుఁ, దైన్యవ్యక్తిమై పల్కులున్
సైరింపంజను పాండవేయులకు నీసంధిక్రమం బొప్పదే? ౨౩౨

క. వీరలవృత్తముఁ, బాండు కు
మారుల వర్తనము తెఱఁగు మాత్సర్యము లే
కారసి, ధృతరాష్ట్రునకున్
గారవమున బుద్ధి సెప్పఁ గాఁదగు మీకున్. ౨౩౩

తే. పాండవులు కౌరవులతోడిపగకు నొల్ల,
రఖిల భూప్రజనాశన మగుటఁ జేసి.
[2]వార లస దని తలఁపంగ వలవ,
దధిక ధర్మపరులైనకతనమునఁ దగవునడచె. ౨౩౪

వ. అందుఁ గూడినవి యేడక్షౌహిణులు; ఇందుఁ గూడినవి పదునొకం
డక్షౌహిణు లని తలంతు రేని వినుండు: ౨౩౫

క. బాహుబలఘనుఁడు భీముఁడు
సాహసరసికాత్ముఁ డయినసాత్యకియు, మహో
గ్రాహవభూమి సహస్రా
క్షౌహిణు; లట్లగుట మీరు గానరె యెందున్? ౨౩౬

క. గాండీవధన్వు నాహవ
పాండిత్యముఁ దలఁప, నతని భండనమున మా

1. లచ్చిం బుచ్చికోలున్ = ఐశ్వర్యము బుచ్చుకొనుటయు—అపహరించుటయు.
2. వారలు అసదు అని = వారలు (పాండవులు) అల్పము అని.

రొక్కండు నని యొకఁడు గడఁగుట
[1]కొండం గని తగరు దాఁకఁ గోరుట గాదే? ౨౩౭

క. ఆభీభత్సునిభూరిభు
జాబలమును, దుర్నివారశౌర్యము, శరవి
ద్యాబహుళతయును బందికి
నైబవరముఁ జేసినట్టి హరుఁడ యెఱుంగున్. ౨౩౮

వ. అదియునుం గాక— ౨౩౯

మ. వివిధోపాయపరాయణుండు, రిపుదోర్వీర్యాపహార క్రియా
ప్రవణోద్యోగుఁడు, మంత్రరక్షణకళాప్రావీణ్యగణ్యుండు, ధై
ర్యవివేకాది గుణోత్తరుం, డఖిలవిద్యాజాలసంవేది మా
ధవుఁ డాదిక్కటె! పాండవేయుల కసాధ్యం బెద్దియుం గల్గునే?

ఆ. అదను దప్పకుండ నమ్మహాత్ముల నెమ్మిఁ
బిలువఁ బంచి, హితముఁ బ్రియము రెండు
పక్షములకు నగుట పాటించి తగవుమై
గొంతభూమి యిచ్చి కూడి మనుఁడు. ౨౪౧

చ. అనవుడు, భీష్ముఁ డిట్లనియె: "నక్కట! భాగ్యముగాదె పాండునం
దను లోకయాపదం బడక, ధర్మగతిం దగ నందఱుఁ సుహృ
జ్జనులను, గృష్ణునిం గలసి సమ్మద మొందుటయుం, బ్రశాంతిమై
మనముల నీసు దక్కి మృదుమార్గము వట్టుటయుం, దలంపఁగన్.

క. నీవాక్యము విప్రస్వా
భావిక మై, యిట్లు శ్రుతికిఁ బరుషం బైనన్,
భావింపఁ గార్యమునయం
దేవిధమున సభకు నింత యిష్టం బగునే? ౨౪౩

చ. సమయము యూఁది, పాండవు లశక్తులచాడ్పున, నిందు నాఁడు బ
న్నము వడి చన్నదైన్యము, వనంబునఁబడ్డ విషాదవేదనా

1. కొండంగని తగరు = ...పొట్టేలు.

శ్రమము, విరాటుపీట లఘుసంచరణంబున డాఁగి యున్నదుః
ఖమును జగం బెఱుంగదె ? అకల్మషులం [1]బఱుపంగఁ బాడియే ?

క. పితృధన మగుపా లుచిత
స్థితి వారల కిచ్చి, నిర్విశేషుండై యీ
పతి లోకము మెచ్చఁగ నిజ
సుతనివహమునట్ల వారిజూడఁగ వలయున్. ౨౪౫

వ. అట్లుం గాక, ౨౪౬
చ. కడవఁగ జూదమాడి, యవుఁ గా దన నేరక, సత్యభాషణం
బెడలిన వచ్చుధర్మగతిహీనత కోర్వక, రాజ్యహీనతం
బడుటకు నోర్చి ధర్మజుఁడు పంచిన సైరణ సేసెఁ గాక, క
వ్వడి నెఱిగిన్క కెట్టిమగవారును నోర్తురె యిజ్జగంబులన్ ?" ౨౪౭

వ. అనిన విని, కర్ణుండు కనలి యిట్లనియె: ౨౪౮
క. "జను లెల్ల నెఱింగిన యీ
పని యేటికి నుగ్గడింపఁ బలుమఱు ? దుర్యో
ధనునకయి శకుని జూదం
బున మేదిని గెలిచె ; ధర్మపుత్త్రుం డోడెన్. ౨౪౯
ఆ. దీన నేమితప్పు ? కానకు నేఁగిన
యతఁడు [2]సమయవృత్తి నాక్రమించి,
తండ్రిపాలు మాకుఁ దగు నంచు, [3]నడియరి
తనము సేసి రాక, తప్పుగాక. ౨౫౦

---

1. పఱుపంగ = బాధింపఁగా. పఱచు రూ.పఱుచు = పడఁజేయు ; పరిభవించు ; పీడించు.
2. సమయనివృత్తి నాక్రమించి = శపథము నిర్వర్తించి. 3. అడియరితనము సేసి = బానిస కొలువుగొలిచి, తండ్రిపాలు మాకుఁదగును అనిరాక (వచ్చుట) తప్పుగాని.
మఱొకవిధము : సమయవృత్తి...నడియరితనము సేసిరాక తప్పుగాక ... లోభిత్వముకతన వచ్చుట తప్పుగాని, దీననేమితప్పు ?
[పైరెంట మొదటవిధము తగినది, రెండవది రెండవపక్షమే. పఠితలు తమకు నచ్చిన విధము గ్రహింపవచ్చును.]

క. విరటుఁడు ద్రుపదుఁడు దోడుగ,
బరవసమున నెత్తి విడిసి బలిమి నడిగినం,
గురుపతియు వెఱచి యిచ్చునె
ధరలోఁ జక్కఁగ, మిట్టితగవులు గలవే?" ౨౫౧

వ. అనిన, గాంగేయుండు గటకటంబడి కర్ణున కిట్లనియె: ౨౫౨

ఉ. "[1]చిక్కని పోటుమానిసి! [2]ఇసీ, వినువారలు నవ్వ నేమిగా
నెక్కుడుమాట లాడెద? వహీనపరాక్రమశాలి యర్జునుం
డొక్కఁడ యార్వురన్ మనల నుగ్రరణంబున గెల్చె నిన్న; నేఁ
డొక్కఁడఁ బల్కులన్ గెలిచె దీ వతనిన్ మనరాజుకొల్వునన్. ౨౫౩

క. నరుఁ డాలవెనుక వచ్చినఁ,
గురురా జడుగంగ, నీవు గురుఁడును గృపుఁడున్,
గురుసుతుఁడు వినఁగ, [3]వారల
చిరసమయము [4]తెగుట యేను జెప్పనె తెలియన్?" ౨౫౪

తే. అనిన, ధృతరాష్ట్రుఁ డాపగా తనయు భక్తి
ననునయించి, రాధేయునిఁ గినిసి, ప్రియము
దోఁపఁ దా నిట్టు లనియె నాద్రుపదమనుజ
పతిపురోహితుతోడ సంభ్రమము లేక: ౨౫౫

ఉ. "మంచిగ నేను బంధులును మంత్రిజనంబులుఁ బెద్దలున్ విచా
రించి, సమస్తభూపతిజకుఁ బ్రీతిగ, బిడ్డలపాలి కిష్టపు
త్తెంచెద సౌమ్యునొక్కరు; మదీయమనోగతి వారిఁ గూడి వ
ర్తించుతెఱంగు గైకొనుట దెల్లము కౌరవజాతి కెంతయున్. ౨౫౬

తే. నీవు ము న్నేఁగు" మని యతనికి విభూష
ణాంబరమ్ములతోఁ దమ్ములంబుఁ బెట్టి

---

1. చిక్కనిపోటు మానిసివి = గట్టిశూరుఁడవ్రులే! 2. ఇసీ = (దే. అవ్య.) వెక్కసపాటు; నిందాసూచకము. 3. వారల చిరసమయము = పాండవుల బహుకాలదీక్ష(శపథము)
4 తెగుట = ముగియుట.

వీడుకో లిచ్చి పుచ్చిన, విప్రవరుఁడు
పాండుజనపాలతనయులపాలి కరిగె. ౧౫౭

వ. ఇట్లు సని వారలం గని యతండు సముచితసంభాషణంబులఁ దనపోయి
వచ్చిన తెఱం గెఱింగించె. ఇట ధృతరాష్ట్రుండును బుత్త్రమిత్త్ర
వృద్ధామాత్యసహితంబుగా నాస్థానాసీనుండయి యుండి సంజయు
రావించి యతని కిట్లనియె: ౧౫౮

తే. "పాండునరపాలసుతు లుపప్లావ్యమునకు
వచ్చియున్నారు; నీవేగి వాసుదేవ
సహితముగ వారిఁగని, తద్విషాదమేమి
భంగి మాను, నమ్మొయిఁ దగఁ బలుక వలయు. ౧౫౯

—: ధృతరాష్ట్రుఁడు సంజయునిఁ బాండవులయొద్దకుఁ బంపుట :—

క. 'మీయయ్య, మీరు వనవా
సాయాసము నిస్తరించి యభ్యుదయమునన్
డాయుట విని ముదితాత్ముం
డై యిట పుత్తెంచె నన్ను' ననుమీ మొదలన్." ౧౬౦

వ. అని చెప్పి చుట్లనున్నవారలతో ని ట్లనియె: ౧౬౧

క. "దుర్యోధనుండు గార్యా
కార్యజ్ఞుఁడు గామి నిట్టికలఁక గలిగెఁ గా,
కార్యులు దృఢధైర్యులు రణ
ధుర్యులు నగు పాండుసుతులు దోషాన్వితులే! ౧౬౨

క. క్షీరోదకవృత్తి మనము,
వారలునుం గలసి బ్రదుక వలదే నెమ్మిన్?
వా రిడుమలఁ బడఁ దగియెడు
వారే, పితృభాగ మేలువారలు గారే? ౧౬౩

ఆ. మనల నింక నమ్మఁ: రస్మత్తాత్ము లన్యాయ
పరులు గర్వ లనుచుఁ బాండుసుతులు;
గూడి మనుట కియ్యకొ౯న నేర; రైనను
ధర్మజుండు గలఁడు దగవు నడప." ౨౬౪

వ. అని పలికి వెండియు — ౨౬౫

మ. "మన కీడుండఁగ వచ్చునే? మనము దుర్మానంబు వాటించి యొ
ప్పని కార్యంబులు వట్టి, వారికిఁ దగం బా లీక గర్వంబు లా
డిన, నిక్కం బగునల్క నర్జునుఁడు గాండీవంబు మోపెట్టఁ, గృ
ష్ణునిసారథ్యము నై జగత్త్రితయసంక్షోభంబు గాకుండునే? ౨౬౬

తే. అలఘుగదఁ బూంచికొని భీముఁ డతిరయమునఁ
గురుకుమారులపైఁ దీవ్రకోప మెసఁగఁ
గవియు టాత్మభావించినఁ గంప మడరు!
నిక్క! మెవ్వరు మార్కొని నిలుచువారు? ౨౬౭

సీ. [1]కవ లగ్రజన్ములకంటె నేమిటఁ గీడు!
ద్రుపదుఁ డల్పుండె! తత్సుతులు బాహు
గర్వసమగ్రులు గారె! విరాటుండు
నాతనితమ్ములు నాత్మజులును
అసదులే! సాత్యకి [2]అలఁతులఁ బోయెడు
వాఁడె! వృష్ణికుమారవరు లనేకు
లట్టియోధులు [3]పోర నరవాయి గొందురే!
పాండ్యుండుఁ, గేకయపతులు, నాది

తే. మైనబంధుల్లు, మిత్త్రులు నగ్గలికలఁ
గొఱఁతవడియెడువారె! అందఱను గెల్వ

---

1. కవ లగ్ర...కీడు = యమళులు-నకుల సహదేవులు - తమఅన్నలకంటె ఎందునఁ గొఱఁతవడువారు? 2. అలఁతులఁ బోయెడువాఁడె? = తేలికగఁ దొలఁగెడు వాఁడా? 3. పోరన్ అరవాయిగొందురే=యుద్ధమున సంకోచింతురా?

నోపినను రుద్రునకు నైన నోర్వరాని
ధర్మపుత్త్రుకోపమునకుఁ దలఁక వలదె?" ..౧౬౯

వ. అని బలికి సంజయుదిక్కు మొగంబై యెల్లవారును విన నిట్లనియె:

తే. "నీవు ధర్మజుపాలికి నెమ్మి నరుగు;
మతఁడు పేరోలగంబున్నయవసరమునఁ
గాన్పు; మతనికి ననుజవర్గంబునకును
బంధులకు నింపు పుట్టంగఁ బలుకు మచట. ౧౭౦

క. నెయ్యము వాటించి, కడుం
దియ్య మెసఁగ, నలుక లెల్ల దీఱునటులుగాఁ,
గయ్య మనుతలఁపు లోనుగ
నయ్యమనందనుఁడు మానునట్టి తెఱఁగునన్- ౧౭౧

--: సంజయుఁ డుపప్లావ్యంబున నున్న పాండవులయొద్దకు వచ్చుట :--

వ. శాంతిప్రకారంబునం గార్యంబు నడపి యొక్కటియై మనుట యొడఁ గూర్చి రమ్ము; రథం బెక్కి పొమ్ము." అని తగిన తెఱంగున వీడ్కొలిపిన, సంజయుండునుం జని, యుపప్లావ్యంబు సొచ్చి, మాధవుమందిరంబున కరిగి, యభ్యంతరవినోదంబుల నర సహితుండై యున్న యన్నారాయణునకుం దనరాక యెఱింగించి పుచ్చి, తగఁ బ్రవేశించి, భయభక్తివినయసంభ్రమంబులు మెఱయ వారలం గాంచి, అమ్మహాత్ము లిరువుర సంభావనంబులును సంభాషణంబులునుం బడసి సంప్రీతచేతస్కుండై, మఱునాఁడు ధర్మతనయు నోడ్డోలగంబున్న సమయంబు వేచి, సముచితంబుగా నతనిం గని సాష్టాంగంబుగాఁ బ్రణమిల్లిన, నతండునుం బ్రియపూర్వకంబుగా నాదరించి సమీపంబున నునిచినం గొలిచి యుండి, అతని కిట్లనియె:

తే. "భాగ్యమున నిన్నుఁ గనుఁగొనఁ బడసి నాదు
చూడ్కి చరితార్థ మయ్యె! సస్తోకపుణ్య

ధనుఁడు మీతండ్రి ధృతరాష్ట్రధరణినాథుఁ
డెంత మీయున్కి విని, ప్రియ మెసఁగ మెసఁగ— ౨౭౩

క. అనుజులు నీవును ద్రోవది
యును బుత్త్రచయంబు నున్న యోగక్షేమం
బున తెఱఁ గారయఁ బుత్తెం
చె, నితాంతస్నేహపూర్ణచేతోవృత్తిన్." ౨౭౪

వ. అనిన, సూతనందనునకు ధర్మనందనుం డిట్లనియె : ౨౭౫

క. "ఆరాజు మాదెసం గల
కారుణ్యముకతమునను సుఖంబున ని ట్లు
న్నారము ; నినుఁ బుత్తెంచిన
గారవమున నాదుమది వికాసముఁ బొందెన్. ౨౭౬.

క. అమ్మనుజేశ్వరునకు సే
మమ్మే? పుత్త్రికలు సుఖులె? మనుమలు సమ్మో
దమ్మునఁ బెరిఁగెద రే? నగ
రమ్ముల భూములను శుభపరంపర గలదే ? ౨౭౭

సీ. ద్రోణుండుఁ, గృపుఁడును, ద్రోణసుతుండును
సుఖ మున్నవారె? సుశ్లోకుఁ డైన
భీష్ముండు కుశలియే? పెద్దతనం బిచ్చి
యాతనిఁ గారవు లనుసరించి
మెలఁగుదురే? బ్రాహ్మణులకు మన్నన గల్గి
యుండునే? నే మర్థి నొసఁగినట్టి
వృత్తులు సెల్లునే?[1] ఒత్తారు వొండుల
వలనఁ బుట్టదు గదా? కలఁకు లంపుఁ

తే. బుట్టినప్పుడు గాండీవిభుజబలంబు
దలఁతురా? భీమసేనుగదావిహార

1. ఒత్తారువు...గదా! = ఒదులవలన ఒరిపిడి (పీడనము) పుట్టదుగదా ?

ముగ్గడింతురె? [1]కవలు మహోగ్రరిపుల
భూము [2]లంతంత కొత్తుట పొగడ్తఁబొంనె ?  ౨౭౮

మ. ఒకనాఁడా, తమముందటం బలుమఱుక్ హోరాటన్మై నేల యొ
త్తికొనంగా, బవరంబులక్ గెలువఁగాఁ జెల్లంబుగాఁ జూచి, పాం
డుకుమారాళి నుతింప కుండుదురె? యాటోపంబునక్ ఘోషయా
త్రకు గంధర్వులు వచ్చినప్పటి చరిత్రం బాత్మలం బాయునే? ౨౭౯

క. వినుము, మనము మధ్యస్థుల;
మని నర్జును నెదిరి, సంజయా, ఇట ము న్నె
వ్వనికిని మానముఁ బ్రాణం
బును దగఁ దక్కించుకొనఁగఁ బోలెనె చెప్పుమా ?  ౨౮౦

క. దుర్యోధనునింటం దగు
కార్యమునకు ఖడ్గమునకుఁ గలవాఁడై, చా
తుర్యంబు మెఱయు కర్ణుని
యార్యత్వము సెల్లు చున్నయదియే నెమ్మిక్?''  ౨౮౧

వ. అనిన, విని సంజయుండు సవినయంబుగా నిట్లను : ''కురురాజునొద్ద
నవినీతులు నీతిమంతులు, సత్త్వసంపన్నులు దురహంకారులు,
మఱియు వివిధప్రకారులు నయి పెరసి యుందురు. వా రొక
ళ్లొకళ్లమాటలం బోయెడువారు గారు; కావున, వారి నంతె యనం
బనిలేదు. నా విన్నపంబు చిత్తగింపుము:  ౨౮౨

క. పొం దొందఁగఁ దలఁచితి నీ
విందుశిశిర మైన విమలహృదయంబున ; వా
రందఱకును సేమం బిట
ముందఱ లేకున్న, నేఁడు మొదలుగఁ గలుగుక్.  ౨౮౩

1. కవలు=నకుల సహదేవులు. 2. అంతంత కొత్తుట=క్రమక్రమమున శత్రుభూముల
నాక్రమించుట.

క. ధృతరాష్ట్రభూపతికి వృ
ద్ధతకతమునఁ జిత్త మొకవిధము గామి, సుతో
ద్ధతి మాన్పఁడ నాఁడు; మనః
క్షతి పిదపంబుట్టి, యిపుడు శాంతుం డయ్యెన్. ౨౮౪

తే. ఇట్టిచందంబు లెల్లను నీవు పుణ్య
చిత్తవృత్తిమై సైఁచినఁ జెల్లివచ్చు;
నీ యజాతశత్రుత్వంబు నిఖిలలోక
విశ్రుతము గాదె, ధర్మప్రవీణహృదయ! ౨౮౫

చ. జగములు నెల్లెడన్ దురితసంతమసంబు జయింపఁ గోరి పా
ల్పుగఁ బరమేష్ఠి నిల్పిన వెలుంగు మహీసురు: లట్టివారికిం
దగవు ఘటింప సత్పురుషదత్తము లై చనుజీవనంబు లెం
త గుమతు లైన మార్తురె, పదంపడి యాయువు శ్రీయు నొల్లరే?

ఉ. ఒక్కొకచోఁ గడంగి ప్రతియోధులు మార్కొనునప్పు, డాత్మలన్
నెక్కొని మోములం బొడము నెవ్వగతోడ జనంబు 'లిట్టియం
దక్కట! భీముఁ డైన, మన యర్జునుఁ డైనను, మాద్రిపుత్త్రులం
దొక్కరుఁ డైన నీపగఱ నుక్కడఁగింపరె యొక్క పేర్మిడిన్?

క. వారొక యాగ్రహవృత్తిం
గూరియు ధర్మంబు సెడుటకుం జాలరు; దు
ర్వారబలు లయ్యుఁ బాండుకు
మారులు శాంతాత్ము' లండ్రు, మనుజాధీశా! ౨౮౮

క. నలువురు తమ్ములు, భవదా
ప్తులుఁ, గృష్ణుఁడు వినుచు నుండ భూవర, నీ కేఁ
గొలువునను విన్నవింపం
బలుకఁ ల్లు గల వవధరింపు పరిపాటి మెయిన్." ౨౮౯

చ. అనవుడు, "వీరె తమ్ములును, నాప్తులుఁ, గృష్ణుఁడు; వీరె తక్కొరొ
ల్పునఁ గలయట్టి సర్వజనులున్ వినుచుండెద; రయ్య నిన్ను నే

మను మని పంచెఁ జెప్పు మది యంతయు నేర్పడ" నన్న, ధర్మనం
దను గరువంపుఁబల్కుల విధంబునకుఁ మదిలోన నుల్కుచున్ —

ఆ. సంజయుండు కృష్ణు సవ్యసాచి నీక్షించి,
పవనపుత్త్రుఁ బార్థుఁ గవల ద్రుపద
తనయు సవినయమునఁ గనుఁగొని, ప్రీతిఁ బాం
చాలు మత్స్యధరణిపాలుఁ జూచి — ౨౯౧

వ. "సావధానుల రై వినుం" డని పలికి, యుధిష్ఠిరుదెసకు మోడ్పుఁగేలు
నిగిడించి యి ట్లనియె:

ఉ. "శాంతతఁ బొంది కార్యముదెసఁ ధృతరాష్ట్రమహీశుఁ డాత్మ న
త్యంతముఁ దేఁటి, నన్నిట ప్రియంబునఁ బంచెదునష్టు నాకుఁ దే
రెంతయు వేడ్కఁ దాన వెర వేర్పడఁ జెప్పుచుఁ బన్నఁ బంచె; ని
ట్లింత ఘటించెఁ బొందు, [1]మన మీాపదనం దెలి వొందఁగాఁ దగున్.

క. చులుకని కార్యము సేయం
దలఁచుట మీాయట్టిసర్వధర్మజ్ఞులు శాం
తులు ననఁ బ్రసిద్ధులగు పె
ద్దలకుం దగ వగునె, యెవ్విధంబునఁ జూడన్? ౨౯౪

ఆ. మడుఁగుఁజీరయందు మసి దాకినట్లు మీా
సత్కులమునఁ గల్మషంబు కౌర
వేంద్రకతనఁ బొందె; నింతయుఁ బాపంగ
నీవ నేర్తు, కార్యనిపుణహృదయ! ౨౯౫

చ. "అఖిలజనక్షయం బయి, జయాపజయంబులు రెండునుం దుదిఁ
సుఖములు గాని యీాపనికిఁ జొత్తురె యుత్తము?" లట్లుఁ గాక, యీా
నిఖిలసుఖంబు లేమిటికి, నీ వని వృద్ధజనంబు బాలురఁ
సఖులను బంధులఁ గురులఁ జంపిత యేని దయాపయోనిధీ? ౨౯౬

---

1. మూలము: ఈపదనన్ = ఈ యదనున — సమయమున.

ఉ. పెట్టని కోట నీకు హరి; భీముఁడు, నర్జునుఁడుం రణంబునం
[1]దొట్టినమంట; లాకొలఁదియోధులె సాత్యకియుం విరాటుఁడుం?
జుట్టపు మేరు వుగ్రరణశోభితుఁ డీద్రుపదుండు; నిన్ను ని
ట్టట్టన వచ్చునే సురల కైనను? ఒల్లవు గాక చివ్వకున్. ౨౯౭

వ. మఱియు నక్కడ — ౨౯౮

ఉ. ద్రోణుఁడు భీష్ముఁడుం గృపుఁడు ద్రోణసుతుండును గర్ణశల్యులుం
బ్రాణము లాసుయోధనునిపాలివ యండ్రు; నిజానుజన్ము ల
క్షీణపరాక్రముల్; సుతు లజేయులు; బాహ్లిక సోమదత్తు లా
స్థాణున కైన నోడరు; వశంబె జయింపఁగ వారి నేరికిన్? ౨౯౯

ఆ. అధిప, యిట్టి మీకు నన్యోన్యకలహంబు
నాకుఁ జూడ మేలనంగ రాదు;
రెండుపక్షములకు బ్రియము హితంబును
నాత్మఁ గోరువారి నడిగి చూడు." ౩౦౦

వ. అని పలికి సూతనందనుండు గొలువు గలయం గనుంగొని— ౩౦౧

ఉ. "మ్రొక్కెద వాసుదేవునకు, మోడ్చెదఁ జేతులు సవ్యసాచికిం,
దక్కటిమిత్ర బాంధవ హిత ప్రియ మంత్రి వయస్యకోటికిం
బ్రుక్కుచు విన్నవించెద, నసూయలు దక్కి యనుజ్ఞ సేయుఁడీ;
యిక్కరుణాకరుం శరణ మే నిదె వేఁడెదఁ గ్రోధశాంతికిన్." ౩౦౨

వ. అనుచుం బ్రణామ పూర్వకంబుగాఁ బాండవాగ్రజు వదనంబునం
జూడ్కి నిలిపి, "దేవా, యుపశమించుట లెస్స. ఇమ్మెయికిం గురు
పితామహుండును సంతసిల్లు; ఆతని కనుమతం బయిన తెఱంగు
సర్వలోకసమ్మతం బగు" నన విని, ధర్మనందనుం డిట్లనియె: ౩౦౩

ఉ. "నెయ్యము దప్ప నొం డొకటి నీచెవి సోఁకెనె నాదుపల్కులం
దెయ్యెడ? సంజయా, యనికి నెమ్మెయి నెక్కుదు నీవు. మాకుఁ దాఁ

---

1. ఒట్టినమంటలు = రగిల్చిన మంటలు. ఆకొలఁదియోధుల = అంతమాత్రము శూరులే.

గయ్యము దక్కి మనికి తగుకార్యము గాదొకో? పోరితంబు లే
కయ్యెడు నర్థసిద్ధి వెడఁగైనను నొల్లక యొంపు సేయునే? ౩౦౪

క. జనులకు నెల్లను బథ్యము
లనఁగా, ధర్మానుగతములగు ననఁ బొగడం
జను పనులు సేయు భీమా
ర్జునులే దుష్కర్మమునకు రోయనివారల్? ౩౦౫

క. మది సుఖము గోరి, దుఃఖం
బొదవంగల కార్యములకు నుత్సాహము సే
యుదు [1]రొప్పనితృష్ణం బడి,
చదు రేమియు లేనియట్టిజను లాతురులై. ౩౦౬

ఆ. యోగ్యతృష్ణదారు, లుచితంపుఁ గొలఁదిమై
నడచినట్టివారు, బెడిదములకు
నంత సొత్తు రెట్లు? సంతాపకారుల
కాక [2]పెనఁకువలు సుఖంబులగునె? ౩౦౭

వ. భోగంబులు వలదా యని తలంతు మేని — ౩౦౮

తే. [3]వస్త్రమాల్యాను లేపనావసరములును,
జతురతూర్యత్రియంబుల సమయములును,
నేము వెలిగాఁగ మామతండ్రి కించునెట్లు?
పుత్త్రులన వట్టి మ మ్మేల పోవఁద్రోచు? ౩౦౯

వ. అయినను నొకమాట సెప్పెద, సమచిత్తుండవై వినుమ" అనియిట్లనియె:

---

1. ఒప్పని...లాతురులై = తగనిదప్పి—దురాశ—లోఁబడి ఏమాత్రము, చతురత—నేర్పు—లేని జనులు తొందరపడినవారై. 2. పెనఁకువలు — పోరాటములు.

3. తా. వలువలు, పూలమాలలు, గంధపుబూతలు అలంకరించుకొను వేళలందును, నేర్పరులచేఁ గావింపఁబడు నృత్త గీత వాద్యముల సమయములందును, మేము దూరమున నుండఁగా మామయ్యకు—ధృతరాష్ట్ర భూపతికి — (ఇంచునెట్లు —) ఏలాగునఁ బ్రియమగును? కొడుకుల నాదరించి—కొడుకులకోసమై ఏల మము వెడలఁగొట్టును?

క. "తానైన నపుడు వసుధం
బై నీతిపథంబు విడిచె నక్కట, పతి, మ
మ్మెన్నను జక్కని తెరువునఁ
బూని నడపుఁ డనుచు నిపుడు బుద్ధులు సెప్పెన్. ౩౦౧

క. [1]ఎదిరిం దమయట్టులకా
మదిఁ దలఁచినఁ బొసఁగుఁ గాక, 'మాకుం గుడు మిం;
డిదె మీరు వ్రక్కఁ గొనుఁ' డని
చదు రడచిన మనసుపొందు చక్కంబడునే ?" ౩౦౨

వ. అని చూపి చెప్పి, వెండియు - ౩౦౩

ఉ. సంపద దక్కి యుండఁగ నశక్తు లనంజను మమ్ముఁ బిల్చి పూ
జింపఁగ [2]నంతబేలె పతి? సెప్పెడువారలబుద్ధి నాఁడ మ
న్నింపఁడ; యింక నేల యగు? [3]నీ వడియాసల వచ్చి రిత్త గా
రింపక మాను; మాతని చరిత్రము నీకును మాకు వింతయే? ౩౦౪

క. తగుమాట లాంబికేయుం
డగు నని కైకొనునె యెన్నఁడైనను? గొడుకుల్
మగఁటిమి గలఁ డనియెడు న
మ్మిగఁ జూచుచునుండు విషము మిగ్రింగెనయేనిన్. ౩౦౫

క. జూదపుసిరి యాసపడం
గా దని విదురుండు సెప్పఁగా నప్పుడు, క
ర్ణాదుల పలుకులు విని పతి
య్యాదరణము సేయ కున్న, నంతన తీరున్. ౩౦౬

1. తా. ఒరులను తమవలెనే తలఁచినచో అనుకూలపడును గాని, మాకు కుడుము ఈయుఁడు; మీరు ముక్కఁగొనుఁడు అని (చమరడిచిన=) ఔచితి నుల్లంఘించినయెడల మనసునేఁ గలయిక చక్కపడునా?
2. అంత బేలె పతి? = అంత బేలయా - వెఱ్ఱివాఁడా - ధృతరాష్ట్రుఁడు?
3. నీవడియాసల...మానుము = పట్టికోర్కితో వచ్చి, ఊరక పీడింపక మానుము.

క. ధృతరాష్ట్రిం డిటమీఁదను
సుతులును శకునియును సూతసుతుఁడును దను నే
గతి నడపించిరి, వారల
మతము యనుష్ఠించుఁ గాక, మరలంబడునే? ౩౧౭

క. గార్యము తెఱఁ గిట్టిది; నీ
వార్యచరితమునకుఁ జొచ్చి యాడెదు: నీ కా
దుర్యోధనునవినయ మని
వార్యం బని యెఱుఁగరామి వలనో, వెడఁగో? ౩౧౮

క. చక్రధరు లెక్కగొనఁడు; ప
రాక్రమనిధి యర్జునునకు రాధేయభుజా
విక్రమ మెదురుగఁ గొని, ని
ర్వక్రముఁ జేసికొను వాఁడు రాజ్యం బెల్లన్." ౩౧౯

వ. అని పలికి [1]వెడవెడ యలుక వొడమిన మఱియు నిట్లనియె: ౩౨౦

శా. చాపాచార్యుఁడు భీష్ముఁడుం గృపుఁడు సశ్వత్థామయుం గర్ణుఁడున్
భూపశ్రేష్ఠుఁడుఁ [2]దారు మున్నెఱుఁగరే పో? రెట్లుఁ గయ్యంబు; లా
శాపాశంబులు చుట్ట, లా వెఱఁగియుం జావేఁడి మార్కొందు, రిం
తే పో! [3]తమ్ముఁ గపిధ్వజప్రభల యంధీభూతులం జేయవే? ౩౨౧

---

1. వెడవెడ...వొడమినన్ = కొలఁదికోపము రాఁగా. వెడవెడ = (క్రి. విశ) కొలఁది; అల్పము, సూక్ష్మము, మందము, మృదువు.
ప్ర: "వెడవెడ నేను తొల్లి యిది వింటి"— ఉద్యోగ. ౪
"వెడవెడ నవ్వుచు"— ఉద్యోగ. ౩
"వెడవెడ యూఁకొని"— ఉద్యోగ. ౨
"వెడవెడ దడిరొత్తి"— ఆముక్త. ౫

2. తారు (ఆచాపాచార్యులు మొదలగువారు) మునుపు యుద్ధమెఱుఁగరా? ఆశాపాశములు చుట్టఁగా ఎట్లును కయ్యములు తప్పవు. ఎదిరిబల మెఱిఁగియు చావుంగోరి పోరాటింతురు. ఇంతకన్న జరుగునదిలేదుపో. 3. తమ్మున్ = (ధార్తరాష్ట్రులను), కపిచిహ్నముగల అర్జునుని ధ్వజకాంతులే గ్రుడ్డివారినిగాఁ జేయవా?

క. మును మమ్ముఁ బొగడి, [1]పదపడి
 యని వారల గెలువ నరిది యని, పొత్తుగఁ జె
 ప్పినమాటకు నే నోడఁబడ ;
 విను, సంజయ, పక్షపాతవృత్తి విడువుమీ. ౩౨౨

స్రగ్ధర. [2]గాండీవజ్యారవం బుత్కటమయి పెలుచం గ్రమ్మినన్, భీముబాహా
 దండం బేపారి శుంభద్గద జడియుచు రౌద్రింబుగాఁ దోఁచినన్, వే
 దండద్వంద్వంబుమాడ్కిం దఱిమి కవలు మాద్యద్గతిం దాఁకినం, జా
 కుండం బోకుండఁ గౌరవ్యులకు వశమె బిట్టుల్కి మూర్ఛిల్ల కుండన్ ?

వ. కావున, ౩౨౪

చ. రణమున వారలన్ గెలువ రా దనుపల్కు లటుండ నిమ్ము. స
 ద్గుణుఁడవు నీవు వచ్చితి ; ప్రకోపవశమంబుగఁ బల్క ; తింక సై
 రణ దగఁ జేయువారము, పరాభవ మొందియు మున్న వారిదు
 ర్గుణములు సైఁచు టీవు నొకకొంత యెఱుంగుదు వింత యేటికిన్ ?

ఉ. [3]ఇంకను నట్ల కాఁ దలఁపు ; మే మొకకీడునకుం దొడంగ ; మా
 శంకలు దక్క ; మయ్యకు విచారము గల్గెనయేని, [4]బాంధవం
 బంకుర మొత్త, మావలన నక్కటికం బొలయంగ, మమ్ము నే
 వంకకుఁ బోవ నీక, [5]గరువంబు జగంబు ప్రశంస సేయఁగన్— ౩౨౬

---

1. పదపడి అని వారల = పిమ్మట యుద్ధమున...
2. తా. గాండీవము నల్లెత్రాటిధ్వని అధికతీవ్రముగాఁ గ్రమ్మినను, భీముని భుజాదండము పొంగి పెద్దగదను ఆడించుచు రౌద్రముగాఁ గనబడినను, ఏనుగుల జంటవలెఁ గవిసి కవలు (నకుల-సహదేవులు) మార్కొనినను, మిక్కిలి భయపడి, చావకుండఁ, బారి పోకుండ, మూర్ఛిల్లకుండ, కౌరవసంబంధులు నిలువఁ గలరా ?
 ఇందు, 'క్రమ్మినన్', 'తోఁచినన్', 'తాఁకినన్' అనుటచే పగతురకు, అర్జునుఁడు శ్రవణమాత్ర భయంకరుఁడని, భీముఁడు దర్శనమాత్ర భయంకరుఁడని, కవలు సంఘర్షణ భయంకరులని విశేషము ధ్వనించు చున్నది.
3. తా. ఇదివరకను అట్లె సైరించియుందు మని తలంపుము. 4. బాంధవంబు అంకురము ఒత్తన్ = చుట్టరికము పెరల మొలకెత్తఁగా. 5. గరువంబు = విరివిగా.. గరువము (వై. వి.) గర్వము ; గౌరవము ; విరివి.

క. రం డని పిలువఁ బనిచి, పా
లిం డని కొడుకులకుఁ జెప్పి, యింద్రప్రస్థం
బొం డెను, వే ఱొకపట్టణ
మొం డెను మా కిచ్చి యనుచు టుచితమ కాదే?" 3౨౭

ఉ. నా విని, సంజయుండు నరనాథున కిట్లను: "నెట్టితప్పులుం
బోవఁగఁ ద్రోచి తాలిమియ పూనుదు గావున, నన్ని మాట లి
ట్లేవు వినంగ నాడియును నేఁ దనివోవక విన్నవించెదన్ ;
నీవిభవం బహింసయు ననింద్యచరిత్రమ కాక యన్యమే? 3౨౮

క. పా లీక కౌరవులు దు
ర్శీలతఁ జెడఁ దలఁచిరేనిఁ, జెప్పెద, రుధిరా
భీలాన్నంబునకంటెను
మే లగు భిక్షాన్న మైన మీనడవడికిన్. 3౨౯

వ. అదియెట్లంటేని, 33౦

సీ. రాజసూయమహాధ్వరం బట్లు నడపి స
ద్ద్విజులకు సురలకుఁ దృప్తిఁ జేసి,
శాంతియు దాంతియు సకల లోకంబులఁ
బొగడొంద బ్రదికినపుణ్యమూర్తి;
విట్టి నీచరితంబు హింసాకళంకిత
మగు టెంత యొప్పదు? అదియుఁ గాక
దుర్ణయవృత్తి దుర్ధ్యాతంబు పుట్టించి
యంతలు సేసినయట్టివారి

తే. నేల గర్వంబు సెల్లంగ నిచ్చి, జగము
చేతఁ దిట్టులు వడునట్లు సేసి పోయి
తేల? అడవుల నిమ్మోయి నిడుమ గుడిచి తేల?
తాల్మియ ధనముగా నింత వడితి. 33౧

క. తుదిఁ బోయి క్రూరకర్మా
స్పద మగు తెఱఁగునకుఁ జొచ్చి, బంధుల గురులన్
వెదకి వధియించుసౌఖ్యం
బది యేటికి? ఆర్యనింద్య, మస్థిర మరయన్. 332

తే. అల్పులకు మ్రింగఁ జేఁదైన హాలహలము
భంగిఁ బొంగెడుకోపంబు మ్రింగికొనఁగ
నీలగళు నెన్ని ని న్నెన్నఁ బోలు; నట్టి
[1]నీవు సాలినఁ గా కేల నెగడఁ బేరు?" 333

చ. అనవుడుఁ, బాండురాజతనయాగ్రణి సంజయుమోముఁ జూచి యి
ట్లను: "నది యెల్ల నీపలికినట్టిద. ధర్మవు లట్ల యుండి బో
ధను లరయంగ వచ్చిన నధర్మము లై చెడుఁ గొన్ని, ధర్మవ
ర్తనములు గాక తోఁచి తుది ధర్మము లై చనుఁ గొన్ని కర్మముల్.

వ. కావున, నన్ను దూఱఁదలంచితేని నాచేయునది ధర్మం బధర్మం బని నిరూపించి మఱి దూఱుము. కోపంబు నివారింపం దగు; నహింసయ యుత్తమధర్మం బగు; నట్లయినను వంశదూషకులును లోకకంటకులును నగుపాపాత్ముల నిర్మూలంబుగాఁ జెఱుచుట ధర్మం బని పెద్దల చేత విందుము. అది య ట్లుండె, సంగ్రామంబు రాజులకు ధర్మం బవుం గా దని నీవ చెప్పుము. అట్లుంగాక యిది కర్తవ్యం బిది యకర్తవ్యం బని మనల శాసింప వాసుదేవుండు గలండు; మన కీవితర్కం బేటికి? ఇతండు ధర్మాధర్మవిదులకు గురుండు; కార్యాకార్యనిరూపకులకు శిక్షకుండు; ఉచితానుచితజ్ఞులకుఁ బ్రవర్తకుండు; ఇతనిపంపునం గాదె యదు భోజాంధక వృష్ణి సృంజయ కేకయ ప్రభృతిభూపతిప్రకరంబు ప్రశస్తపథంబునం బ్రవర్తిల్లు చున్నయది. విశేషించి మాకు నితనిబుద్ధియ సమస్తపురుషార్థమ్ములకు మూలం

---

1. నీవు సాలినఁగాక = ఓపిననేకాని—సమర్థించిననేకాని.

బగుట, నితని వచనం బవశ్యంబు నలంఘనీయంబు." అనిన విని
జనార్దనుండు సంజయున కి ట్లనియె : ౩౩౫

ఉ. "పాండుతనూజకోటికి శుభం బెడఁ గోరుదు నెప్డు ; నాంబికే
యుండును బుత్త్రపౌత్త్రమహిమోజ్జ్వలుఁ, డక్కటు, చేటు మేలె యం
చుండుదు ; నట్లు గాన, తెలి వొంది యతం డిట వీరిఁ దేర్పఁగా
నిండుమనంబుతోఁ బనిచె ని న్నని దీనికిఁ బ్రీతిఁ బొందితిన్. ౩౩౬

ఆ. నీవు నుచితవృత్తి, నెయ్యంబు, ధర్మంబు
వినయ మొప్పఁ దెలిపి, వీరు శాంతిఁ
బొందునట్టిభంగి బొసఁగఁ బల్కుటయును
నాకు సమ్మదం బొనర్చె నిపుడు. ౩౩౭

ఆ. అనఘ, యిట్టు లంతయును దలఁపం [1]గడు
నెనసినట్లు లుండెనేని, [2]వింటె ?
పాండవాగ్రజున్మ పలుకులచందంబు
సూడ, సంధి లేని చొప్పు దోఁచె. ౩౩౮

క. అది యట్టిద. [3]సంధానము
దుది నెమ్మెయిఁ గల్గు ? [4]నెట్లు దుర్యోధనుఁ డు
న్మదుఁడు ; ధృతరాష్ట్రభూవిభు
హృదయంబు తెఱంగు గొంత యెఱుఁగుదువొ కదా ! ౩౩౯

క. ఆరాజు సేయునెయ్యము
గారాముసు జెప్పె దీవు గడుఁదీపులు గా !
వీరు దమపాలు వడయక
[5]నేరిమిమాటలన తేఱ నేర్తురె చెపుమా ? ౩౪౦

1. కడు నెనసినట్లు లుండెనేని = చాల పొందుకడిన ట్లుండినను, 2. వింటె = వింటివిగదా!
3. సంధానము...గల్గు ? = ఏగతినిఁ బొందిక కలుగును ? 4. ఎట్లు...ఉన్మదుఁడు =
ఎట్లు చూచినను...తగని పొగరుబోతు. 5. నేరిమి...చెపుమా ! = నెప్పరి మాటల
తోడనే సమాధాన పడుదురఁటయ్యా ?

ఉ. [1]వీరలు పెద్ద ద్రవ్య, కొకవెంట నోడంబడి, తేజి శాంతులై,
కౌరవకోటిఁ గూడి మనఁగా మదిఁ గోరుట, పెంపుఁ దాల్మియుం
గారుణికత్వముం దగవు గాదె? జగంబున పాడిఁ దండ్రిపా
లీ రని తెంపు సేసి పయి నెత్తిన నెత్తిరి గాక, ద్రోహమే? ౩౮౧

క. విను, [2]మవమానము పడి యి
ట్లునికిఁ బడయుపొగడుకంటె, నుజ్జ్వలులై మా
ర్కొనిన నది లెస్స. ఎట్లయి
నను వీరికిఁ బోటు మేలు నాకుం జూడన్. ౩౮౨

వ. 'సంగ్రామంబు రాజులకు ధర్మం బవుం గా దని నీవ చెప్పు' మని యుధిష్ఠిరుండు ని న్నడిగెఁ గదా? ద్విజాతులకు యజన యాజనాది కర్మకరణవిభాగంబు ధర్మశాస్త్రాచార్యులు విధించునప్పుడు, రాజు లిచ్చువారు గాని, వేఁడుకొనువారు గా రని చెప్పుట సకలలోక ప్రసిద్ధంబు. [3]సర్వవర్ణాశ్రమ ధర్మపరిపాలనంబు సేయునట్టిరాజులు దార నిజధర్మంబు వదలుదు రా? అదియుఁ గాక, పాడితోడి యార్జనంబునం దమకుఁ గలకలిమి యనుభవించుచు సత్పథంబున నడచుచుండఁ, ద మ్మెవ్వరు లన్యాయంబు సేసినయప్పటికిం గదా యీ శస్త్రాస్త్ర ధర్మంబు లిందాద్రు లగు పెద్దలు గావించిరి. నీచెప్పెడి

---

1. తా. వీరలు (పాండవులు) పుట్టుపూర్వోత్తరముల నెత్తక, కడచినవాని నెల్ల పెల్లగింపక, ఏదే నొక వెరవున ఒడఁబడి, సమాధానపడి శాంతులై, కౌరవవర్గము - దుర్యోధనాదుల తోఁ గూడి బ్రదుకఁ గోరుట పెద్దతికము, తాలిమియు, కనికరము కల్మియు, ఒప్పిదము ను గదా! లోకాచారమును బట్టి, కౌరవులు తమ తండ్రిపాలు ఈయరే యని తెగించి రచ్చకెక్కఁబడినను బడుదురు. అది ద్రోహమగునా?
2. అవమానపడి ఇట్లుండుటవలనఁ బొందు పొగడితకంటెను, నాకుఁ జూడఁగా వీరికి పోరాటమే మేలు.
3. సర్వవర్ణాశ్రమ...తార నిజధర్మంబు = తామే తమ...; పాడితోడి యార్జవంబునన్ = న్యాయ్యముగు గడన వలన

ధర్మంబులు కౌరవులకుం జెప్ప వలవదా? వారలు గదా [1]మీఁదెఱుంగక కొఱఁతనఁజుకులై చెడుతెరువునం బోయెడువారు" అని పలికి మఱియు నిట్లనియె: ౩౮౩

క. "[2]నెట్టిన సభలో సేవుర
కట్టెదుర, [3]నరాతితనము గా కెంతయు వా
రెట్టితులువలో! ద్రౌపది
నట్టులు పఱిచెడిదే, జూద మాడరె యెందున్?" ౩౮౪

వ. అనవుడు, సంజయుండు: "దేవా, నీచిత్తంబున నిడి దీని నింత గొనియాడినఁ గర్జం బొడఁగూడునే?" యనిన, వాసుదేవుం డిట్లనియె:

ఉ. "అత్తఱి భీష్మముఖ్యు లగు నచ్చటి వృద్ధజనంబు లెల్ల నో
రెత్తక యూర కుండిరి మహీశ్వరుచిత్త మెఱుంగ కున్కిఁ; దా
నొత్తి కుమారులం గినియ నోపఁడ; యక్కట! మాన్పఁగన్న, నా
చిత్తమ కాదు, లోకముల చిత్తము లెల్లను సంతసింపవే? ౩౮౫

ఉ. [4]తిట్టులఁ బోయి, [5]యక్కొలువు తేఁకువవారలలోని కింతిఁ దా
నట్టులు దుస్ససేనుఁ డదయాకృతి ముందల వట్టి యీడ్వఁగా,
నెట్టు సహించె మాను? సతియేడ్పు లెలుంగున కెట్టు లోర్చె? నీ
పట్టున సేమ మారయఁగఁ బంచుట కెట్టులు నేర్చెఁ గ్రిమ్మఱన్?

చ. "ఇది దగ దంచు నడ్డపడునింతకు నేరక సభ్యు లందఱున్
[6]మది మఱగొన్నయట్టియెడ, మానినికిం [7]దనుఁ దాన కాచికో
లొదవిన దానఁజేసి, సభ నొచ్చెము దక్కినఁ బాండునందనుల్
బ్రదికిరి గాక, [8]యయ్యెడరు రాచకొమారుల కోర్చునట్టిదే? ౩౮౬

---

1. మీఁదెఱుంగక కొఱఁత నుఱుకులై = రాఁగలదాని నెఱుఁగకే, దుడుకుపనులు – అకార్యములు – చేయువారై. 2. నెట్టిన = పూన్కితో 3. అరాతితనము = దుండగము; పోకిరితనము. 4. తిట్టులఁబోయి = తిట్టుచుఁబోయి. 5. అక్కొలువు...లోనికి= ఆకొలువుననున్న పెద్దలలోనికి. 6. మది మఱగొన్నయట్టియెడ = బమ్మెరపాటుననున్న పట్టున. 7. తనుఁదాన...దానఁజేసి = తన్నుఁదానే కాఁపాడుకొన ననువగుటకలన, 8. ఆయ్యెడరు = అభంగపాటు, ఆయాసేగము.

వ. సంజయా, వినవే యప్పుడు సభాసదులకుఁ గర్ణశూలంబు లగు-
నట్లుగాఁ గర్ణుండు — ౩౪౯

క. 'లే రిచట మగలు నీకును;
వీరలు జూదమున నోడి విడిచిరి నిన్నున్;
వారిజలోచన, నీపైఁ
గూరిమి గలమగని వెదకికొను మొరు' ననఁడే? ౩౫౦

క. నరునకు నది వాఙ్మయ మగు
శరమై హృదయంబు నాటి చలియింపక, దు
ర్భరవేదనఁ జేయంగాఁ,
జిరకాలము దచ్చికిత్స చేసెనె చెపుమా? ౩౫౧

వ. మఱియు దుశ్శాసనుండు; 'వీర లందఱును గొడ్డువోయిన వారలు; పౌరుషంబు గల మానిసి యిందెవ్వండు అనియె' నతనిచెప్పినట్ల పెద్దకాలంబేని వీరల గొడ్డువోయిరి గాక, వీరిదెస వారికి నేమి ఫలించె? వెండియుఁ దత్సమయంబునఁ బుట్టినమాట లుగ్గడించునట్టివి గావు. ఈ సంధికార్యం బత్యంతదుర్ఘటంబు. దీని ఘటియింపం జేయుట యశక్యం బని తలంచెద. అయినను — ౩౫౨

సీ. పాండవేయులఁ దగఁ బ్రార్థించి, యందుల
కక్కటా, యేనైన నరుగుదెంచి,
కౌరవులకు బుద్ధిగాఁ జెప్పి రాజ్యంబు
పాలుసేసిన, మృత్యుపాశములకుఁ
దప్పరే వారలు? దగవును నేర్పును
నా మీఁద నిలుచుట నాకుఁ గీడె?
నన్ను మన్నింతు; రన్యాయంబు సొరని నా
మాటకుఁ దా రొడఁబాటు లేక

తే. యుండు రే? [1]కేరడమ్ము లాడు చుండు రేనిఁ
[2]గవియుపాండవబాణాగ్ని గాదు సువ్వె,
[3]తమ్ముఁ [4]దమలోభ మనుచిచ్చు [5]దరికొనంగఁ
[6]దెగినవా రయిపోదు; రింతియ తలంప". ౩౫౩

వ. అని పలికి వెండియు ని ట్లనియె: ౩౫౪

ఆ. "రోషమయమహాతరువు సుయోధనుఁ, డురు
స్కంద మందులోనఁ గర్ణుఁ, డలరుఁ
గొమ్మ సౌబలుండు, గుసుమఫలంబు దు
శ్శాసనుండు, మూలశక్తి తండ్రి. ౩౫౫

ఆ. ధర్మజుండు ధర్మతరు, వర్జునుఁడు ఘన
స్కంధ, మనిలసుతుఁడు శాఖ, కవలు
పుష్పఫలము; లేశ, భూసురులును, వేద
ములుఁ గదియ మైనమూలచయము. ౩౫౬

క. ఈ రెంటియందు నరసి య
సారం బిది, గాఢసార సహితం బిది నా
నేర వలయు: నదియును గా,
కేరూపం బయ్యె నేని నీ నేమిటికిన్? ౩౫౭

మ. ధృతరాష్ట్రుండును బుత్త్రులున్ వనము; గుంతీనందనుల్ సింహముల్;
మతి నూహింప నసింహమైన వనమున్ మర్దింతు; రెందున్ వనా
వృతవృత్తంబులు గానిసింహములకున్ వేగంబ చేటొందుఁ; [7]గా
న, తగం బొందుట కార్య మీయుభయము న్సంతుష్టిమై నక్కటన్.

1. కేరడములాడు ... = వంకరమాటలు, తిరస్కారములు .... 2. కవియు... గాదు సువ్వె = క్రమ్ముకొను పాండవాగ్ని కాదుసుమీ. 3. తమ్మున్ = తమరిని. 4. తమ లోభమనుచిచ్చు = తమ పిసినితనము, దురాశ - అనునగ్ని. 5. దరికొనంగన్ = క్రమ్ముఁగా - ప్రజ్వలింపఁగా. 6. తెగిన... పోదురు = నాశనమయిపోవుదురు.

7. కానతగన్ = కావున ఒప్పిదముగా. ఈ పద్యములలో నియుక్తపట్టున 'కాన' అనునది కావున అనునర్థమున, కళగాఁబ్రయోగింపఁబడినది. దీనింబట్టి తక్కినచోట్లు

క. పరిచారకులై యుండుదు,
¹రరివర్గవ్యతికరమున కగుదురు; వీరిఁ
బరిఁ దనకొడుకులు మెలఁగిన
తెరువున మెలఁగింప వలదె ధృతరాష్ట్రునకుఁ? ౩౫౯

క. ఏ నీపనికై వచ్చెదఁ;
²దా నొప్పఁ దలంచె నొండెఁ దప్పం దలఁచెఁ,
³దానన నెగడెద మే; మ
మ్మానవనాథునకుఁ జెప్పు మామత మెల్లన్". ౩౬౦

వ. అనిన విని, సంజయుండు ధర్మతనయుం గనుంగొని: "అట్లయినను గడు లెస్స గదా? దేవా, నావచ్చిన కార్యంబు సఫలంబయ్యె. పని వినియెద" నని, వాసుదేవునకు నట్ల విన్నవించి, భీమార్జున నకుల సహదేవ సాత్యకి ద్రుపద విరాటుల నీక్షించి, "మీయందఱచేత ననుజ్ఞాతుండన కదా, పోయివచ్చెద. నా యాడినమాటల యం దేమియుం దగనియట్టివి లేవుగదా?" యనుటయుఁ, బాండవాగ్రజుం డతని కిట్లనియె: ౩౬౧

ఆ. "పోయి వత్తుగాక, యీయున్నయందఱు
వినఁగ నాడితీవు విశదభంగి;
నొక్కమాట యైన నుచితంబు గానిది
గలదె? ఇట్లనంగ వలయు నెట్లు! ౩౬౨

క. ఎదు రున్నరూపు పలుకఁగ
దుదిఁ గటకటఁబడవు నీవు; దుర్ణయమును బె

---

...లను 'కౌన' కళగాఁబాటింపఁబడెను. అతక్కినచోటు లన్నిటను 'కౌన' ద్రుతాంతముగాఁ బాటించినను సాధుతకు లోటురాదు. కావున 'కౌన'ను కళగను, ద్రుతాంతముగను బాటింపనగును.

1. అరివర్గ...కగుదురు = పగతుర పెనఁకువలపట్టునఁ బనికివత్తురు. 2. తానొప్ప...దలచెఁ = తాను (ధృతరాష్ట్రుడు) ఒప్పుగాఁదలచినను, లేదా తప్పుగాఁదలఁచినను.
3. దానన ... మేము = దానింబట్టియే మేము పెంపొందుదుము.

ట్టిదమును బెండును నగుపలు
కొదవదు నీనాలుకకు, వయోన్నత, యెపుడున్. ౩౯౩

క. నీ వొండె, విదురుఁ డొండెను
గానలయుం గాక, యిట్టికార్యంబులకున్
రా వేఱ కలరె తగువా,
రీవినయము నేర్పు గలదె యితరుల కెందున్? ౩౯౪

చ. అరిగినయప్డు పెద్ద లగునందలి విప్రుల నెల్లఁ గాంచి, యా
దరమున వారిసేమ ముచితంబుగ నారసి, వెండి కాన్పుమీ •
గురునిఁ బితామహుం గృపునిఁ; గూర్తురు వారలు నాకు; నానమ
స్కరణము గాఁగ వారి కధికప్రియభక్తి నమస్కరింపుమీ. ౩౯౫

సీ. మాతండ్రిఁ గని యేను ప్రీతిమ్రొక్కుట గాఁగ
దండప్రణామంబు దగనొనర్పు;
దుర్వృత్తిఁ బోరయునాదుర్యోధనుని సేమ
మడిగితి నని చెప్పు; మతనితమ్ముఁ
డగుటకుఁ దగియెడునాదుస్ససేనుని
కుశల మారయుము; దక్కనుగుమార
వర్గంబు నెల్లను, వనితాజనంబుల
నుచితంపుమై సుఖ మున్కి యడుగు;

ఆ. విదురు శల్యుఁగాంచి వినయంబు దోఁపంగ
నాడు; ద్రోణతనయు నక్కసేర్చి
కొంటి ననుము; బాహ్లికుని సోమదత్తు భూ
రిశ్రవసునిఁ దలఁచి ప్రియము నెఱపు. ౩౯౬

వ. మఱియు వంశవంతులు వయోవృద్ధులు నగు భూపతులను, కృతవర్మను,
గర్ణ శకుని సైంధవ ప్రభృతులను, దక్కటిరాజలోకంబును, గయ్యం-

1. బెండును = తేలిక.

బునకుఁ దోడువచ్చిన సకలదేశాధీశులనుం గని, యెవ్వరితోడ నెవ్విధం బునం బలుకం దగు ప్రణామ వినయ బాంధవ మైత్రీ వాత్సల్యంబులకు నయ్యై ప్రకారంబుల మద్వచనంబులుగాఁ బలికి, యుచితంబు మెయి నుపచరింపుము. ౩౬౭

క. దాసీ దాసజనముల కు
దాసీనము గాక యుండఁ, [1]దడయక యే మి
త్రాసంగ మొంది, [2]శత్రుని
రాసం బొనరించి, [3]తమ్ము నరసెద ననుమీ. ౩౬౮

క. పోయిన మొగమున నచ్చటఁ
జేయుట తెఱం గెల్ల నీకుఁ జెప్పితిఁ; బిదపన్
మాయయ్య పెద్దకొలువున
[4]వా యోడక యిట్టనంగవలయుం జుమ్మీ. ౩౬౯

చ. అనఘ, భవద్బలంబునన యాపద యించుక లేక పాండుసం
దనులు నిజాప్తబంధుసహితంబు సుఖస్థితి నున్నవారు; త
జ్జనకుని రాజ్యపీఠమున సమ్మద మొందఁగ నిల్పి శైశవం
బునన ప్రభుత్వ మిచ్చి తగఁ బ్రోచితి వారల విశ్రుతంబుగన్. ౩౭౦

ఉ. ఇప్పు డుపేక్ష సేసి, కృప యేమియు లేక, విహీనవృత్తి [5]వా
రొప్పమిఁ బొందఁ జూచు టిది యొప్పునె? యింతట సంతసింప రా
దెప్పుడు; నంత కంజ; నట యెక్కుడు గోరినఁ జాల కుండదే?
ఒప్పదె కూడి మన్కి మన, [6]కొప్పనివారలయుక్కు దక్కఁగన్"

1. తడయక యే మిత్రాసంగ మొంది = జాగుసేయక నేను మిత్రులతోడ్పాటు గాంచి. 2. శత్రునిరాసం బొనరించి = పగతుఱను నిరసించి. 3. తమ్మున్ = దాసీదాసజనములను. అరసెదన్ = కాపాడుదు. అనుమీ = అని తెలుపుమా. 4. వాయోడక = మాట పిఱికిదనము లేక. 5. వారొప్పమిఁ బొందఁ జూచుట = వారు (పాండవులు) తగనిదశ ననుభవించుచుండఁగాఁ జూచుట. ఇదియొప్పునా? ఇంతట ఎప్పుడు సంతసింపరాదు. అంతకంజన్ = అంతకును జంకను. 6. ఒప్పనివారల యుక్కుఁ దక్కఁగన్ = పగఱ పొగరడఁగునట్లు. ఒప్పదె...మనకు = కూడిబ్రదుకుట మనకుఁదగదా?

వ. అని తదవసరంబునం బితామహుతో ని ట్లనుము: ౩౨౨

చ. '[1]అడఁగఁగనీక శంతనునియన్వయముం గలిగించి; తీవ యి
ప్పుడు దగ నీమతంబునన పొం దొడఁగూడఁగఁ జేర్చి పౌత్రులన్
సడికి నధర్మవృత్తికిని జావునకుం దొలఁగించి మన్చినం,
బుడమిజనంబు రాజులును భూసురులున్ నినుఁ బ్రస్తుతింపరే?' ౩౨౩

వ. అని పలికి వెండియు, ౩౨౪

క. 'ఇంతలు పుట్టినచోటను
శంతనునందన, యహీనశాంతిపరుం డై
కౌంతేయాగ్రజుఁ [2]డాలము
పొంతం బో నొల్లఁ'డనుము, బుధు లియ్యకొనన్. ౩౨౫

సీ. ఆసమయంబున నచ్చటివా రెల్ల
వినునట్లుగా సుయోధనునితోడ—
'బాహుబలాఢ్యుల బలహీనులక్రియ
నెడలంగ నడిచిన వెఱ్ఱితనము,
నత్యంతచిరకాల మడవులఁ గొండల
బాధలఁ బెట్టిన పరుసఁదనము,
సభలోన నట్లు పాంచాలరాజాత్మజఁ
దల వట్టి యీడ్చిన తులువతనము,

తే. ధర్మపుత్త్రుండు సైరించెఁ దథ్య; మీవు
కురుకుమారుల నని మ్రింగికొనకు; మొరుల
సొమ్మునకు నాసపడఁ దగ; దిమ్ము వారి
పాలు; వారలతోఁ గూడి బ్రదుకు' మనుము. ౩౨౬

---

1. తా. అడఁగిపోవనీయక — అంతరింపనీయక శంతనునివంశమును గలిగించితివి; ఇప్పుడు నీవే తగుతెరవున, నీయిష్టముచొప్పున, కలయిక కుదురునట్లుచేర్చి, మనుమలను నిందకును ధర్మదూరమగు నడతకును, చావునకును తొలఁగించి — తప్పించి బ్రదికించినచో...... కొనియాడరా?

2. ఆలముపొంతన్ పో నొల్లఁడు = పోరాటముదరికిఁబోవ నిచ్ఛగింపఁడు.

వ. ఏము కలహంబొల్లక పొందు గోరుట తనకు మేలు. తనమనంబున దరికొను తృష్ణానలం బార్ప నోరు లడ్డంబు సారమింజేసి, యేన బుద్ధి సెప్ప వలసె. తన యొద్దంగల యోధవీరు లెయ్యెడలలేమి దెల్లం బయినను, మాకుఁ జేదోడు ధర్మంబు గలదు. అదియునుం గాక యఖిలలోక సేవితుండైన కృష్ణుండు పెనుఁబ్రాపు గావునఁ, దమకు మమ్ము గెలువం గొలఁది గాదు. అది యట్లుండె, నేను భీమసేనాదులకుం దమకుం బెద్దవాఁడ నగుట, వీరును దారును మదీయ ప్రార్థనాభంగంబు సేయక, నా దగుశాంతియు దాంతియుఁ జెల్లించి, సన్నలజడిఁ బెట్టక, పోరితం బుడిగి తమతమ ధనంబులు గుడిచి సుఖం బుండుట మనపెద్దలకుం, దక్కటిబుద్ధిమంతులకును సంతోషం బగు. పెద్ద యీనోపఁ డయ్యేనేనిఁ గుశస్థలంబును, వృకస్థలంబును, వాసంతియు, వారణావతఁబును జాలు. కాదేని మఱియు నెందేనియు నొక్కటి యగునట్లుగాఁ దనతోడఁబుట్టువు లేవురకు నిలువ తావు లయి దిచ్చిన సర్వశాంతియగు. అట్లయిన నిండలి యండలిబంధుమిత్త్ర సహాయజనంబులు గలసి, నవ్వుచుం దెగడుచు ననికి, మన మనంబులకుఁ బ్రియంబు సేయు. కురు పాంచాల యాదవ మాత్స్యలు పరస్పర ప్రీతిసంపాదకత్వసంపన్నులై బ్రదుకుట నాకుం గోర్కి. ఇంతయు నమ్మహాపురుషునకుం దెలియం జెప్పుము". అనిన విని, "దేవా, నీయానతిచ్చిన మార్గం బంతయు నడపెద. మీతండ్రి నీకును దమ్ములకును వాసుదేవునకు నెట్లు ప్రియం బట్లు సేయువాఁడ కాక" యనుచుం బ్రణామంబు సేసిన సంజయునకు ధనంజయుం డిట్లనియె: ౩౭౭

క. "[1]బాలసఖుండవు: నాకును
నీ లెస్సఁదనంబు, నేము నీతి విడిచి దు

---

1. తా. బాలసఖుఁడవు. నీమంచితనము నాకును, మేము నీతివిడిచి చెడుత్రోవఁబడుట నీకును, చిన్ననాటనుండియు ముందు తెలియదా?

శ్శైలురఁ మగుటయు, శైశవ
లీల మొదలు గాఁగ మును దెలియదే, నీకున్? ౩౭౮

మ. బలమత్తాకృతి యైనభీముఁ డనుశుంభత్కుంభి సంరంభముల్
నిలిపెన్ నాఁడును నంకుశం బయి; తుదిన్ నేఁడుం దదుద్రేకముల్
మలుఁగం జేయ నజాతశత్రునికృపామార్గ ద్వయంబ చాలంగ, వా
రల కేలా నయవిక్రమోచితవిచార క్లేశముల్ సంజయా?" ౩౭౯

వ. అని పలికి ధర్మతనయానుమతంబున, సంజయునకు సపరివారంబుగా
సముచిత ప్రకారంబున మజ్జనభోజనంబు లొనరించి, మాల్యానులేప
నాద్యుపచారంబులు సేయించి, మణిభూషణ చిత్రాంబరంబు లొసంగి
వీడుకొల్పిన, నతండును, బాండవులను వాసుదేవుని వీడ్కొనిచనియె".
అని చెప్పిన — ౩౮౦

క. విని, యత్యంతకుతూహల
మునఁ బొదలుచు, 'సంజయుండు మున్నెచ్చటికిం
జనియెను? నెవ్వరితో నే
మనియెను విన వలయు, మునిజనాధిప, చెప్పుమా'. ౩౮౧

వ. అని యడిగిన. ౩౮౨

ఉ. భూరికృపానుషంగ, మునిపుంగవచిత్తసరోజభృంగ, సం
సారదవప్రవర్ష, సురసంస్తుతదివ్యగుణప్రకర్ష, దో
స్సారనిరస్తదైత్య, శమశాలిమనస్థితినిత్య, లోకని
స్తారకశీల, నిర్వృతివిశాల, నిరంజన, పాపభంజనా. ౩౮౩

క. శ్రుతిమౌళిరత్నమూర్తీ,
శతధృతిముఖపద్మషండసౌరభకీర్తీ,
రతిపతిహితాహితాత్మా,
సతతసమాచరితభక్తజనసంరక్షా. ౩౮౪

మాలిని. సదయవిమలదృష్టీ, సంశ్రితాశీగప్రవృష్టీ,
హృదయ కమలవాసా, యుద్ధమాయావిలాసా,
విదితనిఖిలభూతీ, విశ్వరక్షాత్తహేతీ,
సదసదుపచితాత్మా, సంభృతానందవర్త్మా.

గద్యము.

ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి ప్రణీతం బయిన శ్రీమహాభారతంబున యుద్యోగపర్వంబునందుఁ బ్రథమాశ్వాసము. ౩౮౬





హరిహరనాథాయ నమః

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఉద్యోగపర్వము

### ద్వితీయాశ్వాసము.



క. శ్రీ విస్తారకరణకరు
ణావేశోదార, శశ్వదమలాకారా,
భావవికారవిదూర, శు
భావహనామప్రకార, హరిహరనాథా.

—: సంజయుఁడు ధర్మజునిసంధిపల్కులను ధృతరాష్ట్రునకుఁ జెప్పుట :—

వ. దేవా, వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె : "నివ్విధంబున వీడ్కొని సూతనందనుండు పవనజవనంబు లగునరదంబు తురంగంబు లం దఱిమి ప్రొద్దు గ్రుంకునంతకుం గరిపురి సొచ్చి, నగరి కరిగి యంతఃపురంబున నున్నధృతరాష్ట్రునకుం దనరాక యెఱింగించిపుచ్చి, యతనిం గాంచి యడుగుల కెఱఁగిన, నమ్మహీవరుండును నత్యాద రంబున నెత్తి సమీపంబున నునిచినం గొలిచియుండి, చేతులు మోడ్చి యి ట్లనియె : 2

ఉ. "దేవర పంపఁగాఁ జని యుధిష్ఠిరునిం గని వచ్చినాఁడ ; నా
భూవిభుఁ డప్రమేయగుణపూజ్యుఁడు, మీకు నమస్కరించె ; సం
భావన సేసె నా ; కిచటిబంధుల నెల్లఁ దలంచె ; మీసుఖ
శ్రీవిభవంబులుం సుతులసేమము నన్నడిగెం బ్రసన్నుఁడై ." 3

తే. అనుడు, ధృతరాష్ట్రుఁ డి ట్లను: "నయ్యజాత
శత్రునకు సేమమే, యనుజన్ము లెల్ల
సుఖులె, బంధులు భృత్యులు సఖులు మంత్రి
వరులు సంప్రీతిమెయి నున్నవారె యచట?" ౪

వ. అనిన సంజయుం డి ట్లనియె: ౫

క. "వారెల్లను భవదీయ
స్ఫారబలము గారణముగ సౌఖ్యంబున ను
న్నార మని పలుకుదురు; నిజ
మారయఁగా నట్ల కాదె యది, జననాథా! ౬

క. ధర్మజునకు భోగంబులు
ధర్మమువున ట్లింపు గావు; ధర్మంబులలో
నిర్మలబుద్ధి నహింసకుఁ
గూర్మి గడుం గలఁ డతండు, కురువంశనిధీ! ౭

ఉ. మానుషశక్తి యొల్లఁడు; సమంచితదైవము యూఁది యుండు. నీ
పైన యతండు పుణ్యమును బాపముఁ బెట్టినవాఁడు; నీవు నీ
సూనువశంబ కాని యొకచొప్పుఁ దలంపవు; కర్ణ సౌబలా
ధీనము గార్యనిశ్చయము; దెల్లము, నీ మత మొప్ప దేమియున్. ౮

ఆ. ఆలుబిడ్డ లేనియట్టితిమ్మరి యగు
కొయ్యగాక, కుదుటఁ గూడు వెట్టి
కుడుచువార [1]లిట్టికొవ్విదంబులు సేయఁ
జొచ్చు టిచ్చగించి చూతురయ్య! ౯

చ. కొడుకులఁ గానరే నృపు లకుంఠిత తేజుల నెందు; నిమ్మెయిం
జెడు తెరు వైనచోఁ దగవు సెప్పక [2]యొప్పరికించి చూతురే?
పుడమిజనంబు లెల్ల నినుఁ [3]బుర్వ్వఁగఁ దిట్టఁగ వించు నుని నా
చ్చెడు మది యెప్పుడుం, జెవులు చీములు గట్టెడుఁ, గౌరవేశ్వరా! ౧౦

---

1. ఇట్టికొవ్విదంబులు = ఈ తెఱఁగు పొగరుబోతుచేతలు. 2. ఒప్పరికించి = ఉపేక్షించి.
3. పుర్వ్వఁగఁ దిట్టఁగ = పుచ్చునట్లు తిట్టఁగా.

చ. చలమున దుస్ససేనుఁడును సౌబలుఁడున్ [1]మిముఁ బట్టి యార్చ, బొ
మ్మలకిఁయ నాడు చుండుదురు మానక నీవు సుయోధనుండుఁ; దా
రలసి యొకప్డు పాండుసుతు లాగ్రహవృత్తికిఁ జొచ్చి రేని నీ
చలము బలంబునుం గులముఁ జక్కఁగఁ జేయరె [2]యొక్క వ్రేల్మిడిన్ ?

క. [3]వినుము, యుధిష్ఠిరు సైరణ
మనవారలు వెఱపుగా సమర్థింతురు; డీ
కొనఁగాఁ దగ రని వాసినఁ
గని, యోటమి వెట్టినట్లు, కౌరవనాథా ! ౧౨

క. అనుజులకు నడ్డపడి యే
మిని జేయఁగ నీమిఁ జూచి మెచ్చితిగా కీ
వును; సాదు రేఁగ నేని
న్నీను, తలపోలమునన కాని నిలువదు సుమ్మీ. ౧౩

చ. [4]అనయము పుట్టె జూదమున యప్పుడ; యెంతయుఁ జిచ్చువెట్టె కా
ల్చినయది నీయుపేక్షయ; వశీకృతచిత్తుఁడు ధర్మసూతి మె
త్తనిపులి; యెల్లవారలు నధర్మము నీపయిఁ బెట్టునంతకు
న్నీనఁడును గానఁడుం; బిదప నీకును నాకు మరల్ప వచ్చునే ? ౧౪

చ. [5]అనయము నొచ్చుచున్నయవి యంగము లెల్లను వేగ వచ్చుట;
న్మనము వశంబుగాదు; జననాయక, పొద్దును బోయె; నిప్డు డేఁ
బనివిని, రేపు, పుత్త్రులును బంధులు నాప్తులు నీవు నేర్పడన్
విన, మనకార్య మంతయు సవిస్తరతం దగ విన్నవించెదన్." ౧౫

1. మిముఁబట్టియార్ప = యాడింపఁగా. 2. ఒక్కవ్రేల్మిడిన్ = త్రుటిలో — చిటికలో...
3. తా. ఎదుర్కొనఁదగరని ఉపేక్షించినచో, ఓడెనని కేలింతలు గొట్టినట్లుగా — యుధిష్ఠిరుని సహనశీలమును వెఱపుగా మనవారు (దుర్యోధనాదులు) సమర్థింతురు.
4. అనయము = అశుభము, కీడు. అనయము = (ఉభ. దే. దురితాంతావ్యయము) అత్యంతము, అవశ్యము, మటిమటి, సతతము, (సం. వి. అ. పుం.) అశుభము, ఆపద, దురదృష్టము ద్యూతాదివ్యసనము, నీతికానిది. 5. అనయము = అత్యంతము.

ఆ. అనిన, 'నట్ల కాక' యని సంజయుని వీడు
కొలిపి, కొంతపొద్దు కురువిభుండు
కార్యచింత మునిఁగి, కంచుకి నొక్కరుఁ
బిలిచి, వేగ విదురుఁ బిలువు మనియె. ౧౬

వ. వాఁడును సత్వరంబుగాఁ జని యతనిం దోడ్తెచ్చి కాన్పించిన, నమ్మహీవరుం డత్యాదరంబున విదురుం దనయొద్ద నునిచికొని యతని కిట్లనియె: ౧౭

ఆ. "పాండురాజసుతులపాలికిఁ జని, యిప్డు
సంజయుండు వచ్చి, సమ్ముఖమున
నన్నుఁ జాల దూఱి, నాకు రేపచ్చటి
పనులు సెప్పువాఁడ ననుచుఁ జనియె. ౧౮

క. అప్పటినుండియు నెవ్వగ
గప్పికొనినఁ జిత్తవృత్తి గలఁగెడు; మేనున్
నిప్పులఁ బొరలినయ ట్లయి
చొప్పడ దించుకయు నిద్ర, శుద్ధవిచారా!" ౧౯

వ. అనిన, విదురుం డి ట్లనియె: ౨౦

క. "బలవంతుఁడు పై నెత్తిన
బలహీనుఁడు, ధనము గోలుపడినయతఁడు, ప్రము
చ్చిల వేచువాఁడుఁ, గామా
కులచిత్తుఁడు నిద్రలేక కుందుదు రధిపా. ౨౧

క. ఇక్కొఱగాముల లోపల
నొక్కటి నీచిత్తవృత్తి నొందెనొ, [1]యొరుసొ
మ్మొక్కటి గుడువఁ దలంచితొ,
నిక్కము గత మేమి సెప్పుము నిద్ర సెడుటకున్?" ౨౨

1. ఒరుసొమ్ము ఎక్కటి = ...ఒక్కఁడవే,

తే. అనిన, ధృతరాష్ట్రుఁ డిట్లను నతనితోఁడ :
"ధర్మసుతు మాటచొప్పెవ్విధంబొ యెఱుఁగ
కనికిఁ జేసి చింతిల్లితి ; నోపు దీవు
దెలియఁ జెప్పి నాయలమట మలుఁగఁ జేయ." —౧౩

చ. అనవుడు, నిట్లనున్ విదురుఁ : "డక్కట! ధర్మసుతుండు బాంధవుం
డును జెలికాఁడునం దగుభటుండును బ్రెగ్గడయున్ గురుండుఁ గాఁ
డె, నృపవరేణ్య, నీకుఁ? బ్రకటీకృత సత్త్వుఁడు శాంతమూర్తి స
ద్వినయ వివేకశీలముల విశ్రుతుఁ, డాతఁడు గీడు వల్కునే? —౧౪

ఆ. నీవుఁ గొడుకు [1]వారి నెఱిలేక పఱిచితి,
రడియ చాలు ; ననుచిత మైనపాలు
పంచియిందు : [2]పిల్లి పట్టిన యీరువు
నేసి యున్న నేల చెల్ల నేర్చు ? —౧౫

---

1. వారి = పాండవులను. నెఱిలేక పఱిచితిరి = క్రమము దప్పి — అన్యాయముగా — బాధించితిరి. నెఱి = (దే. వి.) అందము ;
ప్ర: 'పసి వాఁళ్ళ వాడియప్పుడు। వసంత... నెఱివోఁ। గసికందులుకఁదిన...'—కళా. ఆ.౪
ఆచారము: 'ఈ నెఱిఁ గైకొని శూద్రుండైనను...'—అను. ఆ. ౩
వస్త్రముకుచ్చె: 'నెఱి పెట్టి కట్టిన నిండు చెంగావిపై...'—పాంచా. ఆ. ౨
క్రమము: 'నెఱితప్పంబడి పెల్లుగ...'—ద్రోణ. ఆ. ౨
న్యాయము: 'నీకు వీరలఁదేర్చుట నెఱియకాదె'—ఉద్యోగ. ఆ. ౩
పరాక్రమము: 'నెఱి నుఱక వైరివీరుల'—ఆది. ఆ. ౪
పూర్తి: 'మీఁదఁ బురోచనుకృతి నెఱి నేర్పడునంతకును'—ఆది. ఆ. ౬
నెక్కు: 'కఱికి నెఱినెఱిఁ గోపెమ్మకయును నెఱుఁగ'—స్వారోచిష. ఆ. ౪
వక్రత: 'ఇంతికచములు నెఱిగల యిందిరీలలు'— చంద్రభాను. ఆ. ౨
విధము: 'మీరి నెఱికిన్ సహాయపడు'—ఉత్తరహరివంశ. ఆ. ౩
ప్రజ్ఞ: 'అనకృలు నరంబులు ద్రెవ్వంగఁజెచిన నెఱిదప్పి'—శాంతి.

2. పిల్లిపట్టిన ఈరువు సేసియున్న = ...చేదుగుండెవలెఁ జేసియుండ...
['ఈరువు' అనుటకు పాల, ఎఱచి, నంజుఁడు, మాంసము అనునర్థములే నిఘంటువులలోఁ జూపఁబడెడి. ఈరువునకు 'చేదుగుండె' అని పడమటిసీమలోఁ గొంతభాగమున

వ. మీరు శకుని కర్ణ దుశ్శాసనుల మీఁద రాజ్యభారంబు వెట్టికొని యుండుదురు. ఇది తుదిముట్ట నేర దెట్లంటేని — ౨౬

క. [1]తముఁ దా రెఱుఁగుట, వేగప
డమి, దాలిమి, విడుపు గలుగుటయు లేని ప్రభు
త్వము గలదె? వారియం దీ
సుమానుషము లోకఁడుఁ బట్టి చూడం గలఁడే? ౨౭

వ. యుధిష్ఠిరుండు నీవు నిక్కమ తండ్రి వని, తగవు నమ్మి, చాల సైరించి యున్నవాఁడు. అది నీవ యెఱుంగు" దనిన విని ధృతరాష్ట్రుం-డిట్లనియె : ౨౮

తే. "సంజయునిచేతఁ గార్యంబు చంద [2]మెల్లి
యెఱిఁగి, మన కెద్ది సేయంగఁ దెఱఁగు, దానిఁ
బనిచి చేయింపు; మిప్పుడు నామనము దల్ల
డిలుట హితభాషణంబుల డిందుపఱుపు. ౨౯

వాడుట కలదు.

ప్రకృత సందర్భమున రాజ్యమాసర్వము హారిఁపచలయునను దు ఁశకును, పాండవుల పరాక్రమమునకు జడుపునకును జిక్కుపడిన ధృతరాష్ట్రునకు సరిపడ "పిల్లి పట్టిన యీరువు" అని ఉపమింపఁబడినది. చేఁకుగుఁడెఁగఱచి, తినుటకుఁ జేఁతు, విడువ మన సొప్పదు— ఇట్లు మ్రింగలేక క్రక్కలేక పెనఁగుచున్న పిల్లితో ధృతరాష్ట్రునికిఁ బోలిక చెప్పఁబడినది. ఈరువునకు మాంసమను నర్థము గ్రహించుచో నీ సందర్భమున కొప్పదు. మాంసమును బట్టిన పిల్లి దానిని కబళించివేయును అట్టిచో మ్రింగుడువడక, -క్రక్కనిష్టములేక తల్లడపడు ధృతరాష్ట్రునకుఁ బోలికయెట్లు? కావున చేఁదుగుండె అనునర్థమే అన్నిట నొప్పియున్నది. ఈరువునకు మాంసము అనునర్థమునే గ్రహించి సందర్భమున కొప్పమిఁగాఁబోలు 'ఈలువు' అని పాఠాంతరమొకటి కల్పితమై, ఈలువునకు వ్రతము అని అర్థము ప్రసిద్ధముగుటచే 'పిల్లిపట్టిన వ్రతము'-అని సమాధానము చెప్పికొన్నవారును కొందఱున్నారు.]

1. తా. తమ్ముఁదా మెఱుఁగుట, తొందరపడకుండుట, ఓర్పు. త్యాగము — ఈగి కలుగుటయు, లేనియేల్బడికలదా? వారి (అశకుని కర్ణ దుశ్శాసనుల) యందు ఈమంచి గుణములు ఒక్కటేని పట్టిచూడఁ గలదా?

2. ఎల్లి = రేపు; మఱునాఁడు.

వ. నీవు ధర్మాధర్మవిదుండవు, నయానయజ్ఞుండవు, నాకుం బ్రజాగరం
బొనర్చుచున్న సంతాపం బుపశమించునట్లు భవద్వచనామృతంబు
నాయుల్లంబున వెల్లిగొల్పుము." అనిన విదురుం డిట్లనియె : ౩౦

క. "జనులకు [1]నొడఁబా టగువిధ
మున నడచుచు, లోకనింద్యముల నుడుగుచు, [2]మీఁ
దని యొకనికలిమి కులుకక,
మనుజులతోఁ బొంది పొసఁగి మనుటొప్పు నృపా. ౩౧

క. కోపము, [3]నుబ్బును, గర్వము,
[4]నాపోవక యునికియును, దురభిమానము, ని
ర్వ్యాపారత్వము నను నివి
కాపురుషగుణంబు లండ్రు, కౌరవనాథా ! ౩౨

క. ఏలినవానిని, దైవము,
నాలిని, బంధులను సముచితారాధన సం
శీలతఁ బ్రీతులఁ జేయని
పాలసుఁడా ఫలము లాసపడు, మనుజేంద్రా ? ౩౩

క. [5]నెమ్మిగలవారి నొల్లరు ;
త మ్మొల్లని వారి వెనుకఁ దగులుదు ; రధిక
త్వ మ్మెఱిఁగి యెఱిఁగి తొడరుదు ;
[6]రిమ్మెఱుఁగనియట్టివార, లిభపురనాథా ! ౩౪

క. ధనమును విద్యయు వంశం
బును దుర్మతులకు మదంబుఁ బొనరించును ; స
జ్జను లైనవారి కడఁకువ
యును వినయము నివియ తెచ్చు, నుర్వీనాథా ! ౩౫

---

1. ఒడఁబాటు = ఒప్పిదము. 2 మీఁదు అని = గొప్పఅని. ఒకనికలిమికి ఉలుకక = ఒకని సంపదకు యీర్ష్యచెందక. 3. ఉబ్బు = పొంగుట. 4. అపోవక యునికియును = తనివి లేకుండుటయు. 5. నెమ్మి = ప్రేమము. 6. ఇమ్ము = ఉపాయము, నేర్పు.

క. అరిదివిలుకాని యుజ్జ్వల
శర మొక్కని నొంచుఁ; దప్పి చనినం జను; నే
ర్పరి యైనవానినీతి
స్ఫురణము పగరాజు, నతనిభూమిం జెఱుచున్. ౩౬

తే. [1]ఒకటిఁగొని, రెంటి నిశ్చలయుక్తిఁ జేర్చి,
మూఁటి నాల్గింటఁ గడువశ్యములుగఁ జేసి,
యేనిటిని గెల్చి, యాఱింటి నెఱిఁగి, యేడు
విడిచి వర్తించువాఁడు వివేకధనుఁడు. ౩౭

క. విను, మధురాహారంబులు
గొనుటయుఁ, బెక్కండ్రు నిద్ర గూరినయెడ మే
ల్కనియునికియుఁ, గార్యాలో
చనముఁ, దెరువు నడచుటయును జన దొక్కనికిన్. ౩౮

---

1. మూలము: ఏకయా ద్వే వినిశ్చిత్య, త్రీం చతుర్భి ర్వశీకురు,
పఞ్చ జిత్వా, విదిత్వా షట్, సప్త హిత్వా సుఖీభవ.

అర్థము: ౧. ఒకటి – ప్రభుత్వము; దీనింగొని మంత్రము ఉత్సాహము అను రెంటిని కదలనీయక జోడుచేసి, మిత్ర అమిత్ర తటస్థులు అను మూఁడువర్గములను సామ దాన భేద దండములను నాలుగు ఉపాయములచే పూర్తిగా వశపఱుచుకొని, త్వగింద్రియముల (త్వక్కు, చక్షువు, శ్రోత్ర, జిహ్వా, ఘ్రాణముల) నయిదింటిని గెలిచి, సంధి విగ్రహ యాన ఆసన ద్వైధీభావములను ఆఱింటి నెఱిఁగి, వ్యసనముల నేడింటిని విడిచి వర్తించువాఁడు వివేకధనుఁడు.

౨. ఒకటి – మనస్సు; రెండు – వాక్కు క్రియ; మూఁడు – ధర్మ అర్థ కామములు; నాలుగు – బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్న్యాసము. ఐదు – కర్మేంద్రియము (వాక్కు, పాణి, పాద, పాయువు, ఉపస్థ) లు. ఆఱు – యజన యాజన అధ్యయన అధ్యాపన దాన ప్రతిగ్రహములు అను స్మార్తకర్మములు. ఏడు – ఆవరణము (పంచభూత ప్రకృతులు బుద్ధి అహంకారము)లు.

౩. ఒకటి – సత్త్వము; రెండు-రజస్సు తమస్సు; మూఁడు – ధన దార పుత్ర ఈషణములు. నాల్గు – ధ్యాన ధారణ యోగ సమాధులు. తక్కినవి పైని చెప్పఁబడిన క్రమము.

క. నడవడి యను మున్నీటిం
గడవం బెట్టంగ నోడకరణిం దగి తా
నోడఁగూడు ననిన, సత్యము
గడచినగుణ మింక నొండు గలదే యరయన్? ౩౯

క. క్షమియించువారిఁ గని చా
లమి వెట్టుదు; రైనను దలంప, ననూన
క్షమయ కడు మెఱయుతోడ; వు
త్తమరూపము గోరువారు దాల్తురు దానిన్. ౪౦

క. పురుషుండు రెండుదెఱఁగుల
ధర నుత్తముఁ డనఁగఁ బరఁగుఁ; దా నెయ్యెడలం
బరుసములు వలుక కునికిన్,
దురితంబులు వొరయుపనులు దొఱఁగుటకతనన్. ౪౧

తే. చెల్లియుండియు సైరణ సేయునతఁడుఁ,
బేదవడియును నర్థికిఁ బ్రియముతోడఁ
దనకుఁ గలభంగి నిచ్చునతండుఁ, బుణ్య
పురుషు లని చెప్పి రార్యులు, గురువరేణ్య! ౪౨

ఆ. [1]పాడి దప్పకుండఁ బడయు సొమ్ములకు, న
పాత్రములకు నీగి పాత్రములకుఁ
బెట్ట కునికి యనఁగ, నెట్టన రెండువి
ధములఁ గీడు దొడరు, ధరణినాథ! ౪౩

తే. వెలఁది, జూదంబు, పానంబు, వేఁట, పలుకు
ప్రల్లదంబును, దండంబుఁ, బరుసఁదనము,

1. తా. ధర్మము దప్పకుండ గడించిన సొమ్మునకు రెండువిధముల కీడు కలుగును: అపాత్రములకు – (ఇయ్యఁ దగని వారికి) – ఇచ్చుట వలనను, పాత్రములకు–(ఈయఁ దగినవారికి) – ఈయకుండుట వలనను – రెండువిధముల కీడు.

సామ్ము నిష్ప్రయోజనముగ వమ్ముసేఁత,
యనెడున ప్తవ్యసనములఁ జనదు తగుల. ౪౪

తే. తగిన వేషంబు, దనుఁదాన పొగడుకొనమి,
నొచ్చియును గీడువలుకమి, యిచ్చి వగవ
కునికి, దన కెంత నడవకయున్నఁ బథము
దప్పకుండుట నడవడి కొప్పు సేయు. ౪౫

క. చెలిమియు, సంభాషణమును,
బలిమి, వివాదంబుఁ, [1]దోఁపుఁ బాడియుఁ దమయం
తలివారితోన తగు; నధి
కుల హీనులతోడ నైనఁ గొఱ గా దధిపా. ౪౬

తే. కొంచె మైనను దగఁ బంచి కుడుపు మేలు;
పనులయెడ దుఃఖ మోర్చి యల్పంబు సుఖము
ననుభవించుట హితము; శత్రునకు నైన
నిచ్చుటయ లెస్స యడిగినయెడ, నృపాల! ౪౭

క. తను లోకము గొనియాడఁగ
విని యుబ్బఁడు సజ్జనుండు; వెండియుఁ గడు మే
లొనరించుఁ; గీడొకించుక
యును దన దెసఁ దోఁప నీక యుడుపుచు నచ్చున్. ౪౮

వ. ఇట్టిచందంబులు ధర్మనందనునకుం గలవు". అని పలికి, విదురుండు అది ప్రసంగంబుగాఁ బాండవులఁ బ్రశంసించి, "నీవు వారలం బెనిచి మానసులం జేసి రక్షించి, యిప్పు డుపేక్షించి, వారలు వెలి నుండ నూర కుండఁ దగునే? తగుపాలిచ్చి, వారి రావించి, నీకొడుకుల తోడివారింగా నడపుట యుచితంబు. మీరును వారును నొక్కటియై యున్న మీదిక్కు దేవతలకుం దేఱిచూడ రాదు"—అనిన, నమ్మాట లు వెడవెడ యూఁకొని ధృతరాష్ట్రుండు విదురున కి ట్లనియె: ౪౯

1. దోఁపుఁ బాడియు = ధిఃకరించుట; ఉల్లంఘించుటయు.

తే. "హితముఁ గర్తవ్యమును నాకు నెఱుఁగు
దీవ; ధర్మసుతుచందమును విదితంబు నీకు;
నట్లు గావున, నెఱిగింపు మఖిలకార్య
జాతమును జిత్తతాపోపశమము గాఁగ". ౫౦

క. అనుడు, విదురుఁ డాతని కి
ట్లను: "నిమ్మెయి నన్ను నొత్తి యడిగినఁ జెప్పం
జను నన్న యూపు; సెప్పెద
విను మవధానంబుతోడ, విమలవిచారా! ౫౧

ఉ. డక్కెను రాజ్యమంచు, నకటా! యిటు దమ్మునిభాగ మీక నీ
వెక్కటి మ్రింగఁ జూచె; దది యెట్లుఱుగున్? విను, మీను లోలతన్
గ్రక్కున నామిషంబుచవి గాలము మ్రింగినచాడ్పు సూవె యి;
ట్లుక్కివుఁ డైన నీకొడుకు నుల్లము నున్నటు లారఁ గూరునే?" ౫౨

క. అన విని, నిరుత్తరుం డయి
మనుజేంద్రుఁడు గొంతసేపు మాన్పడి తలఁపుల్
పెనఁగొన, నిద్రాహీనిం
దను వలయఁగ విదురుతోడఁ దా నిట్లనియెన్: ౫౩

క. "ఇందాఁక నీదుపలుకుల
డెందము తాపంబు గొంత డిందుపడియె: నా
కుం దగ నయానయంబుల
చందంబులు సెప్పుచుండు, సౌజన్యనిధీ!" ౫౪

వ. అనిన విని విదురుం డిట్లనియె: ౫౫

ఆ. "తనియఁ బండకుండ మునుగోసికొనఁ జవి
చేటు కాదు, విత్తుచేటుఁ గలుగుఁ;
బక్వమైనఁ గొనిన ఫల మించుఁ, జెడదు బీ
జంబుఁ; గార్యసిద్ధిచంద మిట్లు. ౫౬

తే. మాలకరి పుష్పములు గోయుమాడ్కిఁ, దేఁటి
పువ్వుఁ దేనియ గొనియెడుపోల్కి, నెదురు
గంద కుందఁగఁ గొనునది కార్యఫలము;
బొగ్గులకుఁబోలె మొద లంటఁ బొడువఁ జనదు. ౫౭

క. పరులధనమునకు, విద్యా
పరిణతికిం, దేజమునకు, బలమునకు మనం
బెరియఁగ నసహ్యపడు న
న్నరుఁడు దెవులు లేనివేదనం బడు నధిపా. ౫౮

క. ఎద్దరికి హితమును బ్రియమును
మది కింపును గాఁగఁ బలుకుమాటలు పెక్కే
యొదవినను లెస్స; యటుగా
కిది యది యన కూరకునికి యెంతయు నొప్పున్. ౫౯

క. చెలిమియుఁ బగయును, దెలివియుఁ
గలఁకయు, ధర్మంబుఁ బాపగతియును, బెంపుం
దులువతనంబును వచ్చును
బలుకుబడిన; కానఁ, బోనఁగఁ బలుకఁగ వలయున్. ౬౦

క. బెడిదముగఁ గత్తి గొడ్డటఁ
బొడువఁ దెగినమాఁనఁ జిగురు వొడముఁ; బలుకులం
జెడఁ దునిసినకార్యంబు ని
గుడ నేరదు పిదప నెట్టుఁ, గురువంశనిధీ! ౬౧

క. తనువున విఱిగినయలుఁగుల
ననువునఁ బుచ్చంగ వచ్చు: నతినిష్ఠురతన్
మనమున నాటినమాటలు
విను మెన్నియుపాయములను వెడలునె, యధిపా? ౬౨

ఉ. అక్కట! ధర్మనందనునియాస్యమునం దొకనాఁడుఁ గీడుప
లొక్కఁడు లేదు; నీకొడుకు లొండొరు మీఱి నికృష్టవాక్యముల్

పెక్కులు పెక్కుభంగులను బేర్చుచు నుండఁగ నీవు దానికిన్
సుర్క్కక వించు నుండె ; దనురూపమె నీ కిది కౌరవేశ్వరా ? ౬౩

ఆ. [1]చేటుకాల మైనఁ, జెట్టమాటలు నెఱి
గాని తెరువు వట్టుకర్జములును
దగవు లట్ల తోఁచుఁ; దగియెడునవి యవి
నీతులని మనంబు నిశ్చయించు. ౬౪

వ. నీబుద్ధి పాండవులతోడి విరోధంబునెడ మరలంబడమి పాపంబు. ఇం
తియ కాక యేమిసేయుదము ? మనకులంబునం దేజోధైర్యధార్మిక
త్వాది గుణంబుల గరిష్ఠుం డయిన యుధిష్ఠిరుండు నీసిరికి వెలి యై
య ట్లుండుట దగ వగునే? నీ పెద్దతనంబుసూచి సైరణవాటించి
యున్నవాఁడు." అనిన, విదురుదిక్కు మొగం బై ధృతరాష్ట్రుండు "నీ
చెప్పిన నీతివాక్యంబుల నామనంబు దనివోవదు. ఇంకను జెప్పు"
మనవుడు, నతండు వెండియు ని ట్లనియె : ౬౫

ఆ. "[2]సకలపుణ్యకర్మచయమును నొకదెస,
వినుము పాడి దప్ప కునికియొక్క
దిక్కు, దీని శుత్రులు తెలిపెడునెడఁ, బాడి
కలిమి యెందుఁ బెద్దగా నుతించె. ౬౬

తే. పాడి గలిగిన నిహలోకఫలము లెల్లఁ
జేరుటయ కాదు, కీర్తియుఁ జెందుఁ బురుషు ;
ధరణిఁ బొగడిత యెందాఁకఁ బరఁగు, నంత
కాలమును బుణ్యలోకంబు గల్గు సండు(?). ౬౭

---

1. తా. చెడుకాలము దాపురించినపుడు చెడుమాటలును, క్రమమునకుఁ దప్పిన త్రోవ పట్టు పనులును తగినవిగాఁ దోఁచును. తగినమాటలును పనులను అవినీతులు అని నమ్మఁగవచ్చును.
2. తా. పుణ్యములగు పను లెల్ల నొకదిక్కున, ధర్మము తప్పకుండుట ఒకదిక్కున ఉం చినచో, దీని పరిశ స్తిని దెలుపునెడ శుత్రులు ధార్మిక సంపత్తినే ఎప్పుడును అధిక తరముగాఁ బొగడెను.

వ. తొల్లి ప్రహ్లాదుండు దైత్యజాతిసంభవుం డయ్యును, దన కొడుకు విరోచనుండును, నంగిరసుం డను విప్రుకొడుకు సుధన్వుండును, దమతమ ప్రాణంబు లొడ్డుగా నొడ్డి యొక్కధర్మసందేహంబునకుం బ్రశ్నార్థంబు సలిపి వచ్చి తన్నడిగిన, నితండు గొడుకు కితండు లాంతి యని తలంపక మధ్యస్థుండై సుధన్వు గెలిపించి, యతనిచేత నిజతనయుని జీవితంబు దానంబుగాం గొని వాని బ్రదికించె. కావున నీవును ధర్మంబు విడువక, యధర్మోపేతులైన నీకొడుకులవలని పక్షపాతంబు విడిచి తెఱంగుసేయుము. వారును వీరును నాపద లేక బ్రదుకుదురు; నీవును శోకంబు లేక తక్కుదువు." అని చెప్పి మఱియును — ౬౮

క. "పాపంబులు కర్జము లని
యెపుడుం జేయంగ నవియు నింపగు; ధర్మ
వ్యాపారంబు లకార్యము
లై పరిణతిం బొందెనేని, నట్టుల చెల్లున్. ౬౯

చ. అది సభయె ప్రియం బెసంగ నార్యులు నిల్వరయేని? యార్యులే
మదిం దలంపంగ వారలు సముచిత ధర్మము వల్కరేని? య
ట్టిదియును ధర్మవే తగ ఘటించిన నిక్కము లేదయేని? తాం
బదిలపునిక్కమే యొక నెపం బడుచొప్పగునేని భూవరా? ౭౦

ఉ. నీతిపథంబునన్ బ్రదుక నేర్పుట యుత్తమభంగి; శౌర్యసం
జాతము లైకరం బలరుసంపద లొందుట మధ్యవృత్తి; య
స్ఫీతము లైనభూరవహాజీవనముల్ దలంపం గనిష్ఠముల్;
నీతికి బాహ్యులైన, ధరణీవర, మెత్తురె వారి నుత్తముల్? ౭౧

ఆ. కయ్యమునకు నెపుడుం గాలుద్రవ్వుదురు నీ
పుత్త్రులెల్ల; సూతపుత్త్రుం డాది
యగుతదీయమంత్రు లంతకు ముందర
[1]బిరుదు; లీవు నీతి తెరువు పొరవు. ౭౨

---

1. బిరుదులు = శూరులు; సమర్థులు.

క. పాండవులు శౌర్య మొల్ల ; ర
ఖండిత నీతిప్రకారకార్యము మెచ్చ
యుండుదు ; రెదు రేచినఁ దుది
మండుదు ; రార్పంగ రాదు మఱియెవ్వరికిన్. ౭౩

క. తమతండ్రి భంగి నీకును
సముచిత మగుభక్తి సేసి, సజ్జననుతమా
ర్గమున నడచువారల నీ
వమలమతిం గన్నకొడుకు లట్లరయఁ దగున్". ౭౪

వ. అని పలికి మఱియు ని ట్లనియె : ౭౫

క. "కారణము లేకయును నుప
కారపరత్వమున నొరులకార్యంబులకున్
వారనియలజడిఁ బడియెడు
వారల చూ [1]యేడుగడయు వారికి, నధిపా ! ౭౬

చ. ఒకరుని చేతి [2]ప్రోపునను, దదున్నతి[3]ప్రాపునను గాంచి, యెల్ల వెం
టకును గొఱంత లేక పొగడం దగుసంపద నొంది, యట్టిదా
తకుఁ దుదిఁ గీడు సేసినకృతఘ్నుని పీనుఁగు నైన రోఁత పు
ట్టక కబళింపఁ గుక్కలు నొడంబడునే కురువంశవర్ధనా ? ౭౭

వ. కావునఁ, గృతము దలంపమి గీడు. పాండురాజు నీకుం బరమభక్తుండు.
పాండవులునుం దేజోలాభంబులు గాంచిన వారలు ; వారల నాద-
రింపు" మని చెప్పి వెండియు నిట్లనియె : ౭౮

ఆ. "బ్రిదుకు చేటు, పొగడువడుట దూ ఱొందుట,
యోగి వేఁడుకొనుట, యిట్లు మఱియుఁ

1. ఏడుగడ = రక్షకము. 2. ప్రోపు = పోషణము.
3. ప్రాపు = ఆశ్రయణము – అండ.

గలుగుసౌఖ్య దుఃఖములు వచ్చు [1]నెడపడి ;
వాని కింత యేల వగవ నధిప ? ౭౯

క. వగ బలము దఱుఁగు, రూపఱు ;
వగచిన మతి దప్పుఁ, దెవులు వచ్చుం ; [2]దూరన్
వగచి నలంగినఁ బ్రియ మగుఁ
బగతురకును ; వగచు టుడుగు, పార్థివముఖ్యా !" ౮౦

వ. అనిన విని ధృతరాష్ట్రుం డి ట్లనియె : ౮౧

క. "రిత్తయుపచారముల నే
నుత్తముఁ డగుధర్మతనయు నుడికించితి. దు
ర్వృత్తు లగుమత్సుతులకును
మిత్తి యగుం బోర ; వగలు మిగులక యున్నే ? ౮౨

వ. నెవ్వగలు నివ్వటిల్ల నీక నిలుపునట్టిది యెయ్యది ? దాని నెఱింగిం-
పు" మనిన, విదురుం డి ట్లనియె : ౮౩

తే. "నియతతపమును, నింద్రియనిగ్రహంబు,
భూరివిద్యయు శాంతికిఁ గారణములు.
వానియన్నింటికంటె మేలైన శాంతి
కారణము లోభ ముడుగుట, కౌరవేంద్ర !" ౮౪

వ. అని వెండియు, ౮౫

క. "జ్ఞాతుల పోరితమును, గో
షో్రితమునాక్రమము, విప్రవర్గము చనవున్,
నాతులఁ గారించుటయును,
బ్రీతిం జన నిచ్చునతనిపెం పొప్పు, నృపా ! ౮౬

---

1. ఎడపడి = ఎడ తెగి — ఒకటి తరువాత నొకటి. 2. దూరన్ = మిక్కిలిగా.

క. అలమిఁ గొని యొండొరులఁ బ్రో
చుచుఁ బ్రాపుల నెలమిఁ గలిమిఁ బొంది, బహుజ్ఞా
తులు నెమ్మిఁ గూడి, తామర
కొలనికి ప్రియుఁ సిరికిఁ బట్టగుదు రుజ్జ్వలులై. ౮౭

చ. కరితురగాదిఘట్టనయు గాలియు నోంపదె యొంటి యున్నయ
త్తరువు? ననేకభూరుహవితానము గుం పయి పేర్చి బాధలం
బొరయునె? యన్న దమ్ములును బొందిన నేరి కసాధ్యు; లట్లు గా
[1]కెరవయి నిల్చినం [2]గెలని కెల్లిద మై పఱిపోదు రెంతయుఁ. ౮౮

వ. కావునఁ గౌరవులుం బాండవులు నొండొరులకుఁ బ్రాపై పొసఁగలిన నెదిరికి నజయ్యు లగుదురు. [3]పరులయొత్తు లేనిరాజ్యంబు పూజ్య మహిమం బరఁగు. వనవాసంబునం గుందినకౌంతేయులం దడయక తెచ్చి యుచితపదం బిచ్చి నిలుపుట, నీకొడుకులకు నిలుపు గావించుట యగు". అని చెప్పి మఱియు నిట్లను: "ప్రియవాదు లెందును గలరు. అప్రియం బగుంగా కేమియని పథ్యంబు వలుకువారు లేరు. జూదంబు నప్పు డే నడ్డపడి, యప్రియం బగుటకు శంకింపక, పథ్యంబు వలికితి. అది నీకు రుచియింపక, రోగికిఁ బథ్యాహారంబు దల కంటగించున ట్లయ్యె. ఐన నిప్పుడుం జెప్పెద వినుము. కాకంబులం గైకొని మయూరంబులం బరిహరించు విధంబున, మార్జాలంబులం బాటించి సింహంబులయెడ ననాదరంబు సేయు చందంబున, సుయోధనాదులం బట్టి యుధిష్ఠిరప్రముఖుల విడిచితివి. నేఁడు కార్యంబు ముట్టవచ్చి నం దోఁపక మిడుంగుఱు సోఁకినట్లు దల్లడించెదవు. కులంబునకై యొకనిఁ దొఱంగుటయ నీతి యని పెద్దలు సెప్పుదురు. దుర్నయ పరుం డై సద్బుద్ధి సెప్ప వినం డేని, మనము దుర్యోధనుం దొఱం-

---

1. ఎరవయి నిల్చినఁ = వేఱయి నిలిచినచో. 2. కెలనికి ఎల్లిద మై పఱిపోదురు = అంచులవారికి చులుకనయి చీలిపోవుదురు- చెడిపోవుదురు. పఱివోవు = (దే. అ. క్రి.) కొల్లవోవు; నశించు. 3. పరులయొత్తు = పగతుర ఆక్రమణము.

గిన నేమి యగు? అది యట్లుండె - సంపద సహాయంబు నపేక్షించి యుండు. సహాయంబు సంపద నుద్దేశించి వర్తిల్లు. ఇట్లివి యొక టొకటి పొందునంగాని సిద్ధింపవు. కావున, నీసంపద పాండవు లకును, వారిసహాయత్వంబుల నీకునుం బ్రియం బొనరింప, నొండొరులకలయుట మేలు గాక, మనలావు వెలిసేయుట లెస్స యగునే? కురువంశనిస్తారకు లగు భీష్మ యుధిష్ఠిరులును, నవక్రవిక్రము లగు కర్ణార్జునులును, ప్రతాపధాము లగు భీమ దుర్యోధనులును, శస్త్రాస్త్ర పారగులగు నభిమన్యు లక్ష్మణప్రభృతి కుమారులును, శాపానుగ్రహ సమర్థు లగు ద్రోణ ద్రుపదాది పరమాప్తులును, వారివారిబంధు మిత్త్ర జనంబులును, నొక్క మొగం బై నీపనుపు సేయుచు, నయ విక్రమంబు లప్రతిహతంబు లై నడవం, బృథివి శాసింప భవదీయ-విభవం బుజ్జ్వలం బై యొరుల కెడ లేక చెల్లుచున్న నెంతయొ ప్పగునో యటు విచారింపుము. పాండవులు ధీరమతు లై వైర మెత్తక యూరక తొలంగి యుండిరేనియుఁ, గతిపయదినంబులలోఁ జీకాకుపడి చెడుం గాక, గాంధారీ నందనుచేత వసుంధరాపరిపాలన భారంబు నిర్వహింపంబడునే?" అనిన విని ధృతరాష్ట్రుండు విదురున కి ట్లనియె : ౮౯

తే. "నీదు సెప్పినమాటలు నిర్మలములు,
నిపుణసమ్మతములు, రాజనీతిమార్గ
బోధకంబులు; నైనను బుత్త్రు విడువ
నోప. ధర్మో జయతి యని యుండువాఁడ." ౯౦

వ. అనిన విని, విదురుం డతని కి ట్లనియె: "దేవా, జ్ఞాతులు గుణహీను లైనను విడువందగ దనిన, సకలగుణసంపన్ను లై భవత్ప్రసాదంబు గోరుచున్న కౌంతేయులఁ దిగవిడువం దగునే? ఏను నీకు హితంబు గోరెడువాఁడ నని నిశ్చయించి నాబుద్ధివినుము. [1]వారల జీవనంబు నకుఁ గొన్ని యలంతిపల్లియ లైనను, దుర్యోధను నొడంబఱచి

1. వారల జీవనంబునకుఁ గొన్ని యలంతి పల్లియ లైనను = ......చిన్ని పల్లెలయినను.

యేర్పఱిచి, తెఱంగు పఱిచిన లెస్స యని చూచెద. అతని విడువ వలయునని చెప్పితినేనిఁ [1]పెనఁకువం బశ్చాత్తాపంబు వుట్టు; దాని కప్పుడు ప్రతీకారంబు లేదు. కావున, నెల్లభంగుల నియ్యకొని పాండవులతోడ సంధిసేయవలయు; నట్లుం గాక— ౯౧

క. తమలోనిపాళ్ళకుంగా
సమరము సేసినను గాని [2]చాఁ జనదె? శరీ
రము లాధివ్యాధిజరా
సమన్వితము లగుటఁ, జేటు సహజం బరయన్. ౯౨

చ. గజతురగాదిసంపదలుఁ, గాంతలతోడి విహారలీలలుం,
బ్రజ కనురాగ మొందఁ బరిపాలన సేయు క్రమంబుఁ, బోరులన్
విజయముఁ బొంది పేర్చుటయు, విస్ఫురితాభరణానులేపవ
స్త్రజనితవైభవంబుఁ గలరాజులుఁ బోయిర కాక నిల్చిరే? ౯౩

క. కావునఁ, జెవికిం జేఁ దగు
నీవాక్యము వినఁగఁ జాలితేని, నిహపర
శ్రీవిభవములకుఁ గీర్తికిఁ
దావల మై వెలయు టింత తథ్యము సుమ్మీ! ౯౪

క. తగ నీలో నూహింపుము;
దిగవిడువకు ధర్మతనయు; దృఢమతి వై పొం
దగుచందము గొడుకులకుం
బ్రెగడలకుం జెప్పి తీర్పు పెం పేర్పడఁగన్". ౯౫

ఆ. అనిన, నాంబికేయుఁ డను: "నీదుపలుకులఁ
గలఁక దేఱె బుద్ధి దెలివి నొందె;
నిట్లు చేయువాఁడ; నిదియ కర్జము ధర్మ
మును యశంబు లాభమును దలంప?" ౯౬

---

1. పెనఁకువం బశ్చాత్తాపంబు వుట్టు = పోరాటమువలన......
2. చాఁ జనదె = చావకూడదా?

చ. అనుడు ముదంబు నమ్మమియు నాత్మఁ బెనంగొన, నన్నతోడ ని
ట్లను విదురుండు: "పెద్దవడి కక్కట! నీ మది కార్యవృత్తి నూ
ల్కొనియె; సుయోధనుం గని యకుంఠితనిశ్చయమై యతండు వ్రా
లినదెస వ్రాల కుండిన, బలే, మనుబోటులకుం బ్రియం బగున్."

వ. అని పలికి నిట్టూర్పు నిగిడించి, ౯౮

క. "దైవంబ నేర్చుఁ గా; కిటు
వోవఁగ నే నేర్తు, నేరఁ బొమ్మని పలుకం
గా వశమె నరున? కెక్కుడు
దైవము పౌరుషముకంటె, ధరణీనాథా!" ౯౯

వ. అనిన, విదురునకు వైచిత్రవీర్యుం డి ట్లనియె: ౧౦౦

తే. "ధర్మపథమును, నీతితత్త్వంబు తెరవు
నిర్మలము లగుపలుకుల నీవు నాకు
దెలియఁ జెప్పితి; పరమార్థదృష్టి యెట్టి
వాక్యములఁ గల్గుఁ? జెప్పుము వాని, ననఘ!" ౧౦౧

—: సనత్సుజాతుఁడు ధృతరాష్ట్రునకు నధ్యాత్మతత్త్వంబు దెలియఁ జెప్పుట :—

వ. అని యడిగిన, విదురుం డతని కి ట్లనియె: "నాకుఁ దోఁచినయన్నియు నానేర్చినట్లు నీ కెఱింగించితి. అత్యంతగుహ్యంబు లగునర్థంబులు పురాణుం డయ్యుఁ గుమారుం డగుసనత్సుజాతుండు దెలుప నోపుం గాని యిటమీఁద నాకుం దెలియదు". అనిన, ధృతరాష్ట్రుండు: "అమ్మునీంద్రుండు నా కెంతదవ్వు! నీవ యవియునుం జెప్పు" మనిన, "నేను శూద్రయోనిజాతుండ, వేదాంతవేద్యంబు లగునర్థంబులు నా కగోచరంబులు. అమ్మహాత్ముబుద్ధి నే నెఱుంగుదు. దేవతలకుం దెలియనట్టివి యాతనికిం దెలియు. అతండు దెలుపం జాలు" ననిన, ధృతరాష్ట్రుం డతికుతూహలుం డై — ౧౦౨

ఆ. "మనకు నిప్పు డతనిఁగను తెఱంగెయ్యది
యగుటయును నెఱుంగ" ననిన, విదురుఁ
డధికభక్తిఁ దలఁచె నాత్మలో నాశ్రిత
వత్సలత్వనిధి సనత్సుజాతు. ౧౦౩

వ. ఇట్లు దలంచుటయును, దివ్యజ్ఞానమానసీయుం డగునమ్మునివరేణ్యుం డాక్షణంబ పొడసూపిన, విదురుం డతనివచ్చుట యుగ్గడించుచు, వినయంబున నతని నెదుర్కొని, దండనమస్కారంబు లాచరించి, యున్నతాసనం బిడి, యర్ఘ్యపాద్యంబు లిచ్చి, ససంభ్రమంబుగాఁ బ్రత్యుత్థానంబును బ్రణామంబునుం జేసియున్న ధృతరాష్ట్రు నతనికిం జూపి విదురుం డి ట్లనియె: ౧౦౪

క. "దేవా, దేవరకృప నీ
భూవల్లభుఁ డమలతత్త్వబోధక మై సా
ఖ్యావహ మగువాక్యచయముఁ
దా వినఁ గోరుటయు, మిమ్ముఁ దలఁచితి భక్తిన్. ౧౦౫

వ. మీరును గారుణ్యాతిశయంబున విజయంచేసితిరి. గురుసమాశ్రితులగు వార లెద్దాని వలన సుఖదుఃఖంబులు, లాభాలాభంబులుఁ, బ్రియద్వేషంబులు నాదిగాఁ గల ద్వంద్వంబులం బడక బ్రదుకుదురు? అట్టి పరమార్థోపదేశంబున నితనిం గృతార్థునిం గావించి రక్షింప వలయు" నని ప్రార్థించినం, బార్థివుండునుం దదనురూపంబులగు నాలాపంబుల నారాధించినం బ్రసన్నుండై, సనత్సుజాతుం డధ్యాత్మవిషయంబులగు వివిధవాక్యంబుల సోపానప్రకారంబున నంత కంతకు సూక్ష్మంబు లగు నర్థంబులు సమర్థించుచు, నందుఁ బ్రజ్ఞాచక్షుం డెయ్యది యేర్పడ నడిగె నది యెల్ల వివరించుచు, హృదయ పుష్కరకలితం బగుపరతత్త్వంబు ప్రసాదించునట్టి గూఢోక్త లనుగ్రహించుచుండ, నెట్టకేలకుఁ బ్రభాతం బగుటయు, ధృతరాష్ట్ర విదురుల నామంత్రణంబు నేసి యద్దేవముని యంతర్ధానంబు నొందె. అట్టి సమయంబున —౧౦౬

—: ప్రాతఃకాలవర్ణనము :—

తే. తనకులంబునఁ బుట్టినధార్తరాష్ట్రు
లన్నదమ్ములతో [1]విగ్రహంబు గొనుట
[2]కుమ్మలించి, వివర్ణత నొందినట్లు
గంది, యెంతయుఁ జెలు వేదెఁ జందురుండు. ౧౦౭

క. కుముదములుఁ దారు నొక్కటఁ
బ్రమదంబున నుండి, వానిపదవి దొలఁగినం
దమకుఁ నిలువఁగఁ దగ దను
[3]క్రమమునఁ జనునట్లు తారకంబులు విరిసెన్. ౧౦౮

ఉ. ఎత్తిన వేడ్కఁ గంధరము లెత్తి, మొగంబులు సాఁచి, చూడ్కులం
జిత్తములుఁ నిగిడ్చి, [3]తమ చెందెడునిక్కలు రోసి, యింపు ద
ళ్కొత్తఁగ నొక్కచో నొకటి నొక్కటి గాంచి, [4]యెలర్చు కాయ్వులం
జిత్తజకేళిఁ దేలె విలసిల్లుచుఁ జక్కవదోయి వేకువన్. ౧౦౯

మ. మును సౌరభ్యము నివ్వటిల్లఁగ, మనోమోదంబునం దేఁటు ల
ల్లన యోలిఁ వెడలంగ, రేకులు సముల్లాసంబునఁ బింక మొ
క్క నయం బెక్కుచు, గ్రద్దపొం దెడలి పీకం గేసరంబుల్ గడ
లొక్కనఁ, దోడ్తోమధు వుచ్చి, సేరెలమిఁ బొల్పుం జెందె నంభోజముల్.

చ. వెడవెడ నిద్రవొంది కనువిచ్చిన పాంథులమీఁద దాడి వోఁ,
దడఁబడ నొండొరుం బిలుచుదర్పకు పంపుబలంబులోనియ
ల్కుడుకరణిం జెలంగె శుక కోకిల భృంగతతుల్ వనంబులం—
ఢేఢనెఢఁ బల్కఁ, గూయ, సొగియింపఁగ, మ్రోయఁగఁ దద్వి
రావముల్.

1. విగ్రహంబు గొనుటకు = ఎదుర్కొనుటకు — పోరాడుటకు. 2. ఉమ్మలించి = విషాద మొంది. 3. తమ చెందెడు నిక్కలు రోసి = తమ చేరఁబలయు నివాసములు వదలి. 4. ఎలర్చు కాయ్వులన్ = వికసిల్లు వలపులతో.

సీ. పద్మపరాగంబుఁ బరఁగించు నరుణోద
యంబుకాంతికిఁ జెలువంబు మిగులఁ,
బరువంబు దప్పినవిరుల రాలుచుఁ దరు
చయము చుక్కలు లేనిచదలఁ జెనయ,
నరవిరి నెత్తావి నడరించు నున్నిద్ర
విటపీటిసౌరభ వితతి వొదల,
[1]నెలఁత చీరినయెులకల నెటఁ దీర్చు జ
క్కవలు [2]చెందొవల కేఁకట యొనర్ప,
ఆ. [3]వెలరువాలుదీవియల నల్ల నల్లార్చు
[4]సోర్ణగండ్లయందుఁ జొచ్చి నుడిసి,
[5]తిరిగి వేగుఁబోక తెమ్మెర లెలదీఁగ
కొనలవంక లొత్తు, ననలఁ బ్రోచు. ౧౧౨

ఆ. అంత నుదయశైల మనునశోకద్రుమ
సమితియందుఁ, గాంతిచారుభంగి
నెఱయ విరిసి తొలుత నెగసినయుజ్జ్వల
స్తబక మనఁగఁ బద్మసఖుఁడు వొడిచె. ౧౧౩

---

1. నెలఁత చీరిన యెులకల నెటఁ దీర్చు = ఆఁడు జక్కవ చీల్పఁగానైన యెక్కలచిక్కు సవరించు. చీరు = (దే. స క్రి.) చీల్చు; పిలుచు. 2. చెందొవలకు ఏఁకటయొనర్ప = ఎఱ్ఱ గలువలకొఱకు అపేక్షింపఁగా.

[ 'భారతము' ముద్రితప్రతుల గొన్నిట 'చీరు' శబ్దము శకటరేఫతోఁగూడి యున్నది. శకటరేపముతోఁ గూడిన 'చీఱు'నకు ప్రయోగములు మృగ్యములు. 'శబ్దరత్నాకర' కారుఁడును ప్రయోగములు లేవని యొప్పికొనినాఁడు. చీల్చు అర్థమున 'చీరు' శబ్దము, 'భారతమున' నొక్కచోఁ బ్రయోగమగుపడు చున్నది. చూడు — ఘోరగదా — విదారణ విఘూర్ణిత శాత్రవ కుంభికుంభముల్, చీరుచు..., ఆది. ౮. ౬. ]

3. వెలరువాలు = తెల్లనగు; వెలవెలఁబాఱు. 4. సోర్ణగండ్లయందు = గవాక్షపు కంతలయందు. సోరణము రూ. సోర్ణము = (దే. వి. సోరణము + గండి) గవాక్షము. 5. తిరిగి = సంచరించి. వేగుఁబోక తెమ్మెరలు = తెల్లవాఱుజాము పిల్లగాలులు.

సీ. ఉర్వీధరంబుల నొప్పెడు జేవురుఁ
జఱుల కాంతికి నునుమెఱుఁగు వెట్టి,
ధరణీజ గుల్మ లతా వితానము పల్ల
వములకుఁ గ్రొత్తజవన్నె యొసఁగి,
యరుణాంబుజంబుల యంతర్దళంబుల
తళతళ యను జిగి దళముకొల్పి,
చక్రవాకద్వయీసంతతి యెఱకల
కొమరారు కెంజాయఁ గ్రొత్త సేసి,
ఆ. తనదు బాలబింబ మనుపమేయప్రభా
పటలి జటిల గగనభాగ మగుచు
నుల్లసిల్లి, జగము తెల్లను విలసిల్లఁ
బూర్వశిఖరిమీఁదఁ బొడిచె నినుఁడు. ౧౧౪

వ. ఇట్లు సూర్యోదయం బగుటయు, ధృతరాష్ట్రుండు దత్కాలోచితా-
చారంబులు నిర్వర్తించి, తగు తెఱంగున నలంకృతుం డయి, యా
స్థానమంటపంబున కరిగి పేరోలగం బిచ్చినఁ, గుంభసంభవ కృప
కృతవర్మాశ్వత్థామ కర్ణాదు లగుదొరలును, భీష్మ విదుర బాహ్లిక
సోమదత్త భూరిశ్రవగ ప్రభృతు లగుబంధుజనులును, దుర్యోధన
దుశ్శాసన ప్రముఖులగు కుమారులును లోనుగాఁ గలసమస్తపరిజనం
బులును వచ్చి కలసి యుండిరి. అయ్యవసరంబున సంజయుండు వచ్చి
వాకిట నిలిచి ప్రతీహారులవలనఁ దన్నెఱింగించి పుచ్చి చొచ్చి,
సముచితప్రదేశంబునఁ గూర్చుండి, తనమాటలు వినుటకుఁ జిడి
ముడి పడుచున్నకొలువుఁ గలయఁ గనుంగొని యిట్లనియె: ౧౧౫

సంజయుఁడు ధృతరాష్ట్రునితోఁ బాండవుల తెఱంగు సెప్పుట:—

తే. "పాండురాజతనూజులపాలి కర్థి
నిమ్మహారాజు పనుపంగ నేఁగి ధర్మ
పుత్త్రుఁ గాంచితి; నాతండు మైత్త్రి మెఱయఁ
గౌరవులసేమ మెల్లఁ బేర్కొన నడిగె. ౧౧౬

వ. మఱియుం దగువారల నెల్ల నయ్యైయుచితవిధిం బ్రణామంబున వినయంబున, బాంధవంబున, మిత్త్రభావంబున, వాత్సల్యంబునఁ, బ్రసాదంబున నాదరించె. నేనును భూనాథుని గఱపిన తెఱంగునఁ గొఱంతలేకుండ బంధుత్వంబునకు వలయుమాట లాడితి. పదంపడి కార్యంబు ప్రసంగించి నాయాడినమాటలకు నయ్యుధిష్ఠిరుండు పలికిన వచనంబు లింత యొప్పవనే?" యని యగ్గించిన, ధృతరాష్ట్రుం డవహితుం డై యడుగఁ, దా నయ్యుధిష్ఠిరునకుం జెప్పినభంగులు, నతండు వానికి నెల్ల నుత్తరం బిచ్చిన తెఱంగును నెఱింగించి, ధృతరాష్ట్రునకుం బితామహునకు దుర్యోధననకుం గ్రమంబున వారివారితో నాడు మని నియమించినచందంబులు ధర్మనందను పలుకులపరిపాటిం దేటపడం జెప్పి సూతసూనుండు వెండియు ని ట్లనియె: ౧౧౭

తే. "ఏ నుపప్లావ్యపురమున కేఁగి తొలుత
వాసుదేవార్జునులఁ గంటి; వారు నీతి
పథము దప్పనిమాటలు బలిమిఁ దోఁచు
నట్లుగా నాడి; రవి వినుం డాదరించి." ౧౧౮

వ. అనిన విని, ధృతరాష్ట్రుండు 'అవ్వాసుదేవుచిత్తం బెట్లు? అతం డే మనియె?' నని యడిగిన, నతనికి సంజయుం డి ట్లనియె: ౧౧౯

ఉ. "తానును సత్యభామయును ద్రౌపదియుం నరుఁడుం రహస్యగో
ష్ఠీనిరతాత్ముఁ డై, సుతులుఁ జేరనిచెందనియట్టిచోటఁ గాం
తానివహంబు గొల్వఁ బ్రముదస్థితి నుండియుఁ, బిల్వఁ బంచె న
న్నానలినోదరుండు; హృదయంబున నీదెసకూర్మి యెట్టిదో? ౧౨౦

వ. ఏనును దత్ప్రకారంబు పరిహారులవలన మున్న యెఱింగినవాఁడ నగుటం జేసి, [1]కంచుకంబును శిరోవేష్టనంబును ధరియించి [2]వినీతవేషుండ నై పోవునప్పుడు, కృష్ణార్జును లనేకమణిమయభూషణపరిభాభాసితు

1. కంచుకంబును శిరోవేష్టనంబును = అంగీయును, తలపాగయును.
2. వినీతవేషుండ నై = వినయమును దెల్పు వేసము వేసినవాఁడ నై

లై యొక్క సెజ్జన యున్నవారు. కృష్ణుండు పవ్వళించియుండి చాఁచినచరణంబులు దొడలపై నిడికొని యర్జునుండు గూర్చున్నవాఁడు. సత్యభామయుం బాంచాలియుం గద్దియలపై నున్నవారు. సవినయంబుగా నేనును దండప్రణామంబు సేసిన నన్నాదరించి, కృష్ణునిచే నన్న నర్జునుపనుపునం గనకరత్నమయం బగునతనిపాదపీఠం బతండు వ్రేల్చినకాళ్లు దిగిచికొన, నిద్దఱుముద్దియ లెత్తి తెచ్చి నాకుం బెట్టిన, నేనును దానిం గరతలంబున నంటుచు ధరణీతలంబునఁ గూర్చుండి, కేలు మొగిడ్చి ఫాలతలంబునం గదియించి, నీలవర్ణులు బాహుబలమదభరితులును నయి యేనుఁగుదోయియుంబోలె నన్న యమ్మాధవ ధనంజయులఁ జూచునప్పుడు నాకు హర్షాశ్రు పులకలును, దదనంతరంబ భయంబునుం బుట్టె. అట్టియెడ — ౧౨౧

క. ఈయిరువురుఁ బంచినపని
సేయుదు రటె! ధర్మజునకుఁ జేకుఱనితలం
పేయది? అతనిం దొడరుట
వే యేటికి జమునిశిరము వ్రేయుట గాదే! ౧౨౨

వ. అని తలఁచుచుండ, నమ్మహానుభావులు నన్ను సంభావించి, తా రుపయోగించునట్టి యన్నపానంబులను, దమకుఁ గట్టఁ దగినట్టివస్త్రంబులను, దాము దొడుగునట్టి భూషణంబులను నాకుఁ బ్రియం బొనర్చి గారవించిరి. నేనును నాపోయిన కార్యంబు విన్నవించితి. విజయుండు బలుమొగంబుతో దానికి నుత్తరంబు వలుకం దొడంగిన వారించి, వారిజోదరుం డిట్లనియె: ౧౨౩

—: సంజయుండు ధృతరాష్ట్రునకుఁ గృష్ణుని సెప్పినమాట లెఱింగించుట :—

తే. “వినుము, సంజయ, ధృతరాష్ట్రవిభుని పెద్ద
కొలువునందుఁ దత్పుత్త్రులు, గురుఁడుఁ, గృపుఁడు,
నాపగానందనుఁడు మొదలైన సకల
జనులు వినుచుండఁగా నిట్టు లనుము నీవు. ౧౨౪

ఆ. అయ్యజాతశత్రుఁ డలుగుట నీళ్లల
నగ్ని పుట్టినట్టి దయ్య ; మీకు
నార్ప నెరవు లేదు ; నేర్పుమై నింకఁ గా
వింపవలయుపనులు వినుఁడు మీరు. ౧౨౫

వ. అవి యెవ్వి యంటేని— ౧౨౬

సీ. కలయట్టివివిధార్థములు నశేషంబుగఁ
దగ నొసంగుండు సత్పాత్రములకుఁ ;
జెలులఁ జుట్టముల నాశ్రితులను రావించి
సత్కరింపుఁడు సంతసం బెలర్ప ;
నిచ్ఛానుగుణముగ నింద్రియసుఖముల
ననుభవింపుఁడు హృదయంబు లలర ;
నాండ్రను బిడ్డల నయ్యైవిధంబుల
గారవింపుఁడు ప్రియపూరితముగ ;
తే. మఱియు, నెవ్వరి చిత్తమె త్తెఱఁగునందు
వాటమైయుండు, నదియెల్ల వలయునట్లు
సేసి విహరింపుఁ ; డింకెడసేయ కనికి
నడవుఁ డఱచేతఁ బ్రాణంబులిడి కడంగి. ౧౨౭

వ. అని చెప్పుము. ఇంత యేమిటి కంటేని – ౧౨౮

ఉ. ఎందును నెవ్వరుం బడనియెంతయుఁ గష్టముపాటు వచ్చినం
గొందల మంది పాండువిభుకోడలు, దవ్వుల నున్ననన్ను 'గో
విందుఁడ, కావు' మంచుఁ బలవించుట యూఁగఁగ రానియప్పుఁ బో
లెం దలపోయ వ్రేఁ గయి చలింపక యున్నది యెప్పుడున్ మదిన్.

తే. ఇట్టి యేఁదేరు గడపంగ, నెందు నతికి
నెక్కు గాండీవ మెత్తఱి నెక్కు వెట్టి
రెండుదొనలను బూని కిరీటి యనికి
వచ్చు నేఁ డెల్లి ; యెందుఁ బోవచ్చు మీకు ? ౧౩౦

వ. అని పలుకునప్పటి వారి మెత్తికోలును, నీకొడుకు విడుపోవమియునుం దలంచి భయం బందితి. ఇతండు వారల నెఱుంగఁడు. భీష్మ ద్రోణుల ప్రాపును, గర్ణుగర్వంబును దన్ను గెలిపించు నని నచ్చి తొడరెడు" — ననిన విని ధృతరాష్ట్రుం 'డర్జునుం డే మనియె?' నని యడిగిన, నతనికి సంజయుం డిట్లనియె: ౧౩౧

క. "నరుఁ డలుక వొడమియును సు
స్థిరుఁ డై, [1]తనయెఱ్ఱసెరలచెలువునఁ గెందా
మరలం దెగడెడుకన్నుల
నరుణచ్ఛవి నెఱయ నిట్టులనియె, నరేంద్రా! ౧౩౨

ఆ. "ఆ సుయోధనుండు, నతనికిఁ దోడ్పడ
నరుగుదెంచినట్టి ధరణినాథ
చయము వినుచు నుండ, సంజయ, నావచ
నములు గాఁగ నిట్లనంగ వలయు. ౧౩౩

ఉ. పాండునియగ్రినందనుఁడు పాలడుగం దగ నీఁడయేని, మా
కొం డన నేల? మే లది; సుయోధనుఁ డింతకు మున్ను పెక్కు లు
ద్దండతఁ దాను జేసిన విధంబుల కెల్ల మెఱుంగు వెట్టిన
ట్లుండెడుఁ గాక; వినుము వృకోదరుఁడుం బ్రియ మందునట్లుగాన్.

క. మా యిరువురతోఁ గయ్యము
సేయ నతం డియ్యకొనిన, సిద్ధించెన కా
దే యుచితచరితుఁ డగు కౌం
తేయాగ్రజుకార్య; మట్టితెఱఁ గొప్పఁ గదా! ౧౩౪

క. వనవాసంబున భూాశ
య్యను ధర్మజుఁ డున్నయట్టియాయాసము వో
వునె, యంపశయ్య దుర్యో
ధనుఁడు రణక్షోణిఁ బడక తక్కినయేనిఁ ? ౧౩౬

---

1. తనయెఱ్ఱసెరల చెలువున = తన కనులయందలి యెఱ్ఱని రేఖాకాంతులతో.

ఉ. సూనృత మూఁది బన్నములు సూడక, లోన నడంచినట్టికో
పానల మెండి యున్న నిబిడాటవిపైఁ బచరించు తీవ్రదా
వానలుఁ బోలి శాత్రవచయంబుపయిం గవియించి నిల్చినం
గాని, యుధిష్ఠిరుఁ సరకుగాఁ గొన రా ధృతరాష్ట్రనందనుల్. ౧౩౭

మ. గద సారించుచు నంత్యకాలవిచలత్కాలాకృతిన్ భీముఁ, డు
న్మదమాతంగచయంబు నుగ్గుగ, లసన్నానారథవ్రాతముల్
చదియన్, భూరిహయవ్రజంబు పొడి గా సంరంభతుంగాంగుఁ డై
కదియం జూచి, బళే! సుయోధనుఁడు భాగం బిచ్చు రాజ్యంబునన్.

సీ. క్రొల్విలి వీఁకమై గొదగొని లేళ్ళకు
నుఱుకు తెఱంగునఁ దఱియఁజొచ్చి,
పెనుగాలి జీమూతబృందంబుపై బెట్టి
దంబుగ వీచుచందమున నడరి,
[1]కసిమసంగినమారి గడఁగి జీవులమీఁద
నుగ్రతఁ గవియున ట్లురవడించి,
యాఁకొన్న లయరుద్రుఁ డాగ్రహంబున జగ
త్త్రిచయంబు ముట్టెడుభంగిఁ బొదివి,
తే. నకులుఁడును దదనుజుఁడు, సాత్యకియు నాను
భద్రకొడుకును, నెదిరినబలము నెల్ల
బెదరఁ జెదర బడల్పడఁ బెల్లు సావఁ
జేయఁ గని, కౌరవులు సంధి సేయువారు. ౧౩౯

ఉ. చిత్తము లుల్లసిల్ల, నలసింహకిశోరము లొక్కుమై మదో
న్మత్తగజావళిం బొదువుమాడ్కి నరాతిబలంబు ముట్టి, యు
ద్వృత్తిఁ గడంగి, యప్రతిమవీరులు ద్రౌపదిపుత్త్రు లేపురున్
నెత్తురునీరఁ దేల్చిన ననిం గని, మీనృపుఁ డల్కఁ దీఱెడిన్. ౧౪౦

1. కసిమసంగినమారి = రెచ్చిన – అలవలలుసేయు – మృత్యుదేవత.

మ. చెలులుం జుట్టలు నిష్టభృత్యులు మహోక్షం బౌరిణముల్ డాఁప కు
జ్జ్వలులై తో నడవన్, విరాటుఁడును బాంచాలుండు నేపారి సే
నలయుద్రేకము రాఁ గ్రమ్ముం జెఱపఁ, నానాహేతి ఘోరంబుగాఁ
దలపడ్డం గని గాక, సుక్షత్రియులు రె గాంధారీసుతుల్ మాటలన్? ౧౪౧

చ. తటిమి శిఖండి తన్నారులు దాఁకఁగ నెవ్వరిదిక్కుఁ జూడ, కే
డ్తెఱఁ దనపూన్కికై మనము ధీరత నిల్పి, రథంబు బల్విడిం
బఱపి, కురుక్షితీశుఁ డను బహ్మాస్త్రము వేయును నిండ, భీష్ముపై
కుటికినఁ గాక, మాకు సగమూరక యిత్తురె మీరు మేదినిన్? ౧౪౨

శా. విద్యుద్దండము నిల్చి పోల్చినగతిన్ వి ల్లందమై యుండ, న
స్మద్యోధావలిమానసంబున రణోత్సాహంబు రెట్టింప, ధృ
ష్టద్యుమ్నుండు గడంగి ద్రోణుఁ గడిమిన్ డాయంగ వీక్షించి, కా
కుదోయ్గించుట మేల తక్కుఁడురు మీ రుగ్రాహవక్రీడలన్? ౧౪౩

సీ. గాండీవగుణరవం బొండొండ చెలఁగంగ,
శరపరంపగ లాకసంబు గప్పఁ,
బ్రతివిశిఖములు ఖండితములై రాలంగ,
నెదిరి సైన్యంబుల మదగజాది
చతురంగములును జర్జరితంబులై యవ
యవభేద మెఱుఁగనియట్లు గాఁగఁ
దునిసిన, నెత్తురు నెనడుచు నెమ్ములు
నెఱచియుఁ గండలు నెనసి సమర

తే. తల్మము ఘోరంబుగాఁ, గపిధ్వజము ధవళ
హరులు శోభిల్ల, నొగలపై హరి యొలర్ప,
దేవదత్తంబు మ్రోయఁ దోఁతెంచునట్టి
రథముఁ గని కాని, కానఁడు రాజరాజు. ౧౪౪

శా. బాలక్రీడ మహాసురప్రకరమున్ భంజింపఁడే? యెప్పుడుం
దై్రలోక్యంబును భక్తియుక్తిఁ దగ నారాధింపదే? యట్టిశౌ

ర్యాలంకారు మహాత్ముఁ డా నరకు నేయం డచ్యుతుఁడె! మ మ్మతం
డేలా కై కొను? నాసుయోధనునియం దె గ్గది యూహింపఁగఁడె?

వ. ఏము పితామహ గురు కృపాచార్యులకు నమస్కరించి, యస్మదీయ
రాజ్యభాగంబునకై తోడరి కయ్యంబు సేయువారము. కౌరవులకుం
బూని యెవ్వరే మాతోఁ బెనంగినను వారిశస్త్రాస్త్రంబులు ధర్మ
ప్రతిహతంబు లగు నని తలంచెదము. పండ్రెండు వత్సరంబులు
వనంబున నమ్మయి నిడుములం బడి, జనపదంబునం బదు మూఁడగునే
డజ్ఞాతవాసాయాసం బ ట్లనుభవించి వచ్చి, మాతండ్రి పాలికిం
బెనంగు మమ్ము, నిందాదిసురసహాయు లయ్యును ధార్తరాష్ట్రులు
గెల్చువారై రేని, ధర్మంబు కంటె నధర్మము బలవంతం బైనయది
యగు. ఇంతియ కాని మాచేయునట్టిది గీ డైనదిగాదు. ఏము వాసు
దేవుని మున్నిడికొని నడతుము గావున, నీయుద్ధంబున జయంబు మాకు
సిద్ధంబ. ఎల్లభంగులం గర్ణసహితంబుగా గాంధారీనందనులం దునిమి
యేము భూమి గొనుట దప్పదు. [1]గాండీవంబు దివియకయును గుడుసు
పడియెడు; బాణంబులు దమయంతన తూణీరంబుల వెడలెడు. తో
లూడ్చు మహానాగంబునుంబోలెఁ గరవాలంబు దాన యొఱ వెలికి
నిగుడుచున్నయది; గావున, మా కవశ్యంబును సంగరంబు సంభ-
వించు. పాశుపతాదిదివ్యశరంబులం గురుపక్ష ప్రజాక్షయంబు సేసి
శాంతిం బొందెదము. సూతనందనా, నీవు సుస్థిరుండ వై యింత
యుం దెలియం బలుకవలయు. ఇమ్మాటలు విని కురువృద్ధుం డగు
బాహ్లికుండును, పితామహుం డగుభీష్ముండును, గురుం డగుకుంభ
సంభవుండును, శిక్షకుండగు కృపాచార్యుండును, గురుపుత్త్రుం డగు
నశ్వత్థామయు, సద్బుద్ధి యగువిదురుండును, ధర్మాచరణకల్యుం డగు
శల్యుండును నెయ్యది నిశ్చయించి పలికి రది యయ్యెడు. సుయోధ

1. గాండీవంబు దివియకయును గుడుసుపడియెడు = బిగింపకయె గుండ్రముఁ జుట్టుకొను
చున్నది.

నాదు లాయుష్మంతు లగువార కాక !" అని పలికె". నని చెప్పిన
విని, మందాకినీనందనుం డంతఱు విన దుర్యోధనున కి ట్లనియె : ౧౪౬

సీ. "నలినగర్భుండు పెద్దకొలువున నున్నెడ,
సురపతిప్రముఖులచూడ్కు లెల్ల
మెఱయు తేజంబున మిఱుమిట్లు గొన నిద్ద
ఱచ్చట నొరసికొం చరుగఁ జూచి,
'వీ రెవ్వ, రిమ్మెయి మీ రుండ నగకు నే
యనియట్లు వో యెదునట్టివార ?"
లని బృహస్పతి బ్రహ్మ నడిగిన, నతని కి
ట్లనియె నాచతురాస్యుఁ డాదరమునఁ:
తే. 'దపము పెంపును బలశౌర్యదర్పములును
గలిగి లోకహితార్థంబుగాఁ జరింతు
రేయుగంబున నరుఁడు నారాయణుండు
ననఁ బ్రసిద్ధికి నెక్కినమునులు సుమ్ము !' ౧౪౭

వ. అని పలికి నెండియు, ౧౪౮

క. 'అనిమిషహితము దనుజనా
శనమును జేయుదు ; రధర్మసంగ్రామము గ
ల్గినచోట ధర్మపరు లగు
జనముల గెలిపింతు రధికసంరంభమునన్. ౧౪౯

వ. దేవాసురయుద్ధంబునప్పు డిందు్రుండు వోయి, వీరి నారాధించి తో
డడిగినం, జనుదెంచి పౌలోమ కాలకేయాదు లగుననేకదైత్యదానవు
లం జంపి యిందు్రునకు విజయంబు గావించిరి. అది మొదలుగా
వీరల నెల్లవారలు నెఱింగి యుండుదురు. ఇది యొక్క తేజంబ రెండు
దెఱంగు లై వెలుంగుచుండు ' నని చెప్పె. వినోదార్థంబు జన్మాంత
రంబునొందిన యమ్మహాత్ములుగదా యీయర్జునుండును వాసుదేవుం
డును ! అర్జునుండు సముద్రతీరంబున హిరణ్యపురంబు వొడిచి

నివాతకవచుల నణువడి నేపుర నిర్జించి పర్జన్యునకుఁ బ్రియంబు సేసె. వాసుదేవు పరాక్రమంబు గంస నరకాసురప్రముఖ నిఖిలదుష్టనిగ్రహంబునం బ్రసిద్ధంబు గాదె? తెలియ విను మున్న రూపు సెప్పెద:

క. ఆయిరువురు నొకతలనై
[1]యాయోధనమునకు నడచునట్టిద యేనిన్
వే యేల మనక కా, దెదు
రై యెద్దెఱుఁ దాఁక హరునకైనను వశమే? ౧౫౧

క. సారథియు రథియు నై యొక
తేరం [2]గృష్ణు లతిఘోర తేజస్స్పార
స్ఫారతఁ దోఁచిన నైనను
ధీరత వాటించి చూచి తెలిసెదవు బలే!" ౧౫౨

వ. అనుచు నాసుయోధను నుపలక్షించి శాంతనవుండు మఱియు నిట్లనియె:

క. "మది నామాట కొంకింతయు
బెదర, వకార్యంబునందుఁ బ్రియము గలిగి యుం
డుదు, కౌరవులకుఁ గాలము
తుదియో, కా కిట్టిగర్వితుని నే మందున్? ౧౫౪

తే. హితము లగునాదువచనంబు లిపుడు వినని
వాఁడ వై తేని, నప్పుడు 'వారు వడిరి;
వీరు వడి' రనుపలుకులు విందు గాక;
శకుని కర్ణ దుశ్శాసనుల్ సమ్మతింప! ౧౫౫

వ. దుష్ట కష్ట నికృష్టాత్ము లగు నిమ్మువ్వురుఁ జెప్పెడు బుద్ధులుగాని యొండు విననొల్లవు. ఏమి సేయ వచ్చు!" అని పలికినం, గానీనుండు గనలి గాంగేయున కిట్లనియె: ౧౫౬

1. ఆయోధనమునకు = అపోరికి. 2. కృష్ణులు = కృష్ణుఁడు అర్జునుఁడును. [అర్జునునకును ద్రౌపదికిని 'కృష్ణ' నామము ప్రసిద్ధమగుట గ్రహించునది.]

ఆ. "ఇట్టు లాడఁ దగునె, యే నేమి సేసితిఁ?
గొలిచి కుడుచుపాడి నలవుఁ జలముఁ
బలుకు టెందు నెగ్గె? పత్నికిఁ బుత్త్రులకును
మనుమలకు హితంబ యొనర నడతు. ౧౫౭

కం. కాని తెఱఁగైన నింతటి
మానిసిఁ గా నేల చేయు మనుజేంద్రుఁడు న?
న్నీ నెఱి దప్పినమాటలు
నీకోరన్ వెడలఁ దగునె నిండినసభలోన్?" ౧౫౮

వ. అనిన విని, భీష్ముఁడు ధృతరాష్ట్రున కిట్లనియె: ౧౫౯

—: భీష్ముఁడు కర్ణుని దుర్ణయంబు ధృతరాష్ట్రునితోఁ జెప్పుట :—

తే. "ఒకట నైనను వారియం దొకరిలోని
[1]చిదురపాలును బోలఁడు; సిగ్గు లేక
'పాండవుల గెల్తునే' నని పలుకుచుండు;
[2]పీనిరజ్జులు దులువలు వీండ్రు తగిలి! ౧౬౦

కం. మగఁటిమి వారికి వీఁ డెదు
రుగ నమ్మి, సుయోధనుఁడు విరోధము గొని, స
ర్వగుణాఢ్యులు బలవంతులు
నగుపాండు నృపాలసుతుల నవమానించెన్. ౧౬౧

ఉ. ఒక్కఁ డొకం డనేకవిధయుద్ధజయంబులు గొన్నవారు వా
రిక్కడ నేమి సేసె నితఁ? డీతని తమ్ముని గూల నేసి యు
క్కెక్కినపార్థుపైఁ గవిసెనే? పసు లాతఁడు గ్రమ్మఱింపఁగా
నక్కడ లేఁడె వీఁడు? భవదాత్మజుఁ గోల్పడె ఘోషయాత్రలోన్?

1. చిదురపాలు = చిన్నితునుకంత. 2. పీనిరజ్జులు = పొల్లుమాటలు.

వ. ఈదుర్జాతుండు కర్జం బెఱుంగక నీతిబాహ్యుండై వలసినట్లు వ్రేలరి మాటలాడుచుండు; నీవును గైకొని విను చుండుదువు. మేల కాక !" అనిన భీష్మపలుకులు విని, ద్రోణుం డమ్మహారాజుతో ని ట్లనియె : ౧౬౩

ఉ. "శాంతనవుండు సర్వకురుసంతతికిం గలవాఁడు గాఁడె? అ త్యంతహితంబు లీపలుకు; లాహవ మొప్పదు. ధర్మసూతితోఁ [1]బాంతువ మేలు. దేవపతిపుత్త్రుఁడు సంజయుతోడ నాడిన ట్లంతకు నోపు. మీఁకుఁ దెలియం దగు ఖాండవదాహ మాదిగాన్.

ఆ. శరశరాసనములు ధరియింప రెట్టు లె వ్వరును? మగతనంబు వలనఁ గలిగి కయ్యమున జయంబు గైకొనరే యొరు? లర్జునుండ విజయుఁ డనఁగ నెగడె! ౧౬౪

క. మనపీటన కాఁ, దయ్యా ర్జునునకు సరిసేంటివానిఁ జూడఁగ లోకం బున నెందు లేమి దెల్లం; బనుమానము లేదు; తోడర నగునే వానిన్ !" ౧౬౬

వ. అని చెప్పి, యప్పాటం బరమహితోపదేశంబు సేసిన భీష్మద్రోణుల పలుకు లాదరింపక, వారికి సదుత్తరంబు లీక, వారలతోడం దదను రూపంబుగా సంభాషింపక, ధృతరాష్ట్రుండు వెండియుఁ బాండవుల వలనివార్త లడుగుటకు సంజయుదిక్కు మొగం బైనం జూచి; కురు పక్షవీరు లందఱుఁ బ్రాణంబులదెస నిరాశులై యుండిరి. అమ్మహీ పతి సంజయునితో ని ట్లనియె ; ౧౬౭

1. శాంతువ మేలు = శాంతు - కూడిక - మంచిది.

తే. "ధర్మపుత్త్రున కిక్కడి తలఁపుభంగి
యెట్టు లుండు? నీ సైన్యంబు లెల్లఁ గూడి
యునికి విని యెనే? ఎవ్వరిఁ గొని యతండు
కౌరవులమీఁద నెత్తిరాఁ గలుగువాఁడు? ౧౬౮

వ. అనిన విని సంజయుండు వెచ్చనూర్చి, ఱిచ్చవడి, మూర్ఛ వోయిన చందంబున డెందంబు మగుడం జేష్టలు దక్కియుండి, కొండొకసేపునకుఁ జిత్తంబొక్కింత సేసికొని, "యక్కటా! యీభూపాలుం డింత వేల యగునే? యుధిష్ఠిరుం డెవ్వరిఁ గొని యెత్తివచ్చువాఁ డని యడుగుచున్నవాఁడు! ఇంత యెఱుఁగనివాఁ డెంత సెప్పినను దెలియ నేర్చునే? ఇతని భంగి యిట్టిదనినఁ, గొడుకుల తెఱంగు వేఱ యెన్న నేల? ఏ నింక నే మనువాఁడ? ఐనను నన్నడిగిన మాటకుం దగిన మాఱుమాట పలుక వలయును గాదే" యని తలంచి ధృతరాష్ట్రున కి ట్లనియె: ౧౬౯

చ. "వినుము నరేంద్ర, పాండుపృథివీపతి యగ్రసుతుండు సంధి సే
యన మదిఁ గోరు; మీరు సమయవ్యసనంబును భూమి యీక త
క్కిన మఱికాని ముంద రొకకీడుఁ దలంపఁడు; మీ బలంబు నె
ల్లను [1]మదిఁ జీరికిం గొనఁడు, లావున నేలఁ గొనం దలంచినన్. ౧౭౦

వ. అతం డెవ్వరిం గొని యెత్తివచ్చువాఁ డని యడిగితివి; నీ యెఱుంగని వార లం దెవ్వరు గలరు? అవధరింపుము : ౧౭౧

మ. బకవిధ్వంసి జటాసురాంతకు హిడింబప్రాణహారిణుఁ గీ
చకనిర్మూలనకేళిలోలు సమరోత్సాహైకశీలప్రవ
ర్తకు నాగాయుత సామ్యకీర్తితబలోదగ్రుం బ్రతివ్యూహదా
హకు భీముం గొని వచ్చు ధర్మజుఁడు బాహాటోపముం జూపఁగన్.

వ. మఱియును— ౧౭౩

1. మదిఁ జీరికిం గొనఁడు = మనస్సున లెక్కకుఁ గొనఁడు — లక్ష్యము సేయఁడు.

మ. అట మిన్నందినయట్టివాని పొడ వెంతన్నట్లు ఫాలాక్షు నె
క్కటికయ్యంబునఁ గన్న ఫల్గును భుజాగర్వంబు లెక్కించు ; టం
తటి వానిం గొని, ధర్మసూతి సమరోత్సాహంబుమై నె త్తి వ
చ్చుటకుం గొంకునె ? వీఁపు సక్కనయి నిల్పుంగాక మీసైన్యముల్.

తే. నకులు సహదేవుఁ గొని ధర్మనందనుండు
మొనసి కౌరవబలముల ముట్టికొనఁగఁ
దలఁచి తఱి వేచి వచ్చుట, ధరణినాథ,
సింగములఁ బట్టి వేఁటాడుభంగి గాదె ? ౧౭౫

తే. ద్రౌపదేయులు, నాసుభద్రాసుతుండు
నుక్కుతునియలు గారె ? మి మ్మక్కుమార
వరులఁ గొని యోర్చువాఁ డయి వచ్చు ధర్మ
పుత్త్రుఁ ; డిది నీకుఁ జూడంగఁ బోల దెట్లు ? ” ౧౭౬

వ. అని చెప్పి వెండియు ని ట్లనియె : ౧౭౭

క. వృష్ణికుమారోత్తముఁ డా
కృష్ణునితమ్ముండు సాత్యకియు, దవదహనా
త్యుష్ణప్రతాపదీప్తులు
[1]కృష్ణాసోదరులుఁ దలఁపఁ గేవలులె, నృపా ? ౧౭౮

సీ. శౌర్యోజ్జ్వలుండు పాంచాలభూనాథుండు,
మహితవిక్రముఁ డగుమత్స్యవిభుఁడు,
నధికశ్రద్ధాన్వితు లతని తమ్ము, లుదగ్ర
తేజస్కులైన తదీయసుతులు
నన్నదమ్ములు, ప్రతాపోన్నతు లేవురు
కేకయపతులు, నక్షీణ బాహు

1. కృష్ణాసోదరులు = ద్రౌపదితోఁబుట్టువులు.

శక్తియుక్తులు జరాసంధసూనుఁడు సహ
దేవుండు నాజయత్సేనవిభుఁడు,
తే. వినుము, శిశుపాలతనయులు వీరధనులు
ధృష్టకేతుండు వృషభుండుఁ, దీవ్రరణవి
నోది యదుభర్త చేకితానుండు, దర్ప
ఘనుఁడు శైబ్యనృపాలుండుఁ గలరుగాదె? ౧౭౯
క. వీ రెల్లఁ బాండురాజకు
మారులపాలునకుఁ గుందుమనములతోడన్
వారిపగ దీర్ప గడఁగెదు
వారల కా కందు లాఁతివారుం గలరే? ౧౮౦
వ. భీమసేనుసూనుండు ఘటోత్కచుండు దండ్రికంటెను లావును బీరంబునుం గల వాఁడు; మాయాబలంబున మనబలంబు నెల్లం గలంచు. మఱియును, దూర్పున నుత్తరంబునం గలుగునరనాయకులు, నానాసేనాసమన్వితులయి వచ్చి [1]చిచ్చయిననుం బిడికిలింత మనుచున్న వారు. అదియునుంగాక — ౧౮౧
క. సకలభువనములు నడచే
తికిఁ దేరంజాలునట్టిధీమంతుఁడు దే
వకికొడుకు గలఁడు ధర్మజు
నికి; నాతం డెత్తి రాక నిలుచునె, యధిపా!" ౧౮౨
వ. అని చెప్పిన సూతపుత్త్రునకు నంబికాపుత్త్రుం డిట్లనియె: ౧౮౩

—: ధృతరాష్ట్రుఁడు భీమసేనాదుల పరాక్రమంబు దలంచి దుఃఖించుట :—

క. "ధారిదెస నీదు సెప్పిన
యారథికులు ప్రబలు లగుదు రందఱు; నైనన్
వా రెల్లను నొకతల, య
మ్మారుతి యొకతల బలప్రమాణము సూడన్. ౧౮౪

---

1. చిచ్చయిననుం బిడికిలింతము=అగ్ని నయినను పిడికిటఁ బట్టుదుము.

ఉ. భీముఁ దలంచినన్ మనము భీతిఁ గలంగుచు నుండు నాకు, రే
లేమియు నిద్ర రా; దతని నేత్తెఱ మార్కొనఁ జాలునట్టివాఁ
డీమొన లేఁ; డతం డలుక నెత్తినయాగద కాలదండ; ము
ద్దామవిలాసుఁడై కురుకదంబములో విహరింప కుండునే? ౧౫౫

తే. చిఱుతనాఁడును వాఁడు నాశిక్షఁ బోఁడు;
వీరు చివ్వకుఁ జొత్తురు వైర మెత్తి;
వానిచేఁ బీడ వడియును మాన; రదియ
కాదె యీభేదమున కెల్లఁ గారణంబు. ౧౫౬

క. సమరమున దైత్యదానవ
సమితియు నాతని కెదుర్పఁ జాలదు; భుజయు
ద్ధమున జరాసంధుని నొక
నిమిషంబునఁ జంపె; నొరులు నిలుతురె యెదురన్? ౧౫౭

మ. బొమ లల్కన్ ముడివడ్డ, రౌద్రిరస ముప్పొంగం, దనర్పన్ భుజా
గ్రము, లిం దెవ్వఁడు నాకు మాఱనుచు శౌర్యస్ఫూర్తి శోభిల్ల, దు
ర్దమలీలం గవియంగ భీముఁ గని, ధైర్యం బేది కౌరవ్యసై
న్యము లంతంతఁ గలంగఁ బాఱినటులై నామోమునన్ వ్రేలెడిన్.

క. కరవాలము గద మొదలగు
పరికర మేమియును లేక, బాహుబలమునం
గరిగతి నడరినను వృకో
దరునకు నొకఁ డెదుర నిలిచి తలపడువాఁడే? ౧౫౯

తే. ప్రళయకాలసముద్రముభంగిఁ బొంగి,
కడు భయంకరుఁ డగుభీముఁ గడవ నీఁద
వశమె నాపుత్త్రులకు? విధి వశము వొంది
యెదిరిఁ దమ్ముఁగను నెఱుఁగరు మదముకతన. ౧౬౦

క. చిచ్చునకుఁ దోడు కరువలి
వచ్చుగతిన్, భీముదుర్నివారవిహారం

బచ్చుపడఁగఁ బ్రాపై, వి
వ్వచ్చుఁడు వెనవచ్చు గాండివంబును డాన్గఁ. ౧౯౧

వ. సంజయా, వినుము నీ కున్న చూపు సెప్పెద. ౧౯౨

క. ఆయర్జునుమగఁటిమి కెన
యేయుగములఁ జూడ వినఁగ నెందును గలఁడే?
నీయెదుర నాడినంతయుఁ
జేయుట కతఁ డోపు; రిత్త సెప్పెడువాఁడే? ౧౯౩

ఉ. ఎక్కటిగాండివంబు నతి కెక్కె వెలుంగుట! మీఁదఁ గేశవుం
డక్కజమైన తేజ! మది యాసపడండు, దనంత నర్జునుం
డొక్కఁడ వైరి సేనలకు నొట్టిన మంట! ప్రతాపమూర్తు లి
ట్లొక్కెడఁ గూడె, నిన్నిటిమహోగ్రపు వేఁడిమి కోర్వవచ్చునే! ౧౯౪

క. దివిజ దనుజ సహితము లగు
భువనము లన్నిట మహేంద్రపుత్త్రుఁడు విజయో
త్సవలీలఁ గ్రీడ సల్పుం;
దవులంబడఁ డెందు నత్యుదగ్రబలమునన్." ౧౯౫

వ. అని పలికి వెండియు, ౧౯౬

క. "కురుసేనఁ గదా గెలుచుట
కరము భరం బర్జునునకు! గాండీవమునం
బెరిఁగినయమ్ముల మంటల
దరికొని తెగఁ గాల్చునట్టిదయ యగుఁ జుమ్మీ. ౧౯౭

వ. భీమార్జునుల కొలందులు భీష్మద్రోణు లెఱుంగునంతకంటె నెవ్వ
రెఱుంగుదురు? ఎఱింగియు మానుషంబు వాటించి సేనమొగంబున
నిలుతురు; కీర్తి వట్టి ప్రాణంబులు విడుతురు. ఇంతియకాని చేయు
నదిలేదు. అదియునుం గాక పౌత్త్రులగుటయు శిష్యులగుటయు,
గాంగేయునకు గురునకు సామాన్యం బగుటంజేసి, రెండుదెఱంగుల

వారికి పీ రొక్క_రూప. మనకడ నున్నతప్పునకు మనముందట నిలువ వలయు నను నింత మాత్రికుం గా వీరల కింత వలసె. నేను దైవా ధీనతకతంబున బిడ్డల నొత్తి చెప్పను నియమింపనుం జాల. మొదల విదురుం డే మని చాటి చెప్పె నది యంతయుం బాటిలె. జూదంబు నాఁటనుండియుఁ గురుజాతికిం జేటు మూఁడుట దోఁచుచుండు. మంద బుద్ధియు లోభోపహతుండును నయి దురభిలాషంబున దుర్యోధనుఁ డింత సేసె. కాలపర్యాయంబునఁ గౌరవులకుఁ గడవరానియవస్థ వచ్చె. సంజయా, నే నేమి సేయుదు, నెందుఁ జొత్తు? ఎద్ది దెరువు, ఎవ్వరు శరణంబు? [1]వా రిరువురుఁ గలయంతటన పోయెనే? విను" మని మఱియు ని ట్లనియె: ౧౯౮

చ. "అనుజులు నట్టివార; ద్రుపదాదిసుహృజ్జను లెల్ల నంతకం
బును బలవంతు; లాహవపటిష్ఠుఁడు రాజు యుధిష్ఠిరుండు స
ద్వినయవివేకశీలముల విశ్రుతుఁ; డాతఁడు బంధుభృత్యులం
దనకు వశంబు సేసికొనుదానికి నేర్చుఁ బ్రభుత్వసంపదన్. ౧౯౯

ఆ. సత్య శౌచ ధర్మశాలి దయాపరుం;
డట్టి ధర్మపుత్రు నాక్రమింప
మనము దలఁచు టెల్ల మంటలో మిడుతలు
దగిలి వ్రత్తినుఱుకఁ దలఁచునట్లు. ౨౦౦

వ. కావునఁ, బాండవులతోడి భండనంబునఁ గులక్షయం బగుట దప్పదు. శాంతిఁ బొందుటయ మేలు. మనవారల కది ప్రియం బగు నేని దానికిఁ దగిన యత్నంబు సేసెద" ననిన విని, ధృతరాష్ట్రునకు సంజయుం డి ట్లనియె: ౨౦౧

క. "దేవర యాసతి యిచ్చిన
యీవాక్యము లెస్స; నాఁడు నీవ యుపేక్షం

---

1. వా రిరువురుఁ గల యంతటన పోయెనే = ఆ భీమార్జునులు ఉన్నంతనే సరిపోయెనా?

బో విడిచితి; వింకను నీ
చే వత్తురు వారు; వీరిచే టొప్పదురే? ౨౦౨

వ. అది యెట్లంటేని – ౨౦౩

క. [1]వారు దెస లాక్రమించియు ధ
రారాజ్యం బిచ్చి పోయిరా పోరా? తా
రారణ్యపీడఁ బడియును
రారాజుం జెఱకుఁ బాపరా మన మెఱుఁగన్? ౨౦౪

వ. అట్టియెడ నైనను – ౨౦౫

క. [2]రావించి తగవుమై సం
భావింపవ కాక, నాఁడ పాండవు లలుకం
బో విడువరె? మిగులుదురే
నీవచనంబులకుఁ? బిలిచి నిలుపుము వారిన్." ౨౦౬

—: దుర్యోధనుఁడు తండ్రితో స్వపక్షవీరులసామర్థ్యంబు సెప్పుట :—

వ. అనిన విని, దుర్యోధనుండు దండ్రి కి ట్లనియె : ౨౦౭

చ. "అడవులఁ గొండలం బడి మహాపద లూ పడి చన్నవారి ని
ప్పుడు గొని వచ్చి, కృష్ణుఁ డొకప్రోవుగఁ [3]గూటువమూఁకఁ గూర్చినం
[4]బొడుతురె పాండునందనులు? భూవర, యేటికి నింతభీతి? [5]మా
కడిమియు లావు నీ వసదుగా గణుతింపకు; గెల్తు మెమ్మెయిన్.

---

1. వారు...పోరా? = పాండవులు దిక్కులాక్రమించియు ధరారాజ్యంబు మీ కిచ్చి పోయిరా లేదా? వారు అరణ్యముల మ్రగ్గుచుండియు, మన మెఱుఁగఁగా, (గంధర్వులనుండి) రారాజును (దుర్యోధనుని) చెఱబాపలేదా?
2. తా. వారి రప్పించి ఉచితగతి నాదరింపవయితివి కాని, నాఁడే పాండవులు కోపము డిగ్గ విడువకుందురా? నీమాటలను మించిపోవుదురా? ఇప్పుడయిన వారినిఁ బిలిచి నిలుపుము.
3. కూటువమూఁకఁ గూర్చినన్ = అప్పటికప్పుడు జతపఱచిన శిక్షణములేనివారి గుంపును గూర్చినను. 4. పొడుతురె పాండునందనులు = పాండురాజకుమారులు సంగర మొనర్తురా? 5. మాకడిమియు...గణుతింపకు = మా పరాక్రమము బలము తక్కువగా లెక్కింపకుము.

తే. పరశురాముని గెలిచిన బల్లిదుండు
భీష్ముఁ; డవనీశ లీతని పేరు వినినఁ
బాఱుచుండుట యెఱుఁగవే? పాండుపుత్త్రు
లనఁగ నెంతటివా రితం డలిగెనేని? ౨౦౯

క. కృపుఁడును గురుఁడు నయోనిజు,
లపరిమితభుజాబలాఢ్యు, లాహవకేళీ
నిపుణు, లజేయులు; వీరలు
కుపితాత్ములు లైన మాఱుకొనునే హరుఁడున్? ౨౧౦

క. ఈశ్వరవరజనితుఁడు, [1]హరి
దశ్వప్రతిమానతేజుఁ, డస్త్రకళాని
త్యైశ్వర్యధురంధరుఁ, డీ
యశ్వత్థామ గలుగ మన కని వెఱ పేలా? ౨౧౧

ఆ. సహజకుండలుండు, శౌర్యధుర్యుఁడు, సము
దీర్ణబాహుబలుఁడు గర్ణుఁ డిందుఁ
గలఁడు; వీని కెదురు గలఁడని యెన్నమా
ధర్మపుత్త్రుపాల, ధరణినాథ. ౨౧౨

క. వినుము నరేశ్వర కర్ణుని
పెనుపు, మహేంద్రుండు వచ్చి ప్రియమున శచికై
తను నర్థింపఁగ నిచ్చెను
గోను మని లోకంబు లెఱుఁగఁ గుండలయుగమున్. ౨౧౩

వ. వీర లాధర్మపుత్త్రాదులచేతన కాదు – ఎవ్వరిచేతనుం జెడమి దెల్లంబు. బాహ్లిక సోమదత్త భూరిశ్రవ శ్శల్య సింధురాజ గాంధారరాజ ప్రభృతిమహావీరులు వీరలకంటెను శక్తి సమగ్రులు. తక్కటిరాజలోకంబును, సహాయులై వచ్చిన వివిధదేశాధీశులును, నాతోడిసుఖ

---

1. హరిదశ్వప్రతిమానతేజుఁడు = పచ్చని గుఱ్ఱములుగలవాని – సూర్యునితోఁ బోల్పదగిన తేజస్సుకలవాఁడు.

దుఃఖంబుల కియ్యకొని, యగ్గలికమై నగ్గి నైన నఱుకను, సముద్రంబైన నీఁదను దెంపు సేసి [1]పొంపిరి వోవుచున్నవారు. కావునఁ బాండవులకు మా దిక్కు దేఱి చూడనుం గొలంది గాదు. అనుమానింపకుము. ఇట్లునుం గాక మాకు నెవ్వరును లేక, చుట్టంబులును జెలులును విడిచి, తోడువచ్చినవారును విచ్చి పోయి, భృత్యులును విరక్తులై, వారిక పోటుమానసులును, బంధుమిత్త్రి సహాయులును, బ్రజానురాగంబునుం గలిగినట్టి దైన నది ప్రాప్తకాలంబు. ఇంతియ కాని యేమింక వారియడుగు లొత్తను, బాఱి పోవనుం జాలము. ఎల్లభంగుల సమరంబు సేయుదుము. తలపెట్టిన నాతలంచిన ట్లొండె, వాసుదేవుండు దలంచిన ట్లొండె నయ్యెడు. ఎట్లైన మేలు. ఇంత వట్టును నిర్ణయంబు" అని పలికి, మఱియు ని ట్లనియె. ౨౧౪

తే. "కులములోఁ దలవం పగుకూడు గుడువఁ
బంపఁ జూచెద, వొకళుల బఱతురట్టె!
వారు పై నెత్తి వచ్చినఁ 'బోరి కోప'
మనిన, ధృతిచేట కాక, పొందగునె చెపుమ? ౨౧౫

క. [2]నీవు బతిమాలి కొడుకుల
చావునకును జేటునకును [3]జాలక, యిమ్మై
[4]వావిడిచి యఱచినం గడు
[5]నేవపడరె జనులు, నిన్ను నే మన నేర్తుఁ? ౨౧౬

తే. భీమసేనుని నీ వింత పెద్ద చేసి
పెక్కుభంగులఁ జెప్పితి '[6]యుక్కు గలఁడు;

---

1. పొంపిరిపోవుచునున్నవారు = విజృంభించుచున్నారు. పొంపిరివోవు = (దే. అ. క్రి) అతిశయించు; వ్యాపించు; విజృంభించు; సంతోషించు; పుట్టు; ప్రసిద్ధికెక్కు.
2. నీవు బతిమాలి = ...దైన్యమున వేఁడికొని. 3. చాలక = సైపలేక. 4. వావిడిచి = నోరువిడిచి. 5. ఏవపడరె = రోఁతపడరా? 6. ఉక్కుగలఁడు = శౌర్యముగలవాఁడు.

[1]గదకు నేర్పు' నం-చెంతయు బెదరె; దతఁడు
నన్నుఁ బోలమి యెఱుఁగవే, నరవరేణ్య? ౨౧౮

మ. గద నాతో సరి మూఁడులోకముల నేఁ గానం; జలం బెత్తి యు
న్మదుఁ డాభీముఁడు న న్ననిం దొడరిన, న్వజ్రిప్రహారంబు బె
ట్టిద మై తాఁకినఁ గూలుపర్వతముమాడ్కిం గుంభినిం గూల వ్రే
సెద! నాకోర్కి గదా, గదారణము వచ్చెం బెద్దకాలంబునన్!

ఆ. అతఁడు వడిన, వెండి [2]యాసేనఁ గోల్తల
సేయ నొకఁడు లేమి సిద్ధ; మింత
యెఱిఁగి వెఱచి కాదె 'యేనూళ్లైనను
దమకుఁజాలు' ననియె ధర్మసుతుఁడు. ౨౧౯

వ. అర్జునుండు గలం డని తలంచితి వేని — ౨౨౦

తే. కర్ణుపడసినయాశక్తి గలుగఁ, బోర
బ్రదుక వచ్చునె నరునకు? నదియుఁ గాక,
యతని భీష్మాదిరథికులయతులితాప్ర
మేయదివ్యబాణంబులు మ్రింగి కొనవె? ౨౨౧

వ. దుశ్శాసన దుష్ప్రహ దుర్ముఖ వివింశతి వికర్ణ చిత్రసేనాదు లగు నీకొడుకు లొకం డొకండ జగంబు లెల్ల జయింపఁ జాలుదురు. అందఱు నొక్క మొగంబై తోఁచినడచిన సవ్యసాచి నొక్కరున కాదు, పాండవుల నెల్ల నొక్కత్తున వైచికొన నోపుదురు. అర్జునుం గాక, మాకు నక్షౌహిణులు పదునొకండు; వారికి నే డక్షౌహిణులు మాసైన్యంబు సారవంతంబు; వారిబలంబు నిస్సారంబు. వారు మ మ్మెవ్విధంబున జయింప నోపుదురు! ఈయెక్కువ దక్కువలు విచారింపక వలవనివెఱపు గట్టికొని [3]ముకూర్కి వగచు చున్నవాఁడవు.

1. గదకు నేర్పు = గదయందు నేర్పరి. 2. ఆసేనఁ గోలలసేయ నొకఁడు లేమిసిద్ధము = ఆసేనలో నెదుటనిలిచి తలపడువాఁడు — ఎసగొల్పువాఁడు — లేఁడనుట తెలిసియే యున్నది.
3. ముకూర్కి = తెలియక — అజ్ఞానమువలన.

నిన్ను వగవ కుండ నుడుపం జాల మంతియ కాని, తక్కెల్ల పను
లకుం జాలుదుము." అని పలికి, సంజయుదెసం గనుంగొని, సుయో
ధనుం డి ట్లనియె: ౨౨౨

క. "నానాదేశంబుల బలు
మానవులం గూర్చికొని సమత్సరబుద్ధిం
దా నే మనియెడు నయ్యమ
సూనుం, డాతని తెఱంగు సూతము చెప్పుమా?" ౨౨౩

వ. అనిన విని, సంజయుం డి ట్లనియె: ౨౨౪

—: సంజయుండు సుయోధనునకు ధర్మరాజునిశ్చయం బెఱింగించుట :—

ఉ. "ఆతఁడు భండనం బనిన నార్చిన మూరెఁడు వేర్చు; నెంతయుం
బ్రీతి వహించి తమ్ము లొకపెండ్లికిఁ బోయెడునట్ల యున్నవా;
రా తెలి వెందునం గలదె? అందలి నాయకు 'లెప్పు డొక్కొ మా
చేతులతీఁట పుత్తు?' మనుచి త్తము గాని చలింప రేమియున్. ౨౨౫

తే. నరుని పాశుపతాది బాణముల పెంపు,
భీము గదసొంపు నమ్మి, యుద్దామలీలఁ
జెలఁగి వెఱ పేది యక్కడి బలము మునురు
గవిసి యెప్పుడుఁ గయ్యమునకుఁ గాలు ద్రివ్వు." ౨౨౬

క. నావుడు, "నిది యేమా, సంజయ,
కైవారము సేసె దీవు కౌంతేయుల. [1]వా
రేవి రణసాధనమ్ములు
గా, వెఱవక నడచువారు కౌరవులపయిన్?" ౨౨౭

వ. అనిన, సుయోధనునకు సూతనందనుం డర్జునుదివ్యరథ శ్వేతాశ్వ కపి
ధ్వజ దేవదత్తంబుల మహానుభావంబులు వేఱువేఱ వర్ణించి చెప్పి,

1. వారేవి రణసాధనమ్ములు గా = ఏవి రణసాధనములు కాఁగా – ఆయుధములుండఁగా –
వారు...

యుధిష్ఠిర భీమ నకుల సహదేవులయరదంబులు, దురంగాదిపరికరంబు లిట్టిట్టి వని యేర్పడం బలికి, విరాట ద్రుపదాదులకు వలయు నుపకరణంబులు గొలంత లేమియు నెఱింగించిన, — ధృతరాష్ట్రుండు, "ఇందుఁ గల బలు మానసు లెవ్వరికి నసాధ్యులు. వీరి సాధించు తెఱంగూహించిరే?" అని యడిగిన నతనికి సంజయుం డి ట్లనియె :

సీ. "గంగాసుతుండు శిఖండిపా, లతనికిఁ
బ్రాపు మత్స్యేశ్వరుబలము ; కుంభ
భవుఁడు ధృష్టద్యుమ్నుపా, లతనికిఁ దోడు
పడు ద్రుపదీపుత్త్రపంచకంబు ;
రారాజుఁ దమ్ములు మారుతిపాలు ; కు
మారు లందఱు నభిమన్యుపాలు ;
[1]శకుని సైంధవులు, నశ్వత్థామ కర్ణులు,
ద క్కొరుచే బోనిదండిమగలు

ఆ. సవ్యసాచిపాలు ; సాత్యకిపాల్కృత
వర్మ ; చేకితానవసుమతీశు
పాలు సోమదత్తుఁ ; డాలంబునకు నిట్లు
నిశ్చయించి రచట , నృపవరేణ్య. ౨౨౯

క. నకులుఁడు సహదేవుండును,
శకుని నలూకాదిసుతుల సారస్వతులం,
బ్రకటబలు లైన కాళిం
గకులను సమయించువారు ; కౌరవనాథా. ౨౩౦

క. కేకయులు మనలఁ గలసిన
కేకయుల జయించువారు ; కృతపుణ్యుఁడు సు

---

1. శకుని...సవ్యసాచిపాలు= శకునియు, సైంధవుఁడును, అశ్వత్థామయుఁ గర్ణుఁడును మఱి యొకరునిచేగెల్వ శక్యముకాని మహాపౌరుషశాలురను అర్జునుని వశము.

శ్లోకుఁడు ధర్మతనూజుఁడు
లోకోత్తరు శల్యుఁ డా గెలుచువాఁ డధిపా. ౨౩౧

వ. అట్టిపలుకుల సమయంబున నచ్చోట గొందఱు జనంబులు ధర్మనందను
నుద్దేశించి – ౨౩౨

క. 'ఇతఁ డెక్కడ? మద్రమహీ
పతి యెక్కడ? ఇతని కతఁడు పాటియె?' యనుడుం,
బ్రతివచనంబుల శల్యుని
యతిబల శౌర్యములు వారి కాతఁడ చెప్పెన్. ౨౩౩

వ. ఇట్లు గాకయు నెవ్వరిమొగంబున నెవ్వరు వడిరి, వారికి వార చాలి
యుండు వారనిరి. ఇవ్విధంబునఁ గొ)వ్వుమిగిలి కొఱంతలేని తెగువం
దేజరిల్లు చున్నవారు. నీకు నీకొడుకునకు నెయ్యది గర్జం బై తోఁచె
నదియ చేయుండు." అనిన విని, విచిత్రవీర్యతనయుం డిట్లనియె :

క. " నాకొడుకుల కెక్కడి బ్రదు?
కేకొలఁదిఁ దలంప నిప్పు డెన్నిన వీరా
నీకంబు నోర్వ వచ్చునె
యాకూడిన సైనికులకు; నే మనువాఁడన్? ౨౩౪

క. రాజు యుధిష్ఠిరుఁడై, హరి
దా జయ మొడఁగూర్ప నున్నఁ దత్సైన్యము రా
రా జిట్లు సరకు సేయమి,
నాజన్మము దుఃఖభాజనం బగుటఁ జుమీ! ౨౩౫

క. నాఁకుడుప నేల వశ మగు?
నీకూడిన భూపతులకు నింతియకాలం
బై కడచన్నది. సంజయ,
నీ కేవగ పేల? ఇంక నిలుపుము పలుకుల్." ౨౩౬

వ. అనిన విని, దుర్యోధనుండు నిజజనకుతో ని ట్లనియె : ౨౩౭

ఉ. "ఏమును బాండునందనులు నేకకులంబునఁ బుట్టి, యొక్క చో
నే మొకఁ డైనఁ జేసి [1]గడ నెద్ది చరించినయట్టివార ; ము
ద్దామబలంబు శౌర్యమును దర్పము వారిక కల్గి, వార సం
గ్రామమునన్ జయింతు రనఁగా నొకనిశ్చయ మెట్లు గల్గెడున్? ౨౩౯

ఉ. వారిని వారివారి నిటు వర్ణన సేసెదు గాని, మమ్ము మా
వారిఁ దలంప ; [2]ఇప్పుడమి వారికిఁ బాయను మాకు నంతయుం
జేరను మున్ సృజించె విధి—సిద్ధము. దీని నొకండు మాన్పఁగా
నేరఁ ; డకారణంబ మది నెవ్వగ లేటికిఁ బట్టుకొల్పఁగన్ ?" ౨౪౦

వ. అనిన విని, సూతనందనునకు నంబికానందనుం డిట్లను : "నాకొడు కున్మత్త ప్రలాపంబులు సేయుచున్నవాఁడు. ఇంతియ కాని సత్య ధర్మనయపరాక్రమ సహాయ సంపన్నులైన పాండవులఁ దనకు గెలువ వచ్చునే ? తాను బ్రబలుం డయినను బెనఁకువ గీడ కాక మేలగునే ? అది యట్లుండె — ఒక్కటి యడిగెద సంజయా, చెప్పుము. ౨౪౧

క. సమరమునకుఁ బురికొల్పుచు,
మముఁ దలఁచిన నుల్లి కుట్టుమాటలఁ దచ్చి
త్తము లుడికించుచుఁ, బాండవ
సమితిం గడఁగించువా రచట నెవ్వారొకో ?" ౨౪౨

క. నావుడు, సంజయుఁ డిట్లను :
"దేవా, పాండవులయలుక ధృష్టద్యుమ్నుం
డేవెరవుమాట నైనను,
[3]నే వోసినయగ్ని భంగి నిగుడం జేయున్. ౨౪౩

వ. అతఁడు ధర్మతనయుతో ని ట్లను : 'గాంగేయ కుంభసంభవాది మహావీర క్రూరసత్త్వ బహుళంబును, గరిఘటాగిరి కదంబకలితం-

---

1. గడన్ = జతగా. 2. ఇప్పుడమి...విధి = ఈపుడమిని వారు (పాండవులు) వదలుటకును, మాకుఁజేరుటకును మున్న విధి సృజించెను. 3. నే వోసిన యగ్ని భంగి = నేయి పోసిన అగ్గివలె నేగయు మండించును.

బున, దురంగనికరతరంగ పరంపారా ఘోరంబును నగు కౌరవసేనా సముద్రంబునకు నే నొక్క చెలియలికట్ట నై నిలిచెద ' — ననవుడు, నయ్యుధిష్ఠిరుండు, ' నీ వింతకుఁ జాలుట యెవ్వరు నెఱుంగరే? ఎల్లును సంగరంబున మ మ్ముద్ధరింపు ' మనియె. ఇట్లు గొనియాడిన, నాతండు నాదెసం గనుంగొని, ' సంజయా, మీవారల కెల్లనుం దెలియం జెప్పుము. ఈశ్వరాదిదేవతలు సమకట్టినసవరణ గల యర్జునుచేత నిర్జింపంబడిన యుత్కృష్టజాతు లనేకు లగుట యెఱుంగు దుర కాదె? మనుష్యు లతని కెంతపెద్ద? ఇట్టిజెట్టి వెన్ను దన్నిచూడఁ గలవాఁడు గావున, మముబోం ట్లెల్లఁ బోక పెనంగినం, బోరు భరం బైనం, బ్రాణంబులపై వచ్చు. అంతకంటెను బరముదయాపరుండైన పాండవాగ్రజుమఱువు సొచ్చి బ్రదుకుం డనుము. అంత లంతలు దప్పులు సేసితి మని తలంకవలవదు. ఎంతలు సేసినను, గాంగేయ పూర్వజుండు శాంతిసుధానిధి యగుటంజేసి, శరణు సొచ్చినం గాచు ' నని పలికె" ననిన విని, ధృతరాష్ట్రుండు దుర్యోధనున కి ట్లనియె:

క. " పరిజనులకు నీకును ని
ద్ధరలోన నగంబు సాలుఁ; దక్కటినగముం
గర ముచితంబుగఁ బాండవ
వరుఁ డగుధర్మజున కిచ్చి బ్రదుకుము నెమ్మిన్. ౨౮౫

—: ధృతరాష్ట్రుఁడు దుర్యోధనుతో సంధి సేయు మని చెప్పుట :—

చ. పెనఁకువ నాక యేల, మనపెద్దల కెవ్వరి కియ్యకోలు గా;
దనుచితవృత్తి గాన గురుఁ డాదిగ నాప్తులు బంధుమిత్రులున్
గొనకొని పోరికిం జొర; రకుంఠితతేజుఁడు ధర్మపుత్త్రుఁ; డా
తనిఁ దగఁ గూడి మన్కి ప్రమదం బగుఁ గౌరవజాతి కెంతయున్."

వ. అని వెండియు, ౨౮౬

క. " కర్ణుండు రేఁచి పెట్టఁగ,
దుర్ణయపరు లైనశకుని దుశ్శాసను లీ

నిర్ణయమొ మే లనఁగ, నీ
[1]కర్ణములకు నించు నెట్లు కార్యవచనముల్ ?" ౨౪౮

వ. అనినఁ గటకటంబడి సుయోధనుం డి ట్లనియె: ౨౪౯

క. "నీచెప్పెడి పెద్దలు ద్రో
ణాచార్యులు మొదలు గాఁగ నని క్రొల్లనివా
రై చేరనివారిం గొని,
యే చక్కంబెట్టువాఁడ నేఁ బాండవులన్ ? ౨౫౦

శా. రాధేయుండును దుస్ససేనుఁడును బోరం బ్రాపుగాఁ బాండవ
క్రోధజ్వాలల నార్తు; నొండొకఁడు నాకుం దోడె? నీ వింక నన్
బాధం బెట్టకు. వాఁడిసూది మొన మోవం జాలునం తైన నే
నీధాత్రీతల మీను వారలకు; [2]నా కే లింతసేగిం బడన్?" ౨౫౧

వ. అనిన గాంధారీవల్లభుం డతని కి ట్లనియె: ౨౫౨

ఆ. "నీకు నంత వగవ; నీపోవు తెరువునఁ
బోవువారు గాఁగఁ బూని యున్న
వారి కెల్ల నేను వగచెదఁ; గయ్యంబు
వలవ దుడుగుమయ్య చలముకొనక. ౨౫3

చ. ఉభయబలంబులుం బొగడ, నుగ్రత భీముఁడు విస్ఫురద్గదన్
రభస మెలర్పఁ గుంభములు వ్రయ్యఁగ వ్రేసిన, [3]నెత్తు రొల్కఁగా
నిభములపిండు [4]గావిసెలయేఱులతోడినగంబు లట్లు సం
క్షుభితము లై పయిం బఱవఁ జూచి, తలంచెదు నాదువాక్యముల్ !

చ. ఉఱక ధనంజయుండు వివిధోగ్రశరంబుల నొక్కమాత్ర నే
డ్తెఱ నుఱుమాడినం, బుడమిఁ ద్రెళ్ళిన నీ దగుసైన్య మంతయున్

---

1. కర్ణములకు నించు నెట్లు = చెవుల కెట్లు ప్రియమగును ? 2. నాకేల ఇంత సేగింబడన్ = ఇంత నష్టపడుట నా కెందులకు ? 3. నెత్తురొల్కగా నిభములపిండు = నెత్తురు ఉరలు చుండఁగా ఏనుఁగులగుంపు... 4. కావిసెలయేఱులతోడి నగంబులట్లు = ఎఱ్ఱని సెల యేళ్ళతో నున్న కొండలవలె,

నఱికినఁ బడ్డ ఘోరవిపినంబు విధంబున నున్నఁ జూచి, యు
త్తరతఱి నయినం దలంపు ముచితం బగునావచనంబుఁబుత్త్రకా!" ౨౫౫

వ. అని పలికి, యతనివలనం [1]బిక్కటగానక మనంబు మరలం బెట్టుకొని కొడుకులు జయింప నోపుదురో కో యనునాస, సంజయుదిక్కు మొగంబు సేసి పాండవ కౌరవ పక్షంబులం గలవారి నడుగుచుం, గొలందులు దలపోయుచు, నాతనివచనంబులం దన విచారంబులను బలాబలంబులు నిశ్చయించి, పాండవేయు లెక్కుడవుట యెఱుంగుచుఁ, గ్రిమ్మఱ నాసూతపుత్త్రితో లెక్కలు వెట్టుచుం, బోలించుచుఁ, బెద్దప్రొద్దు వితర్కించి, కౌంతేయులశక్తి దేవతలశక్తియు గాంధారేయులశక్తి మానుషశక్తియుం గాఁ దెలిసినవాఁడై, యంబికానందనుండు నిజనందనునితో ని ట్లనియె : ౨౫౬

క. "నరుఁ డగ్ని దేవుఁ దనకును
వరదునిఁ గాఁ గొలిచినాఁడు; వానికిఁ గేతు
స్ఫురణం బాదిగఁ గలసం
గరపరికర మెల్ల నతఁడు గావించె నయా. ౨౫౭

వ. అదియునుం గాక, ధర్మదేవతయు వాయుదేవుండును వాసవుండును నాశ్వినులును వారలకుఁ బాండురాజుతోడివారలు. వారి నొకకీడునుం బొరయకుండ రక్షింతురు. కావున, భీష్మ ద్రోణప్రముఖులకుఁ బాండవులం బరిభవింప రామి దెల్లంబు. ౨౫౮

క. దేవత లేటికిఁ, బార్థుఁడు
దేవసముఁడు గాఁడె? వాఁడు దివిజులచేతం
బోవని దైత్యులఁ జంపఁడె?
ఈవును నీవారు నతని నెఱుఁగరె చెప్పుమా? ౨౫౯

వ. కౌరవులకు వచ్చిన యిమ్మహాభయంబునకుఁ బ్రతీకారంబు శాంతిం గడచినయది లేదు. ఎన్ని భంగులం జూచినఁ గయ్యం బుడుగుటయ

1. పిక్కటగానక = వెనుదివియుట గనఁబడక.

మనకుం గర్తవ్యంబై యున్నయది. ఉపశమింప వయ్య; దీర్ఘవైరం-
బు వలవదు." అనినఁ, దండ్రికిఁ గొడుకిట్లనియె: ౨౬౦

క. "దేవత లర్జునునకుఁ దో
డై వత్తురనంగ వలవ; దది యెట్లనినన్:
దేవత్వము రాగద్వే
షావేశము లేమిఁ గాదె యైనది మొదలన్? ౨౬౧

వ. కావున, వారొకళ్లవారుం గారు. అట్లుం గాక, పక్షపాతులై పూని
వత్తురయేని నది దేవత్వంబుగాదు. అట్టి దేవత్వంబున నర్జునుండును
సురక్షితుండుగా నేరఁడు. నీకు నా పనికిఁ జింత వలవ" దని పలికి,
వెండియు నిట్లనుఁ: "బెట్టిగి వచ్చు, కార్చిచ్చు నడుపను, బోషాణ
వర్షంబు వారింపను, మహావాయువు నిలుపను, నీళ్లు గట్టిగా నభిమం-
త్రించి వానిపైఁ గరితురగాదుల నడపింపను, నాసేన నడచునప్పుడు
వలసినచోట జలంబు లుత్పాదింపను జాలుదు. సింహ శరభ శార్దూల
భూత బేతాళాది క్రూరసత్త్వసంరంభ స్తంభనప్రకారం బెఱుంగుదు.
మిత్ర శత్రువిషయంబులైన శుభాశుభంబులు వలయుభంగి నావ-
హింప నేర్తు. మఱియు నానావిధ సిద్ధిప్రదంబులగు మంత్రధ్యానాద్య
నుష్ఠానంబుల నాకుం గొఱంత లేదు. నీచెప్పిన యగ్ని ప్రముఖ
దేవతలం బ్రసన్ను లగునట్లుగా నారాధించినవాఁడ. వారికి నాకుం
బోలె మహానుభావంబు గలిగినఁ బదుమూఁడువత్సరంబు లబ్బంగి
నిడుమలం బడుదురె? వినుము చెప్పెద: ౨౬౨

—: దుర్యోధనుఁడు తండ్రితోఁ దనబలపరాక్రమంబులు సెప్పుట :—

క. ఏ నలిగినవారిని సుర
లైనను రక్షింప నోప; రమరు లలిగినం
బూని చెడ కుండఁ గాతును; [1]మానవు
లోకసరకె నాకు, మనుజాధీశా? ౨౬౩

1. మానవు లోక సరకె నాకు = మనుష్య లోక లక్ష్యమా నాకు?

తే. గర్వమున నాడుమాటలుగాఁ దలంప
వలవ; దిది యెల్ల నిక్కంబు; వసుమతీశ,
నన్ను నేఁ జెప్పికొందునే యెన్నఁడైన?
నాత్మసంస్తుతి పౌరుషం బగునె చెప్పుమ? ౨౬౪

వ. ధర్మతనయాది పాండవేయులును, ద్రుపదాది పాంచాలురును, విరాటాది మాత్స్యులును, వాసుదేవాది యాదవులును మఱియునుం గేకయ పాండ్య మాగధ చైద్య ప్రముఖ నిఖిలదండ నాయకులును నాచారిం బడి, మున్నీరు సొచ్చిన యేఱులచందంబున నడంగిపోవుట యవధరించెదు గాక! వారెల్లఁ దేజోధైర్య పరాక్రమోపాయ విచారవివేకంబుల నాయెత్తు వత్తురె? పితామహ ద్రోణ కృప శాశ్వత్థాములు శస్త్రాస్త్ర విషయంబులుగా నేమేమి యెఱుంగుదు రంతెంత నేర్తు రది యెల్ల నెఱుంగుదు; నంతయు నేర్తు"—నని పలికి, యందఱు వెఱఁగుపడి యుండం, దాను సంజయుతో సంగరంబు తెఱంగు నాలోచనంబుగాఁ బాండవులదెస మాట లాడు చుండఁ, గర్ణుండు ధృతరాష్ట్రుం గైకొనక ధార్తరాష్ట్రునకుం బ్రియంబుగా ని ట్లనియె: ౨౬౫

క. "గురునలుక నాకు నస్త్ర
స్ఫురణ మెడలె నంద్రు జనులు; బొం కది. పూజా
పరతమెయి నమ్మునీశ్వరు
కరుణ గొఱలి మగుడఁ బడయఁ గాంచితి బ్రీతిన్. ౨౬౬

ఉ. కావున, నస్త్రశస్త్రము లఖండితసంపద నొంది యుండు; దేవావలి కైన నన్నుఁ జెనయన్ భర; మేఁ గలుగంగ నర్జునుం డే విడిపించు మేదినిఁ? గడిందిమగంటిమి యుల్లసిల్లఁగా,
నీవు బలంబు మెచ్చ నని నిల్చెద, గెల్చెదఁ బాండవేయులన్. ౨౬౭

శా. గాంగేయాదులు నీకడన్ నిలిచి వేడ్కం జూడఁగా, సర్వసేనాంగాంగంబులమీఁద గాలియును జిట్టాడంగ నీ, కేను వీఁ

కం గాంగేయులఁ దాఁకి, తత్తనువు లుగ్రస్ఫారబాణాలిఁ గూ
లం గోదండవిలాసముల్ మెఱయ లీలం బోరఁ గ్రీడించెదన్." ౨౬౮

వ. అనిన విని, యినసందనునకు మందాకినీ నందనుం డి ట్లనియె : ౨౬౯

క. "కాలుఁడు ప్రేరేపఁగ నిటు
ప్రేలినయంతటన నిన్నుఁ బెద్దగఁ దలఁపం
బోలునె మాకును ? ఉడుగుము,
చాలుదు వీ వెల్లపనులు సాధింపంగన్ ! ౨౭౦

ఉ. కూలెడువారె పాండవులు ? ఘోరపుఁబోర నొకండొకండ యీ
చాలెడువార లెల్ల మును చావఁ, గ్రమంబున సేన లన్నియుం
గూలఁగఁ, గౌరవుల్ పిదపఁ గూలుదు ; రింతియ కాక నోరిచే
ప్రేల ? వృథాభిమానమున నిన్నియుఁ బ్రేలెదు, సూతనందనా ! ౨౭౧

తే. దివిజపతి నీకు నిచ్చిన తీవ్రశక్తి
చేతఁ గవ్వడి వడు నని చూతువేని,
వాసుదేవునిచే నది వ్రయ్య లయ్యు,
దునియ లయ్యును, బొడి యయ్యుఁ దొరఁగు ధరణి. ౨౭౨

క. సర్పముఖశరము గల దను
దర్పంబునఁ గ్రీడిఁ దొడరఁ దలఁపకు. హరి పెం
పేర్పడఁగ, నదియ కా దట
తీర్పవలయువాని నెల్లఁ దీర్చు నరునకై." ౨౭౩

వ. అని పలికి ధృతరాష్ట్రునితో ని ట్లనియె : ౨౭౪

క. "జ్ఞాతులు దమలోఁ బొందినఁ
జేతోమోదమున వెలిఁగి చెలు వొందుదు ; ర
న్నీతిం బాసిన విగత వి
భూతిం గడకొఱవులట్ల పొగయుదు రధిపా. ౨౭౫

వ. కావునఁ, దమలో విరోధం బొప్పదు. సంభాషణసహభోజనాది సత్కారంబులను సవినయ వర్తనంబులను బీ్రతు లైనజ్ఞాతు లిహ పరార్థసాధకు లగుదురు." అని చెప్పి వెండియు– ౨౭౬

క. "విను, మే నొకశైలమునకు
మును భూసురవర్గసహితముగ నొకపనికిం
జనునెడఁ, జన రానితటం
బున నొకజు న్నుండె దానిఁ బొగడిరి తద్జ్ఞుల్. ౨౭౭

తే. 'దీని తేనియఁ ద్రావిన మానవులకు
జరయు రుజయును దప్పియుఁ జావుఁగలుగ'
దనఁగఁ, గొందఱు బోయలు విని, కడంగి
యుఱక మొఱకులై చఱిఁ బడ నుఱికి రపుడు. ౨౭౮

వ. ఇట్లుఱికి మృతిం బొందిరి. అట్లపోలె నవినీతులైన నీకొడుకులు పుడమి యెల్లను దార యేలుతీపుఁ జూచెదరు గాని, తమపోలిసి పోవుటం గానరు. వీర లర్జును తోడం బెనంగి మానప్రాణంబులు దక్కించుకొనువారె? అట్లుం గాక సమబలు లైననుం గయ్యంబునఁ గదా వీ రాదురు వా రాదు రనవచ్చు. అది యేల నీలోనికి ధర్మ నందనుం దెచ్చికొనుటయ నీకుఁ గర్తవ్యంబు." అనిన, బాహ్లికుండు ధార్తరాష్ట్రున కిట్లనియె: ౨౭౯

క. "[1]కను బ్రిమసిన తెరువరి, తన
కనపాయం బైనమార్గ మరసి తగ నెఱిం
గినవారు సెప్పఁగాఁ, గై
కొననికరణిఁ, దగినవెంటకుం జొర వకటా!" ౨౮౦

వ. అనిన, వైచిత్రవీర్యుండు దుర్యోధనున కిట్లనియె: ౨౮౧

1. తా. తన కపాయమగు మార్గము నరసి ఎఱిఁగినవారు సెప్పినను వినని కనుబ్రిమసిన తెరువరియట్లు నీవు తగినమార్గముం జొరవుగదా!

మ. "కొడుకా, యే నెటు లట్లు బాహ్లికుండు నీకుం గూర్చు ; భీష్ముండు నీ
యెడ సస్నేహుండు ; వీరి మాట విను ; మేమీమువ్వురున్ మన్ననల్
వడయంగాం దగునట్టివారము; నినుం బ్రార్థించెదన్ ; ధర్మజున్
విడువంగాం దగ ; దిమ్ము వారలకు నర్ధిం బాలు నెమ్మిం దగన్."

క. అనిన వెండియు నొడం బా
టునకుం జొరనిదానికిం, గొడుకుతోడం గడుం
గినిసి, ధరణీశ్వరుం డి
ట్లనుం గొలువున నున్నవార లందఱు వినంగన్: -౨౮౩

తే. "బవరములు గావె? విఱిగినబారం పాంప
వచ్చునే ? ఒక్కరుండ వివ్వచ్చుం డడరి
[1]పసులం బెట్టించునపుడు నీబలము విఱుగ
దయ్యెనే ? నీవుం గర్ణుండు నచట లేరె?" -౨౮౪

వ. అని రాధేయుదిక్కు మొగంబై మఱియు ని ట్లనియె : -౨౮౫

ఆ. "నాంటికొలంది గాదు. నారాయణుండు నొగ
లెక్కం, గెలన భీముం డేచి నడవ,
ననుజ తనుజసహితుం డై వచ్చు వివ్వచ్చు
మార్కొనంగ వశమె మనకుం గర్ణ ? -౨౮౬

చ. బలమును దర్పమున్ మెఱయ, బంటుతనంబున నీవు పాండవే
యులనని మార్కొనం గడంగు టొప్పెదు తెం పగుం ; జచ్చి శుద్ధుం డై
పలుకులు మాన్పు భృత్యుం డనుపాటి దలంచెద ; విట్లు మేలె? అ
చ్చలమున నీసుయోధనుని చావున కోర్చుట గాదె యింతయున్ ?"

వ. అనిన విని, కానీనుండు సంక్షుభితమానసుం డై 'యిది యెల్ల ని ట్లయ్యె. ఇట్లుంగాక, తక్కినయది యట్లుండె. నదీసూనుండు నన్ను నిరాకరించి పలికిన పలుకులఫలం బనుభవించుం గాక ' యని యతని నుద్దేశించి యి ట్లనియె : -౨౮౮

---

1. పసులం బెట్టించునపుడు = ...మరలించునపుడు — అకట్టనపుడు.

—: కర్ణుఁడు భీష్మునిపై రోషముచేత శస్త్రసన్న్యాసంబు చేయుట :—

తే. "నీకు నాలావుతోడ్పాటు లేక యుండ
వలయు. నీ తెగునంతకుఁ గలన నిలువ;
నాయుధంబులు విడిచితి; నంతమీఁద
మెఱసి బలవిక్రమంబులు నెఱపువాఁడ." ౨౮౯

వ. అని శస్త్రసన్న్యాసంబు చేసి కొలువున నిలువ నొల్లక దిగ్గన లేచిపోయె. అట్టియెడ శాంతనవుండు నవ్వుచు దుర్యోధనునితో నిట్లనియె: ౨౯౦

క. "అంతకుఁ జాలఁడె కర్ణుం
డింతకు మును బాస యిచ్చి యెన్నఁడు బొంకం!
డింతటి మానిసి యలిగినఁ,
గౌంతేయుల కెట్లు బ్రదుకఁ గావచ్చునని ?" ౨౯౧

క. అని వెండియు నిట్లను: "నా
తని మాటల కెట్లుఁ గడఁగి ధర్మతనయుతో
నని సేయక తక్కవు; నీ
మనఃహానము వాయఁ జూడు మతనిని, నన్నున్. ౨౯౨

వ. ఏను బాహ్లీక ద్రోణప్రముఖులు గనుంగొనుచుండఁ బ్రతివీరుల ననేక సహస్రంబుల సమయించెద. పిదప రాధేయు రణంబునం జూచెదవు గాక." అనిన విని, దుర్యోధనుండు కర్ణపక్షపాతియు నవినీతుండు నగుటం జేసి, సహింపక పితామహునితో నిట్లనియె:

చ. "ఎఱిఁగి యెఱిఁగి యొండె, మది నేది యెఱుంగక యొండె, నెప్డు నం
దఱు వినఁ 'బాండునందనులు దర్పితులై యని గెల్తు' రంద్రు; ముం
దఱ నిఁక బాహ్లికుం గురునిఁ దక్కటివారిని సమ్మ-యేను సే
ద్దైఱ నని సేయఁ బూనితిఁ; గడిందిమగంటిమి తోడు సాలదే?

ఉ. కర్ణుఁడు దుస్ససేనుఁడును గల్గఁగ నా కొరు లేల? సద్భటా
కీర్ణవిరోధిసైన్యముల గెల్వఁగఁ జాలుదు మేము. మాకు నీ
యర్ణవ వేష్టితక్షితి యనర్గళవిక్రమ మొప్ప దక్కు; మా
నిర్ణయమెల్ల నిట్టి; దవినీతియొ నీతియొ చూడుమీ తుదిన్." ౨౯౫

క. అనుపలుకులకు విషాదము
దనుకఁగ ధృతరాష్ట్రవిభుఁడు దననందను నే
మనియుం బలుకఁగఁ జాలక
వెనుఁబాటున నిట్టులనియె విదురునితోడన్. ౨౯౬

తే. "మృత్యుపాశోపహతుఁ డయ్యె మీఁదు లేక
సూతనందనుతోఁ గూడి నాతనూజుఁ
డకట! నాశంబుఁ బొందువాఁ డయ్యె. మనకు
నింకఁ జేయంగ నగుపని యెద్ది చెపుమ?" ౨౯౭

వ. అనిన విని, విదురుం డతని కిట్లను: "మనవారలు మున్న దుర్బలులు. తమలోనం బెనంకువ లయి విరసవచనంబు లాడుచు నింతలు పుట్టించుట యది యర్జునునకుఁ గార్యంబు. ఇంతియ కాక యే మనువారము? వారలు బంధుమిత్రసహాయులుం దారును నొక్క తలంపువారలయి యున్నవారు. వలవని యీ వెంగలి మాటలు విడిచి పాండవులం బిలువం బనిచి తగవు నడపుట దక్క మనకుఁ జేయం దగుపని వేఱొండు గలుగునే?" అని చెప్పిన, ధృతరాష్ట్రుండు సంజయు చెప్పిన కార్యవచనంబుల కొంత వినం గలవాఁడై, యతనిదిక్కు మొగంబు సేసి — ౨౯౮

క. "మును వరుసతోడఁ దన తలఁ
చినయన్నియు నీవు వినఁగ జెప్పి, తగవుమై

---

1. మాకు...దక్కు = సముద్రములచేఁ జుట్టఁబడిన భూమియు, అడ్డులేని విక్రమమును మాకు దక్కును.

నిను పిడుకొల్పు నెడ, స
జ్జనుఁ డే మని నిశ్చయించెఁ జూతము చెపుమా." ౨౯౯

క. అని యడిగిన సంజయుఁ డి
ట్లనుఁ: "దుదిఁ బార్థుండు నిశ్చయము సేసి సుయో
ధనుతో నిందలి పెద్దలు
వినఁగా నను మన్న పలుకు వినుము నరేంద్రా! 300

మ. "కురువంశోత్తముఁ డైన ధర్మజుఁడు 'నాకుం దండ్రిపా లీఁదగున్
ధరలో సా' మని తాన పల్క, వినియుఁ దర్పంబుమై నీక త
క్కిరయేనిం, జటులాస్మదీయ విశిఖాగ్నిజ్వాలలం దాహుతుల్
వరుసం బెట్టుదు ధార్తరాష్ట్రతతి నైశ్వర్యం బవార్యంబుగన్." 301

వ. అని పలికి కౌఁగిలించికొని భూషణాంబరాది కమనీయవస్తువు లొసంగిన నేనునుం బాండవులను వాసుదేవుని సవినయంబున వీడ్కొని యింత వట్టును దేవరకు నెఱింగింప వేగంబ వచ్చితి." అనిన, నమ్మాటలు దుర్యోధనుం డాదరింపక పెడచెవులం బెట్టె. ధృతరాష్ట్రుండును ఱిచ్చవడి యూరకుండె. అప్పు డయ్యెరువురపాలను సంజయుం డొక్కరుండు దక్క నయ్యాస్థానంబున నున్న సమస్తజనంబులును దిగ్గన లేచి తమతమ నివాసంబులకుం బోయిరి. తదనంతరంబ— 302

క. తనుజ వశవర్తి యగుట
మ్మనుజేంద్రుఁడు దనసుతుం బుమర్దింపఁగ నో
పునొ యనిఁ బాండుతనూజుల
ననుమతి సంజయునితోడ నాడె దురాశన్. 303

సీ. "ఈ రెండు పిళులతారతమ్యంబులు
నెఱుఁగుదు; పో నైన నెవ్వ రోర్తు,
రిది నిశ్చయింతమే? ఎందు నుపాయంబుఁ
బౌరుషంబును గలవారు గలరు?

సూతము చెప్పి"మన్న సూతనందనుఁడు, "న
న్నడిగెద వే నొంటి యడుగవలదు.
మీ యయ్య సాత్యవతేయుఁ డీయెడకు వేం
చేయునట్లుగ భక్తిఁ జేసి తలఁపు ;
తే. పిలువఁ బంపు గాంధారి. వారలు వినీతి
రతులు నిశ్చయవిదులు ధర్మజ్ఞ చిత్తు ;
లుల్లమున నీ కసూయాదు లొందవేని
వాని మాన్పంగ నేర్తురు మానవేంద్ర." ౩౦౪

—: కృష్ణద్వైపాయనుఁడు ధృతరాష్ట్రునియొద్దకు వచ్చుట :—

వ. అనిన విని, యంబికానందనుండు 'అట్ల కాక'యని యొకకొంచుకిం బిలిచి వానిం బుచ్చి గాంధారి రావించి, సద్భక్తితాత్పర్యంబునఁ గృష్ణద్వైపాయన మహామునిం దలంచిన, దివ్యబోధమహనీయుం డైన యమ్మహాత్ముండు విజయంచేయుటయు, నందఱు దండప్రణామంబులు సేసి సమున్నతాసనంబున నునిచి యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి యున్నసమయంబున, ధృతరాష్ట్రుండు విన్నపంబు సేయక మున్న, యమ్మహాపురుషుండు ధృతరాష్ట్ర సంజయుల చిత్తవృత్తులు దాన యెఱింగినవాఁ డగుటంజేసి, సంజయువలనఁ బ్రసన్నదృష్టి నవలోకించి యతని కిట్లనియె : ౩౦౫

క. "నీవు సమస్తము నెఱుఁగుదు
గావున, నీ కూరకుండఁ గాఁ దగదు. ధరి
త్రీవల్లభుఁ డడిగినపని
యీవిధ మని తెలియఁ బలుకు మేను వినంగన్." ౩౦౬

వ. అనినఁ, బ్రసాదం బని సంజయుండు ధృతరాష్ట్రున కిట్లనియె :

క. "ఆ సేనకు నీ సేనకు
వాసి యడిగె దీవు వన్ను—వసుదేవసుతుం

డాసేనఁ గలఁడు; తత్సము
నీసేనం జూపుమా నరేశ్వర నాకున్. ౩౦౮

వ. వాసుదేవుం డెట్టివాఁ డని యడిగెదేనిం జెప్పెద — ౩౦౯

చ. జగముల నన్నిటిం దనవశంబుగఁ జేసినవీరు భంగమున్
బగయు లలాటలోచనుఁడు వాపఁగఁ బేర్చినయట్టిబాణు, నొ
క్కగడియలోన గర్వ మడఁగం బరిమార్చె; సురేంద్రకల్పకం
బు గరములీలఁ దెచ్చె; హరిభూరిపరాక్రమ మప్రసిద్ధమే! ౩౧౦

ఆ. అధికదుష్కరంబు లైనకార్యంబులు
క్రీడవోలెఁ జేయుఁ గేశవుండు.
విను, మతండు పార్థు నెనసి యేకార్థుఁడై
యుండుఁ బూర్వభవసఖుండు గాన. ౩౧౧

వ. అట్టివాసుదేవుని చక్రంబు నిజమాయాబలంబునఁ బాండవుల సర్వ
సమరసాధనంబుల యందును సూక్ష్మరూప వ్యాపి యై నిలిచి వారికి
విజయం బొసంగు చుండు"నని చెప్పి, మఱియు ని ట్లనియె: ౩౧౨

క. "పలుమఱుఁ బాండుతనూజుల
కొలఁది వితర్కించెదవు; నిగూఢం బదియుం
దెలియం బలికెద; వారికి
బలమును సత్త్వంబు హరియ పార్థివముఖ్యా. ౩౧౩

వ. హరిమహత్త్వంబు విన్నవించెద నవధరింపుము: ౩౧౪

క. ఒకతల సమస్తజగములు
నొకెడ జనార్దనుఁడు నిలిచి యొకతల నైనన్,
సకలము నసార; మాతం
డొకరుని సారంబ చాల నుత్కృష్టమగున్. ౩౧౫

క. తలఁపునన వాసుదేవుఁడు
గలిగింపను, నిలుప, నడఁపఁగానోపు జగం

బుల. మఱియును గ్రీడార్థము
పలువోకలఁ బుచ్చు చుండుఁ గౌరవనాథా. ౩౧౬

క. ఎక్కడ నడచును సత్యం,
బెక్కడ ధర్మంబు వఱఁగు, నెక్కడఁ గలుగుం
[1]జక్కటి నిలుచుం గృష్ణుం
డక్కడ; నతఁ డున్నకడన యగు జయ మధిపా. ౩౧౭

సీ. పురుషోత్తముం డెల్లభువనంబులును దాన,
యఖిలభూతాత్మకుం డై విహార
లీల విచేష్టించు; నీలోకముల మాయ
దొట్టి యొక్కొకమరి పుట్టి, పెరిఁగి,
కర్మానుచరణముల్ గైకొని వర్తించు;
శిష్టరక్షణమును దుష్టనిగ్ర
హంబును జనపను లగుటఁ, బాండవుల నె
పం బిడుకొని ధర్మబాహ్యు లైన
తే. నీతనూజుల నిక్కము నిగ్రహింపఁ
దలఁచినాఁ డమ్మహాత్ముండు; దథ్య మతని,
నిట్టిచందంబువాఁ డని యెఱిఁగి యెవ్వ
రాశ్రయింతురు, బ్రదుకుదు రట్టివారు." ౩౧౮

క. అనవుడు ధృతరాష్ట్రుఁడు, "[2]వి
ష్ణుని నే నెఱుఁగనివిధంబునుం, దెలియఁగ నీ
కని యున్న తెఱఁగుఁ జెప్పుమ"
యనుటయు సూతసుతుఁ డిట్టులను నాతనితోఁ. ౩౧౯

వ. "విద్యయు నవిద్యయు ననఁగా రెండు గలవు. అవిద్యాదూషితుం
డై తమోగ్రస్తుం డైనవాఁడు విష్ణు నెఱుంగఁడు. విద్యాసంపన్నుం

---

1. చక్కటి = న్యాయము. 2. విష్ణుని...జెప్పుమ = నే నెఱుఁగని విధమును, తెలియ నీచూచినట్టి తెఱఁగును చెప్పుమా.

డెఱుంగు"ననిన, "విద్య యనునది యెట్టిది? [1]ఎద్దాన నీ వాసర్వేశ్వరు
నెఱింగితి దాని, నవిద్య యెట్టిది దానిని జెప్పు" మనుటయు, నాంబి
కేయునకు సంజయుం డి ట్లనియె: "సాత్త్విక రాజస తామసవికా
రంబులత్రిప్పులం బడక ధర్మం బాచరించుచు భావశుద్ధి గలిగి యుం-
డుదు; దీన నే నచ్యుతు నెఱుంగుదు; విద్య యిట్టిది. నీకునుం
దక్కెవరి కైనను నతని నెఱుంగుటకు నిదియ తెరువు. ఇట్టిది గాని
విధం బవిద్య"యని చెప్పిన, నతండు నిజనందనుని కి ట్లనియె: ౩_౨౦

క. "మన కాప్తుఁడు సంజయుఁ; డీ
తనియుపదేశంబు పట్టి ధర్మమున ముకుం
దుని నాశ్రయింప వయ్య. అ
తనిఁ జొచ్చిన బ్రిదుకు దీవుఁ దమ్ములు సుతులున్." ౩_౨౧

చ. అనిన, సుయోధనుండు దమయయ్యకు ని ట్లను: "నిజ్జగంబు ల
న్నిని నొక పెట్ట మ్రింగినను, నెట్టన సర్వము గాచె నేనియు
న్వీనుము, ముకుందుఁ డర్జునునినెచ్చెలి నాఁ జెవులార వించు, నిం
క నతని నొక్కబాముసకుఁ గా ధృతి పెం పఱ నాశ్రయింతునే?"

తే. అనిన, గాంధారి కి ట్లను జనవిభుండు:
"నీతనూజుండు దుర్మాని నీతిబాహ్యుఁ
డుద్ధతుం డీసుమాని నాబుద్ధి వినఁడు;
వీఁడు సెడుఁగాని బ్రిదుకంగ లేఁడు సుమ్ము!" ౩_౨౩

ఉ. నావుడుఁ, దల్లి యిట్టు లను నందనుతో, "నిది యేల యాయువుఁ
శ్రీవిభవంబులఁ మము నశేషసుహృజ్జనులం దొఱంగఁగా
నీవు గడంగె? దిట్టియవి నీతులునుం గల రే! [2]వృకోదరుం
డై విధి సంపఁగా నొరుల కాఁగఁగ వచ్చునె యింకఁ బుత్రకా?"

---

1. ఎద్దాన నీ వాసర్వేశ్వరు...జెప్పుము = దేనిచే నీవు ఆసర్వేశ్వరు నెఱింగితివో దానిని అవిద్య యెట్టిదో దానినిఁ జెప్పుము. 2. వృకోదరుండై విధి...వచ్చునె = విధియే భీముడుగావచ్చి చంపునెడ నిఁక ఒరుల కాప శక్యమా?

వ. అనియె. అట్టియెడం గృష్ణద్వైపాయనుండు ధృతరాష్ట్రున కిట్లను : "కృష్ణుండు నీకుం గూర్చు. నీవుం బరమాప్తుండ వై సంజయు నతని పాలికిం బుచ్చితి. అది లెస్స కార్యం బయ్యె. వీఁడును నమ్మహాను భావుమహనీయ ప్రభావం బున్నయది యెఱుంగు. వీని బుద్ధి విని యద్దేవు నాశ్రయింపుము. అతం డేకాగ్రచిత్తు లై యారాధించిన వారికిఁ జేరువయగు. కామక్రోధోపహతు లై తమతమ ధనంబులం దృప్తులుగాక యన్యాయంబున వర్తించువారలకు దూరంబై యుండు. ఎల్లభంగుల నాతనిం జొచ్చి బ్రదుకుము." అనినం, 'బ్రసాదంబు అట్ల చేయుదు' నని, విచిత్రవీర్యనందనుండు సూతనందను నితో, 'నవ్వాసుదేవ నామనిర్వచనంబు నాకుఁ దేటపడం దెలిపి యతనిం బొందు నుపాయం బుపదేశింపవే' యని యడిగిన— ౩_౭౯

తే. "ఎల్లయందును దా వసియించు, నెల్ల
యదియుఁ దనయందు వసియించు టండ్రు; వాసు
దేవుఁ డను పేరి కర్థంబు దెల్ల; మింత
యెఱుఁగుజనులందుఁ దగ వసియించు శుభము. ౩_౮౦

తే. అతనిఁ బొందునుపాయంబు నంతరంగ
నిగ్రహము గాఁగ నార్యు లనుగ్రహింతు;
రోపి, చిత్తవికారంబు లుడిపి, యేక
బుద్ధిఁ గొలువఁ, బ్రసన్నతఁ బొందు నతఁడు. ౩_౮౧

వ. నీవును బలుబుద్ధు లుడిగి గోవిందు నాశ్రయింపుము" అనినం, బ్రజ్ఞా చక్షుం డిట్లనియె : ౩_౮౨

క. "నాకు నయనేంద్రియముగతి
లే కుండుట కంతవగపు లే; దఖిలమనో
జ్ఞాకారుఁ డైనహరి నా
లోకింపం గానమికిఁ గలుగు వగ పెప్పుడున్. ౩_౮౩

ఉ. ఆతనిఁ గన్నులారఁగ సహర్నిశముం గనుఁగొంచు నుండువా
రేతప మాచరించిరొ? ఉపేంద్రుని నాశ్రితవత్సలుఁ విని

ధూతకళంకు ధర్మనిరతుం గరుణాకరు సర్వలోకవి
ఖ్యాతుఁ బవిత్రమూర్తి శరణాగతరక్షకు నాశ్రయించెదన్ ౖరివృత వై
యుతనిత్యో

వ. అని పలికి పరమశాంతుం డై పారాశర్యు నుద్దేశించి 'దేవా, ౫
వాసుదేవుని శరణుసొచ్చి బ్రదుకువాఁడ' ననుచుఁ గృతాంజలి ద
టయు వ్యాసమహాముని యు నాశీర్వాదంబు సేసి యంతర్హితుండయ్యె
కౌరవేశ్వరుండును దుర్యోధన సంజయుల నిజనివాసంబులకుం బోవం
బనిచి, తానును గాంధారియు నభ్యంతర మందిరంబున కరిగి, యుచిత
వ్యాపారంబులం బ్రవర్తిల్లుచు నుండె—నని చెప్పిన విని, పదంపడి
పుట్టినవిశేషంబు లెట్టి వని యడిగిన— ౩౩౧

శా. నిత్యానిత్యవివేక వైభవసముత్సిద్ధాంతరంగస్ఫుట
ప్రత్యక్షా, పరమేశ, విశ్వజగదారాధ్యా, మహానంతచి
త్సత్యానంద విభుస్వభావమహితా, సంవిత్సమాధాన దా
ర్గత్యవ్యాహృతిసంప్రవర్తనవిదగ్ధశ్రీపదాంభోరుహా. ౩౩౨

క. వ్యాసాదిమునిప్రోక్తమ
హాసందర్భాప్రమేయతాయూఢగుణో
ల్లాసా, నైర్గుణ్యాసము
ద్భాసి రహస్యానుభావ, భక్తాధీనా. ౩౩౩

మాలిని. సమదనిమిషచూడా, నవ్యరత్నప్రభాసం
గమరుచిరపదాబ్జా, గర్వదుర్వారదైత్యో
ద్యమబహులతమోమార్తాండదోఃక్రడన ప్ర
క్రమలలితవికాసా, గాఢభక్తిప్రకాశా. ౩౩౪

గద్యము.

ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధన విరాజి
తిక్కన సోమయాజి ప్రణీతంబయిన శ్రీమహాభారతంబున
యుద్యోగపర్వంబునందు ద్వితీయాశ్వాసము. ౩౩౫



హరిహరనాథాయ నమః

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఉద్యోగపర్వము

### తృతీయాశ్వాసము.



శ్రీ వాగ్విభవారోగ్య
ప్రావీణ్యప్రాభవానుభావ మహిత సౌ
ఖ్యావహపదస్మరణ, కరు
ణావాసకటాక్షకిరణ, హరిహరనాథా! ౧

—: శ్రీకృష్ణునిరాయబారము :—

వ. దేవా, వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె: ౨

తే. సంజయుఁడు దన్ను వీడ్కొని చనిన, ధర్మ
సుతుఁడు మఱునాఁడు దమ్ముల సుతుల నిష్ట
భృత్యవరులను దొరలను బిలువఁ బనిచి,
యెల్లవారును విను చుండ నిట్లులనియె: ౩

క. "మనము జనార్దనుపాలికిఁ
జని, కౌరవసభకు నతనిఁ జను మని ప్రార్థిం
చిన మేలు; బంధు హిత గురు
జనములతో రణము గాక సంప్రీతి యగుఁ." ౪

వ. అని పలికి వార లందఱు బలసి చనుదేర మాధవుమందిరంబున కరిగి, యతనిచేత సత్కృతుం డయి, సమస్తపరిజనంబులుం బరివేష్టింప,

నొక్కపార్శ్వంబునం బాంచాలియు సముచితపరివారపరివృత యై యుండ, నతండునుం దానును సుఖాసీనుం డై యుండి యతనితో ని ట్లనియె: ౫

క. "ఆపదఁ గడవం బెట్టఁగ,
నోపి శుభం బై నదాని నొడఁగూర్పను, మా
కీపుట్టువునకుఁ బాండు
భూపాలుఁడు నిన్నుఁ జూపి చనియె, మహాత్మా! ౬

తే. సమయ మిది మిత్త్రకార్యంబు చక్కఁజేయ;
నీకతంబున నే మవినీతుఁడైన
యాసుయోధనతోడిపోరాటదక్కి,
యనుభవింతుము మాయంశ మగుధరిత్రి. ౭

వ. నీకు మేము ప్రద్యుమ్నాది కుమారులతోడి వారము. మమ్ము దురితంబులుపొరయకుండ నరసిరక్షింపుము." అనవుడు, వాసుదేవుండు "నీపంచినయట్ల చేయం గలవాఁడ. ఎయ్యది తలంపు సెప్పు" మనిన, నజాతశత్రుండు "నీవు కరినగరంబున కరిగి కౌరవుల తోడం దగినమాట లాడి తెఱంగు సేయ వలయు"నని ప్రార్థించి, యతని నియ్యకొలిపి యి ట్లనియె: ౮

సీ. "మాతండ్రి తలఁపును, నాతనినందను
చందంబు, నిన్న యాసంజయుఁడు
పలికినపలుకులఁ దెలిసెఁగదా నీకు;
వారిచిత్తముభంగి వాఁ డెఱుంగు.
[1]పాలు పం పని యీక యేలిమాటలన మ
మ్మలుక దీర్చెదరు తా; [2]రధికదుష్క

---

1. పాలిపంపని...తారు = కృత్రిమపు మాటలతోడనే మమ్ము అలుక దీర్చెదరు. తారు (కౌరవులు) 2. అధికదుష్కరంబైన యాసమయంబు ఏము = మిక్కిలి చిక్కగు అజ్ఞాతవాసమును మేము ...

రం బైనయాసమయం బేము పదుమూఁడు
వత్సరంబులు సల్పి వచ్చి యుండఁ,

ఆ. గులముపాడి నడపఁ దలపఁడ పతి; సెడఁ
దలఁచెనేని, గొడుకు వలచినట్టి
వాఁడు గాన, నతనివక్రిత మాన్ప లేఁ;
డింతకంటెఁ గలదె యెడరు మాకు? ౯

క. జననియు సమస్తబాంధవ
జనములుఁ బ్రియ మంద, వారి శాంతులఁగాఁ జే
యను, నెమ్మిగ నొక్కటి యై
మననం దెఱఁ గేది యునికి మాపౌరుషమే? ౧౦

క. ఇచ్చటిబంధులు నీవును
నచ్చెరువడి వినుచు నుండ, నయిదూళ్ళను మా
కిచ్చిననుఁ జాలు నంటిని;
బొచ్చెము గా దింతవట్టు పూర్ణము సుమ్మీ. ౧౧

శా. ఆదుర్యోధనుఁ డంతమాత్రియును జేయం జాలఁడో! కాని పెం
పేదం గ్రూరత కోర్వ రాదు; [1]సిరి నాకేలందునే, [2]గ్రాసవా
సోదైన్యంబులు వచ్చు నాయరయు నీచుట్టాలకుం: గావునన్,
మోదం బందుట గల్గుఁ గౌరవులు నేముం బొంది శ్రీ నొందినన్. ౧౨

ఉ. [3]అక్కట! లాఁతు లైనఁ బగ త్రైనను జంపన కోర నేల? బం
డొక్క తెఱంగు లేదె? అది యొప్పదె? బంధుసుహృజ్జనంబు లా
దిక్కున నున్నవారు; గణుతింపక సంపదకై వధించి, [4]దూ
ఱెక్కుట, దోష మందు టననీదురవస్థల కోర్వ వచ్చునే?" ౧౩

1. సిరి...నేన్ = సంపద నాకెందున కందునేని. 2. గ్రాస...చుట్టాలకున్ = నాపోషణ యందున్న చుట్టములకు తినఁ దిండియు, ఉండ నిల్లును లేని దుస్థితి వచ్చును. 3. అక్కట...నేల = అయ్యో! పరులైనను, పగవారినైనను, చంపుటకే కోర నేల? 4. దూఱెక్కుట...వచ్చునే? = నిందపడుట, పాపముందుట అనే యీదురవస్థలను సైపవచ్చునా?

వ. అని పలికి పాండవాగ్రజుండు వెండియు, ౧౪

ఆ. "క్షత్త్రధర్మ మింతకష్ట మగునె? పెఱ
ధర్మ మాచరింపఁ దగద యండ్రు;
కాన, శస్త్రజీవికయ తగి యున్నది;
యైన [1]వంశనాశ మనభిమతము. ౧౫

వ. అదియునుం గాక — ౧౬

ఆ. కలహ మగుట లక్ష్మిఁ గావించుఁ, బ్రాణహా
నియును జేయు; నింత నిక్కువంబు.
పలువు రొకని కోడి పాఱుట, బల్లిదు
లనదచేతఁ జెడుటయును ఘటించు. ౧౭

క. జయ మగు, నోడుదు మనని
శ్చయ మెక్కఁడు లేదు; వినుము, సమరమునఁ బరా
జయము మరణంబుకంటె హృ
దయపుటభేదనము సేయుఁ; దథ్యం బనఘా! ౧౮

క. కాన, నవశ్యముఁ బెనఁకువ
గానియుపాయమునఁ బగఱఁ గడ తేర్చు ధృతిం
బూని నడచు నెవ్వఁడు, వెం
దానం జెయి నెట్టికొని యతఁడు నిద్రించున్. ౧౯

ఆ. పగయ కలిగెనేనిఁ, బాము మున్న యింటిలో
నున్నయట్ల కాక; యూఱడిల్లి
యుండు నెట్లు చిత్తమొకమాటు? కావున
వలవ దధికదీర్ఘవైరవృత్తి. ౨౦

---

1. వంశనాశ మనభిమతము = వంశమును నశింపఁజేయుట నాకిష్టము గాదు.

చ. పగ యడఁగించు టెంతయు శుభం; బది లెస్స. అడంగునే పగం
బగ? [1]పగ గొన్న మాఱొక్కనక, పల్కక యుండఁగ వచ్చునే? [2]కదం
దెగ మొద లెత్తిపోవఁ బగ దీర్పఁగ వచ్చినఁ గ్రౌర్య మొందు; [3]నే
మిగతిఁ దలంచినం బగకు మేలిమి లేమి ధ్రువంబు కేశవా. ౨౧

ఉ. కావున శాంతిఁ బొందుటయ కర్జము — దా నది యట్టు లుండె. [4]శ్రీ
గావలె నంచుఁ, బోరితము గామియుఁ గోరెద; [5]యెల్లసొమ్ములుం
బోవుటయుం, గులక్షయము పుట్టుటయుఁ వెలి గాఁగ, నొండు మై
నేవిధి నైనఁ జక్కఁబడు టెంతయు నొప్పుఁ జుమీ జనార్దనా! ౨౨

చ. మనమునఁ బక్షపాతగతి మానెన మానుసము. ధర్మ నీతివ
ర్తనముల రెండుదిక్కుల హితంబును బెంపును గల్గునట్టిచొ
ప్పున, విదురాదిసజ్జనులబుద్ధికి రా, నుచితంబుతోడి మె
ల్పునఁ, బరసందనంబునను భూపతు లెల్ల నెఱుంగ నాడుమీ. ౨౩

చ. తగవునఁ బోక రాజు బెడిదంబులు వల్కెనయేని, సైఁచి యొ
ప్పఁగ నిలుమీ; [6]గురుత్వముఁ బ్రభుత్వమునుం గలపెద్దవారి మా
ట గొనమి యా సుయోధనుకడఁ నిలువఁగ, [7]మన మెల్ల గారవం
బునఁ గురువృద్ధుపల్కుఁ దలపుం జన నిచ్చిన మెచ్చరే జనుల్? ౨౪

---

1. పగగొన్న...వచ్చునే = పగగొన్నపుడు ఎదురింపకయు, మాఱుపల్కకయు నుండ నగునా? 2. కదం...గ్రౌర్యమొందు = పూర్తిగాఁ దెగునట్లును, బుడముతోఁ బెల్లగిలి పోవునట్లును పగఁ దీర్పవలసివచ్చినచోఁ గ్రౌర్యమగును — హింసయగును. 3. ఏమిగతి... ధ్రువంబు = ఏవిధమునఁ దలఁచినను పగకు గౌరవము — ఔచితి — లేకుండుట నిజము.
4. శ్రీగావలె...గోరెదము = సంపద గావలయుననియు, యుద్ధము కాకుండుటయుఁ గోరెదము. 5. ఎల్లసొమ్ములుం...వెలిగాఁగ = ధనమెల్లపోవుటయు, కులక్షీణము పుట్టుటయుఁ గాకుండ. 6. గురుత్వము...నిలువఁగ = గౌరవమును అధికారిత్వముగల పెద్దల మాట సరకుసేయఁడనుట సుయోధనునియందే యుండఁగా. 7. మనమెల్ల...మెచ్చరే జనుల్ = మనమందఱము గౌరవముతో ధృతరాష్ట్రుని పలుకును తలఁపును సాగనిచ్చినచో జనులు మెచ్చరా?

మ. [1]సుతుఁ డై వినయంబు సేకొనక, యేచోప్పం దగం జెప్ప, కా
ధృతరాష్ట్రుం డవినీతిఁ జేసినను, సంధింపంగ రా దంచు వే
గ తెగం బాఱకు ; తెంపు సేయునెడ, లోకం బెల్ల మెచ్చం బ్రకా
శిత ధర్మస్థితి నొంది, మామనము నిశ్చింతంబుగాఁ జేయుమీ ! ౨౫

ఆ. ఇన్ని సంకటముల నిబ్భంగి నెంతయు
[2]నొగులు చిత్తవృత్తి నొవ్వ దీర్ప,
వెజ్జ వీవ కావె ? వేయేల యేగతి
నడపఁ దలఁచి తదియ నాకుఁ బ్రియము." ౨౬

వ. అని చెప్పి తలంచుకొని వెండియు ని ట్లనియె : ౨౭

క. " నీవు సుయోధను పాలికిఁ
బోవఁగ వల దనియు నొక్కబుద్ధి వొడమెడుఁ ;
గోవింద, యతఁడు, మంత్రులుఁ
[3]గావరములు ; చక్క వినరు కార్యవచనముల్. ౨౮

తే. కుటిలమతు లవినీతులు క్రూరకర్ము ;
లట్టినీచులకడకు నిన్ననుపఁ జాల ;
నీవు సంకటపడియెడు దేవపదవి
యైన నే నొల్ల. [4]ఒంటి యం దరుగు టుడుగు. " ౨౯

చ. అనవుడుఁ, గృష్ణుఁ డి ట్లనియె : " నాధృతరాష్ట్రుఁడు నట్టివాఁడ, త
త్తనయుఁడ యేల ? నీపలుకు తథ్యము. నీతలఁ పే నెఱింగితిన్.
మనమున శంక దక్కుము. వినన్ వల తే విను, మేను నిక్క మ
ల్గిన నచటం గలండె రణకేళికి మార్కొన నొక్కఁడేనియున్ ? 30

1. సుతుఁడై వినయంబు సేకొనక = కొడుకువట్టువాఁడై మన యెడఁ కువను—విన్నపము ను— ఆదరింపక. 2. నొగులు... వెజ్జ వీవ కావె = కలఁతపడు మనోగతికగు నొప్పితీర్చుటకు వైద్యుఁడవు నీవే కావా ? 3. కావరములు = పొగరుబోతులు. 4. ఒంటియందరుగు టుడుగు = ఒక్కఁడవు అక్కడికిఁ బోవ మానుము.

క. పనుపుము కౌరవసభ, కేఁ
జను టెట్లును మేలు: అర్థసంసిద్ధి యగుఁగా.
మన కొకటం బాపము రా
కునికికిఁ గత మైనపలుకు లొండెను గలుగున్." 3౧

వ. అని పలికిన యుధిష్ఠిరుం డి ట్లనియె: 3౨

ఆ. "మేలు గాక! నీకుఁ బోలినట్లయిన నం
దరిగి, యేము వారు నర్థిఁ బొంది
యుండునట్లు గాఁగ నోడఁబాటు గావింపు;
మెల్లభంగి మనకు నిదియ లెస్స. 33

క. మ మ్మెఱుఁగు, దెదిరి నెఱుఁగుదు,
నెమ్మి యెఱుఁగు, దర్థసిద్ధి నెఱి యెఱుఁగుదు, వా
క్యమ్ములపద్ధతి నెఱుఁగుదు;
పా మ్మెవ్వఁడ నేను నీకు బుద్ధులు సెప్పన్?" 3౪

—: కృష్ణుఁడు ధర్మరాజుతోఁ గౌరవులదుర్నయంబు సెప్పుట :—

సీ. అనిన ముకుందుఁ డిట్లనియె: "సంజయుని మా
టలును, నీ వన్నపలుకులును వింటి.
నీమది ధర్మైకనిష్ఠమె యున్నది;
వైరంబు విడువరు వారు. ద్రోణ—
భీష్ములు గల రని బిరుదులై యున్నవా;
రగునె రాజన్యుల కడఁగి కుడువ?
అక్లేశవృత్తి రాజ్యము చవి గొన్నవా
రేల యిత్తురు నీకుఁ బాలు సెపుమ?
తే. ధార్తరాష్ట్రులు సడికి, నధర్మమునకు
నలుక రెన్నఁడు; విడువు దైన్యంబు; పాడువు
కయ్య; మరివర్గజయమునఁ గలుగు నిహప
రములుఁ జిరకీర్తియును, బాండురాజతనయ. 3౫

మ. గురు భీష్మాదులు సూచుచుండ, సభ మీకుం గీడు నాఁ డట్లు దు
ష్కరులై చేసిరి ; యంత సేసియును బశ్చాత్తాపముం బొంద నో
పర వా రెన్నఁడు ; నట్టిచోటఁ గృపయుఁ, బంధుత్వముం దక్కఁ; మె
వ్వరుఁ గోపింపరె యాదురాత్మకులగర్వ క్రౌర్యముల్ సూచినన్ ? ౩౬

వ. [1]కపటపు నెత్తంబు నెపంబుగా మిమ్ము వెడల నడచునప్పుడు దుర్యోధన దుశ్శాసన శకుని సూతనందనులు [2]పుయిలోటదక్కి కలకల నవ్వుచుం బలికినపలుకు లుగ్గడింప వచ్చునే? వాని విని సమస్తజనంబులు ధృతరాష్ట్రు నిందించుచు, మీరు బలవంతులరయి యుండియు సత్యంబు వాటించి [3]యూరక పోక సూచి యచ్చెరువాటుతో నుమ్మలించు చుండిరి. తిట్టువాట్లం బోయెడువారు దైవోపహతులై మున్న చెడి యుండుదురు గావున, వారలం జెఱుపనుం జులుకన. క్రూరాత్ములగు కౌరవు లెల్ల వారికి వధ్యులుగాఁ దగుదురు ; నీ కేల యవధ్యులైరి ? పాపాత్మకులగు హింసకులం బాముల నెట్ల ట్లనిర్విచారంబుగా వధించుట కర్తవ్యంబు. ౩౭

క. మీతండ్రికి, భీష్మునకుం
జేతోముద మొదవ భక్తి సేయన తగు నీ ;
[4]కాతలకు నేను జని వి
ఖ్యాతంబుగ నీదువినయ మభివర్ణింతున్. ౩౮

క. చెలులుం జుట్టలు దేశం
బులరాజులు వినఁగ నీదుపుణ్యచరిత్రం
బుల్, నీవు ధర్మమార్గము
దలఁచుటయుం దెలియఁ బలికెదం గురుసభలోన్. ౩౯

---

1. కపటపు నెత్తంబు నెపంబుగా = మోసపుజూదము మిష – వంక – పెట్టి. 2. పుయిలోట దక్కి = సంకోచింతలులేక. 3. ఊరక పోక = ఏమవక పోవుట. 4. ఆతలకు = ఆచోటికి – ధృతరాష్ట్రాదులకడకు.

వ. దానికి దుర్యోధనుం డియ్యకొనక తెఱంగు మాలినమాట లాడుటయుఁ, దండ్రి యతని వారింపనేరమికిఁ దో డుపేక్షకుం డగుటయుఁ జూచి, మీ తొల్లింటిపాట్లునుం దలంచి, యెల్లవారును వారిన గర్హింతురు. ఇంతియ కాక, మనకు నొండేమి వలయు? నాయోపి నంతయుఁ బెక్కుభంగుల సంధియ కావింపం జూచెద. అవ్విధంబు సిద్ధించిన మేలు గాదె? అట్లు గాక తక్కిన, నచ్చోటి యుత్సాహంబుచందం బును, నందుఁ జేయం గలవారి వర్తనంబులుఁ, గొలందులు నెఱింగి, నీకు విజయం బగు విధంబునం జనుదెంచెద. ౮౦

తే. ఆసుయోధనుముక్కున [1]నావి గలుగఁ
బుడమి నీ కీఁడు; గావునఁ, [2]బోర కలుగు.
నేను గయ్యపుశకునంబు లెన్నియేనిఁ
గంటి; నీ వనుత్సాహివి గాఁగ వలదు. ౮౧

వ. చతురంగబలంబుల నాయితంబు గావించుచు, దొరలం బురికొల్పి కొనుచు, నాలస్యంబు లేక సమరంబునకు సన్నాహంబు సేయుచుండ వలయు"నని పలికిన విని, వృకోదరుండు దామోదరున కిట్లనియె:

క. "సమరంబు గలుగు ననుచును
మము వెఱపింపంగ వలదు; మాధవ, నీ వా
కుమతియగు ధార్తరాష్ట్రుఁడు
శమించు కార్యంబు నడపు సౌజన్యమునన్." ౮౩

వ. అని వెండియు, ౮౪

శా. "పాపాత్ముండు మదాంధుఁ డాతులువ, నీపం పెట్లునుం జేయఁగా
నోపం; డడ్డము సెప్ప రెవ్వరును; మానోద్రేకమున్ గర్వముం

---

1. ఆవి గలుగ = ఊపిరియుండఁగా. ఆవి = (దే వి.) శ్వాసము, ఊపిరి, తాపము.
ప్రి. 'విహరించున్ మలయానిలంబచటఁ
దావిం జిల్కు సెమ్మోని యావి హరించున్'—విజయ, అ. ౨
2. పోర కలుగు = యుద్ధమేయగును.

గోపంబుం దనుఁ ద్రిప్ప నాప్తజనులం గుందించుటం, బోయిన
ట్లే పో నిత్తురు ; గాన, నిన్నతఁడు జాలిం బెట్టెడుం జూడుమీ !

ఉ. చొచ్చినచోన చొచ్చి తెగఁజూచెద నంచుఁ గడంగు చుండు ; న
న్మెచ్చఁడు బాహుగర్వమున నీచు సుయోధనుఁ ; డట్టివానితోఁ
బొచ్చెము లేక కూడి మనఁ బోవక పోవఁగ రాదు నాకు ; [1]వి
వ్వచ్చుఁడు, రాచవారుఁ గురువంశముచేటున కోప కుండుటన్. ౮౬

ఉ. పాండవ కౌరవుల్ గలసి పాలును నీరును బోలె నెమ్మమై
నుండఁగ, దుష్టచేష్టల సుయోధనుఁ డింతలు సేసె ; నాతఁ డొ
క్కండ కులక్షయంబునకుఁ గారణ మం ; డ్రిది తప్ప ; దైన నీ
వొం డన నేల ? ఆబిరుదు నోపినయంతయుఁ దీర్పు నేర్పునన్. ౮౭

చ. [2]తన పొరిపోవునంతకు నుదగ్రతయుం గపటంబు మాన నే
ర్చునె ధృతరాష్ట్రసూనుఁడు ? యశోభరితం బగుభారతాన్వయం
బున కొకనింద వచ్చు ననుబుద్ధి దురాత్మున కేల కల్గు ? నా
యనమెయిఁ బోయి హీనగతి నైన ఘటించిన నెంత యొప్పునో ?

మాకును వారికిఁ బితామహుం డగుభీష్ముండు విను చుండ, సుయో
ధనుతోడం గురుకులేశ్వరు నాస్థానంబున నావచనంబులుగా నిట్లనుము:

తే. 'అన్నదమ్ముల మై యుండి యకట మనల
నొరులు దలయెత్తి చూడ నొండొరులతోడఁ
బెనఁగ నేటికి ? ఈ నేల, పెద్దవారి
బుద్ధి విని, పంచి కుడుచుట పోలదొక్కొ ?' ౯౦

క. అని, యెవ్విధమున నైనను
వనజోదర, సంధి సేయ వలయుం దగ ; నే

1. వివ్వచ్చుఁడు, రాచవారు = బీభత్సుఁడు (అర్జునుఁడు) రాజుగారు (ధర్మరాజు). 2. తన పొరి...సూనుఁడు = తా జచ్చునందాక గర్వమును కపటమును మాననేర్చునా ధృత రాష్ట్రుని కొడుకు ?

మును వారును గలయుట భూ
జనులకు నెల్లను హితంబు సౌఖ్యకరంబుల్." ౫౧

చ. అనుటయుఁ బిన్ననవ్వు నగి యంబుజనాభుఁడు వల్కెఁ: "నెన్నఁడున్
వినవివి భీముపాలఁ గడు వింతలు వింటిమి మాట; లగ్గి చ
ల్ల నగుట, భూరిభూధరము లాఘవ మొందుట గాదె, యివ్విధం
బున నితఁ డిప్డు మార్దవముఁ బొందుట; యిం కిట చెప్ప నేటికిన్ ?"

—: శ్రీకృష్ణుఁడు భీమసేనునిఁ గౌరవులతోడియుద్ధమునకుఁ బురికొల్పుట :—

తే. అని, సహోదరు లాజి నాయాసపడుట
కోర్వమియుఁ, గౌరవులఁ జంప నొల్లమియును,
గలుగునెయ్యంబు పెంపునఁ గరుణ నార్ద్రుఁ
డైనపవనజుఁ బురికొల్ప నాత్మఁ దలఁచి — ౫౩

వ. మురమర్దనుం డతనితో ని ట్లనియె : ౫౪

ఉ. "యుద్ధముమీఁది వేడ్కయు, మహోగ్రవిరోధుల నల్కఁ జేయు ద
ర్పోద్ధతియున్, సుయోధనునియున్నతి సైఁపనియేపు, రాజ్యసం
సిద్ధి నిజాగ్రజన్మునకుఁ జేయుతలంపును గల్గునీ వసం
బద్ధము లైనవాక్యములు వల్కుట యొప్పునె, కీచకాంతకా !" ౫౫

వ. అని యంత నిలువక— ౫౬

క. "వెఱ పెట్టిదియో యెన్నఁడు
నెఱుఁగని నీయట్టివాని కెవ్వరొకో యీ
పిఱికితన మింత యలవడఁ
గఱపినవా ?" రనుచు శౌరి కలకల నవ్వెన్. ౫౭

వ. దానికి దరహాసితవదనుం డగుచు భీమసేనుండు వసుదేవసూనున
కి ట్లనియె : ౫౮

ఉ. "బంటుతనంబుమాటలకుఁ బోఁటకు, 'పాండునృపాలుపాలు గై
కొంటయ చాలు' నన్న నృపకుంజరుపల్కుల కడ్డ మాడ రా
కుంట యెఱుంగవే? మును సుయోధనుచందముఁ జూపి, 'యప్పు డే
మంటి యుపేంద్ర, న' న్నని రణాగ్రమునన్ [1]నిను మాదలించెదన్.

క. నాకోలఁది విచారింపక
నీ కి ట్లనఁ దగునె? మిన్ను నేలయు నిమ్మైత్రఁ
గాక తిరుగంగఁ బడినం
బోకే ముంజేతు లొడ్డి పోవఁగఁ ద్రోతున్." ౬౦

ఉ. నావుడు, "నవ్వుటాల కనినం, బవనాత్మజ, యింత యేటికిం?
గేవలయోధవే పరులకిల్బిషముల్ దలపోయ కిమ్మెయిన్
[2]జావడ మైనఁ జూచి, యిది చందముగా దని యంటిఁ గాక, నీ
చేవయు లావు, నీదు మును చేసినభంగులు నే నెఱుంగనే?" ౬౧

వ. అని చెప్పి మాధవుండు మఱియును, ౬౨

ఉ. "పార్థుఁడు పోరఁ దేరు గడపం దనకున్ ననుఁ గోరి యెంతయుం
బ్రార్థన సేసె; దాని కనురాగము వొందితి నేను; గాన, యు
ద్ధార్థుల మైనమాకు నిను నాసపడం దగదే? యశంబు నా
నార్థములున్ విరోధివిజయంబునఁ దక్కఁగ నొంటఁ గల్గునే?" ౬౩

వ. అనవుడు, ౬౪

---

1. నిను మాదలించెదన్ = హెచ్చరింతును. మాదల రూ. మాదలిక = (మాల + తల దే. వి.) నిరూపణము, తార్కాణము, హెచ్చరిక.
ప్ర. వేదములకు నఖిలస్మృతి। వాదములకు...
వాదైనచోటులను దా। మాదల ధర్మార్థకామమోక్షస్థితికిన్ - విరాట. ఆ. ౧.
మాదలించు = (దే. స. క్రి) నిరూపించు, తార్కాణించు, హెచ్చరించు.
ప్ర. 'పాండునృపాగ్రనందనుఁడు...నొండొరు మాదలించుకొని'_కర్ణ. ఆ. ౨
2. దే. జావడమైనఁ(జూచి = పిఱికితనగుటచూచి.

శా. "ఏమీ! పార్థుఁడు, నీవు నండిమగ లై యీవచ్చు కౌరవ్యసం
గ్రామక్షోభము, బాహుదర్పమునఁ దీర్పం, బెద్దమి ట్రెక్కి మి
మ్మేమ్మె మెల్లన్ వెఱఁ గంది చూచెదముగా కీసారెకుం బోయి రా!
భీముం డిత్తఱి రిత్తమాటలకుఁ గోపింపండు సూ పెం పఱన్!" ౬౫

వ. అని పలికి యివ్విధంబున గోపాల దేవు మేలంపు మెయివడి కార్య వచ
నంబులకుం దగం దానును దోడ్తో సరసం బాడుటయ కా మఱుమాట
లాడి యంతటఁ దని వోవక బకమర్దనుం డతనితో ని ట్లనియె: ౬౬

ఉ. "కయ్యము గల్గినట్లయిన, గంధగజప్రకరంబుకుంభముల్
వ్రయ్యఁ, దురంగపంక్తులు ధరం బడఁ, దేరిగముల్ [1]బడల్పడన్,
[2]డయ్యమి కీవు వెక్కసపడన్ [3]గదపండువు సేయఁ గోరునా
దయ్యము నెత్తికోలు దుదిదాఁకుట గాదె భుజంగభంజనా!" ౬౭

చ. అన విని, దేవకీతనయుఁ డాతని కిట్లనుఁ: "జెప్పినంతకం
టెను మిగులంగఁ జేయుదు; గడింది మగండవు, [4]నిన్నుఁ దెప్పగాఁ
గొని పలుమాఱు నాపదలకున్ భయ మొందక దుఃఖవార్ధి లీఁ
దిన మము నెల్ల, నిక్కొఱఁత దీర్చి, సుఖాత్ముల జేయు పావనీ. ౬౮

క. ఇదె పోయెదఁ, [5]గౌరవ్యులఁ
బదనికి రాఁ బలికి సంధివాటించెద; నా
కది యెప్పుడె? కాని తుదిం
గుదు రింతకు నీవ కావె గుణరత్ననిధీ!" ౬౯

---

1. బడల్పడన్ = తొట్రుపడఁగా. విఱిగిపోగా. 2. డయ్యమికి = నాబహలమికి, నా యల సట జెందకుండుటకు. 3. గదపండువు...గాదె = గదతో పండువుసేయఁగోరు నా విధానము తుదిముట్టుటయేగదా? 4. నిన్నుఁదెప్పఁగా...మము నెల్ల = నిన్ను తెప్పకొయ్యఁగాఁ గొని, తఱచు ఇడుమలకు జడుపొందక, దుఃఖసముద్రముల నీఁదిన మమ్మందఱను.
5. కౌరవ్యులఁ...వాటించెద = కౌరవులను పక్వమగునట్లుచెప్పి సంధి పొందింతును.

—: అర్జునుఁడు శ్రీకృష్ణునితోఁ దనయభిప్రాయంబు సెప్పుట :—

వ. అనిన వాసుదేవున కర్జునుం డిట్లనియె : ౨౦

తే. "చెప్పఁ గలయంతవట్టును జెప్పె నీక
జాతశత్రుండు ; వింటి వీ వాతెఱంగు.
మాకు నెల్లను బలుకంగ మాట లొండుఁ
గలవె? యినను జెప్పెదఁ గన్నయంత. ౨౧

మ. 'ధృతరాష్ట్రుం డతిలోభదూషితుఁడు, ధాత్రీభాగ మీ నేర్చునే?
సుతుఁడుం గష్టుఁడు ; సంధి యేల యగు' నంచున్ మున్న కైపెక్కిన
ట్టితలం బచ్యుత, నీకుఁ గల్గినది. గాండీవంబు దివ్యాస్త్రసం
తతియుం బెట్టినయట్ల యుండ మముఁ జింతం బాప రాదో కదే? ౨౨

ఉ. నీ వొనరింపఁ బూనినపనిం, గమలోదర, కీడు పుట్టునే?
కా వనినట్ల యుండి యవుఁ గార్యము ; లట్లగుటం [1]బ్రయత్నసం
భావన సేఁత పౌరుషముపద్ధతి ; తత్ఫలసిద్ధి వొందుచో
దైవము దోడ్పడన్ వలయుఁ ; దథ్యము రెండును నీవినోదముల్ ౨౩

ఉ. [2]వేరిమి ధర్మజుం బరిభవించిన ద్రోహులు వధ్యు లన్న నె
వ్వారికిఁ బోలదే? సుజనవత్సల, నీ విటులంట వారు మ
మ్మారస మెత్తి కీడ్పఱచి యింతలు సేసినదాన నీమదిం
గూరిన నొవ్వుసొంపునను, గోపము పెంపునఁ గాదె యారయన్? ౨౪

ఉ. ఐనను జిత్తగింపు, ద్రుపదాత్మజ నాసభ నట్లు సేసినన్
దానికి సైఁప లెస్స యని, దైన్యముఁ బొందుట కోర్చి, యిమ్మెయిం
గాననభూమికిం జనుట, కారుణికోత్తమ, నీ వెఱుంగవే?
కాన సహించి పాండవులఁ గౌరవులం దగఁ గూర్ప నేర్పునన్. ౨౫

1. ప్రయత్న . . . పద్ధతి = జతనము నాలోచించుట మగఁటిమి తెఱఁగు. పౌరుషము (సం. వి. అ. న.) పురుషకారము, పురుషప్రయత్నము, పురుషవ్యాపారము, పరాక్రమము మగఁటిమి, మగతనము. 2. వేరిమిన్ = వైరముతో.

తే. అలవి యెఱుఁగక ధార్తరాష్ట్రులు గడంగి
మమ్ముఁ బఱిచిన పాటులు మానసమునఁ
[1]జవుటఁ బెట్టినవిత్తులచంద మొంది
యంకురింపక చెడి పోయె, నంబుజాక్ష! ౨౬

వ. అమ్మెఱకుల నెమ్మెయి సయినను, ౨౭

క. ఒడఁబఱిచి మాకు వారికిఁ
బుడమి సగము గాఁగఁ జేసి పొంది పొసఁగి యుం
డెడునట్టి తెఱఁగు సేయుట
కడు మే; లది గౌరవము, సుఖంబును జేయున్. ౨౮

క. నీకిట్టిది చిత్తమునకు
రా కుండిననేని "వలదు రం; డిమ్మెయి మీ
రీకార్యము సేయుం' డని
మా కానతి యిమ్ము, కంసమర్దన, తెలియన్. ౨౯

మ. హిత మిబ్భంగిది మాకు; ధర్మము తెఱం గిట్లుండు నం చేను నీ
మతిబోధింప వలంతినే? హితము ధర్మంబున్ విచారించి చూ
చి 'తగుం బో' మ్మని యేది పంచి తది నిశ్చితంబునం జేసి, యు
న్నతిఁ బొందం గలవార మై యునికి, కృష్ణా, నేఁడుగా వచ్చునే?"

వ. అనిన విని, కృష్ణుండు విజయున కి ట్లనియె: ౩౧

చ. "వెరవున లావునం గృషికి వేయువిధంబుల మే లొనర్చినన్
దొరకొనునే ఫలంబు దఱితోఁ దగువర్షము లేక యున్న? ఎ
ప్పరుసున నెన్ని సేసినను, బౌరుషముల్ ఫలియించు నెల్ల నా
దరణమునం బ్రసన్న మగుదైవముచేఁతన చూవె, ఫల్గునా! ౩౨

---

1. చవుట...మొంది = చవుటినేలఁ బెట్టిన విత్తులవలె.

ఉ. కావున, సంధికిఁ బురుషకార మొనర్చిన నోపినంతయుఁ;
దైవముచేఁత యెట్లగునొ! యని నెఱుంగ; [1]సుయోధనుండు సం
భావన సేసి పాలొసఁగుపాడియ కల్గిన, బాల్య మాదిగా
నేవిధి నైననుం జెఱుప నింతలు పాపము లాచరించునే? ౮౩

వ. అది యెల్ల నట్లుండె — ఇచ్చట విరాటుపసులం బట్టింప నీవు వోయిన యప్పుడు భీష్ముండు దుర్యోధనుతోఁ జెప్పిన తెఱంగు: ౮౪

ఉ. 'వచ్చినవాఁడు ఫల్గునుఁ, డవశ్యము గెల్తు మనంగ రాదు; [2]రా
లచ్చికి నై పెనంగిన బలంబులు రెండును గెల్వ నేర్చునే?
[3]హెచ్చుగుఁ, గుం దగుం; దొడరు నెల్లవిధంబుల కోర్చుట; ట్లగా
కిచ్చఁ దలంచి యొక్కమెయి నిత్తఱిఁ బొం దగుచేఁతయుం దగుఁ.' ౮౫

వ. అనియె. దాని కతం డుత్తరం బిచ్చిన తెఱంగు — ౮౬

ఆ. 'మనకుఁ బాండురాజతనయవర్గమునకు
నెట్లు పొందు గలుగు? నేను రాజ్య
భాగ మీను సమరభంగిక విక్రమ
నిరతిఁ బూను; టిదియ నిశ్చయంబు.' ౮౭

వ. అని పలికె. అది యంతయుఁ బరంపడి మన మెల్ల వింటిము కాదె? ఆమాటల ఫలం బప్పుడ కనియు నాకష్టాత్ముండు వెండియుఁ దెలియండు. ౮౮

తే. అతనిగుణదోషములచందమట్ల యుండె —
నాకు ధర్మజుబుద్ధిస నడప వలయు;

---

1. సుయోధనుండు...పాపము లాచరించునే = ఆదరించి పాలిచ్చుపద్ధతియే కలిగియుండినయెడల, చిన్నటనుండి ఏవిధమ ననయిన మిమ్ముఁజెఱచుటకు ఇంతలు కీడులుసేయునా? 2. రాలచ్చికి...గెల్వనేర్చునే = ? రాజ్యలక్ష్మికై పోరునెడ రెండుపక్షములును గెలువఁగలవా? 3. హెచ్చుగు...కోర్చుట = ఎక్కువగావచ్చును, తక్కువగావచ్చును—పెనఁగుట ఎల్లవిధముల కోర్చుట.

ని త్తెఱం గాచరింపంగ నేఁగి యచట
నెల్ల తెఱఁగును నేర్పడ నెఱిఁగి వత్తు. ౮౯

చ. అనిన, ముకుందుతో నకులుఁ డల్లన యి ట్లను : "నీకు ధర్మజుం
డును బవనాత్మజుండు నరుఁడుం డగఁ జెప్పుట రిత్తగాదు. మా
మనము, లరణ్యవాసమున మత్స్యమహీపతిపాల నున్నయ
ద్దినములభంగి గాదు, [1]కృపఁ దీవ్రతఁ గుందినచంద మయ్యెడుఁ. ౯౦

క. కడవఁగ నొకళ్ళ పసరము
నడచిన, నొక్కళులుఁ బెయ్య నడువ వలయునే?
చెడు తెరు వాకౌరవ్యుల
కడ నిలుచుం గాక, మనకుఁ గార్యం బేలా? ౯౧

సీ. గోగ్రహణంబునఁ గోలె నెంతయు మెత్తఁ
బడ కుండుదురె వారు, పద్మనాభ?
నీయనుగ్రహమున నెమ్మిమైఁ గూడిన
బలము లే డక్షౌహిణులను, దొరల
పాంచాల యాదవ పాండ్య కైకేయ మా
త్స్యుల తెంపు లెఱుఁగక యున్నవారె?
భీమార్జునుల లావుపెంపును, నీసహా
యంబును, గలుగుట కలుక రెట్లు?
ఆ. గురుఁడుఁ గృపుఁడు బాహ్లికుఁడు భీష్ముఁడును బుద్ధి
సెప్పి వారిఁ జక్కఁ జేయ రెట్లు?
కార్య మీవు సెప్పఁగా, విదురుండు వి
నంగ, నెట్లు గా దనంగ వచ్చు? ౯౨

వ. అట్లుం గాక, నీవు దమపాలికిం బోవుట ధార్తరాష్ట్రు లాదరింప కుండ

1. కృప...గుందినచంద మయ్యెడుఁ = మామనస్సులు దయయందును తీవ్రతయందును కొఱఁతపడినట్లున్నవి.

వెఱవరే? నీపోయినప్పుడ యీకార్యంబు చక్కనగు"ననిన విని, సహ
దేవుండు వాసుదేవున కిట్లనియె: ౯౩

ఉ. "[1]రక్కసమాట లాడెదరు రాజును దమ్ములు; [2]వానిలోన నీ
వొక్కటి యైనఁ గా దనక యూఁకొను చుండుట యంతకంటె మే;
లక్కట! [3]ఇట్లు వేఁడికొన నైనను బోయెదు వో? సుయోధనుం
డెక్కడ, భూమిలోన సగ మిచ్చుట యెక్కడ దానవాంతకా? ౯౪

మ. తలఁపం గూడునె యింతలేసిదొరలీదైన్యంబు? చుట్టంబులుం
జెలులుం దిట్టరె? లాఁతిరాజులకు మెచ్చే యివ్విధం? బిట్టిదిం
గలదే! వేఁడగ ధర్మజుం, డడుగఁ బోఁగాఁ గృష్ణుఁ, డాధార్తరా
ష్ట్రులు పాలీక చలంబునం బెనఁగ, నిట్లుం గూడు దీ పయ్యెనే! ౯౫

ఉ. వీరలు ధర్మమార్గము సవిస్తరతం దగ నాడి రేనియు,
న్వారలు దాని కియ్యకొనిరన్, విను మచ్యుత, యట్టిసంధి పెం
పారఁగ నేర్చునే? ఉచిత మైనది కయ్యము, వంకమాట లే
నేరఁ; గురుప్రవీరుసభ నిశ్చయ మిట్టిద కాఁగఁ జెప్పుమీ. ౯౬

మ. [4]తుది రాజ్యమ్మునసగమ్ము గొ; మ్మడవియందుం బేరు వంచించియుం
బదుమూఁ డేఁడులు, నీవుసం, దిరిగి రాఁ బాలీక పో వచ్చునే?
అది గాదేఁ దెగి బంట వై యుఱుము; మాయల్ వన్ను నే ర్పింకఁ జె
ల్లదు సూ నీ! కని యాసుయోధనునియుల్లం బుచ్చి పోనాడుమీ."

---

1. రక్కస...తమ్ములు = ధర్మరాజు, అతనితమ్ములును సహింపఁగానిమాట లాడుచురు.
2. వానిలోన...అంతకంటెమేలు = అమాటలలో నొక్కటియైనఁగాదనక నీవు ఊకొట్టు చుండుట = (ఊఁఊఁ అనివినుచుండుట) అంతకంటెమేలు = (వారిమాటలకంటెను మేలు)
3. ఇట్లు...వోయెదువో = ఇట్లు ఐదుఊళ్ళుఇమ్మని రాజీగమ్మని వేఁడుకొనఁగూడఁ బోయె దవుపో — పోయినను...
4. తా. అడవియందును, అజ్ఞాతమునను పదుమూఁడేఁడులు తిరిగిరాఁగా మాకు భాగ మీయకపోవచ్చునా? మాకుఁ బంచియిచ్చి తుది (=పిమ్మట) నీవును రాజ్యము సగము గొనుము, అదిపొసఁగనిచో, తెగించి వీరునివలె నెదుర్కొనుము. మాయలుపన్ను నీనేర్పు ఇఁక జెల్లదుసుమా! అని సుయోధనుని ఉల్లంబుఉచ్చి (మనస్సునదూరి) పోవు

మ. అనినన్, సాత్యకి ప్రీతుఁడై, "యితఁడు లెస్సెన్న యుండఁ బల్కెం; బ్రమో
జనముం గల్గదు, గౌరవంబుఁ జెడు, దుశ్చారిత్రకుం డాసుయో
ధను బోధింపఁగఁ బోయినన్; సరభసోత్సాహంబులై నన్నవీ
రనికాయంబున కెల్లనం బ్రియము సంగ్రామంబు; మే లెమ్మెయిన్."

వ. అనిన విని, రథికవరు లందఱు 'సహదేవుం డింత యొప్ప నాడునే! సాత్యకిపలుకు లిట్లుండునే! తక్కటివి యెక్కడిమాటలు! పగవారి నడిగికొనం బోవుట యుచితంబె! కయ్యంబు కర్జంబు గాదె! భంగంబు నీఁగికొనం దగదె!' యనునివి మొదలుగా ననేకు లనేక ప్రకారంబుల వీరాలాపంబులం, గొలువెల్ల నొక్కమ్రోఁతగాఁ జెలంగినయెలుంగులు నింగి ముట్టె. తదనంతరంబ — ౯౯

---

నట్లు పల్కుమా.

[ఈ పద్యమొక చిక్కుసమస్యకు ఉదాహరణముగా వాడుదురు. కొందరు 'నీవునన్' అనుదానిని 'నీవనన్ (=నీవు అనఁగా) అనిదిద్ది అర్థముచెప్పి సమర్థించుకొని సమాధాన పఱచుకొనుచున్నారు. తిక్కనరచనయం దిట్టివి పరిపాటి. కర్త కర్మ క్రియల నేమాలనో విసరివైచుట, వాక్యము అసమాపకముగ వదలుట తిక్కన రచనలోఁ బెక్కులు గాన్పించుచున్నవి. 'నీవునన్' అనుదానిని 'తుదిరాజ్యమ్ము సగమ్ము గోమ్ము' అనువాక్యముతోఁ జేర్చినచో అర్థము సుకరము.

పైయట్టివానికి తిక్కనరచననుండి ఉదాహరణములు:—

౧. బాలసఖుండవు; నాకును నీ లెస్సదనంబు. నేము నీతివిడిచి దు
శ్శీలుర మగుటయు శైశవ లీల మొదలుగాఁగ మును దెలియదే నీకున్"
('మశ్శీలురమగుటయు' అనుదానిపొంత నుండవలసిన 'నీకున్' కడఁబడినది)

అసమాపకమునకు —

౨. "అంతలుసేసి, పోనడిచి యక్కట! సంజయుచేతఁ జెప్పి పు
త్తెంతురె! ఇట్టియూఱట మదిం బ్రియమంది యుధిష్ఠిరుండు! దా
నంతన యూళ్ళు లేవురకు నైదు సుయోధనుఁ డిచ్చునొక్కో!"

(ఇందు 'ఇట్టియూఱట...యుధిష్ఠిరుండు' అనునది అసమాపకము. తరువాతి తలంపు పైకొనుటచే ఆవాక్య మంతట ఆగినది. సహజముగు మాటవరుసపాటించి చూపినాడు తిక్కన.) కావున 'తుదిరాజ్యమ్ము' పద్యమున వాక్యము పైవిధముగా దండాన్వయముచేసి గ్రహింపఁదగును.]

—: ద్రౌపది కృష్ణునితోఁ దనమున్నుపడిన భంగపాట్లు చెప్పుట :—

*తే. ధర్మనందనుపలుకులు దనకుహృదయ
తాప మొనరింప, మోమున దైన్య మొంద
నన్నపాంచాలి యిట్లని యొయ్యఁ బలికెఁ
గనలి శౌరితో గద్గదకంఠి యగుచు. ౧౦౦

ఉ. [1]అంతలు సేసి పో నడిచి, యక్కట! సంజయుచేతఁ జెప్పి పు
త్తెంతురె? ఇట్టియూఅట మదిం బ్రియమంది యుధిష్ఠిరుండు...దా
నంతన యూళ్లు లేవురకు నైదు సుయోధనుఁ డిచ్చునో కొ? ఈ
కంతకృపావిహీనమతి నాతఁడు నేఁచునె యన్నదమ్ములన్!! ౧౦౧

---

1. అర్థము సుకరము. భావమందలి విశేషము : 'సంజయుచేతఁ జెప్పి పుత్తెంతురె? అనిన చోట 'సంజయుచేత అను మాటలో ఊతమున్నది. ధర్మజుని మోమోటపెట్టఁ దగిన, నేర్పరిని సంజయుని బంపినారే! అని వారి సమయాభిజ్ఞతకును, స్వభావ గ్రహణ కౌశలమునకును, కుటిల ప్రయోగమునకును వింతపాటు. ఇట్టి యూరట యుధిష్ఠిరుండు అనువాక్యమున వెక్కసపాటు. అదియు అంతలో, 'తానంతనె సుయోధనుఁ డిచ్చునో కొ' అనిన సందియపాటు మేకొని, పైవాక్యము వంతటితో నాకట్టినది. ఇది స్వభావము. చూడుఁడు —

"కిమపి కిమపి మన్దమ్ మన్దమాసక్తియోగా
దవిరళిత కపోలమ్ జల్పతో రక్రమేణా" —ఉత్తరరామచరిత, అంక ౧.

(ఇట 'జల్పతోః అక్రమేణ' ఒకవరుస పాటింపని మాటలతో ననుట. ఇట్లే పై 'ఇట్టి యూఅట' వాక్యమును గ్రహించునది)

'ఈ కంత...యన్నదమ్ములన్' అనుటలో పంగెన (=ఎత్తిపొడుపు)

---

* ౧౦౦ పద్యమునుండి ౧౧౭ పద్యములవరకు మూలము.

సుతా ద్రుపదరాజస్య స్వసితాయతమూర్ధజా
సమ్పూజ్య సహదేవం చ, సాత్యకిం చ మహారథమ్.
భీమసేనం చ సంశాన్తం దృష్ట్వా పరమదుర్మనాః
అశ్రుపూర్ణేక్షణా వాక్యమువా చేదం మనస్వినీ
"విదితం తే మహాబాహో ధర్మజ్ఞ మధుసూదన
యథా నికృతి మాస్థాయా భ్రంశితాః పాణ్డవాః సుఖాత్
ధృతరాష్ట్రస్య పుత్రేణ సామాత్యేన జనార్దన

చ. [1]తన మునుపడ్డబన్నములు దమ్మునిపైఁ గలకూర్మి పేర్మి, నీ
జనపతి సైఁప కున్నె? అది సక్కన! రాజ్యముపాలు లేక తీ
ఱున కొడఁబాటు గల్గిన, నెఱుంగమి వెట్టరె? ‘చాల రైరి వీ’
రనరొకొ? ‘నాన లేమి’ యని యాడరె లోకమువారు కేశవా?

శా. [2]పెంపేదం దమ కిట్టితక్కువలు భాషింపంగ నేలా? విచా
రింపన్ వారికె మేలు సంధి. తము, వారిం జూచినం, దారు సా
ధింపం జాలరొ? కాక, పోరఁ దగ మర్దింపం దలంపేని శం
కింపం బట్టొకొ? వారు బ్రాహ్మణులె యేకీడైన సైరింపఁగన్? ౧౦౩

ఉ. [3]ఓట యొకింత యేనియు సుయోధనుచిత్తమునందు లేదు; నీ
మాటలఁ బోవునే, దురభిమానము యెక్కుడు పూనుఁ గాక; య

---

1. ఇందునను అక్కసము కక్కసముతో వెక్కసపాటు పెనఁగొన్నది. ‘రాజ్యమున పాలులేక తీఱునకు (=రాజీకి) ఒడఁబడుట కలుగుచో లోకమువారు: తెలివిలేనివారనరా? చాలరైరి (=ఎదుర్కొనలేకపోయిరి) వీరు అనరా? నానలేమి(=సిగ్గులేకపోవుటచే) అనరా?’
[అని లోకము వారిని నిమిత్తముగాఁ బేర్కొని తానే అన్నిమాటలు అని తీర్చినది.]
2. తా. గొప్పతనము మాని తాము ఇంత తక్కువకోరుటేల? పరిశీలించినచో ఈసంధి వారి (కౌరవుల)కే మేలు. తమున్ (ఈ పాండవులను), వారిన్ (కౌరవులను) చూడఁగా దారు(పాండవులు) తమ పాలు సాధింపఁ జాలరైరి కాని, సంగ్రామముఖముననే నిజముగా వారిని మర్దింపవలయు నను తలఁపు పుట్టియేయుండినచో సందేహింపఁదగిన సమయమా?...
[అని మెలపుతోఁ బోరికి ఎసగొల్పుచున్నది. ‘వారు బ్రాహ్మణులె యేకీడైన సైరింపగన్’ అని క్షాత్త్రమును క్షత్త్రియకర్తవ్యమును సూచించినది.]
3. తా. జంకు ఒక్కింతయైన సుయోధనుని మనస్సున లేదు. దురభిమానమే ఎక్కుడు పూనుంగాని, నీమాటలవెంట నడచునా? ఆచోటనే (కౌరవుల కడనే) సంగరములయ్యెడు జాడలు పుట్టినయెడలనైనను ఈ పాండవుల పోటు (పోరు) నకు ఇచ్చగింతురా? మరల కొనలనుండఁ బోవుదురా?
[ఇచటను బోరికిఁ బ్రోత్సాహము; భావిసూచన]

---

యథా చ సఞ్జయో రాజ్ఞా మన్త్రం రహసి శ్రావితః.
యుధిష్ఠిరస్య దాశార్హ తచ్చాపి విదితం తవ,
యథోక్తః సఞ్జయ శ్చైవ తచ్చ సర్వం శ్రుతం త్వయా.

చోఁ్చటన సంగరంబు లగుచోఁ బ్రాలు వుట్టిన నైనఁ బాండవుల్
పోటున కిచ్చగింతురొకొ ? పోదురొ కానలనుండ, నచ్యుతా ! ౧౦౪

ఉ. [1]ఏ నిటు లంటి నా వలవ ; దింకను నీవును రాజుఁ దమ్ములుం
గా నుచితంబు సూచి, మనకార్యము, మీసుజనత్వముం, జెడం
గా నొకభంగి సేయక, తగం గురువర్గముతోడిసంధి మీ
కైన తెఱంగునన్ వలచినట్టుల చేయుఁడు నేర్పు లేర్పడన్." ౧౦౫

వ. అని మఱియు నిట్లనియె : ౧౦౬

1. తా. నేనిట్లు అంటి ననవలదు. ఇంకను నీవు, ధర్మరాజు, ఆయన తమ్ములునుగూడి తగువెరవుచూచి, మనపనియు (మనపాలు సాధించు కార్యము)ను, మీ మంచితనమును చెడునట్లు సేయక, మీకు అనువగు మార్గమున, మీయిష్టముచొప్పున, తగినట్లు నేర్పుతో కురువర్గముతోడి సంధిసేయుఁడు.

[ మాట తనపైఁ బెట్టుకొనదు. మీలో మీరు ఉచితమేదో ఆలోచించుకొమ్మని వారిమీఁదనే పెట్టినది. మనకార్యముతోఁగూడ మీమంచితనము చెడునట్లు చేయకుఁడని ప్రక్కపోటు పొడిచినది. మీరేమో మంచితనము కాపాడుకొనుఁడు. చెడ్డదానను చివరకు నేనేకాదా. అని నర్మగర్భోక్తి 'తగం...చేయుఁడు' అని ఏవగింపుతో నిసడింపు జోడించి జాడించినది. మనసు ఆఁగక చివర 'నేర్పులేర్పడన్' = తెలివితో వర్తింపుఁడని చుఱుకువుట్ట ఎచ్చరించినది. ]

పశ్చనస్తాత్ దీయన్తాం గ్రామాఇతి మహాన్యుతే
అవిస్థలం వృకస్థలం మాకన్దం వారణావతమ్.
అవసానం మహాబాహో కంచిదేకం చ పఞ్చమమ్
ఇతి దుర్యోధనో వాచ్యః సుహృదశ్చాస్య కేశవ.
న చాపి హ్యకరో ద్వాక్యం శ్రుత్వా కృష్ణా సుయోధనః,
యుధిష్ఠిరస్య దాశార్హ శ్రీమతః సంధిమిచ్ఛతః.
అప్రదానేన రాజ్యస్య యది కృష్ణా సుయోధనః,
సన్ధిమిచ్ఛేన్న కర్తవ్యం తత్రగత్వా కథం చ న.
శక్ష్యన్తి హి మహాబాహో పాణ్డవాః సృఞ్జయైః సహా,
ధార్తరాష్ట్రబలం ఘోరం క్రుద్ధం ప్రతిసమాసితుమ్.
నహిసామ్నా న దానేన శక్యోఽర్థస్తేషు కశ్చన,
తస్మాత్తేషు నకర్తవ్యా కృపా తే మధుసూదన.

ఉ. [1]"ఆఱడిఁబొక్కయుఁ, ఫలము నందుటయుం, గని పల్క నేరమిన్
మాఱటనోరిదాన నయి మాటలు చిత్తమునందు నిల్ప కేఁ
గాఱులు ప్రేలెదన్ ;—వినుఁడు, కర్జము నెగ్గును గాన నల్కమై ;
వీఱిఁడి యైనమానిసికి వెండి వివేకము గల్గ నేర్చునే ? ౧౦౭

చ. [2]వరమునఁ బుట్టితిన్, భరతవంశముఁ జొచ్చితి, నందుఁ బాండుభూ
వరునకుఁ గోడ లైతి, జనవంద్యులఁ బొందితి, నీతివిక్రమ
స్థిరు లగు పుత్త్రులం బడసితిన్, సహజన్ముల ప్రాపు గాంచితిన్ ;
సరసిజనాభ, యిన్నిటఁ బ్రశస్తికి నెక్కినదాన నెంతయున్ ! ౧౦౮

వ. అట్లుం గాక, ౧౦౯

1. తా. అల్లరిపా లగుటయు, దానిఫల మనుభవించుటయుఁ గనిమాటాడ నెఱుఁగక, వాగుడునోటిదాననయి, మనసున మాటలనిల్పలేక పొల్లుమాటలు ప్రేలుదును. కోప మువలన మంచి-చెడ్డలు గానను. వెఱ్ఱిమనిసికి మరల వివేకము గలుగఁ గలదా?

[ఇది ముందటి ప్రసంగమునకుఁ బీఠిక. తన కష్టపాటులకు, తన పరిభవములకు ఇంచుకంత వగపైన భర్తలకుఁ గలుగదేయని మంట.]

2 [లోన దుఃఖము పొంగి వచ్చుచున్నది. ఇన్నివిధముల నొప్పియు నాపాత ఇట్లు తెల్ల వాఱినదే యని యావేగము.]

౧౦౯, ౧౧౦, ౧౧౧, ౧౧౨ దుఃఖ మంతకంతకుఁ దీవ్రమగుచున్న జాడ.

సామ్నా దానేన వా కృష్ణ యేన శామ్యన్తి శత్రవః
యో కశ్యస్తేషు దణ్డః స్యా జ్జీవితం పరిరక్షతా.
తస్మాత్తేషు మహాదణ్డః క్షేప్తవ్యః క్షిప్ర మచ్యుత,
త్వయా చైవ మహాబాహో పాణ్డవైః సహ సృఞ్జయైః.
ఏతత్సమర్థమ్ పార్థానామ్ తవ చైవ యశస్కరమ్;
క్రియమాణం భవేత్కృష్ణ క్షత్రస్య చ సుఖావహమ్.
క్షత్త్రియేణ హి హన్తవ్యః క్షత్త్రియోలోభ మాస్థితః,
అక్షత్రియో వా దాశార్హ స్వధర్మ మనుతిష్ఠతా.
అన్యత్ర బ్రాహ్మణాత్తాత సర్వపాపేష్వవస్థితాత్,
గురుర్హి సర్వవర్ణానాం బ్రాహ్మణః ప్రసృతాగ్రభుక్.
యథాఽవధ్యే వధ్యమానే భవే ద్దోషో జనార్దన,
స వధ్య స్యావధే దృష్ట ఇతి ధర్మవిదో విదుః.

ఉ. నీవు సుభద్రకంటెఁ గడు నెయ్యము గారవముం దలిర్ప సం
భావన సేయు; దిట్టిననుఁ, బంకజనాభ, యొకండు, రాజసూ
యావభృథంబునందు శుచి యై పెను పొందిన వేణి పట్టి యీ
యేవురుఁ జూడఁగా సభకు నీడ్చెఁ!...కులాంగన ని ట్లొనర్తురే?

ఉ. ఆసభ కేకవస్త్ర యగునట్టిననుం గొని వచ్చి నొంచు దు
శ్శాసనుఁ జూచుచుం, బతు లసంభ్రమము లై తగుచేష్ట లేక, నా
యాసలు మాని చిత్రములయాకృతి నున్న యెడన్, ముకుంద, వి
శ్వాసముతోడ నిన్ గొలువ వచ్చె మనం ...బదియుం దలంపవే?

చ. అరయమిఁ జేసి కోడ లన కప్పుడు దాసిగఁ జేసె; నమ్మహా
పురుషునిపాలికిం బతులు వోవఁగ వీరలతోన యేను జె
చ్చెరఁ జని కోటరంబు దగఁ జేయుదునో? అటు గాక పాడిమై
[1]వరవుడ మోపి చేయుదునొ వారికి? మాధవ, నిశ్చయింపుమా!"

వ. అని యుగ్గడించి, — ౧౧౩

---

1. వరవుడము = దాస్యము ; ఊడిగము.

---

యథా త్వాం నస్పృశేదేష దోషః కృష్ణా తథాకురు,
పాణ్డవైః సహ దాశార్హైః సృఞ్జయైశ్చ ససైనికైః.
పునరుక్తఞ్చ వక్ష్యామి విశ్రమ్భేణ జనార్దన,
కాతు సీమన్తినీ మాదృక్ పృథివ్యా మస్తి కేశవ.
సుతా ద్రుపదరాజస్య వేదిమధ్యా త్సముత్థితా,
ధృష్టద్యుమ్నస్య భగినీ తవ కృష్ణా ప్రియాసఖీ.
అజమీఢకులం ప్రాప్తా స్నుషా పాణ్డోర్మహాత్మనః,
మహిషీ పాణ్డుపుత్రాణాం పఞ్చేన్ద్రసమవర్చసామ్.
సుతా మే పఞ్చభి ర్వీరైః పఞ్చజాతా మహారథాః,
అభిమన్యు ర్యథా కృష్ణా తథా తే తవ ధర్మతః.
సాఽహం కేశగ్రహం ప్రాప్తా పరిక్లిష్టా సభాంగతా,
పశ్యతాం పాణ్డుపుత్రాణాం త్వయి జీవతి కేశవ.

ఉ. ద్రౌపది బంధురం బయిన క్రొమ్ముడి గ్రమ్మన విడ్చి, వెండ్రుకల్
¹దా వలచేతఁబూని, ²యసితచ్ఛవిఁ బొల్చు మహాభుజంగమో
నా విలసిల్లి వ్రేలఁగ, మనంబునఁ బొంగు విషాద రోషముల్
గావఁగ లేక, బాష్పములు గ్రమ్మఁగ, దిగ్గన లేచి, యార్తయై —

వ. గోవిందుముంగటం బెట్టి యిట్లనియె : ౧౧౫

---

1. డాపలచేతన్ = ఎడమచేతను.
2. అసితచ్ఛవిఁ బొల్చు... వ్రేలఁగ = నల్లత్రాఁచోయనునట్లు ఒప్పివ్రేలఁగా,

[సూచిక: ధర్మనందనుని పలుకులచే హృదయమున రేఁగిన తాపము, మోము నావరించిన దైన్యధూమము, తనికీన కనలునఁ గుమిలికుమిలి మాటలలో నుండె. 'పరవుడమోపి చేయుదునో వారికే, మాధవ, నిశ్చయింపుమా!' అనుటతోఁ బూర్తిగఁదప్తమై, చేఁతలఁ బ్రతిఫలించినది; విషాద-రోషముల పెనఁకువలఁ బుట్టిన కరుణము కనులఁ గ్రమ్మినది; ఆ వేగము నుస్సహమై దిగ్గన లేవఁదీసినది. లలితమనోహరాకృతిని, క్షణికమున విలయమూర్తిగా మార్చినది!

నాట్యకళయందలి పరిపక్వదశయుఁ బ్రతిపాదితమైనది. వచనమును వెనుకొనిన యలఁతి యలఁతి యభినయము : 'ద్రౌపది బంధురంబయిన క్రొమ్ముడిఁ గ్రమ్మనవిడ్చి'నది మొదలుగా 'దిగ్గనలేచి యార్తయై' నంతవఱకుఁ దానమునుకొని వాచికము నెఱపినది: వచస్సునకు దురాయి పెట్టినది. ఆయభినయపరిణతి మౌనముద్రను భేదించి 'ఇవి మున్ను నేను వ్రేల్లఁదవిలి...' అని ఉద్వేగమున వచస్సును తాను (అభినయము) సాగించినది. ఆవచస్స్రవంతి మహాగహనములఁ బ్రవహించి ప్రవహించి, 'నెట్టన నిట్టియల్క మది నిల్పితి రక్కసతాల్మి'యని, 'తేజమునఁ జొల్చిన భర్తలుఁగల్గ నచ్యుతా!' అను నాక్రందనముతో నవశమై యాఁగినది.

'ధర్మనందను పలుకులు...' 'ద్రౌపది బంధురంబయిన ..' అను రెండువిషయములును చేయవలయు నభినయముంగూర్చి నట్టువకు ఎచ్చరికలు (Stage directions).

---

జీవత్సు పాండుపుత్రేషు పాంచాలేష్వథ వృష్ణిషు,
దాసీ భూతాస్మి పాపానాం సభామధ్యేవ్యవస్థితా.
నిరమర్షేష్వ చేష్టేషు ప్రేక్ష్యమాణేషు పాండుషు,
పాహిమామితి 'గోవింద' మనసా చింతితోసి మే.
యత్రమాం భగవాన్రాజా శ్వశురో వాక్య మబ్రవీత్,
వరం వృష్ణిష్వ పాంచాలి వరార్హాసి మతా మమ,

క. "ఇవి దుస్ససేను వ్రేళ్ళం
దవిలి సగము ద్రెవ్వి పోయి దక్కినయవి ! కౌ
రవులకడఁ దీఱుమాటల
యవసరమునఁ దలఁపవలయు నచ్యుత, వీనిన్ ! ౧౧౬

సీ. [1]ఈవెండ్రుకలు వట్టి యీడ్చిన యాచేయి
దొలుతగాఁ బోరిలో దుస్ససేను
తను వింతలింతలు తునియ లై చెదరి రూ
పఱియున్నఁగని యుడు కాఱుఁగాక,
యలుపాలఁ బొనుపకునట్టిచిచ్చే యిది ?
పెనుగద వట్టిన భీమసేను
బాహుబలంబును, బాటించి గాండీవ
మనునొకవి ల్లెప్పుడును వహించు

---

1. తా. ఈ నా వెండ్రుకలు వట్టియీడ్చిన దుశ్శాసనుని యాచేయి యుద్ధరంగమున తొలుత తెగి. పడంపడి వాని తనువు ఇంతలింతలు తునియలై, ఆతునియలు చెదరి, చెదరిన తునియలుగూడ రూపు లేకుండ నలఁచివేయుట చూచి, ఈనాలోని యుడుకు ఆఱి పోవునుగాని, అల్పముల—ఊరడల_చేతఁ జల్లాఱునదియా?...

---

అదాసాః పాణ్డవాః సన్తు సరథాః సాయుధా ఇతి,
మయోక్తే యత్ర నిర్ముక్తా వనవాసాయ కేశవ.
ఏవం విధానాం దుఃఖానా మభిజ్ఞోఽసి జనార్దన,
త్రాయస్వ పుణ్డరీకాక్ష సభర్తృ జ్ఞాతి బాన్ధవాన్.
నన్వహం కృష్ణ భీష్మస్య ధృతరాష్ట్రస్య చోభయోః,
స్నుషా భవామి ధర్మేణ సాఽహం దాసీ కృతా బలాత్.
ధిక్పార్థస్య ధనుష్మత్తాం భీమసేనస్య ధిగ్బలమ్.
యత్ర దుర్యోధనః కృష్ణ ముహూర్తమపి జీవతి.
యది తేఽహ మనుగ్రాహ్యా యది తేఽస్తి కృపా మయి,
ధార్తరాష్ట్రేషు వై కోపః సర్వః కృష్ణ విధీయతామ్.
"ఇత్యుక్త్వా మృదు సంహారం వృజినాగ్రం సుదర్శనమ్,
సునీల మసితాపాఙ్గీ సర్వగన్ధాధి వాసితమ్.

ఆ. కట్టివిక్రమంబుఁ గాల్పనే ? ఇట్లు బ
న్నములు వడిన ధర్మనందనుండు,
నేను రాజరాజుపీనుంగుఁ గన్నార
గానఁ బడయ మైతి మేనిఁ గృష్ణ ! ౧౧౭

ఉ. [1]నెట్టన యట్టియల్క మది నిల్పితి రక్కసతాల్మిఁ, జిచ్చోడిం
గట్టినయట్లు పెద్దయును గాలము ; దీనికి వాఱు వెన్నుఁడుం
బుట్టదు ; దుష్టనిగ్రహము పూని జగంబులు గాచునట్టి తోఁ
బుట్టువు నీవు, దేజమునఁ బొల్చినభర్తలుఁ గల్గ నచ్యుతా !" ౧౧౮

---

1. నెట్టన = నిజముగా ; అత్యంతము.

---

సర్వలక్షణ సమ్పన్నం మహాభుజగ వర్చసమ్,
కేశపక్షం వరారోహా గృహ్య వామేన పాణినా.
పద్మాక్షీ పుణ్డరీకాక్ష ముపేత్య గజగామినీ,
అశ్రుపూర్ణేక్షణా కృష్ణా కృష్ణం వచన మబ్రవీత్.
అయం తే పుణ్డరీకాక్ష దుశ్శాసన కరోద్ధృతః,
స్మర్తవ్యః సర్వకార్యేషు పరేషాం సన్ధి మిచ్ఛతామ్.
యది భీమార్జునౌ కృష్ణ కృపణౌ సన్ధికాముకౌ,
పితా మే యోత్స్యతే వృద్ధః సహపుత్రై ర్మహారథైః.
పఞ్చచైవ మహావీర్యాః పుత్రా మే మధుసూదన,
అభిమన్యుం పురస్కృత్య యోత్స్యన్తే కురుభిః సహ.
దుశ్శాసన భుజం శ్యామం సంఛిన్నం పాంసుగుణ్ఠితమ్,
యద్యహం తు నపశ్యామి కా శాన్తి ర్హృదయస్య మే ?
త్రయోదశ హి వర్షాణి ప్రతీక్షన్త్యా గతాని మే,
విధాయ హృదయే మన్యుం ప్రదీప్త మివపావకమ్.
విదీర్యతే మేహృదయం భీమవాక్శల్య పీడితమ్,
యోఽయ మద్య మహాబాహు ర్ధర్మ మేవా నుపశ్యతి ?"

—భగవద్యాన. అధ్యాయ ౮౧

[మూలమున దెలుఁగురచన మేలుఁగిడి పోషించినభంగి తెలుపుటకై ఈభాగము ఉద్ధృత మయినది. వ్యాసుని నాట్యకళా ప్రవీణతను తిక్కన కళాకౌశలమునకును గల తారతమ్యము లేర్పరించుటకుఁ జాలునని ఈమాత్రము మచ్చు చూపఁబడెను.]

—: శ్రీకృష్ణుఁడు ద్రౌపది నూరార్చుట :—

వ. అనుచు నెలుంగు రాలుపడ నేడ్చిన యాజ్ఞసేనిం గృపాయత్తచిత్తుం
డయి నారాయణుం డూరార్చి కూర్చుండ నియమించి, కన్నీరు దుడు
వను, బెన్నెఱివేణి ముడువనుం [1]దగువారి నియోగించి, యమ్మాని
నితో ని ట్లనియె : ౧౧౯

ఉ. "[2]మ్రుచ్చిర నేల యేఁ గలుగ ముద్దియ? నాకు వృకోదరుండు, వి
వ్వచ్చుఁడు దోడు గాఁగ, జనవంద్యుఁడు ధర్మసుతుండు పంప, నీ
మెచ్చుగ శత్రుసంక్షయము మేకొని చేసెదఁగాక, వే ఱొకం
డచ్చుపడంగ నేర్చునె? దురాత్ములు కౌరవు లుర్వి యిత్తురే? ౧౨౦

క. లలనా, యుడుగుము; నీ యే
డ్పులకొలఁదియె కురునృపాల పుత్త్రకళత్త్రం
బుల యేడ్పు; లింక వానిం
గలకల నవ్వుచు వినంగఁ గాలం బయ్యెన్. ౧౨౧

క. [3]యమమహిష ఘంటికానా
దము వినఁ గౌతూహలంబు దళుకొత్తెడుచి
త్తములు గలకౌరవుల కి
ష్టము లగునే, సంధికార్యశాంతవచనముల్? ౧౨౨

క. మొదల విధినియతియును న
ట్టిద యందురు పెద్ద; లది ఘటింపక పో; దే
మదిఁ జూచి చెప్పినను ద
ప్పదు మేరువు దిరిగెనేనిఁ బాంచాలసుతా. ౧౨౩

---

1. తగువారి నియోగించి = తాను ముట్టుకొనక ఆఁడువారినే పనుపుపెట్టి.
2. మ్రుచ్చిర నేల యేఁగలుఁగ = నేనుండఁగా నీవేల దుఃఖింతువు?
3. తా. యముని దున్నపోతు మెడయందలి గంటలధ్వని వినుట కిచ్చగించు చిత్తములు గల కౌరవులకు సంధికార్యముం గూర్చిన శాంతివచనములు విన నిష్టములగునా?

తే. పూని పలికెద, వినుము, రిపుక్షయంబుఁ
జేసి యుజ్జ్వలపుణ్యలక్ష్మీసమేతు
లైన పాండుకుమారుల యధికవిభవ
మీవు సూచెదు ; తడవు లే ; దిది నిజంబు." ౧౨౪

క. అని యూఱడిలఁగఁ బలికిన
విని, [1]యంకిలి దేఱుచిత్తవృత్తి గలుగు నం
గన యేడ్పుడిగెం. దగ ఫ
ల్గునుఁ డిట్లని పలికె నప్పుడు గోవిందునితోన్. ౧౨౫

తే. "పాండవులు ధార్తరాష్ట్రులుఁ, బుండరీక
నేత్ర, చుట్టఱికంబున నీకు నొక్క
రూప, కావునఁ [2]గోరి యేస్రూపునందు
నుభయపక్షంబులకుఁ జేయు ముచితహితము. ౧౨౬

క. ధర్మార్థసంగతంబుగ
ధర్మతనయు చెప్పినట్లు తగఁ బల్కుఁగ, నా
దుర్మతులు కౌరవులు స
త్కర్మమునకుఁ జొరక యున్న, దైవమ యెఱుఁగున్." ౧౨౭

క. అన విని, 'కౌరవులకు మీ
కును హితముః బ్రియంబుఁ జేయఁ గోరియ, కుంతీ
తన యాగ్రజుపని, ధృతరా
ష్ట్రునికడకుం బోయెదను గడుం బ్రీతిమెయిన్'. ౧౨౮

క. అని పలికిన హరిధర్మవ
చనముల తెఱఁగున కజాతశత్రుఁడు చిత్తం

1. అంకిలి...గలుగు నంగన = కలఁతనుండి తేఱుకొనిన మనోగతిగల ద్రౌపది.
2. కోరి...ముచిత హితము = మనసార ఏవిధమున నయినను రెండుపక్షములకును తగవు గూర్పుము.

బునఁ బొంగి, 'యట్ల చేయుము;
మననిశ్చయ మిదియ; దీని మఱవకు మనఘా!' ౧౨౯

వ. అని కార్యంబు నిశ్చయించి, దినశుద్ధి నిరూపించి, నారాయణుం జూచి, "నీనక్షత్రంబు రోహిణి గదా! ఎల్లి రేవతి. నీకుఁ జంద్ర-తారాబలంబులు గలవు. గమనంబునకు రేపకడయ మేలు; పయనం బగుటలెస్స"యని చెప్పిన, నప్పలుకుల కతండు సగౌరవంబుగా నియ్యకొనియె. పాండవాగ్రజుండు, గొలువుం గలయం గనుంగొని యెల్లవారును విన, 'అది యట్లకాక' యని పలికి, తదనంతరంబ తానును దమ్ములుఁ, బాంచాలియుఁ, బరివారంబును, నుచితప్రకారంబున నిజనివాసంబులకుం జనియె. మఱునాఁ డరుణోదయంబునఁ గృష్ణుండు కాలోచిత కృత్యంబులు నిర్వర్తించి, సూర్యోపాస్తి సేసి, యగ్ని సమారాధనం బాచరించి, ధరణీసురులం బ్రణామపూర్వకంబుగాఁ బ్రియాణదాన ప్రముఖపూజావిశేషంబులం బ్రీతులం గావించి, వారలయిచ్చు నాశీర్వాదంబులును [1]సమంత్రాక్షత దూర్వాంకురా-దులునుం గైకొని, యుచిత ప్రదేశంబున నుండి సాత్యకి రావించి —

క. "మనప్రజలోఁ గరిపురికిం
జనుదేరఁగ వలయువారి సవరణతోఁ రం
డని యేర్పడ నియమింపు; ప
యన మైయేతెమ్ము నీవు"నని తగ మఱియుఁ — ౧౩౦

వ. 'దుర్యోధనుండు దుష్టాత్మకుండు. అతండు మన్నించుమానుసులునుం గుటిలబుద్ధులు గావునఁ, జక్రగదాద్యాయుధంబులు రథంబునం బెట్టింపవలయు'నని చెప్పి పనిచి, సమయజ్ఞతం బొడసూపి, నిలుచున్న దారుకుం జూచి, తేరు పూన్ప నియోగించె. అతండును మణిగణ ప్రభాపటలజటిలం బగునరదంబు వన్ని, శైబ్య సుగ్రీవ మేఘ పుష్ప

---

1. సమంత్రాక్షత – దూర్వాంకురాదులును = మంత్రించిన అక్షతలు గఱికపోచలు మొదలగునవి...

వలాహకంబు లనంబరఁగు తురంగంబులం బూన్చి, గరుడధ్వజం బెత్తి తెచ్చినం దానునుం బయనంపుఁజందంబునఁ గట్టాయితంబై జనం బులచూడ్కులకుం బండువగుచుఁ బుండరీకాక్షుండు మంగళతూర్యం బులు సెలంగఁ, జామరంబు లుల్లసిల్ల, రథం బెక్కినయవసరంబున కొదవ, సపరివారంబుగా నరుగుదెంచిన సాత్యకిం దనరథం బెక్కించు కొని, యాంగికంబు లైన శుభసూచకంబులు గైకొనుచుఁ, బూర్ణ కలశ వృషభాది భద్రపదార్థంబుల నవలోకించుచుఁ బుణ్యాంగనలు సేస లాలుకఁ, జిత్తంబు ప్రసన్నతం బొంద వెడలునప్పుడు — ౧౩౨

సీ. పాండవ యాదవ పాంచాల కైకేయ
పాండ్య మాత్స్యాదులు భద్రదంతి
హయ రథంబులతోడ నతికుతూహలమున
వచ్చినఁ గనుఁగొని, వారి నెల్ల
సంభావనంబుల సంభాషణంబుల
నాదరించుచుఁ, దగ నల్ల నల్ల
విభవంబు మెఱయంగ విడిదలపఱి పెల్లఁ
గడచినయత్తఱిఁ, గరము శుభము
ఆ. లైనశకునములకు నందఱుఁ బ్రియ మంద
నరుగు చున్నయట్టి యవసరమున,
రథము రథముఁ గదియ రా నిల్పి, ధర్మనం
దనుఁడు నెమ్మి నిట్టు లనియె హరికి : ౧౩౩

ఉ. "వచ్చె జనార్దనుం డనినవార్తకుఁ బ్రాణము మేని కంతకుఁ
వచ్చిన సేద దేఱుఁ గురువంశ పవిత్రచరిత్ర గొంతి. నీ
వచ్చటి కేఁగి, '[1]పాండవుల యందఱమా' అని చెప్పి మ్రొక్కుచుఁ
గ్రుచ్చియ కౌఁగిలించుకొని కుందిన చిత్తమునొప్పి దీర్పుమీ. ౧౩౪

---

1. పాండవుల యందఱ మాకు అని = పాండవులయందఱ బహులుగా అని.

చ. అడవికి నేఁగునాఁడు మము నంపఁగ నెంతయు దవ్వు వచ్చిన
ప్పుడు, దనమోహము దైన్యమునఁ బొందెమనఃప్రిలుఁ జూచి చూచి, య
ట్లొడఁబడి డించి పో వలసె నుమ్మలికమ్మున ; గొంతి యింతకుఁ
బడుగయి పాలలోఁ బడినబల్లివిధంబున నుండ కుండునే? ౧౩౬

క. లక్కయిలు గాలినది మొద
లక్కట! మాతల్లి మాకు నై నెవ్వగతోఁ
బెక్కుడుమలఁ బడు చున్నది
ది క్కెవ్వరు లేనియట్లు దీనత్వమునన్. ౧౩౭

క. ఏ ననుట గాఁగ 'దుఃఖము,
లైనవి దెగునమయ మయ్యె' నని చెప్పుము ; మీ
మేనత్త నూఱడింపుము ;
దా నెప్పుడు నీవు గలవు తన కను చుండున్." ౧౩౮

వ. అని చెప్పి వెండియు — ౧౩౯

ఆ. "గురుఁడు బాహ్లికాదికురువృద్ధులును సుహృ
ద్బాంధవులు నశేషధరణిపతులుఁ
బ్రీతిఁ బొంద నెవ్వరికి నేది దగుఁ బ్రణా
మాదివిధుల నడపు నాదుపలుకు. ౧౩౯

క. పరమప్రియమున [1]నాక్రై
పరిరంభణ నేసి గాఢబాంధవసాంద్రా
దరమున సంభావింపు వి
దురుతోఁ ; మధ్యస్థుఁ డగుహితుం డతఁ డనఘా!" ౧౪౦

వ. అనియె. తదనంతరంబ యర్జునుండు— ౧౪౧

1. నాక్రై పరిరంభణనేసి = నాకు మాఱుగా ఆలింగనము చేసి.

చ. "[1]జనులు వినంగ 'రాజ్యమున సాము గొనం గలవార'మన్న యీ
జనపతికార్యనిశ్చయము సమ్మతి గైకొని చేసినన్ సుయో
ధనుఁడును దమ్ములున్ సఖులు, దానికి నేమును నియ్యకొందు; మొం
డనిన సపుత్త్రమిత్త్రముగ నద్దెస నందఱ గ్రొచ్చి పాఁతుదున్." ౧౪౨

మ. అనినన్ మెచ్చి వృకోదరుం 'డితఁడు కార్యం బింతదెల్లంబుగాఁ
బొనరంబల్కెనె?' యంచుఁ బేరెలుఁగు సొంపుంబొంద, వక్త్రింబుపొ
ల్పున దర్పం బొలయంగ, నంగములకుం బొం గార, [2]నుద్భ్రంహిత
ధ్వనియై పొల్చుమహోగ్రసింధురము చందం బొంది యొప్పెం గడున్.

క. నకుల సహదేవులును దా
నికి నంతసమంది, 'యిట్లు నెయ్యము కయ్యం
బొక తెఱఁగు సేసికొని తడ
యక ర'మ్మని పలికి రప్పు డచ్యుతుతోడన్. ౧౪౪

—: శ్రీకృష్ణుఁడు నారదాదిమహామునులం గని సంభావించుట :—

వ. ఇవ్విధంబునం బాండునందను లందఱును గోవిందునకు వలయుమాటలు సెప్పి, యతనిఁ గౌఁగిలించికొని, యథోచిత ప్రకారంబున [3]వీడుకొని వలగొని మగిడిరి. తక్కినవారలు నర్థంబు లగు తెఱంగుల నామంత్రితులై మరలిరి. మాధవుండును బ్రయాణసర్వసంభారనిర్వాహకులఁ గలయంగనుంగొని తగినసల్లాపంబులు సేసి, [4]కరినగరంబు పెందెరువు

1. తా. జనులు వినునట్లు రాజ్యమున సగము గొందుము అనిన ఈధర్మరాజు కార్యనిశ్చయమును, సుయోధనుఁడును అతని తమ్ములును మిత్త్రులును ప్రియముగా అంగీకరించి నడపినచో, మేమును ఒప్పికొందుము. అట్లుగాక వారువ్యతిరేకముగా ననిన యెడల, ఆకౌరవులపక్షమున నున్నవారి నందఱను, పుత్త్రులతో మిత్త్రులతోఁ గూడ గోయితీసి పాతిపెట్టుదును
2. ఉద్భ్రంహిత ధ్వనియై...గడున్ = ఘీంకారముతో నెసఁగు మహాభయంకర గజముంబోలి... 3. వీడుకొని వలగొని మగిడిరి = సాగనంపి ప్రదక్షిణము సేసి వెనుకకుఁజనిరి. 4. కరినగరంబు పెంచెరువు = హస్తినాపురపు రాచబాట.

గై కొని ¹దారుకుని చతురత్వంబునఁ, దురంగంబుల పటుత్వంబున, ²నత్యంత సమీచీనం బైనయానంబున మనం బలరం జని చని, యొక్క యెడ నారద జమదగ్ని కణ్వాదు లగుమహామునులం గొందఱం గని, రథంబు డిగ్గి నమస్కరించి, సద్భక్తితాత్పర్యంబునఁ గుశలం బడిగి, 'మీ రిక్కడకు విజయంచేయుటకుఁ గతంబేమి? సేయం గలపని యెయ్యది? నా కానతిండు' అనిన, నారాయణునకు నారదుం డి ట్లనియె: ౧౪౫

సీ. "అనఘ, పుణ్యాత్ముఁడ వగునిన్నుఁ గనఁ గొనఁ,
గౌరవసభ నీవు గారవమునఁ
బలికెడిపలుకులభంగు లాకర్ణింప,
విదుర భీష్మాదులు విన తెఱంగు,
నుత్తరం బిచ్చుకార్యోక్తులు నెఱుఁగంగ
వేడుక వచ్చిరి వీరలెల్ల."
అని చెప్ప విని, 'లెస్స, యట్ల చేయుదురు గా'
కని హరి పల్కిన నమ్మునీంద్రు
తే. లతని దీవించి, 'నీవు పో మ్మచటి; కేము
నరుగుదెంచెద' మని ప్రీతి ననుప, నరిగి
³యొక్క పుణ్యాశ్రమంబున యొద్దియేట
విడిసి, దివసప్రవర్తన విధులు నడపి. ౧౪౬

---

1. దారుకుని=కృష్ణుని సారథియయిన. 2. అత్యంత...యానంబున=అధిక సౌఖ్యావహ మయినట్టి పయనమున.

3. ఒక్కపుణ్యాశ్రమంబున యొద్దియేట విడిసి=ఒక పుణ్యాశ్రమమునందలి ఒద్ది చెట్టు పార్శ్వమున విడిసి.
ఏట రూ. ఏటము=(దే. వి.) పక్షము, పార్శ్వము, ఏటవాలు ఇత్యాది.

ప్రి. 'మాటలు నేరక పలికిన, నోటమిగాఁగొనక కార్యమున్న నిజము దాఁ
బాటించి నృపతి ధర్మం బేటముగాఁ బాడి నిర్ణయింపఁగ వలయున్'
విజ్ఞానేశ్వరీయము, వ్యవహారకాండ.

వ. కమలనాభుండు గదలిపోయి సూర్యాస్తమయ సమయంబునఁ గుశస్థలంబు సేరం జనునప్పుడు అందలివిప్రు లెదురువచ్చి కాంచి, నిజ నివాసంబులకుం జనుదెండని పిలిచినం, బ్రసన్నవదనుం డగుచు సమ్మర్దంబు వలవదని పలికి, విశాలరమణీయం బైన బహిరంగణంబునం [1]పటకుటీరప్రకరం బెత్తించి విడిసి, తగువారును దానును వారల గృహంబుల కరిగి, యభ్యాగతపూజలు గైకొని, వారిని సంభావించి విడిదలకుం జని, సమయసముచితవృత్తి బ్రవర్తిల్లుచుండె. అంత నక్కడ —

తే. వార్త విని యాత్మ నెమ్మి కౌరవక్షితీశ్వ
రుండు గాంగేయ గురు విదురులను, బుత్త్రు,
సంజయునిఁ, గర్ణు, సైంధవు, శకునిఁ బిలువఁ
బనిచి, తా నిట్టు లనియె నందనునితోడ : ౧౪౭

వ. "కృష్ణుండు పాండవకార్యార్థంబుగా మనయొద్దకు వచ్చుచున్నవాఁడు. నేఁడు కుశస్థలంబున విడిసె. రే పిందు వచ్చునని వింటిమి. ఇట్టి యాశ్చర్యంబునుం గలదే! [2]సర్వలోకాభిగమ్యుం డగునమ్మహానుభావునకు మన మభిగమ్యుల మైతిమి ; మన కింతకంటెను బెం పెయ్యది? అతం డెవ్వరివలన సంతుష్టుం డయ్యె వారికి శుభంబును, నెవ్వరిదెస ననాదరంబు సేసె వారికి నశుభంబు నగుట దప్పదు. అతనికి వలయుపూజ లాచరించుటకు సంవిధానంబు సేయుము. గృహాలంకరణాది మంగళప్రకారంబు లనుష్ఠింప నియమింపుము. అతనిచిత్తంబునకు నీవిభవంబును దనమీఁది ప్రియంబునుం దోఁచునట్టి తెఱంగున సమస్తంబును సమకట్టుము." ౧౪౮

క. అనిన, ధృతరాష్ట్రుపలుకులు
గొనియాడిరి సంతసిల్లి గురుఁడును భీష్ముం

1. పటకుటీర ప్రకారంబు = గుడారముల వరుసను. 2. సర్వలోకాభి...గమ్యుల మైతిమి = ఎల్లలోకము లతనిఁ జేరుగడయగు మహానుభావునకు మనము చేరుగడ మైతిమి.

డును ; 'నోఁగా' కని దుర్యో
ధనుఁడుం బరిచారక ప్రతతిఁ బిలిపించెన్. ౧౫౦

వ. ఇట్లుచితపరివారంబు రావించి యతండు — ౧౫౧

క. "అలుకుఁడు మృగమదమున, ముగ్గు
లు వెట్టుఁడు గప్పురమునఁ, గుంకుమమున గో
డలు పూయుఁడు, మణిదామక
ములు గట్టుఁడు పెద్దకూటమున సొంపారన్. ౧౫౨

వ. మఱియు, నగళ్లెల్లను శోభిల్ల నలంకారంబు సేయుండు. ౧౫౩

క. పెనుపుం జతురత మెఱయఁగ
మనయింటను, దుస్ససేనమందిరమున శో
భనశిల్పము లొనరింపుఁడు ;
చనుఁడు వృకస్థలమునందుఁ జప్పరము లిడన్. ౧౫౪

వ. అది వీడుఁబట్టు గాఁడగియెడుపట్టు" అని పలికి, "వాసుదేవుండు రేపక డయ వచ్చు ; నంతకు మున్న యింతయుం గావింప వలయు"నని పనిచి, పురంబున నుత్సవంబు సాటుండని నియోగించి, వివిధగంధ మహితమాల్యంబులు సంపాదింపను, మణిభూషణ చిత్రాంబరంబులు సమకట్టను, సరసాన్నస్వాదుపాన ద్రవ్యంబు లొడఁగూర్పను నేర్పరు లగుతద్జ్ఞుల నియమించె. అట్టియెడ నాంబికేయుండు విదురున కిట్లనియె : ౧౫౫

— ధృతరాష్ట్రుఁడు విదురుతో శ్రీకృష్ణునిరాక చెప్పి సంతోషించుట. —

క. "వివిధమణిమయ రథంబులు,
జవనాశ్వంబులును, భద్రసామజములు ర
త్నవిభూషణములు, దాసీ
నివహంబులుఁ జాలఁ గృష్ణునికి నే నిత్తున్. ౧౫౬

క. మనయింట, సుయోధనుగృహ
మున దుశ్శాసనుని కేతమున నెయ్యది [1]యా
తనిచూడ్కి కించు, నది యె
ల్లను గౌరవ మొప్ప నీ వలయు మన కనఘా." ౧౫౯

చ. అన విని యాతఁ డి ట్లనియె: "నంబుజనాభునిఁ బ్రీతుఁ జేయుకం
టెను హిత మైనకృత్య మొకటిం గలదే, యది మేలు! పాండునం
దనులకు నైద యూళ్లు లుచితస్థితి నిచ్చుట కోప మన్న యు
న్కిన యిటు లోఁపుకల్మి, ధరణీవర, యేమిట వచ్చెఁ జెప్పుమా?

ఉ. నీతలఁ పేను గంటి! ఒకనేర్పున శౌరికి లంచ మిచ్చి సం
ప్రీతునిఁ జేసి కార్యగతి భేదము సేయఁగఁ జూచె, దింత బే
లై తిగదే! సుమేరుసదృశార్థముఁ జూచియుఁ బార్థుఁ బాయునే
యాతఁడు! క్రీడిభక్తియును, నచ్యుతు పెంపును నీ వెఱుంగవే?

తే. అర్జునుఁడు ప్రాణతుల్యుండు హరికి; నట్లు
గాన, జలపూర్ణమంగళకలశమునకుఁ,
బాద్యమునకును, [2]కుశల సంప్రశ్నమునకు
మిగుల, నొండు జనార్దనుమెచ్చు గాదు. ౧౬౦

క. మనకడకు నేమిగార్యం
బునకై యాతండు వచ్చెఁ బూనికిమెయి నా
పని వంచింపక చేయుట
విను, మతనికిఁ బ్రియము; [3]తక్క వేయును నేలా?" ౧౬౧

---

1. అతనిచూడ్కికి ఇంచు = అతని చూపునకు బ్రియమగునో. ఇంచు = (యు. దే. అ. క్రి.) ఇంపగు. ప్రియమగు, మనోజ్ఞమగు, కోరు, చెలకు.
ప్ర. 'చతుర తూర్యత్రియంబుల సమయములను,। వస్త్ర మాల్యానులేపనా వసరములును,। నేము వెలిగాఁగ మాతండ్రి కించునెట్లు!...' — ఉద్యోగ. ఆ. ౧
'కర్ణములకు నించునెట్లు కౌర్య వచనముల్...' — కర్ణ. ఆ. ౨
2. కుశల...మిగులన్ = మించినట్టి. 3. తక్క వేయును నేలా = తక్కినవి వేయైన నెందులకు?

వ. అనిన విని దుర్యోధనుండు దండ్రి కిట్లనియె: ౧౬౨

క. "అది విదురుచెప్పినట్టిద.
తుదిఁ గృష్ణుఁడు పాండుసుతులతో వే అగునే?
[1]పదనే యీగికి; [2]నిచ్చిన
బెదరెరె ననరె? [3]ఒచ్చె మైనఁ [4]బిమ్మట నగరే? ౧౬౩

ఆ. అతఁడు పూజనీయుఁ డగు, నే నెఱుంగుదు;
నైన [5]ధనము లీగి ననదతనము
వచ్చుఁ, బెచ్చుపెరిఁగి వైరులు గర్వింతు;
రేల పగ యడంగు నిట్టు లైన?" ౧౬౪

క. అనవుడు, భీష్ముఁడు ధృతరా
ష్ట్రిన కిట్లను: "నీవునుం గొడుకు నేమే ని
చ్చిన నొకటె, యీగి లేకు
న్నను వే ఱొక్కటి దలంచునా కేశవుఁడున్? ౧౬౫

క. విను, మతఁడు సేయఁ బూనిన
పని దప్పింపంగ రాదు; పాండవులం దే
ర్పను గృష్ణుఁడు వెరవుగఁ జొ
చ్చిన మే; లాపురుషుపనుపు సేయుము పుత్రా. ౧౬౬

క. నారాయణుండు ధర్మా
ర్థారూఢము గాఁగఁ బలుకునది నీవును, నీ
వార్థును గైకొని, యెంతయు
గారవమునఁ జేయ నెల్లకార్యంబు నగున్." ౧౬౭

1. పదనే ఈగికి = ఈవికి – దానమునకు – సమయమా? 2. ఇచ్చిన బెదరిరి అనరె = ఇవుడిచ్చినచో జడిసిరి అనరా? 3. ఒచ్చెమైనన్ = కొఱఁత యైనయెడల. 4. పిమ్మటనగరే = ...నవ్వరా? 5. ధనములీగి...వచ్చు = ధనము లిచ్చుటవలన పేలవత్వము వచ్చు.

క. అనుటయు, సుయోధనుఁడు భీ
ష్మున కి ట్లనుఁ : "[1]పాండురాజసుతులకు నిమ్మే
దిని, హరి సగఁబా లీఁ దగు
ననుఁబో, యే నీను ; గాని యది యట్లుండెన్— ౧౬౮

వ. వే ఱొకకార్యంబు సేయం దలంచితి ; నది వినుము. పాండవులకు నేడుగడయు జనార్దనుండు. అతనిం బట్టి బంధించిన ఱెక్కలు విఱిగిన పులుఁగులుంబోలె వారు నాకు విధేయు లగుదురు. పాంచాల యాదవాదు లైనతదీయబంధుమిత్త్రులు నావశంబున వర్తిల్లుదురు. సమస్తదేశంబులు నేన యేలుదు. దీనికిం దగినయుపాయ సహాయంబు లనువు సేసెద. నీ వింక నేమి సెప్పెదవు చెప్పుము." అనిన విని, యతిఘోరం బగునవ్విచారంబునకు నమాత్య సహితంబుగా సంతప్తచిత్తుండై వైచిత్త్రవీర్యుండు గొడుకున కి ట్లనియె : ౧౬౯

క. "ఓహో ! యి ట్లనుట జగ
ద్ద్రోహం, బిమ్మాట మఱవు. దూతత్వంబుఁ,
మాహాత్మ్యంబును, ధర్మా
త్మాహంబును, విను, [2]మబాధ్యతకుఁ గారణముల్. ౧౭౦

క. ఈకారణములు గల వను
నాకొలఁదియె వాసుదేవుఁ, డది గాకయుఁ, గీ
డే కురువంశమున కతని
రాక ? అతం డేమి సేసెరా పాపాత్మా?" ౧౭౧

వ. అని యదల్చె. అప్పుడు గాంగేయుం డాంబికేయున కిట్లను : "నీ కొడుకు [3]ప్రాణగొడ్డం బైన కార్యంబు సేయం దలంచె. దామోదరు నిట్లు సేయం జూచెనేనిం దానును బ్రధానులును వినాశంబుఁ బొందు,

1. పాండురాజ... యేనీను = పాండురాజు కొడుకులకు ఈభూమిని సగముపాలు ఈయఁదగునని హరి యనుఁ బో, నేను ఇయ్యను. 2. అబాధ్యతకుఁ గారణముల్ = బాధింపఁదగమికిఁ గారణములు. 3. ప్రాణగొడ్డం బైన కార్యంబు = ప్రాణిహింసకమైన కృత్యము.

నింతియు. ఇది సేసి లేమి, సేయకున్న లేమి, యమ్మహాత్మునెడ నీయుప కారంబు విచారించిన దుష్టాత్ములు నష్టాత్ముల కాక! యని పలికి యే నిట్టిదాని వినం జాల ననుచు మొగంబు గంటువెట్టుకొని దిగ్గన లేచి పోయె. ధృతరాష్ట్రుండును దుర్యోధనునితో, "ఇటువంటి కొఱగా ములు మనంబునం దలంచి నప్పుడు సేయం గలవాఁడవు గావున, దీనం జేటు వచ్చు. ఉడుగు మయ్య!" యనిచెప్పి యతనిం దక్కిన వారినిం బోవం బనిచి తగినవర్తనంబున నుండె. మఱునాఁడు— ౧౭౨

సీ. కాలోచితము లగుకరణీయములు దీర్చి
కమలనాభుఁడు లేపకడయ కదలి,
తనుఁ గుశస్థలవాసు లనుప రా, నందఱ
నాదరంబున నిల్పి యరుగునపుడు,
గజ్జంబులును బండ్లు గంధమాల్యంబులు
ధృతరాష్ట్రసుతుఁడు పుత్తేరఁ బ్రీతి
నెడ నెడఁ గొని వచ్చి యిచ్చిన, వాని నె
ల్లను వేడ్క ననుభవించినవిధంబు
తే. సలిపి, యనుభవ మొల్లక చనఁగ, నెదురు
బాహ్లిక ద్రోణ భీష్మాదిబంధుమిత్త్ర
గణము, సర్వభూపాలలోకంబుఁ, గురుకు
మారవర్గంబుఁ బుత్తెంచె మనుజవిభుఁడు. ౧౭౩

—: శ్రీకృష్ణుఁడు ధృతరాష్ట్రుని మందిరంబునకుఁ బోవుట:—

వ. ఇట్లు దుర్యోధనుం డొక్కరుండు దక్క, నెల్లవారిం దూర్వాదిశోభన పదార్థంబులు సమకట్టి ధృతరాష్ట్రుండు వనుప నెదుర్కొనిరి. వాసు దేవుండు వారల నందఱ నయ్యైతెఱంగుల సంభావించి, కృతవర్మ దమవాఁడు గావున, నతనికి సవిశేష స్నేహంబు సేసి, యతండు సేరువ రా, సమస్తజనంబులుం బరివేష్టింపం జని, తన రాకకు నలం కృతంబును, బ్రిమోద ఛాపలసుభగజనంబును నైనపురంబు సొచ్చి,

రాజమార్గంబున నరుగు నవసరంబున, మౌక్తికమిళితంబులు బహుగంధలుళితంబులు నగునక్షత ప్రకరంబులును, బుష్పనికరంబులునుం జల్లుచు, సంతసిల్లుచు, మ్రొక్కుచుc, జొక్కుచు, నిరుగెలంకుల రమ్యహర్మ్యంబులపై నిలిచి పొలిచి కనుంగొను నంగనా జనంబులు దమలోన — ౧౭౪

సీ. "ప్రాణంబుతోc గూడ రక్కసిచన్నుల
పాలు ద్రావినప్రౌఢబాలుc డితcడె!
వ్రేల్మిడిc జానూరు విఱిచి లోకముల మె
చ్చించిన యాజగజెట్టి యితcడె!
దుర్వృత్తుc డగుకంసుc దునిమి యాతనితండ్రిc
బట్టంబు గట్టినప్రభు విఁతండె!
సత్యభామకుc బారిజాతంబుపైc గల
కోర్కి దీర్చినరసికుం డితండె!
తే. వెన్నలును గోపికాచిత్తవృత్తములును
నరసి ముచ్చిల నేర్చినహరి యితండె!
శ్రుతిశిరోభాగములc జను సుభగచరణ
సరసిజామోదమును గూర్చుచతురుc డితcడె!" ౧౭౫

వ. అనుచు నతికుతూహలంబున నవలోకింప నాబాలవృద్ధం బగుపౌరలోకం బాలోకన కౌతుకంబునc దనరథంబు గదిసిన, నందడి జడియు వేత్రహస్తుల వారించుచు, నారాయణుండు సమ్మర్దమందగమనంబునం జని, మణితోరణసుందరం బగురాజమందిర ద్వారంబు ప్రవేశించి, కక్ష్యాంతరంబులు గడచి, యేనుంగు మొగసాలcజొచ్చి, యరదంబు డిగ్గి, యల్లన నడచునప్పు డంతకు మున్న యలిగి భీష్మ ద్రోణ ప్రముఖు లగువారలు ధృతరాష్ట్రునిం బొదువ, నతండుc బ్రత్యుత్థానంబు సేసి విదుర సంజయసహితంబుగా నెదుర్కొనం, జేరి — ౧౭౬

ఆ. అతనిc గాcగిలించి, యచ్చట గల విదు
రాదిశిష్టజనుల నాదరార్ద్ర

బంధుదృష్టిఁ జూచి పరిరంభసంభావ
నము లొనర్చి శౌరి ప్రమద మెసఁగ — ౧౭౭

వ. వార లందఱకును సాత్యకిని దగినసమాచారంబులు నడపం బనిచె. అట మున్న ధృతరాష్ట్రుపనుపునం దెచ్చి పెట్టిన నచ్చోటన యున్న యున్నతకనకాసనంబున నతం డునుప నాసీనుం డయ్యె. అవ్వాసుదేవునకు విహితానుష్ఠాన పరాయణు లగు నగరపురోహితులు రాజానుమతంబున, నర్ఘ్యపాద్య మధుపర్కాద్యుపచారంబు లాచరించి, యతనితమ్ముని నర్హపీఠంబున నునిచి యర్చించిరి. నరనాథుండును దొరలును నిజోచితాసనంబుల నుండిరి. కొలు వెల్లను సూర్యోదయసమయంబునఁ గమలాకరంబు విధంబున వికసించి యుండె. అయ్యవసరంబునఁ గృష్ణుండు ధర్మనందను వచనంబులుగా నాంబికేయునకుం దగువారలకుం బ్రణామ పరిరంభణప్రముఖ సముచిత సంభావనంబులు వలికి, సంభాషణంబులకుం జొచ్చి— ౧౭౮

క. రాజునకుఁ దియ్య మెసఁగెడు
పూజావచనముల, నెయ్యపుంబలుకులఁ జే
రోజమెయి బంధు మిత్త్ర స
మాజములకు, మేలములఁ గుమారులకుఁ దగన్ — ౧౭౯

వ. ఇంపు పుట్టించుచుఁ, గొండొక సేపు నిలిచి పుండరీకాక్షుండు, 'విదురు సదనంబునకుం జనియెద. మఱియుఁ బోవలయు నెడలకుం బోయి వచ్చెద' నని పలికి, యాంబికేయు ననుమతి వడసి యరుగ, విదురుండు ససంభ్రమంబునం గడచి చని మంగళోపచారసహితంబుగా నెదుర్కొని భయ భక్తి వినయ స్నేహానందంబులం గందళితుం డగుచు, గోవిందునకు దేవోపచారంబుల ననేకప్రకారంబుల నర్చన లిచ్చి, కౌంతేయులకుశలం బడిగె. అతనికి వారలవృత్తాంతంబు సమస్తంబును సవిస్తరంబుగాఁ జెప్పినయనంతరంబ — ౧౮౦

క. ముదమునఁ గృష్ణుఁడు గుంతీ
సదమునకుఁ జనియె. అపుడు, సమ్మదమున న
వ్విదురుం 'డోగిర మొనరిం
చెద 'నని తన్నడుగ, నట్లచేయుం డనుచున్.— ౧౮౧

వ. చని, కాంచిన నద్దేవియు నతని తోడునీడయుంబోని తనకొడుకులం
దలంచి యడలు వుట్టిన, నమ్మాధవుమెడ వట్టికొని యెలుం గెత్తి
యేడ్చిన నతండు సంబోధించి యూరార్చి, నెట్టకేలకు నుడిగి, యాత
నికి నాసనవిన్యాసనా ద్యుపచారంబులు సేయించి, తత్సమీపంబున
నుచితపీఠంబునం గూర్చుండి, గద్గదకంఠంబుతో నిట్లనియె : ౧౮౨

సీ. "నీశిక్షఁ బెరుఁగుట, నీతిమంతులుఁ బుణ్య
పరులు శూరులుగదా పాండుసుతులు,
సుఖవృత్తిఁ బెక్కేండ్లు [1]సూరెలఁ గొలువ నుం
డెడువార, లిడుములఁ బడుచు నిర్జ
నంబైన కానలోనన యెట్లు నిలిచిరి? [2]ననుఁ బెట్టి
నాయెడఁ గొనుచుఁ జనిరి.
ఏను వర్ధింపంగ నింపారఁ గుడిచి, మె
త్తనిశయ్య నిద్రించి, [3]వినుతభద్ర
తే. గాన కరిబృంహితముల మేల్కాంచునట్టి
వారు, కందమూలంబు లాహారములుగఁ,
బొదలఁ బుట్టలఁ బడి యుండి, పులుఁగుమొకము
లఱవ మేల్కను చుండిరే యక్కటకట! ౧౮౩

ఆ. తండ్రి లేని ప్రజలు, దల్లిని బాసి పె
ద్దయునుగాల మివ్విధమునఁ బడిరి

---

1. సూరెలన్ = ప్రక్కలను. 2. ననుఁబెట్టి...జనిరి = నన్ను ఇటఁబెట్టి నాహృదయమును గొనిపోయిరి! 3. వినుత...మేల్కాంచునట్టి = ప్రశంసనీయమగు వైతాళికుల పాటలవలనను, ఏనుఁగుల ఘీంకారముల వలనను నిదుర మేల్కాంచునట్టి.

భంగపాటు; దుఃఖపాటును, సంకట
పాటుఁ గలిగె విరటుపాలఁ బిడప." ౧౮౪

వ. అని వెండియు, ౧౮౫

ఉ. "దానదయాపరుం డయిన ధర్మతనూభవుసేమ మెట్లు? పం
చాననవిక్రముం డగుబకారికి భద్రమె? అస్త్ర శస్త్రవి
ద్యానిపుణుండు క్రీడి సుఖియా? వినయాభరణుల్ కవల్ సమా
ధానసమేతులే? అకట! ద్రౌపది, సాధ్వి, సుఖంబె దానికిన్? ౧౮౬

చ. కొడుకులకంటె నయ్యనుఁగుఁగోడలి కెక్కుడు గూర్తుఁ; గోడలుం
గొడుకులు సేయుభక్తి కటకోటిమడుంగులు భక్తి నాకు నె
ప్పుడుఁ దగఁ జేయుచుండు! అది పుణ్యచరిత్ర! కులాగ్రకన్య! [1]క్రొ
త్తడి, సకలంబుఁ జూడ సభ దైన్యముఁ బొందుట సూచి పొక్కితిన్!

తే. నాఁడు ద్రౌపది వడినబన్నములు సూడ
నోర్చినప్పుడ యెంతకు నోర్వఁ జెపుమ!
అంత గడచినదుఃఖంబు లనుభవింపఁ
గలవె లోకంబువారికిఁ, గమలనాభ? ౧౮౭

వ. అట్టియెడ — ౧౮౮

క. [2]విదురుం డొక్కరుఁడు దక్కఁగ
సదస్యు లెవ్వరును 'ధర్మసంశయ మిది, గూ
డదు నార!' అతనిశీలము
కుదుం రీలోకమున కింతకుం దలఁపంగన్" ౧౯౦

1. క్రొత్తడి...పొక్కితిన్ = ఎల్లభంగులంజూడ మగనాలు — పతివ్రత; ఆమె కొలువులో దైన్యపడుట సూచి దుఃఖించితిని.
2. తా. విదురుఁడొక్కరుఁడు దప్ప, ఆకొలువువారలు ఎవ్వరును 'ఇది ధర్మసంశయము! కూడదు' అనరుగదా! ఆతని (విదురుని) సద్వర్తనమే ఇంతవఱకు ఈలోకము నకుఁ గుదురు.

వ. అని యివ్విధంబునఁ గృష్ణుతోడఁ దనయుమ్మలికంబు లన్నియుఁ
ద్రవ్వికొని శోకంబు వెల్లిగొనఁ, గొండొక దిగంబాఱెడుచిత్తంబుతో
మఱియు ని ట్లనియె: ౧౯౧

క. "ఇది యెల్లను నొకతల, యీ
పదుమూఁడేఁడులును నాకు బావకొడుకుచే
నదయ మగుకూడు గుడుచుట
యది యొకతల యయ్యె! నేమి యనఁగల దనఘా? ౧౯౨

క. [1]తన్నుఁ దనతమ్ములను నా
కన్నకొడుకుల ట్ల తలఁతుఁ గాని విభేదం
బెన్నఁడు నామది లేమికి,
వెన్నుఁడ, దైవంబ సాక్షి! వినుము పలికెదన్. ౧౯౩

క. ఇది నిక్కం బగునేనియుఁ,
దుది నీవుం బాండవులును దురితరహితు లై
ముద మందఁ జూడఁ గనియెద;
నది దీనికి మందు సువ్వె, యంబుజనాభా! ౧౯౪

సీ. బావ యొప్పం దనుపలుకుల నే మగు?
నాతనికొడుకుఁ గీడాడ నేల?
కురువృద్ధుఁ డగుబాహ్లికుని దూఱ నేటికి?
[2]భీష్మునిపైఁ బ్రియి వెట్ట నగునె?
ఇట్టికార్యములయింటి కిచ్చినమనవారి
నందుఁ గా; కట్లు దా ననుట మేలె?
అర్జునుపుట్టినయప్పుడు వీడు లో
కము లెల్ల గెల్చుపొగడ్త మొగులు
:

---

1. తన్నుఁ దన తమ్ములను = దుర్యోధనుని యతని తమ్ములను. 2. భీష్మునిపైఁ బ్రియి వెట్టనగునె = ...నింద — నడి — పెట్టనగునా?

తే. ముట్టునట్టిద యగు; 'రణమున జయించుఁ
గౌరవుల ; సోదరులుఁ దానుభూరిరాజ్య
గౌరవముఁ బొందు'నని యశరీరవాణి
వలికె ; [1]నది దిట్టువడుఁగాక వలయునేని ! ౯౫

వ. ధర్మంబు గలుగు నే నది నిక్కం బయ్యెడు. దాని కెల్లను నిర్వాహకుండవు నీవు గలవు గాదె! నీ మన్నించు నెచ్చెలులకుం జెప్పెడు మాటలు గలవు వినుము. అయ్యుధిష్ఠిరుతో ని ట్లనుము : ౯౬

క. వేఁడికొని కృపణు లై కను
పోఁడిమి యది యేల ? రాజపుత్త్రిలు దమమై
వాఁడిమి దప్పిన, నిప్పులు
వేఁడిమి సెడినట్లు ; జనులు విని యులుకుదురే ? ౯౭

వ. భీమార్జునుల కి ట్లని చెప్పుము : ౯౮

ఆ. కొడుకుఁ గాంచు రాచకూఁతు రెద్దానికి ;
నట్టిపనికి నుచిత మైనసమయ
మొనవెఁ దడయు టింక నొప్పదు ? జనములు
నట్లు గాని పురుషులనరు మిమ్ము ! ౯౯

క. భుజబలమున జీవించుట
నిజధర్మము ; మెత్తఁబడుట నింద్యము ; మాద్రీ
ప్రజలకుఁ జెప్పుము. ద్రుపదా
త్మజఁ గార్యం బడుగు మనుము తగ నందఱతోఁ. ౧౦౦

చ. అలిగిన భీమ ఫల్గునుల కడ్డము లేమి యెఱుంగు ; దంతలం
తేలు వడి వాని నీఁగ వలదా ? విను, మాపని కెల్లఁ బాండుపు
త్త్రిలె కలవారు. నీ కెటులు దోఁచిన నట్టులు సేయువారు గా,
కలఘువిచార, నాయలఁత యార్పుము, నన్ గడతేర్పు మెమ్మెయిన్ !* 

వ. అనినఁ గృష్ణుండు గొంతి ననునయించి యి ట్లనియె : ౧౦౧

---

1. అది తిట్టువడుగాక వలయునేని = అది దూష్యమగుఁగాక.

—: శ్రీకృష్ణుఁడు కుంతీదేవి నూఱడించుట :—

చ. "సుగుణవు, పుట్టినింటికిని జొచ్చినయింటికిఁ దేజ మెక్కఁగాఁ
దగుచరితంబునన్ నడచుధన్యవు, ధీరవు, దేవి, నీ వెడ
న్వగ లడఁగింప కున్న భువనంబుల నిం కిట యెవ్వ రోర్చువా
రు? కలఁక దక్కుమీ, హృదయరోగము లన్నియుఁ బుచ్చివై చెదన్.

క. తనయులుఁ గోడలు సేమం
బున నున్నా; రధికభక్తిపూర్వముగా దం
డ నమస్కారంబులు నీ
కొనరించిరి; కౌఁగిలించి రుల్లములఁ దగన్. ౨౦౪

క. నీకొడుకు లొండుసుఖములు
సేకొన; రవ్వీరసుఖము చిత్తములఁ గరం
బాకాంక్షింతు; [1]రలంతులఁ
బోక గలుగు నెట్టు, లల్పబుద్ధులె వారల్? ౨౦౫

క. ఉత్సాహంబున శత్రుకు
లోత్సాదనవిధి యొనర్చి, యున్నతసామ్రా
జ్యోత్సవము నొందుపుత్త్రుల
నుత్సుకతం జూతు గాక యూఱడు మింకన్." ౨౦౬

చ. అన విని, మోము విచ్చుచు మురారికి నిట్లనుఁ గుంతి: "పాండునం
దనులకుఁ దండ్రియున్ గురువు దైవము నారయ నీవ కావె? నీ
మనమున ధర్మమున్ హితము మంచిగఁ జూచి విధించినట్లు చే
సి నెగడువారు గాక, నినుఁ జేరిన నాపద లొంద నేర్చునే? ౨౦౭

క. వారలక యేల, మాధవ,
కౌరవులకు మఱియు నీజగంబుల కెల్లం
జేరుగడ నీవ; నీపలు
కారయ వేదంబ కాదె యఖిలంబునకున్?" ౨౦౮

1. అలంతులఁ...వారల్ = వారు నీచులా! తుచ్ఛముల నెట్లాసింతురు?

వ. అనినం, బ్రసన్నవదనుం డగుచు నద్దేవింగారవించి, యామంత్రణంబు
సేసి, తదావాసంబు వెలువడి, తనరాకకు నలంకృతం బైనదుర్యోధను
మందిరంబునకుఁ గృతవర్మ సాత్యకిసమేతుం డయి పోవుగోవిందునిం
గని, తదీయద్వారపాలకులు సంభ్రమంబునం బఱచి యతని కెఱిం-
గించి, తదనుమతంబునం బఱతెంచి యెదుర్కొని కక్ష్యాంతరంబుల
సందడి నెడ గలుగ జడియుచు, వినయంబునం దోడ్కొని చనిరి.
అమ్మనుజవిభుండు, గైలాసశిఖరాకారం బగుసౌధంబున బాహ్లిక
భీష్మ ద్రోణ ప్రభృతులును, కర్ణ శకుని సైంధవాదులును, దుశ్శా
సన వికర్ణ దుర్ముఖ ప్రముఖులును, మఱియు ననేక దేశాధీశులునుం
బరివేష్టింపఁ బేరోలగంబున సింహాసనాసీనుం డై యున్నయెడకుం
జనునప్పు డా సుయోధనుండు సపరివారంబుగాఁ బ్రత్యుత్థానంబు
సేయం జేర నరిగి, యతనికిం దగువారలకు నాలింగనాద్యుపచారం
బులు దానుం దమ్ముండును నాచరించి — ౨౦౯

క. అతఁ డనుపఁగఁ గనకమయో
న్నతపర్యంకంబునందు నారాయణుఁ డూ
ర్జితమహిమ నుండి, యభ్య
ర్చితుఁ డయ్యెఁ దగంగ నతనిచే సత్కృతులన్. ౨౧౦

—: శ్రీకృష్ణుఁడు దుర్యోధనునితో సంభాషించుట :—

వ. సాత్యకియును సముచితప్రకారంబునం బూజితుం డయ్యె. తదనంత
రంబ నిజాసనాసీనులయి తనమొగంబునం జూడ్కి నిలిపి యున్న
దుర్యోధనాదులతో మాధవుండు మధురసంభాషణంబులు సేయు
చుండె; అట్టియెడ — ౨౧౧

తే. సముచితంబుగఁ గూరలచంద ముగ్గ
డించి, కుడుపు తెఱంగు పుట్టించి పలుకు
నాసుయోధనుతోఁ గృష్ణుఁ డచటఁ దాను
గుడువ నొల్లకయునికి యొప్పడఁగఁ జెప్పె. ౨౧౨

వ. చెప్పిన విని, దుర్యోధనుండు సూర్యసూనువదనం బవలోకించి యల్లన
యి ట్లనియె: ౨౧౩

క. "హరి పలికినవిధ మెంతయు
నెర వై యున్నయది వింటె? ఇమ్మాట తెలం
గరయుదము తొలుత; నీ పెను
పరిచందం బెల్ల నెఱుకపడియెడుఁ బిదపన్." ౨౧౪

వ. అని యచ్యుతున కి ట్లనియె: ౨౧౫

తే. "వలయు నన్న పానంబులు పలుదెఱఁగుల
నేర్పువిధముల నే మొదఁగూర్చి వేడ్క
నున్న, నీ వుపయోగింప నొల్ల కునికి
బాంధవమునకు నీతికి బాహిరంబు! ౨౧౬

క. [1]కౌరవులకుఁ బాండవులకు
నారయ నీ వొక్కరూప. అసదృశధర్మా
చారుండవు; రాజునకుం
గూరుతు, గత మేమి యి ట్లగుటకుం జెపుమా" ? ౨౧౭

క. [2]అనుడు, నుపేంద్రుఁడు మనుజేం
ద్రున కి ట్లను: "దూత లెందుఁ దొలితొలి గుడువం,
గొనఁ, గట్టఁ, దొడఁగుదురె? వ
చ్చినకార్యము దీర్చి పిదపఁ జేయుం డెల్లన్." ౨౧౮

వ. అనిన, గాంధారీనందనుండు దేవకీనందనున కి ట్లనియె: ౨౧౯

ఆ. "వేగపడుట మేలె? వినుము, కార్యము దీఱు,
దీఱ కుండు, దాని తెఱఁగుదగిన

---

1. తా. నీవు కౌరవులకుఁ బాండవులకును సమాన బాంధవుఁడవు...ధృతరాష్ట్రునకును ప్రియుఁడయినవాఁడవు. ఇట్లు కుడువననుటకుఁ గారణ మేమయ్యా!
2. తా. రాయబారు లెక్కడనేని, వచ్చినపని కాకమునుపు ఎదరియింట తినుటకు ఏదేని గొనుటకు, వస్త్రములు గట్టుకొనుటకుఁ గడంగుదురా?

యప్పు డాడ రాదె? ఇప్పుడు ముకుఁదాప్రిటఁ
గాలు ద్రువ్వ నేల కమలనాభ? ౨౨౦

వ. నీవు వచ్చినవాఁడవు మాయింటఁ గుడిచి కూర్చుండి యెల్లపనులుం జెప్పుట యొప్పుఁగాక, కుడువనొల్ల నసం దగునె? దీనికిం గారణంబు నాయెఱింగినయది లేదు. విచారింపక పలికితి!" అనిన, మందరధరుండు, మందస్మితంబుతో నంకటం గలయం గనుంగొని, ధార్తరాష్ట్రకరంబు గజంబు పల్లవం బల్లన తెమల్చులీలం గేల నమర్చి 'యిట్టిమాటలు తేటపఱుప వలయునేని విను'మని యతని కిట్లనియె:

చ. [1]"ప్రియ మెసఁగం దగం బిలిచి పెట్టెడుకూడది లెస్సకూడు; ద క్కుయనయహీనతం, దమకు నాపద యైనెడ, నిట్టు నట్టు నే మియు నన లేనికూడదియు మేవడి యై చను; నీవు మాదెసం బ్రియుఁడవు గావు; మాకు ధృతిపెం పఱ నాపద లే దొకింతయుణ.

వ. అట్లుం గాక, ౨౨౩

క. పగవారియింటఁ గుడిచిన
నగుఁ దమ కనుమాన మమృత మైనను; దారుం
బగతురకుఁ గుడువఁ బెట్టఁగఁ
దగ; [2]దొడళులకు కెప్పు డెవ్విధము వాటిలునో! ౨౨౪

వ. 'నేను బగతుండనె' యంటేని– ౨౨౫

1. అయినెడ...మేవడియై చను=కలిసినచోటిది మంచియని చెడుగని యేమియు నన నవకాశములేని కూడు; అదియయినను ఉచితమే – పరవాలేదు. తక్కు...చను= తక్కినది మేలును గౌరవమును పాటింపక ఆపదం జిక్కువడినపట్టున. ఇట్లు అట్లు–బాగు ఓగు–అని యేమియు ననవీలులేక (అన్నము దొరికినదే చాలునను కొనువేళ) దొరకు కూడయి నను ఒకవిధముగా మంచిదే–పరవాలేదు. నీవు మాదెసఁ...లే దొకింతయుణ=(ప్రకృత మున్ననో)– నీవు మాయెడఁ బ్రియుఁడవుకావు; మాకా ధైర్యము కోల్పోయి యాచించు నంత ఆపదయు నేమాత్రము లేదు. [మేవడి=(దే. వి.) ఉపాయము; సమ్రిత. (విణ) ఉచితము.] 2. ఒడళులకు...వాటిలునో=శరీరమునకు ఎప్పుడు నెట్టివికారము కలుగునో.

క. అలుగుదు పాండవులకు ; వా
రలు నాకుం బ్రాణములు ధరావల్లభ, యి
ట్టలముగఁ ; [1]దమప్రాణములకు
నలుగుజనులు పగతు రగుట యనుమానంబే ? ౨౨౬

ఆ. కారణంబు లేక కౌంతేయులకు బాల్య
మాది గాఁగఁ గీడె యాచరింతు ;
పుణ్యపరులు దోడఁబుట్టువు లార్యులు ;
వైర మెత్తఁ దగునె వారితోడ ? ౨౨౭

వ. ఇట్లున్న మీయందఱ యన్నంబులు దుష్టాన్నంబులు. విదురుం డొక్కనియన్నంబు భోక్తవ్యం బని నిశ్చయించితి. కావున, నందుఁ బోయెద"నని చెప్పి, యజ్ఞనపతి యనుమతిసేయఁ జనునప్పుడు తోడన బాహ్లీక భీష్మాది కౌరవులును, గుంభసంభవ ప్రముఖులైనమాన్యులును జని మాధవుతోడ, 'మాయిండ్లనెల్లను గానిక లాయితంబులు సేసికొని నీవు విజయంచేయుటకు నెదుళ్ళుచూచుచున్న వారము'. అని పల్కి ప్రార్థించిన, 'నే నన్నిచోట్లకు వచ్చినవాఁడన ; యందఱ యర్చనలుం గైకొంటిన ; మీరు నిలువుండు' అని వారల నిలిపి, విదురుగృహంబునకుం బోయె. ౨౨౮

సీ. సంభ్రమస్నేహనిశ్చల భక్తియుక్తిఁ బ
విత్రమజ్జనము గావించి, విదురుఁ
డెల్లవంటకములు నేర్పడ బోనాలు
వేర్పింప, నెంతయుఁ బ్రీతి ముంద
రోజమై బ్రాహ్మణభోజనం బొనరించి,
సపరివారముగ విశాలరమ్య

1. తమ ప్రాణములకు ... అనుమానంబే = తమ ప్రాణములయెడఁ గోపగించువారు శత్రువులగుట సంశయమా ?

పూతస్థలంబునఁ బుండరీకాక్షుండు
దమ్ముఁ గాంచుఁ, దాను నత్సన మెలర్ప

తే. సరసరంజక మహనీయసంప్రయోగ
మగుచతుర్విధహృద్యాన్న మారగించె;
లలితసంభావనామంజులంబు లైన
పలుకు లెడనెడ విదురున కెలమి యొసఁగ. ౨౨౯

వ. అతండును— ౨౩౦

క. "గోవింద, సంభ్రమము సం
భావింపుము; మాకు నిదియ పరమధనం; బీం
డేవిధమున నీ కర్చన
గావింపం జాలువాఁడు గలఁడే యెందుఁ?" ౨౩౧

వ. అని మఱియు నత్యంత వినయవాక్యమ్ములఁ నారాధించుచుండె. ఇట్లు కృతాహారుండైనహరికిఁ జందన చర్చాద్యర్చనంబు లాచరించి యవ్విదురుండు కృతార్థుం డై యుండ, గవి గణకప్రముఖ నిఖిలవిద్వజ్జనంబులు, గాయక పాఠక [1]వాంశిక వైణికాది వినోదపాత్రంబులు నప్పరమేశ్వరుం గాన వచ్చి ప్రొద్దు పుచ్చి యభిమతార్థంబులు వడసి చనిరి. రాత్రి యగుటయుం దగిన యభ్యంతర మందిరంబున హంసతూలికాతల్పంబున భుజంగతల్పు నునిచి యతనికడ నుచితాసనంబున నుండి—

ఆ. విదురుఁ డిట్టు లనియె: "నిది యొకకార్యంబు
గాఁగఁ బూని యిందు రాఁగఁ దగునె?
దుష్టబుద్ధి నీచు దుర్యోధనుండు నీ
మాట వినునె దురభిమానఘనుఁడు? ౨౩౩

క. వచ్చిన సైన్యంబులఁ గని
పెచ్చు పెరిఁగినాఁడు; ద్రోణ భీష్ములలావుల్

---

1. వాంశిక = వేణుగాన ప్రవీణులు.

నచ్చియుఁ, గర్ణుం డొక్కఁడ
యిచ్చుఁ దనకు విజయ మనియు నెంతయుఁ బొంగున్. ౨౩౪

వ. నీ విట వచ్చుట వినినయప్పుడు ధార్తరాష్ట్రు లందఱుం గూడం బాఱి తమలో నిశ్చయించిన తెఱంగు: నీశాసనం బుల్లంఘింపం గలవారు; పాండునందనులకు నేమియు నీ కుండువారు; తార యీధాత్రి యంతయు బీఱు వోవ కుండ నేలువారు; వారిం గూడినరాజు లెల్లను దిగ్విజయంబు నాఁడు పాండవులచేత భంగపడిన వారు గావునఁ, 'గర్ణుతో నేకార్థుల మై చత్తుము; గెలుతుము — ఇంతియ కాని యొండు లేదు' అని నిశ్చయించుకొని యున్నవారు. అట్లగుటం జేసి, దుర్యోధనుండు గండు మిగిలి యున్నవాఁడు. సంధి గా నేరదు. వారల కందఱకు నిది ప్రాప్తకాలం బై యున్నయది. ఎట్లును నడుగ నేర్చినవారు గారు. ఇట్లు దమ్మెఱుంగని దుష్టాత్ముల నడుమం గూర్చుండుటయు, నవ్వొంగలివిత్తు లఱచుపీఱఁడి యఱపులకు వంక లొత్తి మాఱు సెప్పుటయు నొప్పక యుండు. వెడంగు లగుటం గార్యవచనంబు లెఱుంగరు. మొఱకు లగుటం బ్రతాపభాషణంబులకు వెఱవరు. వారలతలంపులు గీడు. నీమహనీయ ప్రభావబుద్ధిపౌరుషంబు లే నెఱుంగుదు. అయినను బాండవేయులపై స్నేహంబునను నీమీఁది భక్తినిం జెప్పెద; అందుఁ బో వలవదు." అనిన వాసుదేవుం డతని కిట్లనియె: ౨౩౫

తే. "నీవివేకంబు నార్తియు నెఱపి తీవు;
తల్లిదండ్రులమాడ్కి హితంబు సెప్పి;
తేను నా రాక తెఱఁ గెల్ల నేర్పడంగఁ
జెప్ప విని, యేమి సెప్పినఁ జేయువాఁడ. ౨౩౬

---

1. అవ్వొంగలివిత్తుల = అమూఢాగ్రేసరుల.

—: శ్రీకృష్ణుఁడు విదురుతో సంభాషించుట :—

క. ఎఱుఁగుదు నేను సుయోధను
కొఱగామియు, నతనితోడఁ గూడిన నృపు లం
దఱుఁ బగ మనమున నిడికొని
యఱుముటయును, సంధిపొసఁగ దనియు మహాత్మా. ౨౩౭

ఆ. పుడమియెల్ల నొడ్డగెడ వయి గజవాజి
యుతముగాఁ గడంగి, యుగ్రమృత్యు
ముఖము మొరఁగఁ దివురుమూర్ఖత మానుట
యధిక మైనపుణ్య మనఘచరిత. ౨౩౮

వ. మానుప వచ్చునే యంటేని —

క. [1]దొరకొని పుణ్యముఁ బాపము ౨౩౯
నరుఁ డర్థిం జేయుచుండ, నడుమ నొకట న
వ్వెర వెడలి తప్పినను, ద
త్పరిణతిఫల మొందునండ్రు ధర్మవిధిజ్ఞుల్. ౨౪౦

వ. అట్లుం గాక — ౨౪౧

తే. చుట్టములలోన నొప్పమి పుట్టినప్పు
డడ్డపడి, వారితోడఁ గోట్లాడి యైనఁ
దాన యుడుపంగఁ జొరకున్న వానిఁ గ్రూర
కర్ముఁ డని చెప్పుదురు, కర్మకాండవిదులు. ౨౪౨

వ. కావున, నీ రెండు దెఱంగులవారికి శాంతి గావింపం బ్రయత్నంబు సేసెద. ధర్మార్థ సహితంబైన తెఱంగుమాటలు మంత్రిజన సహితుం డైన సుయోధనునకుం జెప్పెద. తనకుం, బాండునందనులకు, లోకంబులకు హితం బయినవిధంబు వంచనలేక చెప్పెదు నన్నుఁ బాండవుల

1. తా. భూమియంతయు ఒడ్డగిలవడి — వాటుపడి — ఏనుఁగుల గుఱ్ఱములతోఁ గడఁగి భయావహమగు మిత్తివాతఁ జొర మునుకొను మొఱకుఁదనము మానుట.

వాఁ డని శంకించి యతండు నామాట వినం డయ్యెనేనియు మేలకాక. ఇట్లు సొచ్చి చెప్పకున్న, 'నన్నదమ్ములు దమలోనం బోరఁ గృష్ణుండు వారింపక యుపేక్షించె. తనచేతఁ జక్కంబడదా' యని యజ్ఞులైన జను లాడుదురు. ఎల్లభంగులం గార్యం బార్యులియ్యకొనం జెప్పుదు. ధార్తరాష్ట్రులుం దమకు బ్రిదుకుతెరువైన నాపలుకులు వట్టుదురు. పట్టక నీతలంచిన చందమునం దులువలై కలఁగంబాఱిన, వారు నా ముందఱ నిలువం జాలుదురే?" అని పలికిన, విదురుండు 'అట్లకాక' యని సమ్మతించి, యామంత్రణంబుసేసి నిజశయన స్థానంబునకుం జనియె. అనంతరంబ — ౨౪౩

ఆ. అతనివచనరచన యాత్మలోఁ దలపోసి
'యిట్టివాఁడు గలఁడె యెందు!' ననుచుఁ
[1]బాలకడలి కడలి పాటియై యొప్పు న
ప్పాన్పునందు శౌరి పవ్వళించె. ౨౪౪

వ. ఇట్లు సుఖనిద్ర నేసి [2]వేగుం బోకట మాగధమంగళగానంబుల మేలుకాంచి, సమయ కర్తవ్యంబులు సలిపె. అట్టియెడఁ గృతవర్మయు సాత్యకియు వచ్చి పొడసూపినం, బురుషోత్తముండు వారలు మొదలుగాఁగల యిష్టజనంబులు పరివేష్టింప, నుచిత ప్రదేశంబున నున్నంత—

క. ఇనతనయ శకుని దుశ్శా
సనసహితము గాఁగ నెలమిఁ జనుదెంచి సుయో
ధనుఁడు ప్రియోక్తులఁ దగువా
రును దానును వారిజోదరుం గొనియాడెఁ. ౨౪౬

వ. అతండును, మధుర సంభాషణంబులు సేయ, వార లతనికి ధృత-రాష్ట్రుండు బంధుమిత్త్రాది సమస్త పరిజన సమన్వితుం డయి పేరోల

---

1. పాలకడలి కడలిపాటియై = పాలసంద్రము కెరటముఁ బోలినదై.
కడలు=(దే. వి.) అల. ప్ర. 'తూలెడు పయ్యెద దుఃఖాంబునిధిలోనఁ గడలిచందమ్మునఁ గడలుకొనఁగ!'
2. వేగుంబోకట = తెల్ల తెల్లవాఱ.

గంబున నునికి యెఱింగించినఁ, బ్రియంబునఁ గట్టాయితంబైన తేరెక్కి భేరీ శంఖ చామర ప్రముఖ భద్రచిహ్నంబులతో వెడలి, గరుడ ధ్వజంబు గ్రాలఁ, గృతవర్మ సాత్యకు లొక్కరథంబునను, దుర్యోధ నాదిచతుష్టయం బొక్కరథంబునను, బార్శ్వంబుల రాఁ, బౌరులకుఁ గన్నులపండు వగుచు రాజమందిరద్వారంబుసేర [1]నరుగునప్పటియులివు నకుఁ గొలువువా రెల్ల నత్యుత్సుకు లై యెదురుచూడ, [2]రథోత్త మంబు నవతరించి, యరవిందనాభుండు — ౨౮౭

తే. ఎదురువచ్చిన విదురునియిచ్చకరముఁ,
దమ్ముచేయును రెండు హస్తములఁ బట్టి
నడచె, ముందటఁ గదియు సందడిఁ గడంగి
కర్ణ దుర్యోధనులు దొలఁగంగ జడియ. ౨౮౮

వ. కృతవర్మాది యాదవులు లోనఁగాఁగల యభ్యంతరు లైన బలుమాను షులు పొదివికొని పోవఁ, దనసమీపంబునఁ గౌరవులు రవిసన్నిధిఁ దారాగ్రహంబుల చందం బగుచుండం, దేజోరాశి యగు రాజీవా క్షుండు నని, తనకుం బ్రత్యుత్థానంబు సేసిన కురురాజును దొరలను నభివందించుచు — ౨౮౯

క. తన కని పెట్టినమణిమయ
కనకోన్నత పీఠమునఁ బ్రకాశంబున ని
ల్చినయెడఁ, దోఁచిరి నారద
మునిప్రముఖు లంతరిక్షమున నుజ్జ్వలు లై. ౨౯౦

వ. ఇవ్విధంబున సన్నిహితు లయిన యమ్మహామునులం గురుపితామహు నకుం జూపి నారాయణుం డి ట్లనియె: ౨౯౧

ఆ. "మనలఁ జూచువేడ్కఁ జనుదెంచినారు మ
హాత్ము లైన నారదాదిమునులు.

---

1. అరుగునప్పటి యఖిలివు = పోత్రత. 2. రథోత్తమం బవతరించి = రథశ్రేష్ఠము నందిగి.

వీరి కర్ఘ్యపాద్యవిధు లొనరింపు; మా
సనము లిడఁగఁ బనుపు సత్వరముగ. ౨౫౨

వ. వీరలు సముచితాసనంబుల నుండక మనకుఁ గూర్చుండుట దగవు గా" దనినం, గొలువువారెల్ల సంభ్రమాశ్చర్యంబులతో మునులవలన జూచుచుండ, భీష్ముండు పరిచారకులం బనిచి కనకమణిమయాసనంబు లనేకంబులు దెప్పింప, వార లరుగుదెంచిన, వారలకు నమస్కరించి యాసనార్ఘ్యపాద్యాదివిధులం బూజలు సేయించి, కృష్ణుండు గూర్చున్నయనంతరంబ, ధృతరాష్ట్రుండునుం, దక్కటివారును నుచిత ప్రకారంబుల నమ్మునీంద్రులకు నభివందనంబులు సేసి నిజాసనాసీను లైరి. దుశ్శాసనుండును వివింశతియును గద్దియ లిడ, సాత్యకియుఁ గృతవర్మయుఁ గృష్ణుం గదిసి యిరుపంకలం గూర్చుండిరి. కర్ణ దుర్యోధనులుం జేరువ నొక్కగద్దియ నుండిరి. విదురుండును మణిపీఠంబునఁ గృష్ణునివెనుకదెసఁ దదీయోన్నత పీఠంబునఁ [1]గరంబ త్తమిల్లి యుండె. గాంధారరాజు నిజపుత్రపరివృతుం డై యొక్కదిక్కున నుచిత పీఠాసీనుం డయ్యె. అట్టిసమయంబున— ౨౫౩

క. అంబుదశుభగాత్రుం బీ
తాంబరధరుఁ గమలదళనిభాక్షుఁ హరిఁ జూ
డం బడసి, లోచనము లమృ
తం బానినమాడ్కి, సమ్మదంబునఁ దేలన్— ౨౫౪

క. [2]ఆకొలువువారు గర మచ
లాకృతి, నొకపలుకు లేక, యుండలు వింజం
బౌఁ కిడినకరణి, నవశ ము
దాకారితచిత్తవృత్తు లై, యుండంగన్. ౨౫౫

---

1. కరంబు అత్తమిల్లియుండె = పూర్తిగ ముందటికి మొగ్గియుండె.
అత్తమిల్లు =(వై. అ. క్రి.) అస్తమించు, ఒఱగు, మొగ్గు, వ్యాపించు, శయనించు.
2. తా. ఆకొలువునవా రందఱు కరము పర్వతమువలె, నిశ్శబ్దముగా, వింధ్యశైలము అడ్డగించినట్లు, పరవశానందము రూపుదాల్చిన మనోగతులు గలవారై యుండఁగా, ..

:— శ్రీకృష్ణుఁడు ధృతరాష్ట్రితో సంభాషించుట :—

క. జలదస్వనగంభీరత
నెలుఁ గొప్పఁగ, దంతదీప్తు లెసఁగ ముకుందుం,
డలరుచెవుల నఖిలజనం
బులు విన, ధృతరాష్ట్రి భూవిభున కిట్లనియెన్: ౨౫౬

క. "జననాథ, నీకెఱుంగని
పనులు గలవె? ఐనఁ దగవుఁ బరమహితంబుం
దనవారికిఁ జెప్పన తగు
నని వచ్చితి; భారతాన్వయము ప్రియ మొందన్. ౨౫౭

క. క్షీరోదకగతిఁ బాండవ
కౌరవు లొడఁగూడి మనికి కార్యం; బది నీ
వారసి నడపుము. వా రన,
వీ రనఁ, గురుముఖ్య, నీకు వేఱుం గలదే? ౨౫౮

చ. భరతకులంబు ధర్మమును బాడియు సత్యముఁ బొత్తుఁ బెంపునం
గరుణయుఁ గల్గి యుండు ననఁగా నుతిఁ గన్నది; యందు సద్గుణో
త్తరులరు నీవు, నీయనుఁగుఁదమ్ముఁడు; నీతనయుల్ యశోధురం
ధరశుభశీలు; రీ సుచరితక్రమ మిప్పుడు దప్ప నేటికిన్? ౨౫౯

శా. ఈవంశంబున కెల్ల నీవ కుదు; రిం దెవ్వారిచందంబు లె
ట్లైన వర్తిల్లినఁ, గీడు — మేలుఁ దుది నీయం దొందెడుం గాన, స
ద్భావం బారసి, లోనిపొత్తు వెలివృత్తంబున్ జనస్తుత్యముల్
గావింపం దగు నీక యెవ్విధమునం, గౌరవ్యవంశాగ్రిణీ. ౨౬౦

చ. వినుము, సుయోధనాదు లగువీరు, సధర్ములు గాక, కార్యము
ల్గానక, మహార్థసిద్ధి యెడలుం దమ కిట్లన, కన్వయంబువ
ర్తన మిది గాదు నాక, బెడిదంపుఁడసంబున, బంధుకోటికి
న్మనసులు నొవ్వఁగా నవగుణంబులకుం బుయిలోడ రేమియున్!

ఉ. కౌరవ పాండవుల్ తెఱఁగు గైకొని, శాంతతఁ బొంది యున్కి మే;
లారయ నాకు, నీకుఁ, గుల మంతకు, నీనృపకోటి, కుర్వీకిం;
బోరిత మైన నింతకును బుట్టు మహాపద గావునన్, ధరి
త్రీరమణాగ్రి గణ్య, గణుతించి యవశ్యముఁ బొం దొనర్పవే! ౨౬౨

తే. నీకు వీరలఁ దీర్పంగ నేర వచ్చు,
నధిప, తెఱఁగు నీవశమునయదియ కాన;
నీకు వీరలఁ దేర్చుట నెఱియ కాదె?
[1]సిద్ధ మెవ్వారిఁ దెలి వొందఁ జేయ నేర్తు. ౨౬౩

ఉ. [2]అందు వృకోదరార్జునుల నాహవరంగమునందు మీఱువా
రెందఱొ? యెన్నుమా యిచట నీగురు భీష్ములఁ [3]శ్రేణి సేయువా
రెందఱొ? వారు వీరు నని నీల్గుటకంటె భవద్బలంబు లై
యందఱుఁ గూడు టొప్పదె? జనాధిప, శాంతి యొనర్పు మెమ్మెయిన్.

తే. జగతిఁ గలజనపతులు నీచరణపీఠ
మర్థిఁ గొలువ సముద్రవేలావృతోర్వి
యెల్ల నేలుట యొప్పదే? [4]తల్లి ప్రజల
యెడ విరోధంబు వాటించు టెంత మేలు? ౨౬౫

క. నరనాథ, నీ వుపేక్షా
పరుఁడ వయినఁ గౌరవులక, పాండవులక కా;
దరయఁగ భూప్రజ కెల్లను
దురితం బొనరించినట్ల; తుదిఁ గీడు సుమీ. ౨౬౬

---

1. సిద్ధము... నేర్తు = నిజముగా ఎవ్వరినేనిఁ దెలివొందునట్లు సేయనేర్తువు.
2. తా. యుద్ధరంగమున భీమార్జునులను మించువారు అక్కడ ఎందఱో గలరు. ఇచట (కౌరవులకడ) ఈ భీష్మ - ద్రోణులను మీఱువారు ఎందఱో ఎన్నుమా.
3. శ్రేణి =(దే. వి.) ఉన్నతపదము. పరిహాసము, అలక్ష్యము.
4. తల్లి ప్రజలయెడ = తల్లి బిడ్డలమీఁద.

క. కౌరవ పాండవులం దె
వ్వారలకుం జావు నొవ్వు వచ్చిన మే? లు
ర్వీరమణ, చిత్తమున ని
ట్లారయుమా, నీక దుఃఖ మగు నె ట్లయినన్. ౨౬౭

ఉ. వీరును వారుఁ బండితులు, విక్రమవంతులు, బాహుగర్వదు
ర్వారులు; [1]లోనిరిత్తబవరంబున నాఱడిఁ జావఁ బోవ, నె
ట్లూరక యుండ వచ్చుఁ? [2]గడునొప్పెడుమేనులు, వాఁడికైదువుల్
గూరఁగ నాటినం బుడమిఁ గూలుట కక్కట! యోర్వవచ్చునే? ౨౬౮

ఆ. ఇట్లు గాక యుండ నీ రెండుదెఱఁగుల
వారిఁ గాచికొనుము, వసుమతీశ,
నీదుప్రాభవంబు నీతియు శాంతియు
నఖిలజనులుఁ బొగడునట్లు గాఁగ." ౨౬౯

వ. అని చెప్పి వెండియు— ౨౭౦

—: శ్రీకృష్ణుఁడు పాండవుల చెప్పినమాటలు ధృతరాష్ట్రునితోఁ జెప్పుట :—

తే. "పాండవులు దండ్రి నచ్చినప్రజలు; వారి
నరసి ప్రోచితి శైశవ మాది గాఁగ;
నడుమ నిష్కారణము దిగవిడువఁ దగునె?
పార మొందంగ రక్షింపు గారవమున. ౨౭౧

వ. పాండుకుమారులు నీకుం బరమభక్తిం బ్రణమిల్లి యందఱు నొక్క
మాటగా నీతోఁ జెప్పు మని నాకుం జెప్పినవిధంబు వినుము: "తన
పంపునం బండ్రెండువత్సరంబులు వనంబున వసియించితిమి. పదు

---

1. లోనిరిత్త...వచ్చు = తమలోని వట్టి పోరాటములలో వ్యర్థముగాఁ జావఁబోవ నూరక ఎట్లుండనగును? . 2. కడునొప్పెడు మేనులు...ఓర్వవచ్చునే = మిగుల నందమయిన తనువులు పదనగు నాయుధములు గ్రుచ్చుకొని భూమిం బడుచుండఁగా ఎట్లోర్వవచ్చును?

మూఁ డగునేఁడు జనపదంబున నజ్ఞాతవాసంబునుం జలిపితిమి. మా తండ్రిసమయంబు పరిపాలించి యే మర్ధరాజ్యం బెట్లునుం బడయుదు మని కృతనిశ్చయుల మై పడితిమి. తల్లియుఁ దండ్రియు నెల్ల చుట్టంబులు నేఁడుగడయును మాకుఁ దాన. మావలన నేరమి గల్గినం గినిసి యిట్లు గాఁ దల్లని చక్కంబెట్టునది. తనగల పది వేలేండ్లకుం దన్న కాని మఱి యెఱుంగము. ఎట్టివార మైనను మమ్మును దుర్యోధనాదులు దలంపరు. తనయందుఁ దెఱంగు గలిగిన నెవ్వరు గొఱ గాకున్నను గులంబుపాడి సెడక చెల్లు" ననిరి. అని పలికి, మఱియు ని ట్లనియె:

ఉ. "[1]సారపుధర్మమున్ విమలసత్యముఁ, బాపముచేత బొంకుచేఁ
బారముఁ బొంద లేక, చెడఁ బాలివి యైనయవస్థ, దక్షు లె
వ్వార లుపేక్ష సేసి రది వారలచే టగుఁ గాని; ధర్మని
స్తారక మయ్యు, సత్యశుభదాయక మయ్యును దైవ ముండెడున్.

వ. అని, యీసభ్యులకుం జెప్పు మనిరి. నీవును సభాసదు లైనరాజులు నే మనియెదరు, అనుండు. ఏను ధర్మంబును నీతియును మున్నిడికొని మనోవాక్ప్రకారంబు లేకరూపం బైన సత్యంబ కాఁ జెప్పితి. ఇత్తెఱంగు మీకు మేలు. క్రోధమాన మత్సరంబులు విడిచి యిట్లు సేయుండు — ౨౭౪

ఆ. పాండవులకుఁ దగినపాలు మేదినిఁ బంచి
యిచ్చుకంటెఁ గార్య మెద్ది గలదు?
ధర్మ మెద్ది? సముచితం బగువిధ మెద్ది?
శక్య మెద్ది? చెప్పుఁడ వాక్య విదులు." ౨౭౫

1. తా. పరమధర్మము పవిత్రమగు సత్యము—ఈరెండును పాపముచేతను, బొంకుచేతను కడముట్టలేక చెడును. (ధర్మము చెడునడతచేతను, సత్యము బొంకుచేతను చెడు ననుట) ఆచెడుటకుఁ బాల్పడిన ధర్మ - సత్యముల యవస్థచూచి, దక్షులు (= నేర్పరులు) ఎవ్వరు ఉపేక్షింతురో అది వారికేచేటుగాని, ధర్మమును తరింపఁజేయుటకును, సత్యమును శుభావహముగఁ జేయుటకును దైవము ఉండఁగలదు.

క. అని పలికి, 'మహారాజా,
విను' మని ధృతరాష్ట్రుతోడ వెండియుఁ దా ని
ట్లని చెప్పె వాసుదేవుఁడు
తనమది నలు లేక కార్యదశ దెలియంగన్ : ౨౭౬

ఆ. "వారితండ్రిపాలు వారికి నిచ్చి, నీ
పాలు నీవుఁ బుత్త్రపౌత్త్రచయము
ననుభవించి సుఖుల రై యుండుఁ; డిది బంధు
మిత్త్రసుజనకోటి మెచ్చు తెఱఁగు. ౨౭౭

క. ఎఱుఁగవె యజాతశత్రుని
నెఱియును ధర్మంబు సత్యనిష్ఠయు ? మిము నె
త్తెఱఁగున ననువర్తించెనొ
యెఱుఁగవె, తనుచేవ గలుగు టెఱుఁగవె యధిపా ? ౨౭౮

వ. నీ వెఱుంగుదు; ఐనను జెప్పెద వినుము. ఇంద్రప్రస్థపురంబుననుండి పాండవాగ్రజుండు నీకుం బెంపునుం బేరునుం జేయం గోరి — ౨౭౯

చ. మద మడఁగించి భూపతిసమాజము నెల్లను నిన్నుఁ గొల్వఁ జే
యుదు నని పూని, దిగ్విజయ మున్నతిఁ జేసి మహావిభూతితో
మది మది నుండ, నీసుతుఁడు మంత్రులు, సౌబలు జూద మార్చి, సం
పద గొని, యంతఁ బోవక, సభన్ ద్రుపదాత్మజ భంగ పెట్టరే ?

ఉ. దానికి నీవొడంబడితి ! ధర్మజుఁ డంతయుఁ జూచి సత్యముం
బూని, వృకోద రార్జునులు బొంగులుగాఁ, బెడచేతఁ గన్ను నీ
రూనఁగ నొత్తుకొంచుఁ జని, యుగ్రవనంబున దుఃఖమగ్నుఁడై
దీనత నుండి పూన్కి దగఁ దీర్చియుఁ, గూడి మనంగఁ గోరెడిన్.

క. తనుఁ దాన పోలుఁ గా, కే
మన వచ్చు నజాతశత్రు నతి శాంతతయున్
వినయము గౌరవమును ! నే
జనపతులకుఁ గలవు సెపుమ సౌజన్యనిధీ ? ౨౮౨

తే. ఏ నిం తాడితి సీసం
తానం బిరుదెఱఁగునకు హితము గోరి; భవ
త్సూనునిమతి యతిలోభము
మానిచి, పాండవులఁ దెమ్ము, మనుజాధీశా! ౨౮౩

ఉ. వారలు శాంతశూరులు, భవచ్చరణంబులు గొల్వఁ బూని యు
న్నాః రటుఁ గాక, మీకది మనంబున కప్రియమేని నింతకుం
బోరికి వచ్చుచుండుదురు. భూవర, రెండుదెఱంగులందు నీ
కారయఁ బథ్య మేది యగు, నవ్విధ మేర్పడ నిశ్చయింపుమా."

చ. అనవుడు, రోమహర్షణము లంగములం బొడమన్, సదస్యు లె
ల్లను బ్రియ మంది నెమ్మనమునలం 'బురుషోత్తముఁ డింతయొప్పఁ బ
ల్కెనె! మఱుమాట లాడ నయకోవిదుఁ డెవ్వఁడు? ధీరుఁ డెవ్వఁ? డిం
దనువరి యెవ్వఁ?' డంచు నచలాకృతులై నెటి నూర కుండఁగన్.

వ. జామదగ్న్యమహాముని సుయోధనుతో ని ట్లనియె: ౨౮౬

సీ. "వినుము, దంభోద్భవుం డనురాజు దన కేదు
రెవ్వరు లేరంచుఁ గ్రొవ్వి, నరుఁడు
నారాయణుం డనువారలు గంధమా
దన మనునగమునఁ దపము సేయ,
వారిపైఁ జని యాహవమునకుఁ బిలిచిన,
నమ్మునీంద్రులు వల దని యనేక
విధములఁ జెప్పంగ వెండియుఁ బో కున్నఁ,
[1]గుశముష్టి నుజ్జ్వలవిశిఖవృష్టి
ఆ. గురిసి నరుఁడు సేనఁ గూల్చి, యాతని భంగ
పెట్టి, పట్టి విడిచె. అట్టియమ్మ

1. కుశముష్టిన్ ఉజ్జ్వల విశిఖవృష్టి గురిసి = దర్భపిడికిలితో తీవ్రతమమగు అంపవాన గురిపించి.

హాత్ము లిపుడు పార్థుఁ డనఁ, గృష్ణుఁ డనఁగ లీ
లార్థ కలితజన్ము లైరి సూవె! ౨౮౭

వ. కావున, నాదంభోద్భవు చందంబున నుద్ధతి వాటించుటయు, నరనారా
యణులతోడఁ దొడరుటయు మీఁద మే లయి యుండదు. పాండవుల
తోడి పొందు మేలు". అనిన యనంతరంబ, కణ్వుండు దుర్యోధనున
కి ట్లనియె : ౨౮౮

—. కణ్వుండు దుర్యోధనునితో గరుత్మంతుని వృత్తాంతంబు సెప్పుట —

క. "అది యోలుఁ; దన్ను నెదిరిని
మది నెఱుఁగక నిగ్రహించి మద మెత్తుట యొ
ప్పు; దహంకారం బొనరిం
పదె పౌరుషహానిఁ దొల్లి పక్షీందుగ్రనకుఁ ? ౨౮౯

వ. అది యె ట్లనిన — ౨౯౦

సీ. అమరేంద్రరథసూతుఁ డైనమాతలి దన
సుత గుణకేశికిఁ బతిఁ దగంగ
నారసి, యార్యకుం డనుభుజంగాధిపు
మనుమనిఁ జిరకుని తనయు సుముఖు
నర్థిమైఁ గోరిన, నార్యకుం డుమ్మలి
కంబుతో ని ట్లను: 'గరుడుఁ డితని
తండ్రి వధించి యొంతయు నల్కమై వీని
నిం కిట నెల సమయించువాఁడు

ఆ. గాఁగఁ బూనిపోయెఁ; గావున, నే మియ్య
కొనఁగ నేర;' మనిన విని, 'బలారి
నడిగి పడసి యిత్తు నాయువు రం' డని,
వారిఁ గొనుచు నరిగె సారథియును." ౨౯౧

వ. వారల భాగ్యంబున నప్పు డింద్రుండును నుపేంద్రుండును నొక్కచో నుండంగని, మాతలి యక్కార్యంబు విన్నవించినం గరుణించి జిష్ణుండు విష్ణునకుం జెప్పి చేయించువాఁడై వైనతేయుదెసకుం దాన చాలి సుముఖుం జిరాయురుపేతుం జేసిన — ౨౯౨

క. మాతలి, పాణిగ్రహణం
బాతనిఁ జేయింపు మన్న, నంతయు విని తా
నేతెంచి గరుడుఁ డతికో
పాతురుఁడై రేఁగి పెలుచ నమరాధిపుతోన్. ౨౯౩

వ. వాసుదేవు సన్నిధి నిట్లనియె: ౨౯౪

క. "విను, నీ వదితిసుతుండవు;
వినతకొడుక నేను విఱ్ఱవీఁగెడు మనకున్
జనకుఁడు కశ్యపుఁ డొక్కఁడ
దనుజుల శోధించి చంపుదమ యిరువురమున్. ౨౯౫

క. ఏమిట నీ కేఁ దక్కువ?
నామేరకు నడ్డపడితి" నావుడు, నింద్రుం
"డీ మహనీయమహిమకును
ధామము విష్ణుండు గాక తక్కొరుఁ డగునే?" ౨౯౬

వ. అనినఁ గటకటంబడి గరుత్మంతుండు — ౨౯౭

ఉ. "తమ్ముఁడ, నీవు నాకొలఁది తథ్య మెఱుంగక నాకు నీచభా
వ మ్మగుభంగిఁ జేసితివి. వాసవ, యియ్యదితిప్రసూతవం
శ మ్మఖిలమ్ముఁ దాల్తు నొకసన్నపుటీఁకన. ఇట్టినన్ను నీ
విమ్మెయిఁ దూలపుత్తె?" అని యాక్షుణరోచులఁ గెం పెలర్పఁగన్ —

వ. ఉన్నం గనుంగొని, కోపించి వాసుదేవుండు వెడనవ్వు నవ్వుచు —

క. "నీ వేటిమోపుకాఁడవు?
నావెరపున నిన్ను నడపినను గర్వం బే
లా? వెడఁగ" యంచుఁ దనముం
జే వీఁపున నిడ, సురేంద్రజిత్తు వికలుఁడై — ౩౦౦

క. ఎఱకలు విచ్చుచుఁ, దుండము
తెఱచుచు, వ్రేఁగడరి, సొగసి, త్రెళ్ళి, వివశుఁడై
యఱచిన, నోడకు మని హరి
నెఱి సక్కఁగఁ దీర్చి యొత్తె నెగయంగఁ గృపన్. ౩౦౧

వ. ఇవ్విధంబునం గేశవుండు గరుణించి గరుడుని ననునయించి, 'యింక
నవుదానికి సద్గతిమాని బుద్ధి గలిగి యుండుము' అని వీడ్కొలిపి
పుచ్చినం బోయె. కావున, గర్వంబు గొఱగాదు; ఇంతయు నీమహా
నుభావుం డెఱుంగు"నని నారదుం జూపి, "యితండు మాతలి కన్యా
కార్యంబునకుఁ దోడై నడచె నడుగుము. అదియ కాదు, సర్వేశ్వ
రుం డగుమాధవు మాహాత్మ్యం బితనికిం గరతలామలకం బయి
యుండు. ప్రభవిష్ణుం డగు నాదివిష్ణుఁడుగదా యీకృష్ణుండు. ఈతని
సహాయత్వంబు గలకౌంతేయుల తోడం గూడి మనికి కార్యంబు"
అనిన, నారదుండు ధార్తరాష్ట్రు నాలోకించి — ౩౦౨

క. "బలవంతులబలములు న
గ్గల మగుబల మెదురఁ గలుగఁగాఁ గీడ్పడు నే?
కొలఁదులవారికి గర్వము
నిలుచునె, నయమార్గవృత్తి నిలిచినభంగిన్?" ౩౦౩

వ. అని వెండియు ని ట్లనియె: ౩౦౪

అ. "ఇదియ కాని చేయ నెద్దియే ననుచు ని
ర్బంధవృత్తిఁ దలఁపు పట్టుకొనిన,
నట్టివాని కెందు నలజడి వాటిల్లు,
గాలవుండు గుఱియ కాఁడె మనకు? ౩౦౫

వ. వినుము, విశ్వామిత్త్రుపాల విద్యాభ్యాసంబు సేసి గాలవుం డనుముని కుమారుండు, 'గురుదక్షిణ యేమి సమర్పింతు' నని యడిగిన, నతండు 'ఏమియు నేల?' అని యుడిపిన నుడుగక, యెన్ని సెప్పిన నన్నింటికి నన్ని సెప్పి, నిర్బంధించినఁ గటకటంబడి యత్తపోధన వర్యుండు 'అశ్లేని శుద్ధధవళవర్ణంబు లై యొక్క కర్ణంబు నీలం బైన యుత్తమాశ్వంబు లెనమన్నూఱు దెచ్చి యి'మ్మని పలికినం బోయి—

తే. గాలవుం డవ్విధము ఘోటకముల నెందుఁ
బడయ లేక చింతాభరభ్రాంతుఁ డగుచు
వెడలి, యాహారనిద్రలు విడిచి, తా [1]మ
హాపథముఁ బోదుఁ గా కని యరిగి యరిగి— ౩౦౭

వ. ఒక్కచో గరుడునిం గని, బాలసఖుండు గావున, నతనికిం దన వృత్తాంతంబు సెప్పిన, నతండు కరుణాభరితుం డై— ౩౦౮

క. 'దేవతలు గాని యిట్టివి
గావింపం జాల; రీసకలదిక్కులలో
దేవేంద్రుదిక్కు బహుదివి
జవాసం; బందుఁ బోద'మని మునిపుత్త్రిఁ— ౩౦౯

క. [2]ఱెఱకడ నిడి ప్రాఙ్ముఖుఁ డై
[3]పఱచి జలధిలోనఁ, [4]జదలఁ బాఱెడునెడఁ జె
[5]య్వాఱి దప్పి నిలువఁ జాలక
యొఱగినగాలవుని డించె నొకగిరిమీఁదన్. ౩౧౦

వ. ఇట్లు డించి డప్పి దేర్చి, యందుఁ గశ్యపనందనుండు శాండిలి యను నొక్క తపస్వి శాపంబునఁ బక్షంబులు డుల్లి, యనుగ్రహంబునం

---

1. మహాపథముఁ బోదుఁగాక = ప్రాణాంతము సేసికొందుఁగాక. 2. ఱెఱకడ నిడి ప్రాఙ్ముఖుం డై = మెడమీఁద నుంచుకొని తూర్పుదిక్కుగా. 3. పఱచి జలధిలోన = సముద్రములోనఁ బఱచి. 4. చదలఁబాఱెడు నెడ = గగనమునఁ బాఱుచున్న ప్పుడు 5. చెయ్వాఱి = చేష్టదక్కి.

గ్రమ్మఱి వచ్చిన విషాద మోదంబు లనుభవించి యట సనుట
చాలించి, మగుడ మహీతలంబునకు ముని కుమారుం దెచ్చి,
యయాతి తననెచ్చెలి యని ప్రతిష్ఠానపురనాథుం డగునతనికడకు
నాతనిం దోడ్కొని చని, యగ్గాలవు లెఱుం గెఱింగించిన, నతండు —

క. తన కట్టిగుఱ్ఱములు లే
కునికిని, మాధవి యనంగ నొప్పెడుపుత్త్రిన్
ముని కొసఁగె, 'దీనికై యే
మనుజేశుఁడు నీఁడె హయసమాజము?' ననుచున్. ౩౦౨

వ. ఇట్లొసంగినం దోడుకొని — ౩౦౩

తే. 'ఇట్టి హయములు గలరాజు లెవ్వరొక్కొ'
యనుచుఁ దిరిగి యయోధ్యకుఁజని క్షత్రియ
నాథు నిక్ష్వాకుఁ గనిన, నన్నరవరుండు
దనకు నిన్నూఱు కాని లే వనియె హరులు. ౩౦౪

క. అన విని మాధవి ఋషి కి
ట్లను: 'నొక్కమహానుభావునతుల వరమునం
దనయవతి నయ్యె నేఁ గ
న్యన యగుదుం గాన, యిమ్ము న న్నితనికిన్. ౩౦౫

వ. ఒక్కసమయంబు సేసికొని యిచ్చి, గుఱ్ఱంబులు వచ్చినవి యెల్లరాఁ
బుచ్చికొ'మ్మనిన గాలవుండు, నవ్విధంబునకు సమ్మతించె. [1]అప
త్యార్థియై యిక్ష్వాకుఁడును [2]నయ్యుంకువునకు భార్య యగుట పుత్త్రి
జన్మావధిగా నోడిన యశ్వంబుల నొసంగి కన్యకం బరిగ్రహించి దాని
యందు వసుమనస్సుం డనుకొడుకుం బడసి గాలవునకు నమ్మగువను
మగుడ సమర్పించినఁ జూచి, యబ్భంగిం గలచోట్ల నెల్ల నరసి తురం

---

1. అపత్యార్థియై = సంతానముఁ గోరినవాఁడై. 2. అయ్యుంకువునకు = అశుల్కమునకు;

గంబులం గావించికొమ్మని యతనికిం జెప్పి సువర్ణుండు సనియె. మఱియు మహీతలంబునం గ్రుమ్మరి యమ్మునికుమారుండు [1]కందువ లెఱింగి పోవం బోవ— ౩౧౬

క. ఆసమయంబునను దివో
దాసుఁడు, గాశీశ్వరుండుఁ దరుణికి నిన్నూ
ఱేసిహయంబుల నిచ్చి మ
హాసత్త్వుల సుతులఁ బడసి రధిక ప్రీతిన్. ౩౧౭

వ. ఇట్లు క్రమంబునఁ గాశీశ్వరునకుఁ బ్రవర్ధనుని, భోజపురనాథునకు శిబినిఁ గనిన యక్కన్యకం గొని, వెండియు వసుంధరం దిరుగుచుండ, గరుత్మంతుండు గ్రమ్మఱి వచ్చి యమ్మునితో 'నీ వింక జాలిం బడవలదు. ఒక్కకారణంబున నీరాజులు మువ్వురకు ని[2]వ్వాజులు గలిగె. ఇంతియ కాని యొండెడ నీచందంబున మొత్తంబులై దొరక నేరవు. ఇయ్యాఱునూఱు గుఱ్ఱంబులను గురునకు సమర్పింపుము. ఒక్కటి సెప్పెద విను' మని యి ట్లనియె : ౩౧౮

క. 'ఈమువ్వుర తెఱఁగునఁ దగ
నామునియుం గొడుకుఁ బడయునట్లుగ ని మ్మీ
కోమలిని గొఱంతకు, వి
శ్వామిత్రున కిట్టులైన సంప్రార్థనతోన్.' ౩౧౯

వ. అని తానునుం దోడు సని యత్తపస్విపాలికిం బోయి, యత్తెఱంగెఱింగించి గాలవుం గానిపించి 'యీతండు బాలుండు. నీవు దయాళుండవు. ఇతనిం గృతార్థుం జేయవలయు'నని ప్రార్థించి పక్షిరాజకార్యంబు చక్కంజేసి పోయిన— ౩౨౦

క. మునివరుఁ డష్టకుఁ డనియెడు
తనయుఁ బడసి, శిష్యునకు సుదతి నొప్పించెన్ ;

1. కందువలు = జాడలు. 2. వాజులు = గుఱ్ఱములు.

వనితయుఁ దపంబు సేయం
జనియెను ; గాలవున కిట్టిచరితము గలిగెన్. 3_౨౧

వ. కావున, నెట్టివారికి నిర్బంధము దగదు. దుర్మానంబు దుర్దశ నాపాదించు. అయ్యయాతి దుర్మానంబునం గాదె పుణ్యలోక పరిభ్రష్టుండై మాధవీపుత్రు లగునన్నలువురు దౌహిత్రులకతంబున నూర్ధ్వగతిం గనియె ? అట్లగుటం జేసి — 3_౨౨

క. " నిర్బంధము దుర్మానము
దుర్బుద్ధికిఁ గాక తగునె ? దుర్యోధన, నీ
మార్బలమె పాండవులకున్
దౌర్బల్యము వాపు, శుభము దలఁకొను సంధిన్. 3_౨౩

వ. కృష్ణునిమాట విని, నీ విక్కౌరవాన్వయంబు రక్షింపుము " అనియె. ఇవ్విధంబున నమ్మువ్వురు మునీంద్రులు సెప్పిన హితోపదేశంబులదెస ననాదరంబుసేసి, గాంధారేయుండు రాధేయుం గనుంగొని చేయుప్పళించి నవ్వి ' వీర లింత నెట్టు లగుదెరే !' అనిపలికి వారలనవలోకించి —

—: దుర్యోధనుఁడు నారదాదిమునులమాట వినక నిరాకరించుట :—

క. " మునులార, నన్ను విధి యే
మని మును పుట్టించె నట్టు లయ్యెడుఁ గా ; కీ
వినఁ జవిగానిపలుకులకుఁ
బని గలదే ? ఉడుగుఁ డింక బహుభాషణముల్." 3_౨౪

వ. అనిన విని, ధృతరాష్ట్రుం డమ్మహామునులతో ని ట్లనియె : 3_౨౫

తే. " మీరు సెప్పిన బుద్ధులు గారవమునఁ
జేయఁ గాంచినఁ బుణ్యంబు సేయ నెట్లు ;
నాముఖంబునఁ గార్యంబు నడవ ; దేమి
సేయువాఁడ, నొం డెద్దియుఁ జెప్పలేదు." 3_౨౬

కం. అని యతఁడు శౌరితో ని
ట్లను : "నిహముం బరముఁ గలుగునట్టి విధము, నీ
వనఘా, చెప్పితి నాకుం,
జనవు ననువు లేదు దీని సమ్మతి నడపన్. 328

ఆ. మందబుద్ధి నాదునందనుఁ; డీవు పో
రానిచుట్టమవు, మహానుభావుఁ
డవు, దయార్ద్రచిత్తుఁడవు; వీనిఁ దేర్పవే
యనునయించి యెట్టులైనఁ గృష్ణ." 329

కం. అనిన, ముకుందుఁడు దుర్యో
ధనుతో నిట్లనియె : "విమలతర వంశమునన్
జనియించి; తెల్ల గుణముల
ననూనుఁడవు; నీకు నీదురాగ్రహ మగునే? 330

చ. తులువలు గాక యిట్టిదోర దుర్ణయవృత్తికిఁ జొత్తురయ్య? పు
త్రులు ననుజన్ములుం జెలులు దుష్టపథంబునఁ బోవకుండఁ, జు
ట్టలుఁ దగువారుఁ దండ్రియు నొడంబడఁ, జేయుము కార్య; మల్పబు
ద్ధుల వెడమాట లూఁకొనకు; దోసము సేగియు వచ్చు నమ్మెయిన్.

కం. పాండిత్య శౌర్యనిత్యులు
పాండుసుతులు; వారిఁ గూడి బ్రదుకుట ధృతరా
ష్ట్రుండును బాహ్లికుఁడును భీ
ష్ముండు గురుఁడుఁ గోరు తెఱఁగు సూవె నరేంద్రా! 332

ఆ. విను, మసత్యలోభమున సిరియగునె? ఆఁ
కొని ముసిండి దినినఁ గ్రొవ్వు లావుఁ
గలుగునయ్య? శకుని కర్ణ దుశ్శాసన
మంత్రితంబు గార్యతంత్ర మగునె? 333

శా. [1]తోడం బుట్టిన భీమపార్థుల మహాదోర్దర్పముల్ లేఁతులై,
తోడంచుం బెఱవారి దుర్బలుల నెందుఁ గ నచ్చి, దైన్యంబునం
గూడం బెట్టెదు నీవ పాండుసుతులం గుందింపగా, సత్యముం
బాడిం దప్ప, రొకప్పుడుం గినియ ; రాబంధుత్వ మేలొల్లవో ?

ఉ. వారును మీరుఁ బొంది, జనవల్లభు లెల్లను భృత్యభావనం
జేర, సమస్తవస్తువులుఁ జేకుఱఁగా బ్రదు కొప్పఁ గాక; [2]నీ
కీరస మెత్తికోల్ గలపి, యిప్పుడు కార్యము దప్పఁ జూచు నీ
వారలు, ముట్ట వచ్చిన, నవశ్యము నంతకుఁ జాలరుం జుమీ! ౩౩౫

ఆ. వీర కారు, పాండవేయులఁ బోర మా
ర్కొన సురాసురులకుఁ గొలఁది గాదు :
గాన వారితోడి కయ్యంబునకు నిర్ణ
యింప వలదు; సంధి పెంపుఁ జేయు ! ౩౩౬

క. ఈయున్న రాజు లందఱు
వాయుసుతున కొక్క యెత్తు! వాఁ డలిగిన శూ
లాయుధుఁడు వడఁకు ; నాకాం
తేయులతోఁ బొడుచు టుడుగు, ధీరవిచారా. ౩౩౭

క. ఒకకార్యము సెప్పెద, మీ
సకలబలములందు సవ్యసాచి కెదురుగా
నొకరుఁడు గలిగినఁ గయ్యము
నకుఁ బూనుఁడు ; రిత్త బహుజనక్షయ మేలా ? ౩౩౮

1. తా. తోడఁబుట్టిన భీమార్జునుల అధిక బాహుపరాక్రమములు కొనిపై, బలహీనులగు నితరుల తోడ్పాటు నీమనస్సునకెక్కి, నీవే పాండుసుతులను దైన్యమందునట్లుచేసి పీడించుచున్నావు. వారు (పాండవులు) సత్యమును ధర్మమును తప్పరు. ఒకప్పుడును కినుకఁబూనరు. ఇట్టి పాండవుల చుట్టరిక మేల ఇష్టపడవో గదా!
2. తా. నీ కీర్ష్య రేగునట్లు నేర్పి, ఇప్పుడు పొందుపాటును తప్పింపఁజూచు నీవారలు (కర్ణ శకుని దుశ్శాసనాదులు) పోరు దాపరించినపుడు నిశ్చయముగా ఎదిరించి నిలువఁగలంత సమర్థులుగారు సుమీ!

క. పెక్కండ్రు గోవులం గొని
యుక్కు మిగిలి నడవ, వెనుక నుద్దవిడిం దా
నొక్కఁడ నరుఁ డేతెంచినఁ
జిక్కె సమస్తంబు ; నది ప్రసిద్ధము కాదే ? ౩౩౯

క. తోడుదోన లేనియప్పటి
[1]క్రీడికొలఁది యట్టి ; దధిప, కినియక విను, మేఁ
దోడై రా నెదురుట గడుఁ
గీడు ; వలవ దుడుగవయ్య, [2]గెలు పరిది సుమీ. ౩౪౦

తే. అనుజ తనుజులుఁ జెలులు వియ్యములు [3]నడుగు
మాలి పోదురు నీకుఁ గా మనుజనాథ,
దొరకుఁ గులనాశనం బనుదూఱు మేలె ?
పాండవులతోడ నొడఁగూడి బ్రదుకవయ్య. ౩౪౧

ఉ. రాజ్యము భార మెల్ల ధృతరాష్ట్రునియందు వెలుంగుచుండఁ, ద
[4]త్పూజ్యకుమార పట్టమునఁ బొల్చి చరింపఁగ నీవు, పాండవుల్
సజ్జతఁ దండ్రిచిత్తము ప్రసన్నతఁ బొందఁగఁ గొల్చి యున్కి సా
మ్రాజ్యముగాఁ దలంతు రనురక్తమతిం దమకుఁ ధరాధిపా. ౩౪౨

క. కౌరవనాయక, పాండుకు
మారులు నీతోడిపొత్తు మనియెద మనఁగా
శ్రీ రా మోఁకా లొడ్డిన
వారివిధము కాదె నీవు వల దను టెల్లన్ ? * ౩౪౩

---

1. క్రీడికొలఁది యట్టిది = అర్జునుని సామర్థ్యమట్టిది. 2. గెలు పరిదిసుమీ = జయము దుర్లభము సుమా! అరిది =(దే. విశే.) దుర్లభము, అశక్యము, దుస్సహము.

3. అడుగుమాలి పోదురు నీకుఁగా = నీకై నిర్మూలమై పోవుదురు.

4. పూజ్యమగు నాకుమారపదవియందు ఒప్పి నీవు వర్తింపఁగా, ఆజ్ఞాతా ప్రీతిగతో, తండ్రి మనస్సు సంతసించునట్లు సేవించుచుండుటయే తమకు సామ్రాజ్యముగా ప్రీతి పూర్వకముగాఁ బాండవులు దలంతురు.

—: భీష్మ ద్రోణులు దుర్యోధనునకు హితంబు సెప్పుట :—

చ. అన విని, భీష్ముఁ డిట్లనియె నా ధృతరాష్ట్రతనూజుతోడ: "నీ
జనకునిమాట వట్టుము. ప్రసన్నమతిన్ మనవంశ మెల్లఁ బా
వనముగ నిందు వచ్చి బుధవత్సలుఁ డీహరి యిట్లు సెప్పఁగా
వినమి గడుం జెడుం దెరువు; నీ కలపం పొనరింపు పెంపుగన్. ౩౭౪

క. మానక ధృతరాష్ట్రుఁడు ప్రా
జ్ఞానం గలుగంగ, బంధునాశము, రాజ్య
శ్రీనాశము, సద్ధామయ
శోనాశముఁ జేయనేల చూచెదు చెప్పుమా? ౩౭౫

వ. కృష్ణార్జునులతోడి విరోధం బీబంధులోకంబునకు కాదు; లోకంబున
నెవ్వరికినిం జూడం బోలదు. లోకంబులు రెంటికిని హానిం జేయక
కూడి బ్రదుకుట మేలు." అనినం దదనంతరంబ ద్రోణాచార్యుండు
దుర్యోధనున కి ట్లనియె: ౩౭౬

తే. "పితృ పితామహ గురుల మై ప్రీతిఁ గోరు
చున్నయట్టి మాపరమహితోపదేశ
వాక్యములు విని, దుర్జనవచనరచనఁ
గొనక, బంధులతో నొడఁగూడి మనుము. ౩౭౭

ఉ. వెన్నుఁడు ప్రీతిఁ జెప్పిన సవిస్తర వాక్ప్రచయంబు త్రోవఁ బో
వన్న! కుమార, యట్లయిన నాయువు శ్రీయును నీకుఁ గల్గు. మా
కన్నులు సల్లగా, నకట, గన్గొను చుండుదు మేము. అట్లు గా
కున్నను నీవ నేర్తు! నిను నొండన నేరము, నిండుకొల్వునన్." ౩౭౮

చ. అనవుడు, నాంబికేయుఁడు నిజాత్మజుదిక్కు మొగంబు సేసి యి
ట్లను: "హరినాశ్రయించి, భవదగ్రజుఁ బుణ్యు నజాతశత్రునిం
గను మట వోయి; దీన మనకార్యము లన్నియు సిద్ధిఁ బొందు; నీ
తనిపలు కాదరింపమిఁ బడంపడి పాటిలు నెల్ల చేటులున్"— ౩౭౯

వ. అనియె. అట్టియెడ గురు భీష్ము లాత్మఁజెప్పందలంచి గాంధారేయున
కి ట్లనిరి : ౩౫౦

క. "ఈకృష్ణుని సారథ్యము,
నాకృష్ణునిగాండీవంబు నైతోఁపక ము
న్నీకోలఁదిఁ జక్కఁబడి, నీ
వీకురువంశంబు గావు, మిభపురనాథా !" ౩౫౧

వ. అని పలికి మఱియు — ౩౫౨

సీ. "ధర్మపుత్త్రుని పదద్వయమున కతిభక్తి
నెఱఁగిన, నతఁడు నిన్నెత్తి గ్రుచ్చి
నిడుఁగేలఁ బెద్దయుఁ దడవుగాఁ గౌఁగిలిం
పఁగ, భీముఁడును నీవుఁ బరమహర్ష
మునఁ జారుతర వక్షములు సంగతములు గాఁ
బరిరంభణం బొనర్పంగ, నరుఁడుఁ,
గవలును మ్రొక్కఁ గర మర్థిఁ దిగిచి నీ
వాలింగనంబు సేయంగ, నిట్లు

తే. వారు మీరును దగ బాంధవమునఁ బొదలి,
యింపు దళుకొత్తఁ దామరతంప రైనఁ,
జెలులుఁ జుట్టలుఁ గలసి పేరెలమిఁ బొంది
యుల్లసిల్లంగఁ గుల మెంత యొప్పునొక్కొ ? ౩౫౩

క. సమరమునకు వచ్చిన భూ
రమణు లుభయకటకములను బ్రమదం బెసఁగం
దమతమపురములకుం బో
వ, మహీజను లెట్టియుత్సవముఁ బొందుదురో ?" ౩౫౪

వ. అని వెండియు ననేకవిధంబులం జెప్పి, "యీరెండు దెఱంగులవారును
బంచి కుడిచి సుఖంబున్న నఖిలభూప్రజకును బ్రమోదం బగుం గావున
నట్లు సేసి యందఱచేత దీవనలు వడయ వయ్య నీవు." అనిన విని,
దుర్యోధనుం డప్పుండరీకాక్షు వీక్షించి యి ట్లనియె : ౩౫౫

క. "గురుఁడును బితామహుఁడు నీ
నరనాథుఁడు నెల్ల ప్రొద్దు నను దూఱుదు ; రి
ప్పురుసున నీవును దామో
దర, దూఱెదుగాని, తగవుఁ దలఁపవు కంటే ! ౩౫౭

క. 'వనితం బఱిచి, రరణ్యం
బున నిడుమలఁ బడితి' మనుచుఁ బోటరులై చం
పను జెఱుపఁ దలఁచి, మాఁదెసఁ
గనలుదు రప్పాండుసుతు లకారణమ కడున్. ౩౫౮

మ. అరయం దప్పొకయింత నావలన లే; దాధర్మపుత్రుండు జూ
దరివెంటం దమకించి, సౌబలునిచేతన్ భూమి గోల్పోయి, ము
ష్కరుఁడై వెండియు నొడ్డఁగా నతఁడు నక్షప్రౌఢిమై గెల్చె. ఏ
తెరువైనం దనయిచ్చలోఁ బడియె ; నింతేకాక, యేఁ బూఁటయే ?

తే. మాత్స్య పాంచాల పాండ్యాది మనుజపతులఁ
గూర్చికొని తార కయ్యంబు గోరి యెత్తి
విడిసి : రింతియ కాక, యివ్విధము నుగ్ర
కర్మమున కేము దొడఁగుట గలదె చెపుమ ! ౩౫౯

క. ఉక్కఱి సురపతి కైనను
మ్రొక్కము : నృపధర్మ మూఁది మొనతలఁ బడినన్
మిక్కిలి పేరును నిట, దివి
నక్కజముగఁ బెంపుఁ బడయ నగుట, నుపేంద్రా ! ౩౬౦

చ. [1]చిఱుతఁదనంబునం దగవు చిత్తమునం దలపోయ లేక, మున్
దఱ యటు పోవ నిచ్చితిఁ ; బితామహుఁడున్ జనకుండు నింకఁ [2]క్రి

---

1. తా. చిన్ననాఁడు ఉచితము మనసునఁ దలపోయలేక మునుపు పోగనిచ్చితినిగాక — ఇంక — ఇపుడు — తాతయుఁ, దండ్రియు నాబలము నెఱుఁగక, పగ దెగుటకై అక్కడ — పాండవులవారి కెవ్వరికేని చక్కఁగా రాజ్యము సగముపంచి ఇయ్యఁ దలంచినను అది నేనేటికి సమ్మతింతును ?
2. క్రిచ్చఱన్ (క్రిచ్చు + అఱన్) = చిక్కుదీఱునట్లు; పగ దెగునట్లు, వారిష్టానుసరమే

చ్చఱ నిలఁ బంచి చక్కసగ మక్కడ నెవ్వరికేని మచ్చలం
బెఱుఁగక యీఁ దలంచినను, నే నది యేటికి సమ్మతించెదన్ ? ౩౬౧

తే. తొంటిచవి గని యిప్పుడుఁ దోఁచి, పాండు
సుతులు [1]రాజ్యంబు సేయంగఁ జూచుకలుచ
నాకు నీఁ దేఱునే? ఇంక [2]నాఁటిచూఱ
లెక్కడివి? ద్రోణ భీష్మ లీదిక్కు నమ్ము. ౩౬౨

ఉ. ఏమును వారుఁ బంచికొని యేలుట గల్గదు. పల్కు కుంతు మిం
కేమియు. వాఁడిసూదిమొన యించుక మోపినయంతమాత్రయున్
భూమి యొనర్చి పాండునృపపుత్రుల కిత్తునె? ఎవ్వ రైన సం
గ్రామమునన్ జయంబు గొని రాజ్యము సేయుట నిశ్చయించితిన్."

తే. అనిన విని కిన్కఁ బూనినయలఁతినగవు
చెలువు మొగమున కొకకొ్రత్తపొలు పొనర్పఁ,
బుండరీకాక్షుఁ డగు పెల్లఁబోఁటు, యప్పు
డరుణకమలాక్షుఁ డగుచు మురాంతకుండు — ౩౬౪

—: శ్రీకృష్ణుఁడు దుర్యోధనునితో మున్నతండు సేసినదుర్ణయంబులు చెప్పుట :—

క. "మొనతలఁ బడియెదు నీచె
ప్పినయట్టుల; తడవు లేదు. బిరుదుల రై నీ
వును వీరు నిలువుఁ; డిదె భం
డన మెల్లియ వచ్చె! నూఱటలు గనుఁ డింకన్. ౩౬౫

సీ. అరయంగఁ దప్పు లే దంటి నీవలనఁ; గీ
డొకనాఁడు సేసియు, నొక్కనాఁడు
సేయవె? నీ జనించినయది యాదిగా
నుడుగక పాండవేయులకుఁ జాల

1. రాజ్యంబుసేయంగఁ జూచుకలుచ = ప్రభుత్వము సేయఁ గడంగునంతనే నేసియఁ గలనా? 2. నాఁటిచూఱలెక్కడివి = ఆదినముల సొగుకొల్లలు ఇఁక నెక్కడివి?

నెగ్గు సేసితి. విష మిడి, పెనుబాములఁ
గఱపించి, నీరిలోఁ గట్టి త్రోచి,
లక్కయిల్ గాలిచి, పెక్కు భంగులఁ జంపఁ
దలఁచినఁ జావక, ధర్మరక్షఁ
ఆ. జేసి నెగడి, రాచసిరి నొంది యున్నఁ, జూ
పోప కీవు తీవ్రపాపబుద్ధిఁ
గనమి, జూద మొకటి కల్పించి కపటంబు
సేయ, దాన నెల్లచేటుఁ బుట్టె. ౩౬౬

తే. అన్నదమ్ముల నెత్తంబు లాడి, సతుల
తలలు వట్టి సభాస్థలంబులకు నీడ్చి
చీర లొలిపింతురే? ఇట్టివారి నెందుఁ
దడవుమా నీ వొకండవు దక్క, నధిప! ౩౬౭

ఉ. అప్పుడు నీవుఁ, గర్ణుఁడును నాడినమాటలు గొల్వులోపలం
జెప్పెడునట్టివే? కులము శీలముఁ గల్గినపుణ్యకాంత క
ట్లొప్పమి సేయు టెల్లఁ గని యున్నజనంబులు వించు నుండఁగాఁ
'ద ప్పొకయింత లే' దనువిధం బది నీక చనుం, గుమారకా! ౩౬౮

తే. ఎత్తి విశిసినవారని యెల్లతప్పఁ
బాండవులమీఁదఁ బెట్టిన బ్రదుకు గలదె?
ద్రోణ భీష్ములుఁ దండ్రియుఁ దోడుతోడఁ
జెప్ప తగుమాట లేమియుఁ జెవులు సొరవు! ౩౬౯

క. శాంతిం బొందుట నీకుం
గుంతీపుత్త్రులకు మే లగుఁ; దానిక యే
నింతయు నాడెద; నది నీ
కెంతయు రుచియింప కునికి మెఱిఁగి మెఱిఁగియుఁ." ౩౭౦

వ. అని యిట్లు నారాయణుండు నానాప్రకారంబులం జెప్పుటకుఁ గటకటం
బడిమోము దుర్యోధనునకు దుశ్శాసనుం డి ట్లనియె: ౩౭౧

మ. "జనకుండున్ గురు భీష్ములుం దగినకర్జం బాప్తులై నీకుఁ బ్రీ
తి నెఱింగించు తెఱంగు గాదు; తమబుద్ధిం బోయి సంధాన మి
ట్లొనరం జేయక యున్నఁ గృష్ణునకు నిన్నొప్పించువా; రింత వ
ట్టు నిజం; బిచ్చట నింక నీయునికి నెట్లుం గీడు వుట్టుం జుమీ!"

ఆ. అనిన, బాహ్లికాదు లగుకురువృద్ధుల
నాత్మజనకుఁ గృష్ణు నాదరింప
కతఁడు రాజసమున నప్పుడు దిగ్గన
లేచిపోయె; సంచలించెఁ గొలువు. ౩౨౩

తే. అతనివెనుకన కర్ణుండు ననుజగణము,
శకునియును, వారిపొం దైనజనపతులును
బోయి; రమ్మెయిఁ జని యొక్క-పొ్రివుగట్టి
[1]వేఱ యంతంతనుండిరి కోఱడమున. ౩౨౪

వ. ఇట్లున్నం గనుంగొని గాంగేయుండు — ౩౨౫

చ. "ఇతఁ డిది యేల కొ్రివ్వి ధరణీశుఁడ నంచు వృథాభిమాని యై
మతి సెడి, లోభమోహమదమత్సరముల్ దనుఁ ద్రిప్ప, ని ట్లసం
గతమునఁ బోయె? వీనివెనుకం జని రేమి దలంచియో మహీ
పతులును; [2]వీరు గొందఱతిభారపుమానసు, లేమి సేయుదుర్?"

తే. అని జనార్దనుఁ గనుఁగొని, 'యకట! కాల
పక్వ మయ్యె నీనరపతిప్రతతి యెల్ల!'
ననుడుఁ, దగువారిదెసఁ గలయంగఁ జూచి,
తగవుమెయి నిట్లు లనియె నన్నగధరుండు: ౩౨౬

---

1. వేఱ...కోఱడమున = పరిహాస ప్రసంగమున. కోఱడము =(దే. వి.) అపహాస్యము; పరిహాస ప్రసంగము. 2. వీరుకొందఱు అతిభారపు మానసులు = ...చాల పెద్దబుద్ధి గలవారు. పెదమనుష్యులు.

శా. "ఈదుర్యోధనుఁ డింతగర్వి యగునే? ఈయున్నవా రెల్ల నా
చే దైన్యంబునఁ బొందు టొప్ప దని చర్చింపండ. ఈభంగికిన్
లేదే యొంతు దెఱంగు? సత్కులముఁ బాలింపంగ వర్జింప రా
దే దుష్టాత్మకు నీచు నొక్కరునిఁ? బోదే ఖేద మీజాతికిన్! ౩౬౯

ఉ. కంసుఁడు నిట్ల తండ్రిమది గందెడుచంద మొనర్చి ధర్మవి
ధ్వంసము సేసినం, గులమువారలు నా కెఱిఁగింప, నేను దు
ర్మాంసము గోయువైద్యునిక్రమంబున, నాతనిఁ ద్రుంచి, యన్వయో
త్తంసముఁ జేయనే జనకుఁ! దద్విధ మొప్పదె మీరుఁ జేసినన్?

ఆ. అంతతోడ నెల్లయాపదలును దీఱు;
వంశ మధికగౌరవంబు నొందుఁ;
గూడి మనుట గలుగుఁ గురుపాండవులకు; ని
త్తెఱఁగు సూడ [1]మీకు నుఱవ కాదె?" ౩౭౦

వ. అనిన విని ధృతరాష్ట్రుం డదరిపడి విదురున కిట్లనియె: ౩౭౧

ఆ. "బుద్ధిమంతురాలు, పొందుగఁ బలుకంగ
నేర్చు, వచ్చి కొడుకుఁ దేర్చి పోవుఁ
గాన, వేగ నీవు గాంధారిఁ దోడితె"
మ్మనుడు, నరిగి యతఁడు నట్ల చేసె. ౩౭౨

వ. అద్దేవియు — ౩౭౩

క. చనుదెంచి యుచితపీఠం
బున నున్నం, గురువిభుండు పొలఁతుకతో ని
ట్లను: "నీతనూభవుఁడు దు
ర్వినయంబునఁ జనియె? నిట్టివెంగలి గలఁడే? ౩౭౪

1. మీకు నుఱవ కాదె = మీకును తగునే కాదా?
ఉఱవు = (పై. వి.) ఔచిత్యము (విణ.). అధికము, ఉచితము.

క. నీ వైనఁ జెప్పి శాంతుం
గావింపఁగ నోపుదేనిఁ, గౌరవకుల మీ
గోవిందు శాసనము సం
భావింపం గాంచి, చెడక బ్రదుకుం జుమ్మీ! ౩౮౫

తే. అనుడు; "నీపుత్త్రుఁ డవినీతుఁ డగుట యెఱిఁగి
యెఱిఁగి, వానివశంబున నేల పోయె?
దీవు పాండవులకు నేమి యిచ్చి తేని
నడ్డపడ నెవ్వరికి వచ్చు, నధిప చెపుమ?" ౩౮౬

క. అని గాంధారి పతియుఁ దా
నును విదురుం బనిచె నందనుం బిలువ; నతం
డును మొగము జేవుఱింపఁగఁ
జనుదెంచెను సభకు విదురసంప్రార్థితుఁ డై. ౩౮౭

వ. మున్ను దనతోడం జనినవార లందఱు నచ్చోటన నిలువ, నిట్లు వచ్చి సుయోధనుండు నిజాసనాసీనుం డై యున్నఁ జూచి, తల్లి చిత్తంబున గర్హించుచు, నతనికి ధర్మంబును, నీతియును, జుట్టఱికంబును, బ్రదుకుఁ దెరువును, నిజశక్తియు, సహాయంబుకొలందియుఁ, గులజన చిత్తప్రకారంబును, బాండుపుత్త్రుల బలపరాక్రమంబులుఁ దెలియు నట్లుగాఁ దెఱంగుపడం జెప్పి, బుజ్జగించియుం గినిసియు ననేకవిధంబుల నాడిన నమ్మాటల దెస ననాదరంబు సేసి, యుద్ధతిం గ్రమ్మఱం జని యతండు కర్ణాదులం గలసి, వారునుం దానును దుర్మంత్రంబునకుం జొచ్చి — ౩౮౮

—: దుర్యోధనాదులు శ్రీకృష్ణునిం బట్టికొని చెఱం బెట్టఁ దలంచుట :—

క. హారితలఁ బొప్పదు. భీష్ముని
గురునిం గూర్చికొని మనలఁ గ్రొవ్వఱఁ బట్టం
గర ముత్సహించు చున్నాఁ;
డరయఁ నతనివచనరచన నంతయుఁ దెలిసెఁ. ౩౮౯

క. మును దాఁ గంసునిఁ బరిమా
ర్చిన చందము వారి కెల్లఁ జెప్పెడుఁ; దనకున్
మును మనము గడఁగి వెనఁ బ
ట్టినఁ గార్యం బగుఁ; జలంబు డింపకుఁ డింకన్. ౩౯౦

తే. పట్టి యీతనిఁ జెఱఁబెట్టి పాండవులకు
దిగులు పుట్టింత; మంతటఁ దెగక యెత్తి
వచ్చి రేనియు నిర్జింప వచ్చుఁ; గోఱ
లెల్లఁ బుచ్చిన నురగంబు లేమి సేయు?" ౩౯౧

వ. అని విచారించె. ఇట్లు దుష్కార్యాలోచనంబు సేసి దుర్యోధన దుశ్శాసన శకుని కర్ణు లగుదుష్టచతుష్టయంబు మొదలుగాఁ గలయ వినీతులు దై తేయమర్దను మర్దింప నిశ్చయించిరి. అయ్యవసరంబున—

చ. అడఁకువ లేమి నల్కి యురియాడుట, నొండొరుఁ గూడ కుండుటన్,
బుడిబుడి మాట లాడుటను, బోవుచు వచ్చుచుఁ గ్రిందుగ్రిమ్మఱం
బడుటను దెల్లమైన, మును పన్నుగఁ దాఁ బరికించి యున్కి, న
ప్పుడు హరిఁ బట్టుసంకులము వుట్టుట సాత్యకి నిశ్చయించుచున్—

తే. [1]బఱటి కొనిపోయి కృతవర్మఁ బన్నఁ బనిచె:
'నీవు బలమును వాకిట నిలువు; మేను
లోపలికి నెల్లఁ జాలుదుఁ; బాపబుద్ధు
లన్న దెసఁ దప్పి' రని నిర్భయమునఁ జెప్పి. ౩౯౪

వ. ఇట్లు పరమాప్తుం డగుహార్దిక్యు నట పుచ్చి సాత్యకి సత్వరంబుగాఁ

---

1. తా. 'నీవును మన బలగమును వాకిట నిలువుము. నేను లోపలికి నెల్లఁజాలుదును. —లోపలివా రెవరేని ఇట్లట్లనిన మట్టగింపఁజాలుదును. ఈ పాపాత్ములు — దుర్యోధనాదులు అన్న (కృష్ణుని)యెడ గౌరవము దప్పిరి. — అపకారముఁ దలంచిరి' అని నిర్భయముగాఁజెప్పి, కృతవర్మను బఱటి (సైగఁగా గొకి) పిలిచికొని పోయి సిద్ధపఱుపంబంపె.

జనుదెంచి జనార్దనునకు నర్తిలం గల్ల నెఱింగించి, తదనుమతిం గౌర
వేశ్వర బాహ్లిక భీష్మ విదురులతో ని ట్లనియె: ౩౯౫

మ. "అదె కౌరవ్యు లశక్తదుర్జనత సేయం బూని పైం బొలం జూ
చెద; రమ్మెన్న దమచేతం దీఱునె? జయశ్రీకాంతు దైత్యాంతకుం
బొదువం ¹దారు దలంచు టెల్ల ననలంబుం జీర బంధింపంగా
మది నూహించినయట్ల కాక, తమదుర్మంత్రంబులం బోవునే?"

వ. అనిన, విదురుం డడరిపడి వై చిత్రవీర్యున కి ట్లనియె: ౩౯౭

ఉ. "భూవర, సీతనూభవులు, పుణ్యు నగణ్యపరాక్రమున్ హరిం,
గేవలమర్త్యుఁ గాఁ దలఁచి, ²కిట్టినఁ బట్టినఁ దారు, మంటపై
వావిరిఁ గ్రమ్ము నాశలభవర్గముచాడ్పున మ్రింది పోరె? కా
లావధి యయ్యెఁ గావలయు నక్కట వారికి వారివారికిన్?" ౩౯౮

వ. అనుటయు గోవిందుం డందఱు విన నంబికానందనున కి ట్లనియె:

ఉ. "రోషము నాపయిం గలిగి క్రూరతఁ గౌరవు లింత సేఁత సం
తోషమ! నీవు ప్రాభవముతోఁ దగ నాకు ననుజ్ఞ యిమ్ము. ని
ర్దోషత నేను నోపుగతి దోర్బలదుర్జయు లైనవారి వి
ద్వేషముఁ జక్కఁ బెట్టి, జగతీవర, యింతక పోయి వచ్చెదన్." ౪౦౦

క. అనుడు, ససంభ్రమముగ న
జనపతి దుశ్శాసనాదిసకలపరిజనం
బును నాదుర్జనునిం దో
డ్కొని రమ్మని విదురుఁ బనుచుడుం, జని యతఁడున్— ౪౦౧

1. తారు ......= కౌరవులు. 2. కిట్టినఁ బట్టినఁ దారు = సమీపించినను. పట్టినను తారు (=ఆకౌరవులు). కిట్టు = (దే. అ. క్రి); స. (క్రి) సమీపించు.
ప్ర: 'వీరు కిమ్మీరుఁడను సురారి నిశ్చల భీకరాకారుఁ గిట్టి...'—అరణ్య. ఆ. ౧
'భీమాగ్రజుం డాజిఁ గిట్టినఁ బట్టన్...'—ద్రోణ. ఆ. ౧

వ. సపరివారంబుగా దుర్యోధనుం దోడ్తెచ్చినం జూచి యతనికి ధృత
రాష్ట్రుం డి ట్లనియె : ౪౦౨

చ. "అలవి యెఱుంగ కిట్లు దనుజారికిఁ గీ డొనరింప నీవు, నీ
తులువలు నుత్సహించితిరి! దుర్మదులార, [1]సమీరు మీకుఁ జోఁ
కలవడి పట్ట వచ్చునె? మహాద్రిఁ గదల్పఁగఁ బోలునే? దవా
నలుఁ జమరంగ శక్యమె? వినాశముఁ బొందెద; రేమి సేయుదున్!

ఆ. అనిన విదురుఁ డిట్టులను సుయోధనుతోడ:
"బాలకేళిఁ దొడఁగి లీలఁ గృష్ణుఁ
డెచట నెచట నెవ్వ రెవ్వరి నేమేమి
సేసె వినవె? ఏల చెడియె దిట్లు? ౪౦౪

వ. అనియె. అట్టియెడఁ గట్టెదుర నున్న యక్కురుపతికుమారుం జక్కం
జూచి, 'యే నొక్కరుండన యని తలంచియే దుర్మకంబునం బొదివి
పట్టనుత్సాహంబు సేసి' తనుచు దరహాసంబు సేయువాసుదేవుని ఫాల
ప్రదేశంబున బ్రహ్మయు, వక్షంబున విరూపాక్షుండును, వదనంబున
వహ్నియుఁ, బార్శ్వంబుల నింద్ర యమ వరుణ కుబేరులు నాదిత్య
మరు ద్విశ్వేదేవాశ్వినులు నుద్భవించిరి. హల గాండీవమండిత
బాహు లగుబలదేవార్జునులు సవ్య దక్షిణభుజంబులను, నిజాయుధ
హస్తు లగు యుధిష్ఠిర భీమ నకుల సహదేవులు వీఁపునను, వివిధ
ప్రహరణపాణు లగుయదు వృష్ణి భోజాంధకవీరకుమారులను బ్రభవిం
చిరి. జనితనానాహస్తవిన్యస్తంబు లయి శంఖ చక్ర గదా ఖడ్గ శక్తి
శార్ఙ్గ ప్రముఖనిఖిల సాధనంబులు వెలింగె. నేత్ర శ్రోత్ర నాసా
వివరంబుల సధూమధూమ కేతుజ్వాలాజాలంబులు నిగిడె. రోమకూ
పకలాపంబులం దరణి కిరణనిభప్రభలు వెడలె. ఇట్లు దుర్నిరీక్ష్యం

---

1. సమీరు...వచ్చునె = గాలిని వాడుకపఱచి మీకుఁ బట్టనగునా?
అలవడు = (అలవు + పడు – ద్వ. అ. క్రి.) అభ్యాసపడు, వాడుకపడు, తగు, సిద్ధించు, స్వాధీనపడు.

బగున త్తేజోరూపంబుఁ గనుంగొనం గొలఁదిగాక, సకలజనంబులు నయనంబులు మొగిడ్చి యద్భుతభయానకరసంబుల జొత్తిల్లు చిత్తంబులతోడం గదల కుండ, నప్పుండరీకాక్షుండు నారదాదిమహామునుల వలనను, భీష్మ విదుర ద్రోణ సంజయులయందును, గరుణాతరంగితంబగుకటాక్షవీక్షణం బొలయ వారలకు దివ్యదృష్టి యొసఁగె. ఆపుణ్యపురుషులు సాంద్రానందంబునం దేలుచుండిరి. అయ్యవసరంబున—

తే. దేవదుందుభిధ్వానంబు దివి రెఁ; గల్ప
వృక్షపుష్పధారామయవృష్టి గురిసె;
సిద్ధ సాధ్య విద్యాధర శ్రేణి భక్తి
నిచ్చు జయజయశబ్దంబు లెసఁగె జడల. ౪౦౬

వ. అప్పుడు ధృతరాష్ట్రుం డమ్మహాసంకులంబు విష్ణుని దివ్యవిజృంభణంబు గావలయునని యూహించి, ౪౦౭

క. "కరుణింపుము. సంశ్రితభయ
హారణధురీణా, సహింపు మజ్ఞానంబుల్;
శరణంబు వేఁడెద, భవ
చ్చరణంబులు గనుఁగొనం బ్రసాదింపఁగదే!" ౪౦౮

చ. అనుడు, దయార్ద్రచిత్తుఁ డగునప్పరమేశ్వరుఁ డిచ్చె దృష్టి య
జ్జనపతి; కద్భుతం బడర సమ్మదపూరము గ్రమ్మ నాతఁడుం
గనుఁగొని, భక్తి మ్రొక్కి 'నినుఁ గంటిఁ, గృతార్థుఁడ నైతి; నింక నొ
ల్లనొరులఁ జూడ! లోచనములం బురుషోత్తమ, సంహరింపవే!'

క. అనిన పలుకులకు నచ్చటి
జను లెల్ల నృపాలు సితవిశాలాక్షుఁ గనం
గొను చుండి; రపుడు దమనె
మ్మనమ్ము లాశ్చర్యరస నిమగ్నంబులు గాఁ. ౪౧౦

వ. తదనంతరంబ, దామోదరుండు, ధృతరాష్ట్రునభిమతం బొడఁగూడ నతనికన్ను లెప్పటియట్ల కావించి, నిజవిశ్వరూప ప్రపంచంబు నుప

సంహారించి, మునీంద్రుల నామంత్రణంబుసేసె; నమ్మహాత్ము లంత ర్ధానంబు సేసిరి. తానును సముత్థానంబు సేసి, యంతకు మున్న సన్నిహితులై యున్న కృతవర్మకరంబును, సాత్యకి హస్తంబును నవలంబించి, యూరక వెడలె, నని చెప్పిన - ౪౧౧

ఆ. "ఇవ్విధమునఁ గృష్ణుఁ డేఁగిన పిదపటి
కథ వినంగ నాకుఁ గౌతుకంబు
మనము నిండి కడలుకొనుచున్న యది, వివ
రించి చెప్పు మునివరేణ్య" యనుఁడు. ౪౧౨

ఉ. భక్తమనఃప్రమోదకర పాదసరోజవికాస, చేతనా
శక్తిమయప్రభావ, మునిసంస్తుత, సాత్యవతేయ భారతీ
ప్రోక్త, నిగూఢసంప్రకటభూమసమాశ్రయ, వత్సలత్వను
వ్యక్త, కృపాభిరామ, గుణవర్ణన, నిష్కల, నిత్య, పుష్కలా. ౪౧౩

క. అవ్యయనిర్మలవిభవా,
దివ్యప్రభవా, సుధైకదీప్తానుభవా,
నవ్యత్వనిత్య, యతిసం
సేవ్యసుసాంగత్య, లోకజీవనకృత్యా. ౪౧౪

మాలిని. రవి శశిమయనేత్రాప్రస్ఫురత్కాంతి హృద్యా,
నవజరఠవికారన్యాసలీలానవద్యా,
వివృతనిగమశాఖావిశ్రుతాగ్రైకవేద్యా,
వివిధనియతచర్యావిత్త చిత్తప్రసాద్యా. ౪౧౫

గద్యము.

ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి
తిక్కనసోమయాజి ప్రణీతంబయిన శ్రీమహాభారతంబున
యుద్యోగపర్వంబునందుఁ దృతీయాశ్వాసము.



హరిహరనాథాయ నమః

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఉద్యోగ పర్వము

### చతుర్థాశ్వాసము.



శ్రీమత్తులసీపల్లవ
దామచ్ఛవిలబ్ధమరకతప్రతిమత్వో
ద్దామప్రభాస్థిమాలా
శ్యామాయితవిపులవక్షః హరిహరనాథా. ౧

—: కృష్ణుండు కుంతియింటికిం జని యామెతో మాట లాడుట :—

వ. దేవా, వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె: "కృష్ణుం డత్తె ఱంగున వెడలిన, విస్మితయై గాంధారి యభ్యంతర మందిరంబున కరుగం, గౌరవు లెల్లను బంధుమిత్త్రసహాయ సహితంబుగాఁ దన తోడన వెడల, మొగంబు గంటు వెట్టికొని కక్ష్యాంతరంబులు గడచి నప్పుడు, దారుకుండు తేరినొగలపై నుండి పాదసూపి కేలు మొగిడ్చి ఫాలభాగంబునం గదియించినం, దత్ప్రదేశంబున నిలిచి, వారలదెస మరలి చూచి 'మీ రింక నిలువుం' డని పలికిన నాంబికేయుండు పుండరీకాక్షుం జేరి నిజతనూజుల నుపలక్షించి— ౨

ఉ. "వీరును బాండుపుత్త్రులును వేరము డక్కి పొసంగి మన్కికై
పోరిత మాడి యే నటులు బుద్ధులు సెప్పినభంగియుం, గులా

భారము నిర్వహింపఁ బలుచందములం దగ దుఃఖపాటు నీ
కౌరవజాతికిం దెలిసెఁ గాదె, గదాధర, నీదుసన్నిధిన్ ?" ౩

వ. అని వెండియు — ౪

తే. "నీకు శుద్ధుండ నగుటయు నిఖిలబంధు
మిత్రగురుజనకోటికి ధాత్రి కెల్ల
నంబుజాక్ష, నిర్దోషుండ నగుట ; గాన,
నా తెఱంగు నీ వెఱుఁగుట నాకుఁ జాలు." ౫

వ. అనిన విని, యచ్యుతుండు బాహ్లిక భీష్మ ద్రోణ కృపప్రముఖ నిఖిల
విశిష్టజనంబుల నాలోకించి — ౬

తే. " ఇప్పు డీసభఁ బుట్టిన యింతవట్టు
మీకుఁ దెల్లంబ కాదె? ఈ మేదినీవి
భుండు దా నేమిటికిని ముఃఖ్యుండఁ గాను ;
దప్పు దనదెస లేదని చెప్పి విడిచె. ౭

వ. కావున నాకు నిర్యోడం బడయం బనిలేదు ; పోయి వచ్చెద. ధర్మ
పుత్రునకు నింత వృత్తాంతం బెఱింగింప వలయు"నని పలికి, వారల నా
మంత్రణంబు సేసినవాఁడై రథారోహణంబు సేసి, ధృతరాష్ట్రుం
డును నచటిజనంబులును వెనకం జనఁ, జని కుంతీగృహద్వారంబున
నరదంబు డిగ్గి — ౮

క. వా రందఱుఁ దనతోడన
గారవమున నరుగు దేరఁ గాఁ జొచ్చి, మహో
దారుఁడు, గుంతీచరణాం
భోరుహముల కెఱఁగి వినయభూషణుఁ డగుచున్. ౯

క. కౌరవసభఁ దా నాడిన
గారవవాక్యములుఁ, గార్యఖడ్గక్రమవా

కర్పూరములు, సుయోధనుడు
ప్రారంభము [1]నల్పవచనపద్ధతిఁ జెప్పెన్. ౧౦

వ. ఇట్లు ధృతరాష్ట్రుకొలువునం బుట్టినవిశేషంబులు పాండురాజమహిషి
కెఱింగించి, మాధవుండు, మఱియును:-- ౧౧

తే. "కురుకుమారులు దమయంతఁ గుడిచి క్రొవ్వి
మీఁ దెఱుంగరు? మా కేమి మేలకాక!
నాలుకలుగోయు నర్జునానలము దఱిసి
మెరగొనం గని సంతృప్తియెసక మెసఁగు. ౧౨

వ. పాండుకుమారులపాలికిం బోయి వచ్చెద. వారికిం దగినబుద్ధు లాన
తిమ్ము" అనిన, నద్దేవి, విక్రమోపజీవు లయిన ముచుకుందుండును
సృంజయుండును ననతోంటినరపతుల చరిత్రంబులు సెప్పి; యుధిష్ఠి
రుండు వీరిని వినండొ కాక యని పలికి, యెల్లవారును విను చుండ
వెండియు ని ట్లనియె: ౧౩

ఉ. "రాజుల కెందు నారయఁ బరాక్రమజీవనవృత్తి దక్క నొం
డోజ నిషిద్ధ మండ్రు మును; లుత్తమసత్త్వులు వంశధర్మముల్
పూజితభంగిఁ జేయుదురు. బుద్ధివిహీనులు వానిఁ దక్కి ని
స్తేజపుఁగూటి కియ్యకొని దీనతఁ బొందుదు రంబుజోదరా. ౧౪

క. నీవియ్యంబులు సంధియు
కావింపంబడిరి; వీరిఁ గలయుట కష్టం;
బా వెరవు దప్పుటయ మే
లై వచ్చం బొమ్ము; విడువు మనుమానంబున్. ౧౫

మ. నిజవంశోచిత వీరవృత్తమున కున్మేషంబుగా నా కపి
ధ్వజుఁ డుత్సాహము సేయ కున్న, నకటా! దైన్యంబు వాటిల్లదే!

---

1. అల్పవచనపద్ధతిఁ జెప్పెన్ = కొలఁది మాటలవరుసను జెప్పెను — సంక్షేపముగాఁ జెప్పెననుట.

భుజదర్పోద్ధతుఁ డైనభీమునకు నీపాం దొప్పునే? నీవు స
ర్వజగన్మాన్యుఁడ విందు రాఁ దగునె? దైవం బిట్లు దప్పించునే?"

వ. అని యంత నిలువక గొంతి యి ట్లనియె: ౧౭

క. "మఱచిరె కొలువున ద్రౌపదిఁ
బఱచినబన్నంబు? ధర్మపథము దొఱంగన్
వెఱచుట కప్పటి కది దగుఁ;
జెఱచినచో వెదక వలదె చిరతరకీర్తిన్!" ౧౮

—: శ్రీకృష్ణుఁడు కర్ణునిఁ దనరథం బెక్కించుకొని కొన్నిరహస్యోక్తులు వలుకుట :—

వ. అని పలికి పుండరీకాక్షుం గాఁగిలించుకొని, యచ్యుతుండు మ్రొక్కిన దీవించి, "యేను సుఖం బున్నదాననని పాండవులకుం జెప్పుము. చేతులలావునం గనిన జీవనంబున బ్రదుకుం డనుము. పోయిరమ్ము" అని వీడుకొల్పిన, సింహగమనసుందరంబుగా వెడలి తనతోడన కదలి వచ్చిన ధృతరాష్ట్రాదుల నిలువం బనిచి, రథారోహణంబు సేసి గోవిందుండు, కర్ణుదెసం గనుంగొని, 'నన్ననిచి వత్తుగాని ర'మ్మని కరంబు సాఁచి చెయి వట్టి తనయరదం బెక్కించుకొని, [1]సాత్యకి వేసరి నెక్కి కెలనం జనుదేరం గదలి చని, యనుప నచ్చిన కృతవర్మను చిత ప్రకారంబున సస్నేహంబుగా నిలిపి, యరుగు నవసరంబునం బౌర లోకంబున — ౧౯

ఉ. "అక్కట! వాసుదేవుపను పాదరణంబునఁ జేయ రైరి; వీ
రెక్కడి బుద్ధిమంతు; లని నిందును నందును లోక మెల్లఁ జే
రుక్కిన మ్రగ్గుటం దలఁప నొల్ల కపాయము సేసి రట్టె! ఈ
యుక్కివు లెందునం గలరె? ఒప్పరు వో ధృతరాష్ట్రనందనుల్!"

వ. అని మఱియు ననేకు లనేక ప్రకారంబులం బలుకుచు నిరుగెలంకులం జూచుచుండఁ, బుండరీకాక్షుండు పురంబు నిర్గమించె. ఇట ధృత

1. సాత్యకి వేసరి నెక్కి = కంచరగాడిదనో, అట్టివాహనమునో ఎక్కి.
వేసరము, రూ. వేసడము = (ఉభ. దే. వి.) శ్రమము (సం. అ. పుం.) కంచరగాడిద (శ.ర.)

రాష్ట్రుండును మగిడి కొలువుకూటంబునకు వచ్చి యెప్పటివారలు పరి
వేష్టింప నుండి, కృష్ణునివలని మాట లాడుచున్న సమయంబున
సుయోధనుతో భీష్మ ద్రోణు లిట్లనిరి : ౨౧

చ. "పలుకునె యిట్లు గొంతి! విని బిమ్మిరపోయితి ; యింత బెట్టిదం
బు లగునె మాట ? లయ్యమయుఁ, బుణ్యుఁడు కృష్ణుఁడు గార్యవాద
పలికెడువార లిట్లు దెగఁ బాఱిరి ; [1]ధర్మజవారిరాశికిం [ముల్
జెలియలికట్ట వాసె! మనచే నగుకర్జముచంద మెట్టిదో ?" ౨౨

వ. అని పలికి వెండియు — ౨౩

శా. "మాకుం జూడఁగఁ బోలుకార్య మిది : ధర్మప్రీతి నీ వేఁగి సు
శ్లోకుం డైనయుధిష్ఠిరుం గని, జనస్తుత్యంబుగా శాంతిమై
నీకౌరవ్యుల నెల్లఁ గాచికొనవే ! ఏ పొప్పు దెందుం ! దుదిన్
శోకం బొందక, వేగమైఁ గదలి కృష్ణుం గూడఁ బోవే నృపా !" ౨౪

వ. అనిన విని, దుర్యోధనుండు మొగంబు రాఁజుచుండ నూరకుండె. గాం
గేయుండును గురుండును దిగ్గనలేచి యతని నవలోకించి — ౨౫

క. "కురునృప, విను, సంసారము
దరి ద్రొక్కినవార; మింకఁ దలఁకెద మే సం
గరమునకు ? ఏము [2]నీకై
పొరలితి ; మె ట్లైన నగును బోయెద" మనుచున్ — ౨౬

క. అరిగిరి : రాజును సభ్యం
తరమునకుం జనియె. రాజతనయుండు బహిః
పరివారముఁ బొమ్మని యిత
పరిజనుఁ డై యేఁగె నాత్మభవనంబునకున్. ౨౭

1. ధర్మజ...వాసె = ధర్మరాజనెడు సముద్రమునకు చెలియలికట్ట తెగినది.
2. నీకై పొరలితిమి = నీకోసము విపక్షమునకుఁ దిరిగితిమి.

తే. అంత నక్కడ నచ్యుతుఁ డరిగి యరిగి
యధిక సంప్రీతి దలఁకొన నర్కతనయు
నాననంబు వీక్షించి యిట్లనియె నెమ్మి,
నన్యు లెవ్వరు వినకుండ నతనితోడ: ౨౮

సీ. "నీవు వృద్ధజనోపసేవివి, ధర్మసం
వేదివి, తెలియంగ వినుము; సిద్ధ
మంత్రబలంబున, మార్తాండువరమునఁ,
గన్నియతఱి గొంతి గన్నవాఁడ
వగుటఁ, బాండునృపాలు నగ్రసుతుండవు;
ధర్మమార్గం బిది. ధర్మతనయుఁ
డాదిగాఁ గలతమ్ము లందఱు నాచేత
నెఱిఁగి, నీయడుగుల కెఱఁగి, సకల

ఆ. పుత్త్ర మిత్త్ర బంధుభూరిసేనా సమ
న్వితము గాఁగఁ గొలిచి, నిన్ను రాజ్య
భారవహనమునకుఁ బట్టంబుఁ గట్ట, ను
జ్జ్వలుఁడ వగుదు! రమ్ము వారికడకు. ౨౯

వ. ఏను నిన్ను సామ్రాజ్యంబునకు నభిషిక్తుం జేయుదు. నీవు దొలుత వెడలునప్పటి మహోత్సవంబునకు యువరాజై యుధిష్ఠిరుండు నీ రథంబున నుండి, నీకు ధవళచామరంబులు వైచు; వాయుపుత్త్రుండు సితచ్ఛత్త్రంబు వట్టు; సవ్యసాచి సారథ్యంబు సేయు; మఱియుఁ బాంచాల యాదవ పాండ్య మాత్స్యులు లోనుగాఁ గల రాజలోకంబుతోడఁ గవలు, నభిమన్యు ప్రభృతికుమారులు బెరయ నేమెల్లం బలసి పరివేష్టించి వత్తుము. ఇట్టిమహేంద్ర విభవంబున మహనీయుండ వగుచు మహీచక్రం బేలుము!" అని చెప్పి మఱియును — ౩౦

క. "పాంచాల రాజపుత్త్రియు
నంచితముగ నిన్నుఁ బొందు నార్వురవరుసన్;

సంచితపుణ్యుఁడ వీ వొక
యించుకయును వేఱు సేయ కే తె మ్మొలమిన్." ౩౧

వ. ఇట్లైనఁ గుంతికి సమస్తబంధు మిత్త్రులకుఁ బ్రియంబగు" ననిన విని, రహస్యంబుగా రాధేయుండు మాధవున కిట్లనియె : ౩౨

—: కర్ణుఁడు శ్రీకృష్ణునకుఁ దగినయుత్తరంబు లిచ్చుట :—

చ. "వెడవెడ యేనుఁ దొల్లి యిది వింటి. ననుం గని కుంతి యెంతయుం
జెడ నదివైచి పోయెఁ; గృపఁ జేకొని సూతుఁడు దెచ్చి తాను మున్
గొడుకులఁ గాన కున్కిఁ, బ్రియకుం డగ నిచ్చినఁ జేఁపెఁ జన్ను; ల
ప్పడఁతియు నప్పు డాదిగ శుభస్థితిఁ బెంచెఁ బ్రియత్నశీల యై. ౩౩

క. మాతృపురీషాదులు దమ
గాత్త్రములం దింక, వారు గారవ మెసఁగం
బుత్త్రుం డని సంవర్ధిత
గాత్త్రునిఁ గాఁ జేసి రింతకాలము గూర్మిన్. ౩౪

క. నేఁ డింక నెఱిఁగి యొరువుల
వాఁడఁ గదా యనుచు నేను వారిఁ దొఱఁగినం
బోఁడిమి సెడదే? మదిఁ గడు
వాఁడి గలదె నాకు నకట! వారిజనాభా. ౩౫

వ. వృద్ధోపసేవనంబును ధర్మసంవేదనంబునుం గలవాఁడవని నన్ను నీవ చెప్పితివి. రాధయు నధిరథుండును నాకు జాతకర్మాది సమస్త సంస్కారంబులు నిజకులోచితంబుగా నాచరించిరి. అట్టి తల్లిదండ్రులకుఁ బుత్త్రకృత్యంబులు నిర్వర్తింపక, వారలం బాసి యేను వచ్చుట ధర్మం బగునే?" అని పలికి వెండియు, ౩౬

క. "సోదరులుఁ బ్రియులు ననుజులు
నాదెసఁ బెక్కండ్రు. వారి నందఱ విడువం

గా దని యూహింపక, దా
మోదర, న న్నిట్లు పిలుచు టుచితమె చెప్పుమా? ౩౭

వ. అదియుం గాక— ౩౮

ఉ. సూతసుతుండు వీఁ డనక, సూనల తమ్ములకంటె నాకు సం
ప్రీతి యొనర్చి, తేజమును పెంపును నాఁటికి నాఁటి కగ్గలం
బై తనరార, నన్నుఁ దనయంతటిమానిసిఁ జేసి యుండ, నే
నేతగవ్రాఁది యా కురుకులేశ్వరుఁ బాయుదు మట్టు వచ్చినన్? ౩౯

క. నను నయ్యర్జునునకు నెదు
రని పెద్దయు నమ్మియుండు, నక్కటా, దుర్యో
ధనుఁ; [1]డానమ్మగ వమ్మగఁ
జనునే పాండవులఁ గలయఁజన నా కనఘా? ౪౦

ఆ. ఏను నర్జునుండు నెక్కటెక్కటి దల
పడకయున్న నగరె పుడమిజనము?
లందు నాదువచ్చు టతనికి నపకీర్తి
యనిన, నాకు వేఱ యడుగ నేల? ౪౧

క. హిత ముపదేశించితి నీ
వతినిర్మలబుద్ధి వగుట; నైనను నిది నా
మతి సొరదు; రహస్యము ర
క్షితముగఁ బాటింపుమయ్య చిత్తములోనన్. ౪౨

వ. అది యేమిటి కంటేని — ౪౩

తే. ధర్మతనయుండు దాను నాతమ్ముఁడగుట
యెఱిఁగెనేనియు సామ్రాజ్య మేలపూను?
అట్టిధార్మికుఁ డాధిపత్యంబుఁ జేయ
వలవదే శాశ్వతంబుగ వసుధ యెల్ల? ౪౪

---

1. అనమ్మగ వమ్మగఁ...నాకనఘా = అనమ్మకము వ్యర్థమగునట్లు పాండవులను కలయం జనుట నాకుఁజనునా—తగునా?

క. అనుజులు ఋత్విజులు గ 'నీ
పని యిటు సేయు' మని నీ వుపద్రష్టవు గా,
విను, [1]కురుకుమారపశువిశ
సనమున రణయజ్ఞ మతఁడు సమ్మతిఁ జేయున్. ౪౫

వ. దానం బుణ్యభూమి యగుకురుక్షేత్రంబున మముబోంట్లెల్లను సద్గతి వడయుదురుగాక యనిన" విని, వసుదేవనందనుండు సూతనందనున కి ట్లనియె: ౪౬

మ. "దయ నాయాడినమాట గైకొనవు; [2]సంతాపంబుఁ దెచ్చుం జుమీ
స్మయ మెట్లుం దుది నీకు; నర్జునునితో మాత్సర్య మైనం, బరా
జయ మొందెన్, మృతి యొందెఁ గాక గెలువన్ శక్యంబె? పెక్కండ్ర కిం
తియ కాలం బగునట్టె! నీమనము శాంతిం బొందఁగా నేర్చునే? ౪౭

క. గాండీవముఁ, [3]గవదొనలు, న
ఖండితదివ్యాస్త్రములు, నొగలసై నేనుం
జండభుజబలము నై యు
ద్దండత నరుఁ డడర, నెదురఁ దరమే నీకున్? ౪౮

వ. ఎల్లభంగులం బాండవుల గెల్తురు. అది య ట్లుండె — నీవు పొమ్ము. ఇప్పుడ పోయి సుయోధనునకును, గురు భీష్ములకును, మీకుం దోడు వచ్చిన రాజులకం డఱకుం జెప్పుము. ఇమ్మాసంబు సౌమ్యంబై శీతోష్ణంబులులేక పుష్పఫలోపేతంబును, సమగ్రధాన్యంబును, సులభయవసైంధవంబును నగుచు నొప్పి యున్నయది. ఏ డెనిమిది దివసంబులకు నమావాస్య వచ్చు; నది పుణ్యదినంబు. నాఁడు భండనంబు గావలయు" ననినఁ, గానీ నుండు కమలనాభున కి ట్లనియె:

1. కురుకుమార పశువిశసనమున = కురుకుమారులను వధించుటతో. 2. సంతాపంబు... స్మయము = గర్వము సంతాపము దెచ్చునుసుమా! 3. కవదొనలున్ = అమ్ములపొదుల జోడును.

క. "కలవు నిమిత్తస్వప్నం
బులు కౌరవ పాండవులకుఁ; బోటగు దానన్.
గెలు పయ్యుధిష్ఠిరునకును
గల దెఱుఁగుదు; నీవు సెప్పఁగా నేమిటికిన్? ౫౦

వ. అట్లు గానఁ గదా యే నందు రా"నని పలికి, మఱియును— ౫౧

క. "దీనికి మూలము శకునియు,
నేనును, దుశ్శాసనుండు నింతియ: కుంతీ
సూనుల వారలు గలసిన
రానేరఁగ వచ్చు నాకు రాజీవాక్షా. ౫౨

వ. ఈసమరసముద్రంబు దఱియ నీఁది నిన్నుం గనియెదఁ; గాదేని నూర్ధ్వలోకంబునం గాంచెద. నీ వింక నేమియుం బలుకకుము. పనివినియెద" నని కౌఁగిలించుకొనిన, 'నట్ల కాక పో'మ్మని విష్ణుండు వీడుకొలిపె; రాధేయుండు రథావతరణంబు సేసి, కనకరత్నమయం బగుతనయరదం బెక్కి కరిపురంబున కరిగె. అచ్యుతుండును సాత్యకిం దనరథం బెక్కించికొని దారుకుం జూచి, 'పద పద పో నిమ్ము పోని' మ్మని పలికి లలితాటోపకలితుం డగుచుఁ జనియె. అట్టియెడ విదురుండు విషాదంబుతోఁ బాండురాజ మహిషిపాలికిం జని యి ట్లనియె:

ఉ. "అక్కట! కౌరవాన్వయమహార్ణవ మింకెడునట్లు పుట్టె; నిం
దొక్కరుఁ డైనఁ గేశవుహితోక్తికి మేకొనఁ డయ్యె; [1]నర్జునుం
డెక్కటిదాన చాలుఁ దము నిందఱఁ దీవ్రశరాగ్నిఁ గాల్పఁ; బెం
పెక్కినపాండునందనులయే డ్తెఱఁ దొల్లియుఁ దా రెఱుంగరే? ౫౩

తే. అన్ని వడియును బంధుక్షయంబు సేయ
నొల్ల కెల్లవిధంబుల నుపశమంబ

1. అర్జునుం డెక్కటి...గాల్ప = తముఁ (కౌరవులను) ఇందఱను తీవ్రశరాగ్నిచేఁ గాల్చుటకు అర్జునుఁడు తాను ఒక్కఁడే చాలును.

కోరి రప్పాండవేయులు : వారి కిట్టి
దొసఁగు వచ్చెనె తులువలతోడఁ బుట్టి!" ౫౫

వ. అని వెండియు, నివ్విధంబుమాటలఁ బాండవులకుఁ గయ్యంపుటలజడి యైనవగపు దోఁప నాడుచుం గొండొకప్రొద్దు నిలిచి, నిజనివాసంబునకుం బోయిన యనంతరంబ కుంతి యి ట్లని వితర్కించె: ౫౬

మ. "తమవారిన్ సిరికై వధించు టిది సద్ధర్మంబె? అక్లేశకృ
త్యమె! తాఁ గయ్యము? ద్రోణ భీష్మ కృప కర్ణాటోపముల్ మాన్పు ట
ల్పములం దీఱునె? అందు నర్జునియుల్లం బెప్పుడుం గ్రోధదీ
ప్తము భీమాదులమీఁదఁ; దక్కొరుల కుత్సాహంబు లే దాజికిన్."

వ. అని యి త్తెఱంగునఁ బెక్కులు చింతించి, తలంచుకొని, 'కర్ణునకుం బుట్టువు దెలిపి సహోదరస్నేహం బావహించెద ; అట్లయిన నాహవంబువలనికడంక యుడుగకుండునె ?' యని విచారించి యతనిపాలికిం బోవ నిశ్చయించి యుచితప్రకారంబున వెడలి, యతం డనుష్ఠానార్థంబు భాగీరథికిం జనుట విని, తత్ప్రదేశంబున కరిగి యతనికి జపకాలం బయి యునికిం జూచి, వెనుకవలనఁ గూర్చుండఁ గొండొక సేపునకు జపంబు దీఱి గలయం గనుంగొని యమ్మహాదేవిం గాంచి, కానీనుండు సంభ్రమ వినయంబులతోడం జేరి సూతగోత్రంబు రాధేయనామంబునుం జెప్పి యభివాదనంబు సేసి, "నీవు విజయంచేసిన కార్యం బేమి ; నాకుం జేయంగలపని యెయ్యది యాన తిమ్ము" అనినఁ, గుంతి యేకాంతంబుగా ని ట్లనియె: ౫౭

—: కుంతీదేవి కర్ణునకు నతండు దనపుత్త్రుం డగుట దెలుపుట :—

సీ. "వినుము, సూతాన్వయంబున నీవు పుట్టుట
బొం; కేను మాకుంతిభోజునింటఁ
గన్నియనాఁడు భాస్కరుని రావించితి
వరమంత్రబలమున ; వచ్చియతఁడు

సంప్రీతి నొసఁగంగ జన్మించినాఁడవు
నాకుఁ ; గావునఁ, బాండునందనుండ
వగుదు ధర్మస్థితి ; నట్టి నీ వితరులఁ
గొలువ నేటికిఁ గురుకులవరేణ్య,

తే. ధర్మతనయాదు లైన నీతమ్ములకును,
ధార్తరాష్ట్రులకును నీవ తగువిభుండ;
వేలు మీలోక మెల్ల. నీ కేల 'రాధ
కొడు కితం' డను తక్కువ, కొడుకుఁ గుఱ్ఱ!" ౫౯

క. అని పలికిన యవసరమున
నినబింబములోన నుండి 'యిది నిజ ; మిబ్భం
గిన నెగడ వన్న, మే లగు'
ననువాక్యము వెడలెఁ, గర్ణుఁ డాకర్ణింపన్. ౬౦

తే. దాని వినియును, నపుడు రాధాసుతుండు
దిరుగఁబడని మనంబుతో ధీరవృత్తిఁ
దల్లి కి ట్లను : "నీమాట తథ్యమగున ;
యైన నొక్కటి సెప్పెద నవధరింపు. ౬౧

క. క్షత్రియ సంస్కారమునకుఁ
బాత్రముగా నీవు నన్నుఁ బాటింప ; [1]విహా
ముత్రఫలములకు నీ కేఁ
బుత్త్రుఁడ నని వచ్చు టింకఁ బొసఁగునె చెపుమా ? ౬౨

వ. సూర్యానుగ్రహంబునం జేసి నింద్యంబుగాక తక్కెనేనియు నాజన్మంబు పరమ రహస్యంబునై యున్నయది. దీనిఁ బ్రకాశంబు సేయుట మన కెంత మేలు ? అట్లుంగాక — ౬౩

1. ఇహాముత్రఫలంబులకు = (ఇహ + అముత్ర) ఇహ – పరలోక – ఐహికాముష్మికఫలములకు. నీ కేఁ బుత్త్రుఁడనని = నీకు నేను...

ఆ. విజయు విక్రమంబు విఖ్యాతమై యుండ
'నేను గుంతికొడుక, భానుజుండ'
ననుచు నతనిఁ జేర నరిగిన 'నతనికి
వెఱచి పోయె' ననరె, వేయు నేల ? ౬౪

క. [1]కడిఁదిపగఱ, నేఁ దెప్పఁగఁ
గడవంగా నీఁదఁ దలచుకౌరవనాథుం
జెడుఁ గాక యంచు నిత్తఱి
విడువఁ దగునె; యతనివలన వెలసినవాఁడన్ ? ౬౫

క. కౌరవులచేతఁ గుడిచిన
వారికి నిది సమయ; మెట్టివారును సంగ్రా
మారంభంబునఁ బాయుదు
రే? రాజులు మనలఁ దిట్టరే యట్లయినన్ ? ౬౬

వ. ఏ నవశ్యంబును దుర్యోధనునకై నీకొడుకులతోడం బెనంగుదు. ౬౭

ఉ. నీపలు కెంత వోలినను నిర్ణయ మిట్టిద గాని యొండు లే;
దీపనిమీఁది భారమున నీ విట వచ్చితి గాన [2]పాండవుల్
నేపడిరేనిఁ జంప ; నఱ నేయక చెప్పెద : సవ్యసాచిపైఁ
గోపము పెద్ద; వాఁడు సమకూరిన బిట్టుఱఁ జంపుదుం జుమీ ! ౬౮

ఆ. సవ్యసాచిచేతఁ జచ్చుటయును గీర్తి
కరమ. అతఁడు లోను గాఁగ నేవు,

---

1. తా. నను తెప్పఁగాఁ జేసికొని, బలవంతులగు పగతురను, దాఁటుటకై ఈఁదఁ దలఁచు కౌరవేశ్వరుని, అతనివలన వృద్ధికివచ్చినవాఁడను నేను, చెడుకాలమ్మని ఈయదనున విడువవచ్చునా ?

2. పాండవుల్ నేపడిరేనిఁ జంప = ...నాచేపడినను — నాచేతఁ జిక్కినను చంపను. అఱనేయక చెప్పెద = మఱుఁగుపెట్టక చెప్పెదను.

రేనఁ లోనఁ గాఁగ నేవురు; గాని నీ
కొడుకు లార్వురనుట విడువు మింక." ౯౯

చ. అనుటయు, నప్డు గొంతి హృదయంబున శోకము నివ్వటిల్ల ని
ట్లనుఁ: "నిది దైవసంఘటన! మక్కట యెట్లును దప్ప నేర్చునే?
యనుపమ సత్యవిస్ఫురణ నాడినమాట మహాకుమన్న; నీ
యనుజుల నల్వురం గడవు; మర్జునుఁ జేతకు సమ్మతించితిన్" ౨౦

ఆ. అనుచుఁ గౌఁగిలింప నర్కజుం 'డట్లు కా'
కని ప్రియంబు మెఱయ వినతుఁడైన,
నరిగె సదనమునకు నద్దేవి; యతఁడును
జనియె నిజనివాసమునకుఁ బ్రీతి. ౨౧

వ. అక్కడ వాసుదేవుం, డుచిత ప్రయాణంబుల నుపప్లావ్యంబునకుం జని,
ధర్మతనయు చేతం బూజితుం డయి, భీమసేనాదులు, విరాట ద్రుపద
ముఖ్యులగు తగువారలుఁ దన్నుఁ గాంచిన వారినెల్ల నభినందించి,
కొలువున నుండి యుధిష్ఠిరుతో ని ట్లనియె; ౨౨

తే. "ధార్తరాష్ట్రు లున్మత్తులు! దగినపలుకు
లేల విని సంధిసేయుట కిచ్చగింతు?
రెదిరిఁ దమ్ము నెఱిఁగిర యేని, వార
లంత లంతలు సేయుదు రయ్య నాఁడు?" 23

వ. అని యెల్లవారును వినం దనపోయి వచ్చిన కార్యంబు తెఱంగెఱిం
గించి, పథిశ్రమంబు వుచ్చువాఁ డయి పుండరీకాక్షుండు నిజమందిరం
బున కరిగె. నాఁటిరాత్రి ధర్మనందనుం డనుజసహితంబుగా నుచిత
ప్రదేశంబున నుండి గోవిందుని రావించి, 'నీవు సుయోధనుతోఁ బలి
కిన చందం బెట్టులు అతండు విని యెవ్విధంబున నుత్తరం బిచ్చె'? అని
యడిగిన, నచ్యుతుం డి ట్లనియె: ౨౪

—: శ్రీకృష్ణుఁడు ధర్మరాజునకుఁ గౌరవసభం బుట్టినవిశేషంబులు దెలుపుట :—

క. "కయ్యము గాని తెఱంగున,
నెయ్యం బగునట్లు గాఁగ నేటిఁ బలికితి నే
నెయ్యది సుఖంబు, పథ్యం
బెయ్యది, మెఱుఁగంగఁ దథ్యమెయ్యది దానిన్. ౭౫

తే. బహువిధంబులఁ బలుకు నాపలుకులెల్లఁ
[1]చీఁదకనువడి తనపెడచెవులఁ బెట్టి,
యీఱతాఱులు మఱుమాట లిచ్చి యపహ
సించె దుర్యోధనుఁడు! వేయుఁ జెప్పనేల?" ౭౬

క. అనిన, విని ధర్మజుం డి
ట్లను: "నష్టుఁడు దండ్రి యుచిత మాడఁడె? భీష్ముం
డును గురుఁడు విదురుఁడుం ద
క్కినపెద్దలుఁ బలుకరే తగిన చందమునన్?" ౭౭

క. నావుడు, హరి యి ట్లను: "స
ద్భావమున విచిత్రవీర్యతనయుఁడు దగ నా
నావిధములఁ జెప్పిన సం
భావన వినఁ డతఁడు; వలుకుఁ బ్రతికూలంబుల్. ౭౮

సీ. శంతను పుణ్యవంశం బంకురించిన
చందంబు, నంబికానందనుండు
జాత్యంధుఁడై యుండ, సామ్రాజ్యమంతయుఁ
బాలించి పాండునృపాలుఁ డతనిఁ
గొలిచి యుండుటయును, గురుకులంబున కెల్ల
దేజంబుగా మీరు దిగ్విజయము

1. చీఁదకనువడి = చీఁదఱగొన్న కనులతో... ఈఱతాఱులు మఱుమాటలు = తంటలగు [illegible]

నేసి కావించినసిరి వారు వంచనఁ
గొనుటయు, [1]సత్యమకుంఠితముగ

తే. నీవు సమయంబు నడపిన నెఱియుఁ, దండ్రి
పాలు మీకు నీఁదగుటయుఁ, బాడిలేమి
నడరఁ జెడుదురు కౌరవులనియుఁ, బెద్ద
లెల్లఁ జెప్పిరి మొగమోట యింతలేక. ౭౯

క. అలయక యందఱుఁ జెప్పం
గలయంతయుఁ జెప్పి; రతఁడు గటకటఁబడి య
క్కొలువు వెడలిపోయెం; ద
మ్ములుఁ గర్ణుఁడు రాజలోకముం దో నరుగన్. ౮౦

వ. ఇట్లు గొడుకు ముష్కరుం డై యరిగిన ధృతరాష్ట్రుండు గాంధారి
రావించి — ౮౧

క. తగ విదురుఁ బంచి యాతని
మగుడఁగఁ బిలిపించె: నాయమయుఁ దనయునకున్
వగయును గూర్మియు వెరవును
మిగిలినవచనముల సంధి మెయికొనఁ జెప్పెన్. ౮౨

వ. ఎవ్వ రెంత సెప్పినను గైకొనక, కడంగి, దుర్యోధనుండు దనకుం గల వారలనెల్లను గురుక్షేత్రంబునకు నడవుం డని చెప్పం బనిచె. భీష్ముని సేనాముఖంబు సేసికొని యెత్తి విడియం గలవాఁడు; ఇది ధార్త రాష్ట్రుల నిశ్చయంబు. ఏనును నారోపినంత సామవాదంబు లాడితి. నారదాదిమహామునులను సుయోధనునకు బుద్ధులు సెప్పునట్లు సేసితి. ఏమి సెప్పినను నెంతటం బో కున్నం గినుక దెచ్చికొని, జంకించియు, భంగించియు, ధిక్కరించియుఁ, దృణీకరించియుం జూచితి. కార్యంబు భగ్నం బగుట కొల్లక వెండియు శాంతవచనంబులు వలికితి. అతం

1. సత్య... నెఱియు = సత్యము దొలఁగక నీవు ప్రతిన నడపినవిధమును.

డశక్తదుర్జనత సేయంజూచిన, నమానుషంబు లగువానిం గొన్ని వెడ మాయలం బన్ని పెక్కుపోకలం బోయితి. ఎన్ని భంగుల సంధియ కావలయు నని పొరలం గలయంతయుం బొరలితి. అప్పాపాత్ముం డెట్లునుం జిక్కంబడక తనచలంబుతోన [1]పొట్టుపొరలయ్యుఁ గయ్యంబు వోడుచుం గాని, యవశ్యంబును రాజ్యంబుపా లిచ్చువాఁడు గాఁడు. కౌరవులయెడ, దండంబు దక్క నొం డుపాయంబు లేదు. మీకుం బోలిన తెఱంగు సేయుండు" అనియె. ధర్మతనయుండు దమ్ములం గనుం గొని యి ట్లనియె: ౮౩

క. "కురుసభఁ బుట్టినచందము
హరి యంతయుఁ జెప్పె; నింక ననుమానము లే;
దరిమర్దనమున కయ్యెడు
వెరవుం జేవయును మెఱయ వెడలుఁడు గడఁకన్." ౮౪

వ. అని పలికి యజాతశత్రుండు కరుణాయత్తచిత్తుం డై యచ్యుతు నాలోకించి — ౮౫

క. "కురువంశము దుంచుటకుం
జొరఁ జాలక, నామనంబు సుడివడియెడు; నే
వెరవును దొరకొనదు గదే,
సరసీరుహనాభ, పొందు సంపాదింపన్. ౮౬

వ. నామనంబును, దమ్ములతలంపును నీ వెఱుంగుదు; ధార్తరాష్ట్రుల చందంబును భీష్మ ద్రోణ విదురాదుల చిత్తంబులును నెఱింగి వచ్చితి. మాకు ధర్మచ్యుతి లేకుండునట్టి కార్యంబు నిశ్చయింపుము", అనిన, నారాయణుం డి ట్లనియె: ౮౭

---

1. పొట్టుపొరలయ్యుఁ గయ్యంబు వోడుచుంగాని = నుగ్గునూచమయినను పోరికి మునుకొనుంగాని. పొట్టుపొరలగు =(దే. అ. క్రి.) నుగ్గునూచమగు, తుతుమురగు, అదవదలగు, వలిమాలయగు. ప్ర: 'పునర్జన్మంబు కలదు లేదను సంశయంబుతోఁ
బొట్టుపొరలగుదురు నరులు'—అను. ఆ. ౫

ఉ. "యుద్ధమ కాక, కార్యమును నొండొక బుద్ధియుఁ గల్గ నేర్చునే?
బుద్ధులు సెప్పు వాక్యముల పోల వినం డన నేల? అట్టిచో
బద్ధునిఁ జేయఁ జూచె ననుఁ బట్టి సుయోధనుఁ! డింక నయ్యసం
బద్ధునితోడి సంధికి నుపాయము నామదిఁ దోఁప దెమ్మెయిన్." ౮౮

వ. అని చెప్పి, విదురుం డేకాంతంబున నాడినమాటలును, భీష్మద్రోణబాహ్లికాదులగు పెద్దలకు ధార్తరాష్ట్రులదెసం బుట్టినమనగతక్షోభంబును, గుంతి కౌరవులు వినం బలికిన పలుకులుం బ్రకటించి, ధర్మపుత్త్రుపైఁ బాపంబు లే కునికిఁ దెలిపి, సమరం బవశ్యకర్తవ్యంబుగా నిశ్చయించె. అట్టియెడఁ దమ్ము లన్న మొగంబునం జూడ్కి నిలిపి యూర కుండిరి. అతండు వారలం గలయం గనుంగొని యిట్లనియె:

ఉ. "కౌరవకోటిచేత మనకష్టపుఁబాటు దలంపు వచ్చినం
గ్రూరవిచేష్టితంబునకు గొంతి యొడంబడె. బంధువర్గమున్
ఘోరముగా వధించుటకుఁ గోల్కొన కున్నది బుద్ధి. మీరు ని
ర్ధారణ సేయుఁడా హితము ధర్మము నయ్యెడువృత్త మెట్టిదో?"

వ. అనిన, విని యర్జునుం డతని కిట్లనియె: ౯౧

చ. "హితమును ధర్మముం దగవు [1]నిట్టిది నా మనమేమి నేర్తు? మ
చ్యుతుఁడు సమస్తధర్మపరిశోధకుఁ; డావిదురుండుఁ బాండు భూ
పతిసతియుం దగం బలుకుపల్కుల సందియ మెల్లఁ బాసె; ని
ట్లితఁడు 'రణంబు సేయుఁ' డన నింక విచారము లెల్ల నేటికిన్?" ౯౨

ఆ. అనిన "నట్లకాక, యఖిలధర్మజ్ఞాన
ఘనుఁడు, మనకు నేడుగడయుఁ దాన
శౌరి నిశ్చయింప, సంశయం బేటికి?
సంఘటింపుఁ డుగ్రసమరవిధము." ౯౩

---

1. ...ఇట్టిది నామన మేమినేర్తుము = ...అని మన మేమెఱుంగుదుము?

వ. అని యుధిష్ఠిరుండు దమ్ములతో నెట్టకేలకుం దెగువ సెప్పి — ౯౪

క. "బాహాగర్వము, వివిధ
వ్యూహావిధిజ్ఞతయుఁ గలిగి, యొకరుం డే డ
క్షౌహిణులు నడపి, భీష్మో
త్సాహంబున కోర్చు చాపధరుఁ డెవ్వఁ డొకో? ౯౫

వ. అట్టివానికి వాహినీనాయకత్వం బిచ్చి యభిషేకంబు సేయ వలయు."

తే. అనిన, సహదేవుఁ డిట్లను: "నధిప, పుత్త్ర
పౌత్త్ర సోదరవంతుండు, బాహువీర్య
ఘనుఁడు, మన కాశ్రయం బయి మనిచె మత్స్య
దేశపతి, గాఁడె సేనాపతిత్వమునకు?" ౯౭

వ. అనవుడు నకులుండు — ౯౮

చ. "బలఁగముఁ బెంపుఁ, దేజమును, బాహుబలంబును నగ్గలంబు; పె
క్కు లెఱుఁగుఁ గార్య ఖడ్గములకుం దగుతోవలు. ద్రోణులందు భీ
ష్ములదెసఁ గోపముం గలఁ డమోఘపరాక్రమశాలి. నీబలం
బుల కధినాథుఁ గా ద్రుపదభూపతిఁ బట్టముఁ గట్టు టెట్లొకో?" ౯౯

వ. అనుటయుం, దదనంతరంబ ధనంజయుండు — ౧౦౦

—: ధృష్టద్యుమ్నునకు సేనానాయకత్వంబు నిర్ణయించుట :—

సీ. "అగ్నికుండమున, ద్రోణాచార్యునకు నాశ
మొనరించుదానికై, యుద్భవించె;
రథరథ్యములు ధనుర్బాణంబులును దను
త్రాణ ఖడ్గములు నుద్దామలీలఁ
దనతోన జన్మించె; దహనశిఖామూర్తి,
భుజవీర్యవిక్రమస్ఫూర్తిశాలి,
సైన్యనాథుండు ధృష్టద్యుమ్నుఁ డగు నని
తలఁచెద; నాతఁడు దక్క నొరులం

తే. భీష్ముతోఁ బోర్వ ; రుగ్రింపు బిరుదు, ధైర్య
ధనఘనుండు , శిఖండి భీష్మునకు మృత్యు
వై జనించినవాఁడు, మహాబలుండు ,
దండ నాయకుఁ జేయ నతండు దగును." ౧౦౧

వ. అనవుడు, ధర్మనందనుండు గోవిందుం జూపి, "ఇతండు సకలచరాచర తారతమ్య సంవేది ; విశేషించి మనకు నితని మాటయ విజయమూలంబు, గావున నిమ్మహాత్ముండు నిరూపించినవాఁడు వరూథినీ ముఖ్యుండు ?" ౧౦౨

క. అనుటయు, దామోదరుఁ డి
ట్లను : "ధృష్టద్యుమ్నుఁ డర్హుఁ డగు ; నభిషేకం
బొనరింపుము పేరోలగ
మున నక్షౌహిణుల కెల్ల ముఖ్యుఁడు గాఁగన్. ౧౦౩

క. సుర గంధర్వ ఖచర కిం
పురుషాది సమస్తదివ్యభూతంబుల బం
ధురభూరివ్యూహంబుల
విరచనముల నెఱుఁగు నతఁడు వీరోత్తముఁడుర్. ౧౦౪

క. నీయొద్ది రాజు లందఱు
ధీయుక్తులు, విక్రమప్రదీప్తుల ; యైనన్
వే యేటికి , ధృష్టద్యు
మ్నాయత్తము సేయు సైన్య మంతయు నధిపా." ౧౦౫

వ. అనిన విని, యుధిష్ఠిరుండు 'అక్షౌహిణులకుం బ్రత్యేక నాయకులను నీవ నిర్దేశింపుము.' అనుటయు నతండు — ౧౦౬

తే. "సేన దమకును గలవారు లేనివారు
ననక, తగువారిఁ జెప్పెద నఖిలసమర
పండితుల నేర్చి ; వారి నీబలము లేదు
నడపఁ జాలించి యభిషేచనం బొనర్పు." ౧౦౭

వ. అనిన, 'నట్లు చేయుదు వా రెవ్వ రెవ్వరు నిరూపింపు' మనియడిగినఁ,
గుంతీనందనునకు దేవకీనందనుం డిట్లనియె : ౧౦౮

సీ. "పటుపరాక్రమనిధి పాంచాలపతియు, న
మానుషతేజుండు మత్స్యవిభుఁడు
శత్రుభీకరమూర్తి సాత్యకియును, జరా
సంధాగ్రతనయుండు శౌర్యఘనుఁడు,
సహదేవుఁడును, ధైర్యశాలి యాదవశిరో
మణి చేకితానుండు, మహితవిభవ
ఖని యగు శిశుపాలతనయుండు దోర్దర్ప
ధుర్యుండు ధృష్టకేతుండు, సమర
తే. లంపటుండు శిఖండియు, లావు వెరవుఁ
గలరు, నీయెడ ననురక్తి గలరు, స్వాలఁ
బెంపు గల, రుక్కుమట్టిన తెంపుగలరు,
[1]కడఁగి పతులుగఁ జేయు మక్షౌహిణులకు." ౧౦౯

వ. అని దండనాథుల నిశ్చయించి వెండియు — ౧౧౦

క. "కురుసైన్యము నిస్సారం;
బరయఁగ మనబలము లెల్ల నతిదృఢములు. నీ
వరవాయి గొనక నడపుము;
ధరణీశ్వర, [2]సేన మొగము దైవము నీకున్." ౧౧౧

క. నీయనుజులు దివిజులకు న
జేయులు; ధృతరాష్ట్రసుతులఁ జెఱుచుట వ్రేఁగే?

---

1. ఇటను 'కోరి...మక్షోహిణులకు' అనియున్నది. 'అక్షోహిణి' × 'అక్షౌహిణి' శబ్దములకు సంఘర్షణ మొదవినది. చూడు—ఉద్యోగ, అ. ౧-౨౨౫ క్రింది వివరణము. ఇచటను నాకుదొరకిన 'కడఁగి...మక్షౌహిణులకు' అను పాఠమునే గ్రహించితిని.
2. సేన మొగము...నీకున్ = విధియే నీసేనకు ముఖము.

తోయజ నాశము గజలీ
లాయత్తము గాదె? ఎత్తు మాహవమునకున్." ౧౧౨

వ. అని నిర్ణయించి నారాయణుండు, నిజనివాసంబునకుం జనియె. ధర్మ తనయుండును, దమ్ములుం బ్రియం బంది యారాత్రి సుఖనిద్రసేసిరి. రేపకడయ పాండవాగ్రజుం డనుజ తనుజ దనుజాంతక సామంత మంత్రి పురోహిత సహితంబుగాఁ బేరోలగంబున నుండి, సమస్త పరివారం బును వినఁ, గార్యంబు నిశ్చయంబుఁ దెలియంబలికి, తగువారలతో సముచిత సంభాషణంబులు సేసి, మహనీయమహిమ వెలయం, బుండరీ కాక్షుండు పనిచినట్ల పాంచాలనాథప్రముఖుల నక్షౌహిణులకు నధి పతులుగా వేఱు వేఱ యభిషేకించి, శ్వేతజాతుండగుటం జేసి శ్వేతుం డనం బ్రఖ్యాతుం డగుధృష్టద్యుమ్నునకు నుత్కృష్ట ప్రకారంబున నభిషేకం బొనర్చి, సర్వసేనాధిపత్యంబునకుం బట్టంబుగట్టి, యయ్యైన మండ్రను, దక్కటిదొరలను గనుంగొని, మధురవాక్యంబుల నగ్గించి, 'కౌరవులతోడి కయ్యంబునకుం గురుక్షేత్రంబునకు విడియంబోదము' అని చెప్పి వారి నెల్ల ధనంజయునకుం జూపి — ౧౧౩

ఉ. "ఎప్పుడు నెయ్యడం బొదివి యిందఱకుం దగ నీవు కంటికిఁ
జెప్పయుఁ బోలె మాటయి, నెఱిం బను లారసి, యొజ్జచాడ్పునం
జెప్పుచు, వీరిబుద్ధి గొని చేయుము కార్యము; నీకు రక్ష దా
నిప్పరమేశ్వరుండు గలఁ; డిచ్చు శుభం" బని చూపెఁ గృష్ణునిన్.

వ. ఇట్లు గాంభీర్యమాధుర్యధుర్యుం డైనయుధిష్ఠిరుండు నరిష్ఠ ప్రభువుల చిత్తంబులారాధించి, సర్వజనసమ్మతంబుగా సమరోత్సాహంబు సేసి, మహోల్లాసంబునం [1]బ్రస్థానభేరి సఱవం బంచిన — ౧౧౫

సీ. "బీఱెండతాఁకున బీఁటలు వాఱిన
పచ్చిగోడలపాడ్కిఁ బగిలె దెసలు,

---

1. ప్రస్థానభేరి సఱవం బంచిన = పయనపు నగారా చఱచుటకు—వాయించుటకు ఆజ్ఞాపింపఁగా

కాఁగినయెసరులకరణిఁ బొరింబొరి
శరనిధు లుప్పొంగి పొగలఁ బడియెఁ,
[1]గలముపైఁ గీలించి గాలి కెత్తినచాఁప
వోలె మిన్నంతయు బూరటిల్లెఁ,
గులపర్వతావళి కులిశభయంబున
బెదరి [2]వాపోవున ట్లెదురు సెలఁగె,
తే. ధాత్రి కుమ్మరిసారెవిధమునఁ దిరిగెఁ,
జిత్రరూపులభంగి నిశ్చేష్టితంబు
లయ్యె సర్వభూతములుఁ, బ్రయాణభేరి
భూరినిష్ఠురఘోర భాంకార మడరి. ౧౧౬

—: పాండవులు కౌరవులతోడి యుద్ధంబునకు వెడలుట :—

వ. ఇట్లు ప్రస్థానభేరి సెలంగిన, సకలసైన్యంబులు దండనాథ సహితంబుగా సన్నద్ధంబులయ్యె. మఱునాఁడు — ౧౧౭

ఉ. భూరివిభూతిఁ బెండిలికిఁ బోవు తెఱంగునఁ బాండునందనుల్
దారును, బుత్త్రులుఁ, హరియుఁ దమ్ముఁడు నుజ్జ్వలచారులీల శృం
గారము సేసి, సమ్మదవికాస మెలర్పఁగ, వీరసంభ్రమో
దారసముద్ధతిం జనిరి ద్రౌపది యున్నెడ కందఱుం దగఁ. ౧౧౮

వ. ఇట్లు సని, యమ్మహాదేవి నామంత్రణంబు సేసి, తత్ప్రభృతి పుణ్యస్త్రీకరకలితలలి తాక్షతంబులు గైకొని, విప్రాశీర్వాదంబు లాదరించుచు, భద్రపాఠకశ్లోకంబు లాకర్ణించుచు, శోభనపదార్థంబులు గనుంగొనుచు, నాంగికమాంగల్య సూచకంబులు సేకొనుచు వెడలునప్పుడు—

---

1. కలముపైఁగీలించి = ఓడమీఁద నెక్కొల్పి. 2. వాపోవున ట్లెదురుసెలఁగె = అఱచు నట్లు మాఱ్మ్రోఁగె.

క. తగుశంఖ కాహళాదిక
మగుమంగళ తూర్యసంచయము గంభీరం
బుగ మ్రోసె జయముఁ దెలుపుచు
జగతీశ్వరు మ్రోల నాకసము నిండుకొనన్. ౧౨౦

క. మనుమని జయప్రియాణం
బనుమోదింపంగ నాసుధాంశుఁడు సనఁ దెం
చినకరణి, గొడుగు కుంతీ
తనయాగ్రజు మ్రోల నతిసితప్రభ నొప్పెన్. ౧౨౧

వ. అట్టియెడ నమ్మహీవల్లభుండు — ౧౨౨

క. ఉచితగతిఁ జేరి వంది
ప్రచయము కీర్తింప నెక్కె రథ ; మం దొనరన్
ఖచియించిన వజ్రంబుల
రుచులను బోలు పారు [1]సీవిరులు బెరయంగన్. ౧౨౩

వ. తదనంతరంబ— ౧౨౪

సీ. వక్షస్స్థలంబున వనమాలగ్రాలంగ,
[2]వెలిమావుగెడలవాగెలు ధరించి,
నొగలపై హరి యొప్ప, [3]నగచరకేతువు
మెఱయంగ, నరదంబు మొఱుఁగు లడర,
దివ్యకిరీటంబుదీప్తులు భూనభోం
తర మెల్లఁ గలయంగఁ బరఁగుచుండ,
గాండీవ తూణయుగ్మములు పూర్వాపర
భాగంబులకు నవాభరణములుగఁ,

1. సీవిరులు బెరయంగన్ = వింజామరములు చేరఁగాన్. 2. వెలిమావుగెడల వాగెలు = తెల్లగుఱ్ఱపుజతల పగ్గములు, 3. నగచరకేతువు = కపిధ్వజము.

తే. దెలిమొగంబుతో నల్ల నేతెంచి యొక్క
పార్శ్వమునఁ బొడసూపి, భూపతికి మ్రొక్కి,
దేవదత్తంబు పూరించె దేవదేవు
పాంచజన్యంబు మున్నుగా ఫల్గునుండు. ౧౨౫

శా. భీముండుం గవలుం గుమారులును సంప్రీతిన్ గదాద్యాయుధో
ద్దామస్ఫీతరుచుల్ వెలుంగ, రథసంతానంబు రమ్యోజ్జ్వల
శ్రీ మీఱం దగ వచ్చి, శంఖములు గర్జిల్లంగఁ బూరించుచున్,
భూమీశుం గని యగ్రభాగమున గొప్పం బెంపునుం జేయుచున్—

క. నిలిచిరి. దక్కటిదొరలును
బలుమానసులును మహోగ్రభంగి సవరణల్
చెలు వొంద నధిపుచుట్టున
నలంకరించిరి విభూషణాంశుచ్ఛటలన్. ౧౨౬

వ. అప్పుడు పాండవాగ్రజున కభిముఖంబుగాఁ జనుదెంచి — ౧౨౭

క. సాష్టాంగ మెఱఁగి, సమరా
వష్టంభం బొప్ప, దివ్యవాహన శ్రీలో
త్కృష్టగతిన్ ముంగలి యై
ధృష్టద్యుమ్నుండు వొలిచెఁ దేజోమహిమన్. ౧౨౮

వ. ఇవ్విధంబునం జారుభీషణంబుగా సన్నద్ధుండై యుధిష్ఠిరుండు గదలి శుభసూచకంబులు గైకొనుచు నడచె. అట్టిసమయంబున నెల్లవారి పరిచారకులును, శకటాది సకలసాధనంబులును, [1]పటగృహంబులును మొదలుగా వలయుసమస్తవస్తువు లొడఁగూర్చి, వెడలినదండు పఱపై సముద్రంబు గాఁపువొవుచందం బయ్యె. ఇట్లరిగి ధర్మపుత్త్రుండు కురుక్షేత్రంబు సఱియం జొచ్చి, ఋష్యాశ్రమంబులకు దేవతాయతనంబులకు నలజడి గా కుండం బరిహారంబు సేయుచుం జని, తృణ

1. పటగృహంబులును = గుడారములును.

కాష్ఠ జలసమృద్ధం బై తగియెడు సమస్థలంబున హిరణ్వతి యనుపుణ్య
నదిపొంత విడిదలగా నిరూపించి యచ్చో నిలిచె; తదనంతరంబ—

తే. విడియుటకు సూచకంబుగ విష్ణుఁ డొత్తెఁ
బాంచజన్యంబు; ధర్మజ పార్థులాది
గాఁగఁ దమతమవీరశంఖంబు లెల్ల
దొరలు నొత్తిరి; [1]దివి మ్రోఁతఁ దూఁటు గట్ట. ౧౩౧

వ. తదనంతరంబ యొక్క రమ్యప్రదేశంబున రాజమందిరంబును, నుచిత స్థానంబుల సమస్తజననివాసంబులు నై రమణీయబంధురంబును, సింధు రాశ్వశాలామాలికా మనోహరంబునుం గా వీడెల్ల విడిసె. వీటిచుట్టు నుం దిరిగి ధృష్టద్యుమ్నుండు సురక్షితంబు చేసి వచ్చె. రాజును దొరలును దమ్ములును సకలపరివారంబును దగిన తెఱంగున నుండిరి. నానావస్తుబహుళ సంభారంబుల మహోదారం బగుచుఁ బాండవ స్కంధావారంబు మహనీయాకారంబున నొప్పె. అంత నక్కడ—

క. చారులచే నంతయు విని,
కౌరవపతి విననియట్లు, కర్ణాదులతోఁ
బేరోలగమున విగతవి
కారుం డై, యిట్టు లనియె గర్వ మెలర్పన్. ౧౩౩

క. "తనవచ్చినకార్యము, మన
మనకూలతఁ జేయ కున్న, హరి, యలుక మెయిం
జని, యప్పాండుతనూజులు
మనములఁ గిను కూనునట్టిమాటలు సెప్పన్. ౧౩౪

చ. మును మనచేత భంగపడి ముచ్చిరి యుండుటఁ జేసి, పాండునం
దనులును నెత్తి వత్తు రుచితంబుగ; సంగర మెట్లుఁ గల్గుఁ; బే

1. దివిమ్రోఁతఁ దూఁటుగట్ట = ఆమ్రోఁతచే దివి (ఆకాశము) తూఁటువడఁగ.

గ్చిన బహుసైన్యముల్ బయలఁ జేరఁ దగ౯ విడియింత మెల్లి దం
డని పురిఁ జాటఁ బంచి, [1]దొర లందఱకు౯ బడి సేయుఁ డే త్తెఱ౯.

వ. మనకు విడిదల కురుక్షేత్రంబు" అని పలికి, దుశ్శాసనుం జూచి; "నీవును గర్ణుండును గాంధారపతియును సమస్తంబును సమకట్టుం" డనుటయు, వారలు ప్రియంబునం బని పూని వెడలి, దండు సాటించి తగువారల కెల్ల నెఱింగించి పుచ్చిరి. సకల పరివారంబును బ్రమోదంబు నొందె. భూవల్లభుండును, గొలిచి యున్నవారలం బోవం బంచి, వలయు నెడకుం జని తగినవర్తనంబున నుండె. అట్టిసమయంబునఁ బ్రయాణోచితంబు లగుబహుప్రకార వ్యాపారంబులయందుఁ దత్పరు లయిన దొరల నానాచేష్టితంబులను, గరి తురగ రథంబులకు సవరణలు సమకూర్చు చతుర పరిచారకుల సంభ్రమంబునను, వివిధాయుధంబులు రవణంబులుగా నాయితంబులు సేయఁ బ్రవర్తించుపదాతివర్గంబుల సంరంభంబునను, నమ్యైసరకులు పయనంబున కనువు సేయు బలుమానసుల తిరుగుడువడుటనుం, బురంబు సమరోత్సాహ చంద్రోదయంబునకు మహార్ణవం బై, ఘూర్ణిల్లుచుండె. అపరదిన ముఖంబున— ౧౩౮

క. త్వరితగతి సమయసముచిత
కరణీయము లాచరించి కమనీయాలం
కరణోజ్జ్వలుఁ డై యెలమిఁ
గురుగా జేతెంచెఁ గొలువు కూటంబునకు౯. ౧౩౯

వ. వచ్చి దుశ్శాసనప్రముఖ నిఖిలసహోదర పరివృతుం డై యుండి —

---

1. దొరలందఱకు౯ బడిసేయుఁడు = ...కట్టడ, ఎచ్చరిక సేయుఁడు.
బడి = (దే. ఆపదము. భావార్థ మంమవచ్చు నొకప్రత్యయము: పిలుబడి, పలుకుబడి, మొ॥) దిట్టము, కట్టడ, ఎచ్చరిక, క్రమము, పాఠశాల,

—: దుర్యోధనుఁడు ద్రోణప్రభృతుల సేనాపతులం జేయుట :—

సీ. అరిభయంకరుఁడు ద్రోణాచార్యుఁడును, రణో
త్సాహలంపటుఁడు రాధాసుతుండు,
శరతత్త్వవేది యశ్వత్థామయును, భూరి
బాహావిలాసుండు బాహ్లికుండు,
శౌర్యవైభవశాలి శల్యుండు, ధైర్యసం
పన్నిధి కృపుఁడును, బ్రకటశక్తి
సారదుర్జయమూర్తి భూరిశ్రవుండును,
దర్పోజ్జ్వలుండు గాంధారపతియు,
తే. సుగ్రతేజుండు కృతవర్మయును, బ్రతాప
ఘనుఁడు గాంభోజుఁడును, బరాక్రమధనుండు
సింధురాజును బతులుగాఁ జేయఁ గోరి
[1]కొనఁగఁ దగువార లగుదు రక్షోహిణులకు. ౧౩౯

చ. అని మది నిశ్చయించి తగ నందఱఁ బిల్వఁగఁ బంచి, [2]వారితో
ననిపని మాటలాడి, వినయంబునఁ బ్రార్థన సేసి 'మీర లీ
యొనరినసైన్యముల్ పదునొకొంటికిఁ బ్రాభవ మాచరింపఁ జొ
చ్చిన సకలంబు నొప్పు; నభిషేకము గైకొనుఁ డుత్సవంబునన్.' ౧౪౦

క. అనవుడు, నందఱు 'నౌ గా'
కని సంతస మంద, నధిపుఁ డభిషేకించెన్,
జను లెల్ల సంప్రమోదం
బునఁ బొందఁగ, నప్పు డతివిభూతిం బ్రభులన్. ౧౪౧

వ. ఇట్లు మహామహిమ వెలయ నక్షౌహిణీనాయకుల సమకట్టి, రారాజు పితామహు పాలికి వారిం దోడ్కొని చని, సవినయంబుగా నతనికిఁ

1. 'కొనఁగ...రక్షోహిణులకు'—దీనికిఁ బాఠాంతరము దొరకదు. 2. వారితో ననిపని మాటలాడి = యుద్ధముంగూర్చినపని.

బ్రణామంబు సేసి, వారలంజూపి, 'వీరల మనయక్షౌహిణులు పదు
నొకొంటికిం బతులఁ గావించితి ; ఇన్ని సైన్యంబులు నొక్కలావున
వర్తించు చందంబు సూచికొనవలయు' నని చెప్పుచుఁ జేతులు మొగిచి
యి ట్లనియె : ౧౪౨

చ. "[1]నెఱిఁ బడి యాజి నీ మొనలు నేరవు గూడి తగం జరింప ; నిం
దఱమన సొక్కఁడై చనక తప్పఁ గదా ! బహుదేశవాసు లం
ద ఱొకటి సేయుచో వెరవు దప్పక చెల్లుట యెట్లు గల్గు ? ఇ
త్తెఱఁ గొకచాలువానిఁబలుతీర్పునఁ గాక పొసంగ నేర్చునే? ౧౪౩

ఆ. [2]అమరసేనలును దమంతన వర్తింప
నేర కునికి నాకుమారు మొగము
గా నొనర్ప వలసెఁ గాదె? సమస్త సే
నలను నీవ యరసి నడపవలయు. ౧౪౪

క. తారలకుం జందుర్రనిగతిఁ,
గారవులకు మేటి వీవ కావున, నీ వీ
భారంబు వూని మముఁ గడ
చేరుపఁ దగునెమ్మెయిం బ్రసిద్ధచరిత్రా. ౧౪౫

తే. సర్వసేనాధిపత్యంబు నిర్వహింప
నీవు దక్క, నిం దొక్కడు, నీవ యరసి
చెప్పుమా కలఁడేని? రక్షింపు మమ్ముఁ,
బూని పట్టంబు దాల్పుము, పొడిచి గెలుము." ౧౪౬

1. తా. ఈసేనలు ఒకపద్ధతినిఁగూడి అనువుగా యుద్ధరంగమునఁ జరింపనేఱవుఁగద. ఈ సేనలోని ఇందఱమనసు ఒక్కరీతిగా నుండక తప్పనేమోకదా! పెక్కుదేశ ములవారు గూడి ఒకపని సేయునెడ వెరవుతప్పక ఎట్లు సాగఁగలదు?— వెరవు దప్పకుండునా? ఈమనవ్రూన్కి ఒకసమర్థుని నేతృత్వము — మేలిశిక్షణము లేనిచో అనుకూలపడ నేర్చునా?

2. తా. నిర్జరసైన్యములును తమంతఁ దాము వర్తింప నెఱుఁగ కుండుటచేతనే అకుమార స్వామి ముఖునుగా—నేతృత్వమున నడపవలసెఁగదా!

వ. అనిన విని, గాంగేయుండు గాంధారేయున కిట్లనియె: ౧౪౭

ఆ. "మీరుఁ, బాండుసుతులు నారయ నాకొక్క
రూప; కార్య మున్న రూపువలుక
వలయుఁ; గయ్యమైన వత్తు; మీలోన నా
యునికిచందమునకు నుచిత మిదియ. ౧౪౮

క. సేనాధిపత్యమును దగఁ
బూనెద; నను మాఱొక్కనంగఁ బురుషుల నెవ్విం
గానఁ; గిరీటికి నొక్కని
కే నోర్వ; నతండు శరము లెక్కు డెఱుంగున్. ౧౪౯

క. పెఱవారి నెల్లఁ [1]దర మిడి
నఱకుదుఁ; బాండుక్షితీశ నందనులను దూ
పఱ నేయం జే యాడదు;
దఱుమరు నామీఁద నత్యుదగ్రత వారున్. ౧౫౦

వ. అప్పటికిఁ దగినభంగి యయ్యెడు. అది యట్లుండె" ననిపలికి మఱియు
ని ట్లనియె: ౧౫౧

ఆ. "మున్న కర్ణునొండె, నన్నొండెఁ గయ్యంబు
సేయఁ బనుపు; మిట్లు సేయువాఁడ
వైనఁ గాని, సకలసేనాధిపత్యంబుఁ
బూన నేరఁ జుమ్ము భూపతనయ!" ౧౫౨

వ. అనినం గర్ణుండు కౌరవపతితో ని ట్లనియె: ౧౫౩

క. "ఇప్పుడు గ్రొత్తగ దీనిం
జెప్పంగా నేల? మున్న చెప్పితిఁ గాదే;
'యెప్పుడు భీష్ముఁడు వడు, నే
నప్పు డనికి వచ్చువాఁడ' నని సభలోనన్." ౧౫౪

1. తరమిడి = వరుసబెట్టి.

ఆ. అనిన, 'నట్ల కాక' యని సర్వసేనాధి
పత్యభారపట్టబంధమునకు
నియ్యకొనియె భీష్ముఁ డయ్యగ్గలికఁ గాని
యాఁడె విభుఁడు ప్రముదితాత్ముఁ డగుచు. ౧౯౫

క. భేరీ మృదంగ శంఖ కు
లారవములు సెలఁగఁ జేయుఁ డని పనిచి, మహో
దారపతాకాద్యుత్సవ
గౌరవములు నడపె నెల్లకడలం బురిలోన్. ౧౯౬

వ. ఇట్లు పట్టశాలంకారంబు సంఘటించి, రత్న కాంచన కలధౌతమయంబు లగు కలశంబులఁ దీర్థ జలంబులు దెప్పించి, మణిప్రకరంబునఁ, గుసుమ నికరంబున, [1]మంగళతరు త్వక్ప్రచయంబున మహౌషధినిచయంబున, విహితమంత్రంబుల, నుచితతంత్రంబుల, ఋత్విక్పురోహిత సహితుం డై తత్సంస్కారప్రకారం బాచరించి— ౧౯౭

క. "గురుఁడును గృపుఁడును లోనగు
గురు లనుమోదింప, బాహ్లికుండు మొదలుగాఁ
గురుజాతి యెలర్పఁగ న
న్నరపతి భీష్మాభిషేచనం బొనరించెన్. ౧౯౮

తే. ఇవ్విధంబున నభిషేక మెలమిఁ జేసి,
పరమభక్తి నక్షౌహిణీ పతులఁ జూపి,
'వీరికిని సైన్యములకును మీర యొడయ'
లనుచుఁ బట్టంబు గట్టె శంతనుతనూజు. ౧౯౯

క. అత్తఱిఁ బాషాణంబులు
నెత్తురు నెమ్ములును గురిసె; నిష్ఠురనినదా

---

1. మంగళతరు త్వక్ప్రచయంబున = గోరోచనము, జమ్మి, తెల్లవస, సదాప, మారేడు, రావి మున్నుగా మొక్కలతొక్కలును.

యుత్తమయి నభము పిడుగుల
మొత్తంబులు వడియె నగరమున నెల్లెడలన్. ౧౬౦

క. దానికి జను లుత్సాహ వి
హీనతఁ బొందంగఁ, గౌరవేంద్రుఁడు నానా
దానాదు లయినశాంతి వి
ధానము లొనరించి యాన తత్పరమతి యై. ౧౬౧

క. తల్లియుఁ దండ్రియు వెఱఁగునఁ
బుల్లవడన్, వారికడకుఁ బోయి, తడయఁగా
[1]నొల్లక పయనపువీడ్కో
లెల్లం దనయిచ్చ నడపి యేత్తెఱ వెడలెన్. ౧౬౨

తే. వెడలి, తమ్ములుఁ, దగువారు, వివిధభృత్య
గణముఁ, దానును నేల గ్రిక్కిఱలఁ గదలి,
రాజరాజు, గాంగేయుఁ బురస్కరించి
కొని, సముద్ధతి నడచె దిక్కులు వడంక. ౧౬౩

వ. నడచి కురుక్షేత్రంబు దఱియం జొచ్చి, యం దొక్కరమణీయ ప్రదేశంబు విడిసలగా నిరూపించి నిలిచి, భానుసూనుండును దానును మొలంగి, యెల్లవారిని విడియించి, నడుమ నిజనివాసంబు గావించినఁ, గౌరవేశ్వరు స్కంధావారంబు వారణపురంబున నెవ్వ రెయ్యెడ వసియింతు

---

1. 'నొల్లక పయనము వీడ్కో-లెల్లను దనయిచ్చఁ దెల్పి యిట్లనియెఁ దగన్.'
౧ 'గెలువుమని నన్ను దీవింపఁగలయు నమ్మ' యనుచు గాంధారి కెఱఁగి తా విన్నవింప
నెచట ధర్మంబుగలదు తా నచట నెసఁగు జయము సిద్ధంబటంచు నాసాధ్వి పలికె.
౨ 'గెలువుమని నన్ను దీవింపవలయుఁ దల్లి' యంచు గాంధారికి న్మ్రొక్కి వినతుఁడైన
నెచ్చటను ధర్మముండు తా నచ్చటికిని జయమగునటంచు నప్పు డా సాధ్వియనియె.'
పైరెంట మొదటి దొక తాళపత్రప్రతియందుమాత్రము గలదు. రెండవ పాఠము ముద్రితప్రతులలోఁ బెక్కింటఁ గలదు.

రాచంపంబున నందం బై యొప్పె. ఇట్లు [1]రెండువీళ్లును సన్నద్ధంబు
లైన సమయంబున — ౧౬౪

ఉ. సంధికి నేఁగి కార్యము పొసంగక [2]కృష్ణుఁడు రాకయుఁ, సుహృ
ద్బాంధవసంఘయుక్తముగఁ బాండవ కౌరవవీరు లష్ట ది
క్సింధురకంధరంబు లడఁగించు బలంబుల నెల్లతోడ గ
ర్వాంధత నాజి కెత్తుటయు, నా బలభద్రుఁడు విని నార్తుఁ డై.

—: బలరాముఁడు పాండవుల వీడ్కొని తీర్థయాత్ర వోవుట :—

వ. కతిపయపరివారంబు పరివేష్టింప రయంబునం జనుదెంచి, సముచిత
ప్రకారంబున ధర్మనందనుం బేరోలగంబునం గని, సంభ్రమాలింగనా
సనార్ఘ్యపాద్యంబుల నతనిచేత సంభావితుండయి, దామోదర భీమా
ర్జున నకుల సహదేవుల యభివాదనంబు లాదరించి, పాంచాల విరాట
ప్రముఖు లగుతగు వారలవినయంబుల నభినందించి, యాదొరలతోఁ
దత్కాలయోగ్య మిత సంభాషణంబులు సేసి యనంతరంబ వారల
కి ట్లనియె: ౧౬౬

క. "కౌరవ పాండవు లెంతయుఁ
గ్రూరత వాటించి, బంధుకోటికి నిఖిలో
ర్వీరమణులకుం జేటుగఁ
బోరికిఁ దెగి; రెట్టిఘోరపుంబని! యగునే! ౧౬౭

తే. ఇట్టి దానికి నోర్వక యెన్నఁడేనిఁ
గృష్ణుతోడ నేఁ జెప్పితిఁ గినిసి 'యిరుదె
అంగువారికిఁ దగఁ జెప్పి సంగతంబు
సేయు' మని; యెంత సెప్పినఁ జేయఁ డయ్యె. ౧౬౮

క. పలుకులపొం దెఱుఁగని వా
రలఁ బూజావాక్యములఁ దిరం బై తనకుం

---

1. రెండువీళ్ళును=రెండు తెగలును. 2. కృష్ణుఁడు రాకయుఁ = ...వచ్చుటయును.

దెలుపం దగదే? ప మని
యలుకమెయిన్ సంధి చెఱిచి హరి యేతెంచెన్? ౧౬౯

తే. వీరు వారును సంబంధవిషయబంధు
లగుట సరి గాదె హరికిఁ? దా నర్జునునకుఁ
బక్షపాతంబు సేయుటఁ బాండవులను
బెట్టుచోటులు గానక పట్టె కాళ్లు. ౧౭౦

ఉ. కావున, వీరికిన్ జయము గల్గుట నిశ్చయ మెల్ల భంగులం;
జావు నిజంబు వారికి; నసంశయ మై యిటు లుండ, దీని నె
ల్లే వినఁ జూడ నేర్తుఁ? దగ నింతపవిత్రపు నేన చేసితిం
జూవె సుయోధనుం, బవనసూనుని! [1]నొండొరుఁ జంపఁ జూతునే?

క. [2]హరి యెఱుఁగని చక్కటియుం,
బురుషార్థము నా కెఱుంగఁ బోలునె? ఈ ని
ష్ఠురత వినఁ జూడఁ జాలక
సరస్వతీతీర్థమునకుఁ జనియెదు బుద్ధిన్- ౧౭౨

వ. మీకుం జెప్పి పో వచ్చితిఁ; బోయి వచ్చెద" నని పలికి బలదేవుండు వాసుదేవ ధర్మపుత్రు లొడంబడి యనుపఁ దీర్థయాత్రవోయె. తద నంతరంబ — ౧౭౩

—: రుక్మి వృత్తాంతము :—

సీ. కృష్ణుని దేవి రుక్మిణిసోదరుఁడు, రుక్మి
యనువాఁడు, బలవిక్రమాన్వితుండు,
శార్ఙ్గ గాండీవ విజయములు నాఁ గల
దివ్యచాపములఁ దృతీయ మైన

1. ఒండొరుఁ జంపఁ జూతునే = ఒక్కఁడు మఱొక్కని...? 2. హరి...చక్కటి యున్ = ...న్యాయమును.

చాపంబు గలవాఁడు, సైన్యసమేతుఁడై
చనుదెంచి ధర్మజుఁగని, తదీయ
సత్కారములుగాంచి సముచితాసనమున
నుండి, యక్కొలువున నున్నవీరు

ఆ. లెల్ల వినఁ, గిరీటి కిట్లను: "సమరంబు
సేయ వెఱచితేనిఁ జెప్పు; నాకు
నెదురు లేరు జగతి నెవ్వరు; నీకుఁ దో
డ్పడి జయింతు నెట్టిపగఱ నైన." ౧౭౪

వ. అని తన్ను నాక్రమించి తనతోఁబుట్టువు రుక్మిణిం గొనివచ్చిన యా
కృష్ణుని సన్నిధిన సిగ్గులేక యాడిన మాటలు విని, చిఱునవ్వు నవ్వు
చుం గవ్వడి యతని యాననం బాలోకించి — ౧౭౫

తే. "చెనసి గంధర్వసేన నిర్జించునప్పుడు,
మత్స్యనాథుగోవర్గంబు మరలఁ దెచ్చు
నెడను దప్పె! [1]నీకందువ యెఱుఁగనైతి;
నింక నాఁగాని తోడు గమ్మెచటి కైన." ౧౭౬

వ. అని యతని యుత్తరమునకుఁ దగినయట్లు పలికి మఱియును — ౧౭౭

క. "మున్నే నసహాయుఁడనై
చన్నకడం జనఁగ నైనచందం బయ్యెన్;
నెన్నఁడు దోడు గలఁడు; వెఱ
వెన్నండును వలవదింక నేమిటి కైనన్." ౧౭౮

చ. వెఱచితి రాఁ గదే యనిన వెండి కదా పగఁ దీర్తు నీవు; నా
వెఱ పెటు లున్న నీరథిక వీరులు వాపెద; రొల్ల నిన్ను; [2]నీ
యుఱుకడ కేఁగి తోడుపడు మొల్లను నెవ్వరి కేని" నన్న నే
త్తెఱ నతఁ డేఁగి కౌరవపతిం గని యట్టుల బెట్టు వల్కినన్. ౧౭౯

---

1. నీకందువయెఱుఁగనైతి = నీ సామర్థ్యము... 2. నీయుఱుకడకేఁగి = నీకుఁ దగినచోటి
కిఁ బోయి.

క. ఆతఁ 'డివి యేటి మాటలు!
నీతో డగు టోల్లఁ బో' మ్మనిన, రుక్మి వృథా
యాతాయాసవిషణ్ణుం
డై తనపురమునకు మగుడ నరిగెం బెలుచన్. ౧౫౦

తే. ఇట్లు బలదేవ రుక్ముల కిద్దఱకును
గయ్యమునకు సన్నాహంబు గలుగదయ్యెఁ
గాని, తక్కలోకమ్మునఁ గలుగునృపతి
కోటి యిరువాఁగునందును గూడె ననికి. ౧౫౧

వ. అట్టియెడ నిశాసమయంబున ధృతరాష్ట్రుండు సంజయు రావించి
యి ట్లనియె: ౧౫౨

క. "బవరము గీ డని యెఱుఁగుదు;
నవినీతుం డైనకొడుకు నదలిచి యుడుపం
దివిరియు నోరాడమి డై
వవశం! బప్పునికి మనకు వగ పిం కేలా? ౧౫౩

క. ఎయ్యది గా నున్నది యది
యయ్యెడుఁ; జేయునది గలదె? అవనీశులకుఁ
గయ్యానఁ జచ్చుటయు మే
లయ్యెప్పుట లెన్న గాక! అది య ట్లుండెన్. ౧౫౪

వ. రెండువీళ్లును గురుక్షేత్రంబున విడిసినపిదపం బుట్టినవిశేషంబులు గల
వేని నెఱింగింపుము" ౧౫౫

—: సంజయుండు ధృతరాష్ట్రుని కులూకుఁడు పాండవుల నాడినమాటలు సెప్పుట :—

తే. అనిన, సంజయుఁ డి ట్లను "నకట! కొడుకు
మీఁదఁ దప్పు పెట్టెదవు! నీమీఁది కొఱఁత
నీకుఁ గానంగవచ్చునె? నీ వెఱుంగ
కుండఁ బఱచెనె యాతండు పాండుసుతుల? ౧౫౬

వ. ఆపని గడపంబడియె. వార్తలు వినియెద వేని వినుము. దుర్యోధ
నుండు దుశ్శాసన శకుని కర్ణులతో విచారించి యులూకుం బిలిచి,
'నీవు వోయి పాండవులం గని వాసుదేవుసన్నిధిని బాంచాల విరాట
ప్రముఖులు వినఁ బలుకు' మని పరుసని మాటలు గఱపి పుచ్చిన,
నతండును — ౧౮౭

క. చని కొలువున ధర్మసుతుం
గని 'దుర్యోధనుఁడు సెప్పఁగా నను నియమిం
చినమాటలు గొన్ని గలవు;
విను మలుగక' యనిన, నతఁడు విని యి ట్లనియెన్: ౧౮౮

ఆ. "నీకు వెఱవ నేల? నిన్ను నాబుద్ధిమం
తుండు సెప్పు మనిన తులువమాట
లెన్ని గలవు, వాని నన్నింటి ననుమాన
మింత లేక యాడుమెల్ల వినఁగ." ౧౮౯

వ. అనిన నులూకుం డి ట్లనియె: ౧౯౦

సీ. "కయ్యంబునకుఁ బెద్దకాల మేనియుఁ బూఁచి
పట్టి వచ్చితి కడుబరవసమున;
సంజయుతో మీరు శంక లే కాడిన
యెక్కుడుమాటలు పెక్కు గలవు;
భూమిభాగము గోలుపోయినయలుకకు,
ద్రౌపదిఁ బఱచినదైన్యమునకుఁ,
దగ మంచిబంట వై, 'తఱి యిది బాహుబ
లాస్త్రవిద్యలు సూప' నని తలంచి,

ఆ. నిలువ వలయు. నీకుఁ గలవారి నెల్లను
గూర్చి మోహరించికొని, కడంగి
నడవు సమరమునకు; వెడజంకఁ బో దింకఁ
దప్పఁ గ్రుంకలేదు; తఱికిఁ జొరుము." ౧౯౧

క. ఆతతబలుఁ డగుభీష్ముని
చేతి బలువు, ద్రోణునంపసెల లవియుటయుం,
జూతు రటు రండు, కృష్ణుని
చేతన సకలంబుఁ జక్కఁ జేసికొనుండీ ! ౧౯౨

క. నా రిద్దఱవాలమ్ముల
బారిం బడి యర్జునునకు బ్రిదుక వశమె? మీ
నా రెల్ల నెఱుంగరె యు
ద్వీరులదివ్యాస్త్ర శస్త్రవిభవ సమృద్ధుల్ ?” ౧౯౩

వ. అని భీమసేనుం జూచి –

క. “ఈ వాయుపుత్రుఁ, ‘ డాజిం
దా బ్రిపుదు నే దుస్సనేనుర క్తం’ బనియెం !
దా బ్రివఁగ శక్యం బేనిం
దా బ్రివు మనఁగ రాదె యింకఁ దడ వేమిటికిన్ ? ౧౯౪

క. విను, నూతికప్పవిధమున
నిను నీవ యెఱుంగు ; దెఱుఁగ నేరవు గర్వం
బున నావలికొలఁది : రణం
బున నొకమరి పెట్టువడక పో నేర్చెదవే.” ౧౯౬

వ. అని పలికె సవ్యసాచిం జూచి – ౧౯౭

తే. “వినుము, గాండీవ మనునొకవిల్లు దాటి
పోడవు గలిగియుఁ, గృష్ణుండు వ్రాని తోడు
గూడుకొని వచ్చుటయు నెఱుంగుదుము ! వీని
కెల్ల శంకించి భూమి పాలీము గాని – ౧౯౮

క. పవనజుగదయును, నీగాం
డివమును నెట వోయె, [1]నంగడికిఁ బాంచాలిం

---

1. అంగడికి = కొలువుకూటమునకు,

దివిచికొని వచ్చునెడఁ? బరి
భవ మెఱుఁగవె, బీర మేల పలుకుదు తోడ్తోన్? ౧౯౯

చ. వలలుఁ డనన్ విరాటుకడ వంటలవాఁ డయి భీముఁ డున్, బృహ
న్నల యన నాఁడుపేడి యయి నాన యొకింతయు లేక నీవు, న
గ్గల మగుదైన్య మొంది కడుఁ గాఁటియ వొందితి రుర్వి యేలునా
సలఁ బడి; సవ్యసాచి, యిది శౌర్యము బాహుబలంబొ చెప్పుమా?

ఉ. మాయలు నింద్రజాలములు మాధవుఁ డెందును గొన్ని వన్నినన్,
[1]వాయపురజ్జు లెప్పుడు నవారణ నీ వెటు లాడితేనియున్,
వేయును నేల, పార్థులును విష్ణులు నేఁబదివేలు వచ్చినం
జేయుదు మేము గయ్య; మొకచీరియు సంపదఁ బంచి యిత్తుమే? *

వ. *అనిన, భీమార్జున నకుల సహదేవు లొండొరులం జూచుచు నాసనం
బులు చలింప, మొగంబులు జేవుఱింపఁ, గ్రోధాయత్తచిత్తులై
యున్నం గనుంగొని, నవ్వుచు నారాయణుం డులూకున కిట్లనియె:
"నీవుఁబోయి సుయోధనుతో నెల్లవారును విన నిట్లనుము? ౨౦౧

తే. బవర మెల్లియ; బిరుదవై బరవసంబు
గలిగి చావుము; చావక తొలఁగరాదు

---

1. వాయపురజ్జులు = వ్యర్థప్రలాపములు. వాయము = (దే. విణ) వ్యర్థము; పొల్లు. ప్ర. వాయువు రజ్జులేల — మార్కండేయ. ఆ ౪.

* పై 201 వ వచనమునకును 202 వ పద్యమునకును నడుమ వ్రాతప్రతులఁ గొన్నింటఁగల పాఠము

వ. "అని నకులుం జూచి

క. దామగ్రంథి యనం గా మోమిడికొని విరటు గుఱ్ఱములఁ బట్టుచు నీ
వా మెయినుండితి రాజ్యము పై మమతను గాక, నీకుఁ బౌరుషమదియే?

వ. అని సహదేవుంజూచి.

క. పెడ తంత్రిపాలుం డనఁ గడుహీనత విరటు పసులఁగాచితి వౌ నీ
పుడమి గలదే మెఱుఁ యనుమా సడికోర్చితిగాక; నీకు శౌర్యముగలదే?"

కృష్ణసారథికం బగుజిష్ణురథము
దొడరి నీ వెందుఁ జొచ్చినఁ దోన చొచ్చు! ౨౦౩

క. రిత్తలు రజ్జెడువాఁడే
మత్తగజాయుతబలుండు మారుతి! అని ను
ద్వృత్తుఁ డగుదుస్ససేనని
నెత్తు రురము వ్రచ్చి త్రావు నీవుం జూడన్." ౨౦౪

వ. అని యిట్లు హరి పలికినయనంతరంబ యర్జునుం డులూకున కి ట్లనియె:

క. "వారు గలరు, వీరు గలరు
పోరికినని చెప్పె దీవు పొం గారుచు! మీ
వారిని మిమ్మును రేపు గ
దా యీ వేర్పడఁగఁ జూచెదం [1]గితవసుతా! ౨౦౬

చ. తనభుజశక్తి లేక యొరు దర్పము యూఁది పరాక్రమింప వ
చ్చిన నది సెల్లునే? కులవిశిష్టుని సువ్రతు వృద్ధు నార్యు భీ
ష్మునిఁ నెసకొల్పి, 'సేనలకు ముఖ్యుఁడ వీ' వని యుబ్బఁ జేసి, యీ
సునఁ దలపెట్టి చంపికొనఁ జూచె సుయోధను; డింత నే మగున్!

చ. తనతలఁ పెట్లు భీష్మభుజదర్పము లోకముకంటె నెక్కు; డీ
తని నొకభంగి నండగొని తప్పదు చావున కంచు నున్నవాఁ;
డనిఁ దొలుమున్న గొందుము రయంబున నాతని; వెంటి ద్రోణులం
దునుముదు; మశ్వ నూతసుతుఁ దోలుదు; మంతట నాసమాలెదున్!

క. అనుజులఁ దనుజుల చావులు
గనుఁగొని, మఱితాను భీముగదచే నిలఁ గూ
లిన యప్పుడైన దుర్యో
ధనుఁడు మదిం దలఁచుఁ గాక తనదుష్కృతముల్! ౨౦౭

1. కితవసుతా = జూదరికొడుకా.

వ. అది యట్లుండె, నీవు వేగ పోయి రేపకడయ మీరాజుం గలనికి నడపింపు" మనియె. అప్పుడు ధర్మనందనుం డులూకునకుం దాంబూలాభరణంబు లిచ్చి వీడుకొలిపి, ధృష్టద్యుమ్ను నవలోకించి, 'యెల్లి గయ్యం బని మన సైన్యంబుల కెఱింగించి సర్వసన్నాహంబులు సమకట్టు' మని పనిచి, కొలువు విరిసి చనియె. ధృష్టద్యుమ్నుండును 'ద్రోణులం దోడరం బడసితి' నని యుబ్బుచు వెడలి, భీష్ముం దలపడఁ గంటినని పొంగు శిఖండి దోడుగా, రాజుశాసనంబు నిర్వర్తించె. ఇట యులూకుండువచ్చి దుర్యోధనుం బేరోలగంబునం గని, యతనికిఁ గృష్ణార్జునుల పలుకు లున్నరూపు విన్నవించిన, నతండు కర్ణుదెసఁ గనుంగొని, 'సమస్త సేనలకు రేపు బవరం బనిచెప్పి పుచ్చుము. సకల సాధనంబులు నాయితంబులు సేయుము' అని పనిచిన, నతండు నట్ల చేసె. ఇట్లుభయకటకంబులు రణంబునకు నుత్సహించి విజృంభించి యుల్లసిల్లె ననిన, ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె:

క. "వినుము, హరితోడు గలయ
ర్జును గెలువ నదీసుతునకుఁ జొప్పడునే? యా
పని నిలుపు; ములూకుని చె
ప్పినమాటల కేమియనిరి పిదపఁ గొలువునన్ ?" ౨౧౧

వ. అనిన విని యంబికానందనునకు సూతనందనుం డిట్లనియె: ౨౧౨

ఆ. "అయ్యులూకు పలుకు లన్నియు విని భవ
త్తనయుతోడ నిట్టు లనియె భీష్ముఁ:
"డేను గలుగ వెఱవ నేటికి? సేనలఁ
గాతు నీవు మెచ్చఁ; గౌరవేంద్ర. ౨౧౩

క. నడిపింపఁగఁ బొడిపింపఁగ,
[1]నెడమడు వై కలఁగినప్పు డేర్పఱుపఁగ నేఁ

---

1. ఎడమడువై ... నేర్తు = వ్యత్యస్తమై కలత వడినపుడు విశదీకరింప నేనెంతయు నేర్తు.

గడు నేర్తుఁ; [1]చేర్పునాకగు
కడిమియ నీసైన్యమునకు గాసెన గాదే!" ౨౧౪

క. అనినం, గురునా జిల్లను :
"వినుము, పితామహ, మహాస్త్రవిత్తము లనఁగాఁ
జను నీవును నాచార్యుం
డును గలుగఁగ నాకు నెన్నఁడును వెఱ పేలా? ౨౧౫

తే. ఏను గంధర్వ కిన్నర దానవాది
దివ్యభూతంబులకును భీతిల్ల ననినఁ
బాండుపుత్రుల మాత్రకు భయము నాకు
నెక్కడిది? వేల్మిడిన వారియుక్కు మడఁతు." ౨౧౬

—: భీష్ముఁడు కౌరవసేనలో నతిరథమహారథాదుల నిరూపణంబు సేయుట :—

వ. అని పలికి మఱియు నిట్లనియె : ౨౧౭

క. "నీయందు వారియందుం
జేయం గలమానసుల విశేషంబులఁ జి
త్తాయత్తంబుగఁ జెప్పుము;
నీయెఱుఁగనియవియు లేవు నిక్కపుఁ బరముల్." ౨౧౮

క. అనవుడు, "నీ విట్లడిగిన
విని యూరక యుండఁ దగదు; విను మేర్పడ నె
ల్లను నన్నరూపు సెప్పెద
మనవారల [2]వారివారి మానము లధిపా." ౨౧౯

వ. అని గాంగేయుండు మఱియు నిట్లనియె : ౨౨౦

---

1. చేర్పు...గాసెనగాదె = చేరిన నాపరాక్రమము నీసైన్యమునకు కవచము గదా!
2. వారివారి మానములు = .. తరతమములు—కొలఁదులు.

సీ. "నీ వతిరథుఁడవు; నీ తమ్ము లందఱు
సమరథ శ్రేష్ఠులు, సమరమునకుఁ
బరుసని వీరులు, పాంచాలసేన ని
ర్జింతురు; నను నేన చెప్పికొనఁగ
నేర; నాయెడ్డెఱ మీ రెఱుంగుదురు. భో
జాగ్రణి కృతవర్మ యతిరథుండు,
దృఢవేధి; యాతండు దీర్చు నెంతటిపని
నైనఁ గైకొని. శల్యుఁ డతిరథుండు,
ఆ. వాసుదేవుతోడి యీసువాఁ, డల్లుర
విడిచె నిన్నుఁ గూడి. విక్రమమునఁ
జేరుకొనఁగఁ జాలు భూరిశ్రవుం డతి
రథుల మొదలి, యనికి రక్కసుండు. ౨౨౧

క. విను, సైంధవుఁడు మహారథుఁ,
డనిఁ బోక పెనంగు; నతని నా ద్రౌపది కై
పెను పఱఁ బఱచిరి కుంతీ
తనయులు; వారల కెదుర్పఁ దపముం జేసెన్. ౨౨౨

వ. కాంభోజరాజగు సుదక్షిణుండు సమరథుండు. ఇతనిపాల రథ బృం
దంబులు మేలుగలుగుఁ; బాండవబలంబులం గలంచు. మాహిష్మతీ
పతియగు నీలుం డతిరథుండు. ఇతనికి సహదేవునకుఁ బెగనిపగ యై
యుండు; దానం జేసి యాలంబున నోల మాసగొనండు. అవంతి
దేశాధీశులగు విందానువిందు లగ్రరథులు; పరస్పర స్నేహంబున
సాహసికు లై యొకళ్లొకళ్లం బెట్టి పోవక పోరుదురు. త్రిగర్తపతులు
దోడంబుట్టువు లేవురును మహారథులు; గోగ్రహణంబునం బడినబన్నం
బుఁ బాపికొనం గడంగుదురు; వీరికి భుజబలం బగ్గలం బై యుండు.

1. ఆలంబున నోల మాసగొనండు = సమరమున డాఁగడు — జంకఁడు.

క. సమరథుఁడు, బిరుదు, లక్షణ
కుమారకుం జేచి మొనలఁ గోత్తల సేయున్ ;
మిము నెల్ల మిగులు భుజగ
ర్వము మదముం గలఁడు ; కొనఁ డరాతుల నధిపా. ౨౨౪

వ. బృహద్బలుండు సమరథుండు ; గోసలబలంబులతోడం గడంగి చిచ్చు
నుం గరువలియునుం గొని తాఁకు. దండధారుఁడు సమరథుండు,
సేనపఱపు గలండు ; బెట్టిదంబుగాఁ గయ్యంబు సేయు. ౨౨౫

తే. అతిరథోత్తముఁ డిప్పోటియందు మేటి
కృపుఁడు ; తనపెంపువాటించి గెలుచుఁ జచ్చుఁ
గాని, నాలుగుదెఱఁగుల సేనలకును
దివియఁ డించుకయును నరదేవముఖ్య. ౨౨౬

క. శకుని, విను, సమరథుఁడు ; పాం
డుకుమారులతోడ నెప్పుడుం బగ గొని [1]వా
రికిఁ గీడ రోయు ; భృత్యులు
ప్రకటబలులు గలరు ; నేర్పు బవరంబునకున్. ౨౨౭

మ. [2]వరదివ్యాస్త్రవిదుండు, బాహుఘనుఁ, డశ్వత్థామ, గాండీవితోఁ
బురుడింపం దగువాఁడు ; వీని కెన యీభూలోకసంచారు లె
వ్వరు లే ; రీతఁడు బ్రాహ్మణుండ నని భావం బూనఁగా నోర్వమిం
దర మూహింపఁగ లేద కాని, జముచందం బయ్యెడుం బోరులన్.

సీ. అతిరథోత్తముఁడు ద్రోణాచార్యుఁ, డందలి
యిందలి విలుకాండ్ర కెల్ల గురుఁడు,
హితుఁడు నీ కెంతయు, నేర్చిన మొన లితం
డడరినఁ జమరినయట్ల మ్రందు,

---

1. వారికిఁ గీడ రోయు = కీడే వెదకుచుండును.
2. తా. ఈతఁడు బ్రాహ్మణుఁడు గాఁడను భావమూనినచో సహింపకుండుటచేత, ఇతని సామర్థ్యము ఊహింప శక్యము గాదు గాని పోరులందు యమునివంటి వాఁడే.

వృద్ధని యితని భావింప రా దనిలోన
నంగవిస్ఫురణంబుభంగి సూడ;
[1]నర్జునుపైఁ గూర్మి నతని నో నేయఁడు;
సచరాచరం బైనజగము లెల్ల
తే. నొక్కమొగ మైకడంగినఁ జిక్కువఱుచు
దివ్యబాణజాలంబుల దీటుకొలిపి;
ప్రాణములు డాఁపఁ; డీతనిపాటిదొరలఁ
గాన మేరాజ్యములయందుఁ గారవేంద్ర. ౨౨౯

క. అతిరథుఁడు బాహ్లికుఁడు, విను,
మతులితబలుఁ; [2]డితనియట్ల యాత్మజుఁడును, వి
శ్రుతశక్తి సోమదత్తుం;
డితనికి నీతనికి సమర మెన పెండిలికిన్. ౨౩౦

క. అసురవరుఁ డీహలాయుధుఁ,
డసమానబలుండు, సమరధాగ్రణి, విను, పాం
డుసుతులయెడ రోషము గలఁ;
డసంఖ్యమాయాబలమున నరులఁ గలంచున్. ౨౩౧

తే. వినుము, ప్రాగ్జ్యోతిషాధీశుఁ డనుపమాన
శక్తి, యాభగదత్తుండు సమరథుండు;
గజము నెక్కి తా నేనికకయ్యమైన
నేర్పు నైరావణముమీఁది యింద్రుఁబోలి. ౨౩౨

—: భీష్ముఁడు కర్ణుని నర్ధరథుం డని చెప్పుట. :—

వ. గాంధారరాజు లగువృషకుండును నచలుండును సమరథులు; మానిసితనంబును మానసులుం గలవారు. వీరి సమరోపాయం బజేయం బై యుండు. ౨౩౩

1. అర్జునుపై... నో నేయఁడు = ...నొవ్వ నేయఁడు.
2. ఇతనికి... పెండ్లికిన్ = ఈయబ్బ — కొడుకులకు సమరమనఁ బెండ్లికిసమానము.

సీ. నీకుఁ బెద్దగడయును నెయ్యంపుఁజెలియు నై
కయ్యంబునకు నెప్డు గాలుద్రవ్వఁ,
బాండుపుత్త్రులతోడిపగకు ని న్నెసకొల్పఁ,
గొలువున రజ్జులు వలుకు, నట్టి
రాధాసుతుం డర్ధరథుఁడు; గుండలములుఁ
గవచంబుఁ బోవుట కారణముగ
బీఱువాఱినవాఁడు; వీఱేఁడి; కృపఁ బెద్ద;
పరశురాముండు శాపమున వీని
తే. యస్త్రవీర్యంబుఁ జెఱిచె! అ ట్లగుట, వీఁడు
పార్థు మార్కొని మానంబుఁ బ్రాణములును
దనకు సొమ్ముగఁ దక్కించుకొనఁగ లేమి
యె ల్లవారికి నెంతయుఁ దెల్ల మధిప." ౨౩౪

క. అనవుడు, గురుఁ డిట్లనుఁ "గ
ర్ణునిచందము: మున్న గడఁగు; రోయఁడు పాఱన్;
విను, మేమఱి యుండుం గా
వున, నీతం డర్ధరథుఁ డవుం దలపోయన్." ౨౩౫

వ. అనిన విని, రాధేయుండు, క్రోధతామ్రాక్షుం డగుచు గాంగేయున
కి ట్లనియె: ౨౩౬

క. "[1]ఒంటమిని లేనియొంటర
మింటరములు వలుకు టుచితమే? అర్ధరథుం
డంటి నను; నేమితక్కువ
గంటి చెపుమ? దీన నీవు గన్నది గలదే! ౨౩౭

తే. నొవ్వఁ బలుకుదు సభలోనఁ, జివ్వకొల్ల
కేను గురుపతిఁ జూచి సహించి పోదు:

1. తా. సరిపడకపోవుటచే లేనినొక్కులును చిక్కులును వలుకుట ఉచితమా ?

సురనదీపుత్త్ర, విను, నాకుఁ జూడ నర్ధర
థుఁడ వగు దీవు, లావు బీరంబు నరయ." ౨౩౮

వ. అని పలికి కొలువుఁ గలయం గనుంగొని — ౨౩౯

చ. "హితుఁ డని నమ్మఁగాఁ దగునె యీతనిఁ? గార్యపుమాట లిట్టివే?
పతిదెసకూర్మి వాపుటకుఁ బట్టుగ, నెక్కువ తక్కు వంచు ను
న్నతు లగుమేదినీశులకు [1]నానగఁ బల్కుట గాక! [2]ఇట్టివా
రితవులు తండ్రికిఁ సుతుల, కేమన నేర్తుము పెద్దరాజులకా!" ౨౪౦

వ. అని దుర్యోధనుం జూచి యి ట్లనియె: ౨౪౧

ఉ. "కర్జము దప్పె, నీయెదురఁ గష్టపుమాటల కేల యోర్తు? ఈ
దుర్జనుఁ డైన శాంతనవుదోర్బల మేటిది? ఈతఁ డొక్కఁడుర్
వర్జితుఁ డైన నేమి? నృపవర్గము గుందుట యొంటఁ బాయునే?
అర్జునపక్షపాతి యితఁ, డాలము మేకొని చేయఁడుం జుమీ! ౨౪౨

తే. చాలఁ గాలంబు వోవక చతురు లైన
వృద్ధజనముల బుద్ధులు విందురి గాక,
ముదియ మతి దప్పి నోరికి నోదవినట్లు
పలుకువెడఁగుల మాటలు పాటియగునె? ౨౪౩

క. సేనమొగ మీతఁ డైనం,
బూని మహీశ్వరులు నీకుఁ బోడిచెదరే? దు
ర్మ్మాని యని కాదె యీతని
తో నడచుట కొల్ల నైతి దురమున కధిపా." ౨౪౪

వ. అనిన, భీష్ముండు సూతసూనున కి ట్లనియె: ౨౪౫

1. నానగఁ బల్కుటగాక = సిగ్గునట్లు పల్కుటయకాని. 2. ఇట్టివారితవులు... సుతులను = ఇట్లు సిగ్గుగా మాటాడువారు ఈయబ్బకు కొడుకులకు హితులు!

చ. "ముదుకఁడ నైన నాదుబలముం జలముం, వివిధాస్త్రశస్త్ర సం
పదయును, బోయి నీగురుఁడు భార్గవుచే విను! మాజిభూమి నా
కెదిరినవారు పెక్కడల నేమయిరో యెఱుఁగుం జగంబు! నా
ముదిమియు, నీకుమారుతనముం వరుసం విజయుం డెఱింగెడుం.

క. అనుమానింపక సభలో
నను నేఁ జెప్పికొన వలసె నాకిమ్మెయి! దు
ర్జనితుఁడ వగునీయెడ నీ
సున నాకిటు వలుకవలసె, సూతతనూజా! ౨౪౭

తే. కార్యమును ఖడ్గమును నింత గలుగునీవు
గలుగఁ జేటువాటిల్లె నికౌరవులకు!
దీని మముబోఁటు లెల్లను దీర్ప నెట్లు
సాలెదము? మంచిబంటవు సక్క నగుము. ౨౪౮

చ. నెపమిడి యోహాటించి యిటు నీవు దొలంగినఁ బోవ వచ్చునే?
కుపితమనస్కుఁడై నరుఁడు గూల్పఁ గ్రమంబున దొడ్డ లెల్లఁ జ
న్నపిడప, నెట్లుఁ జచ్చెదు రణంబున; నప్పుడు సావ కున్నదై
న్యపుఁబరివారముం బతియు నైన నెఱింగెద రెల్ల చందముల్." ౨౪౯

వ. అని పలికి దుర్యోధను నుపలక్షించి కర్ణుతో వెండియు: ౨౫౦

ఆ. "సూతపుత్త్రి యితఁడు నాతలఁ బెద్దమో
పెత్తి నమ్మి యున్నయిట్టిచోటఁ
గ్రిందు సేయ నాకుఁ గాదని సైరించి
యున్న బ్రిదికి; తింక నూర కుండు." ౨౫౧

వ. అని యాడి, మొగంబు గంటు వెట్టుకొనియున్న సురనదీసూను దిక్కు
మొగంబై, సుయోధనుండు 'నీకుం గోపింప నగునె? నన్నును,

1. నెపమిడి యోహాటించి = మిషపెట్టి ఒత్తిగిలి.

గార్యభారంబునకుం జూచి, నాబ్రదుకునకై సర్వంబును సహింపవలయు' నని తేర్చి, యంగరాజుం గనుంగొని 'మీరిద్దఱు నొక్కటియై భరం పడి, యిప్పని సక్కంజేసి కాక మీలోన నిట్టి యెరవుమాట లేల?' యని పొదివి పలికి, తదనంతరంబ పాండవపక్షంబువారల తారతమ్యంబులు వినువాఁడై యమ్మాట పుట్టించిన నతనికి భీష్ముం డి ట్లనియె: ౨౫౨

తే. "పాండుపుత్త్రుల యొద్దను దండిమగల
కలనిజంబేను జెప్పినఁ గర్ణుమనసు
నొచ్చు; నీచిత్త మెట్లగునో యెఱుంగ;
నాకు నిది యేమి పని, రిత్త నడుమనుండి!" ౨౫౩

వ. అనిన, మఱియు దుర్యోధనుండు దఱిమి యడుగుటయు ని ట్లనియె:

—: భీష్ముఁడు పాండవవీరులం దతిరథమహారథాదుల నిరూపించి చెప్పుట :—

తే. "అతిరథుండు యుధిష్ఠిరుం డగ్ని కల్పుఁ;
డాహవంబున నప్రతిహతుఁడు భీముఁ
డతిరథ శ్రేష్ఠుఁ; డతని మహాబలం బ
మానుషము; విక్రమం బసమాన మధిప. ౨౫౫

క. సమరథులు గవలు, భుజగ
ర్వము పటువిక్రమము దుర్నివారంబులు; వా
రిమనంబులు నిర్భయములు;
దమ మొనలకు మించి బెట్టుదాఁకుదు రధిపా. ౨౫౬

సీ. వా రందఱును ధర్మవైభవంబునఁ దప
స్సంపద నెక్కుడు జనుల కెల్ల;
[1]ధనువు నాలుంగంబులను బరిణతులు, దాఁ
కోర్తురు; పరులకు నోర్వరాని

1. ధనువు నాలుంగంబులను బరిణతులు = సంధానము, ప్రయోగము, ఉపసంహారము మొదలుగా గల అంగములతోడి ధనుఃకౌశలమున నారితేఱినవారు.

కోత్తల గలరు పెక్కుఱు, పరాక్రమములు
వేర్వేఱ చేసిన వీరు; లోక్క_
మొగ మయి తాఁకిన వెగడంద కుండునే
మన సేన ? మున్నవమానపాటు,

ఆ. దుఃఖపాటు గలిగి తోడరంగ వచ్చిన
వారు గాన నలఁతిఁ బోరు; ప్రాణ
మాసపడక యోపినంతయుఁ బెనగుదు;
రది సహించి నిలుచు టరిది మనకు! ౨౫౭

మ. [1]నరుఁ డీమానమువాఁ డనంగ వశమే నా? కంతవా రెందు నె
వ్వరు లే; రింకను బుట్ట; [2]రాపులికి దుర్వారోద్యముం డైనయా
హరియుం దోడటె, యేమి చెప్పుదు! నతం డాసేనలం గాచు, నొ
క్కరుఁడుం గీటడఁగించు నీబలములన్ గాండీవదుర్దాంతుఁ డై." ౨౫౮

వ. అనిన విని, యక్కొలువున నున్న రాజులమనంబు లెల్లను జేవ సెడియె,
భీష్ముండు వెండియు ని ట్లనియె: ౨౫౯

సీ. "ద్రౌపదేయులు మహారథు లేవురును; [3]వారి
తరమ యుత్తరుఁడును; ధరణినాథ,
యతిరథవర్యుఁ డయ్యభిమన్యుఁ, డర్జున
వాసుదేవుల కెన వచ్చువాఁడు;
లఘుచిత్రములు నేర్చు; లావును దాల్మియుఁ
గలఁడు; తండ్రులపాటు దలఁచుచుండుఁ
గావున, బెడిదంబుగాఁ బోరు. సాత్యకి
యతిరథోత్తముఁడు, శౌర్యాన్వితుండు

---

1. అర్జునుఁడు ఈపాటిసమర్థుఁడని నాకుఁ జెప్పవశమా? 2. ఆపులికి...యాహరియుం దోడటె = అయ్యర్జునుఁడను పులికి అక్కృష్ణుఁడను సింహము తోడుగదా! (నరునిఁ బులిగాఁ జెప్పి 'హరి' అనుటచే సింహముధ్వని. 3. వారితరమ యుత్తరుఁడును = ఉత్తరుఁడును వారికి సమానుఁడే.

తే. పాండవస్నేహాసక్తుఁ డైయుండుఁ గాన,
నలుక మనమీఁదఁ బెద్దయుఁ గలిగి పెనఁగు ;
వీర లిరువురుఁ బరుసనివారు, సమర
వరుల నొప్పింతు రీయోధవరుల నెల్ల. ౨౬౦

మ. అలఁతిం బోరు మహారథుల్ ద్రుపద మత్స్యాధీశు ; లుద్యద్భుజా
బలశౌర్యాఢ్యులు ; పాండురాజసుత సంబంధ ప్రియస్నేహముల్
గలిమిం జేసి, తదీయ దైన్యమునకుం గా నొచ్చియుం జచ్చియుర్,
గెలిపింపం దమకించి చొత్తు రని కేకీభూతచేతస్కు లై. ౨౬౧

ఆ. వీరగుణము బలము వేఁకయుఁ గలఁడు మ
హారథుఁడు శిఖండి ; యతనితమ్ముఁ
డతిరథుండు దర్పయుతుఁడు ధృష్టద్యుమ్నుఁ
డుగ్రతేజుఁ ; డనికి నుగ్రినట్ల. ౨౬౨

క. అతనిసుతుఁ డర్ధ రథుఁ డా
ధృతవర్ముఁడు : పిన్ననాఁడు త్రిమ్మటకాఁ డై
మతిహీనత శస్త్రాస్త్ర
ప్రతతిపరిశ్రమము లేక పాలసుఁ డగుటర్. ౨౬౩

ఆ. చేదిభూవిభుండు శిశుపాలతనయుండు
ధృష్టకేతుఁ డధికధీరమతి, మ
హారథుండు. భోజుఁ డజుఁ డనురాజులు
నట్టివార , తెంపు నలవుఁ గలరు. ౨౬౪

వ. ఉత్తమౌజుండును యుధామన్యుండును క్షత్రదేవుండును జయంతుం
డును నమితౌజుండును విరాటుండును సత్యజితుండును ననం బరఁగు
పాంచాల కులప్రదీపకులు మహారథులు ; మత్తమాతంగ బృందంబు
చందమునం బ్రతిబలంబుపయిం గవిసి కోలాహల బహుళంబుగాఁ
గలంపంజాలుదురు. కేకయపతు లేవురు సహోదరులు మహారథులు,

గడిందిమగలు; గెంపురథంబుల మొత్తంబులతోఁ గార్చిచ్చు పగిదిం బొదువుదురు. కాశీశుండు నీలుండు సూర్యదత్తుండు మదిరాశ్వుండు శంఖుండు విరాటజ్ఞాతులు మహారథులు, వివిధాయుధ విద్యావిశారదులు; వారి పోరు భరంబై యుండు. ౨౬౫

సీ. చిత్రాయుధుండును జేకితానుండు మ
హారథు లిద్దఱు, నర్జునునకుఁ
గూర్తురు; కయ్యాన కోర్తురు; నేర్తు రా
యుధముల కెల్ల: సత్యాగ్రు లవ్వి
ధమువార చంద్రదత్త వ్యాఘ్రదత్తులు.
వినుము, సేనాబిందుఁ డనఁ నృపాలు
డతిరథోత్తముఁడు: మారుతపుత్రునెస
యతం డొక్కరుండును. వారియుబి దిలావు:

ఆ. పాండ్యుఁ డతిరథుండు, బలఁగంబుగలవాఁడు.
సమరథుండు గాశ్యుఁ డమితబలుఁడు.
కుంతిభోజుఁ డాజికోవిదుఁ, డతిరథుం;
డతనియొద్ది జోదు లధికబలులు. ౨౬౬

వ. రోచమానుండు మహారథుండు; దేవసమానుండు — ౨౬౭

తే. అతిరథుల కెల్లఁ దల, దండిరియట్టివాఁడ,
యసురవిభుఁడు ఘటోత్కచుం డాహిడింబ
కొడుకు; మాయాబలంబున నోడుచుఁ బగిలి;
నతనికడ దానవానీక మగ్గలంబు. ౨౬౮

వ. తోఁచినవారిం బేరుకొంటి. ఇంతియకాని రెండువీళ్లను మంచిమగలు పెక్కండ్రు గల"రని చెప్పి గాంగేయుండు — ౨౬౯

క. "పాండవులదిక్కువీరు ల
ఖండితబలు లైన, నామొగంబునఁ బడ్డి యు

ద్దండత చూపఁగ లేరు; శిఖండిని
నొక్కరునిఁ జంపఁ గాని, కుమారా!" ౨౭౦

క. అనవుడు దుర్యోధనుఁ 'డా
తని మీరు వధింపమికిఁ గతం బేమి యొకో?
వినఁ దగునేనిం జెపుఁడా'
యనుటయు, ని ట్లనియె భీష్ముఁ డతనికి నెమ్మిన్. ౨౭౧

వ. "ఏ నాశిఖండిని జంపమికి మూలంబు సాలం గలదు; తత్ప్రపంచం బం
తయు వివరించెద నాకర్ణింపుము. ౨౭౨

—: భీష్ముఁడు దుర్యోధనున కంబోపాఖ్యానంబు సెప్పుట :—

సీ. శంతనుపిమ్మట, సత్యవతీదేవి
యనుమతితోడఁ, జిత్రాంగదునకు
సామ్రాజ్యపట్టంబు సమ్మతిఁ గట్టితి;
నల్పకాలంబున నతఁడు దీఱె.
తత్పరోక్షావస్థఁ దదనుసంభవుని వి
చిత్రవీర్యుని రాజుఁ జేసి, పెండ్లి
సేయంగఁ దివిరి, కాశీపతికూఁతులు
కన్యలు మువ్వురు గలుగుటయును,
తే. నాతఁ డర్థి దదీయస్వయంవరమున
కఖిలనృపతులఁ బిలిపించె ననియు నెఱిఁగి,
తల్లి కెఱిఁగించి, యొంటిమై దత్పురమున
కాయితంబయి పోయితి నరద మెక్కి. ౨౭౩

వ. ఇవ్విధంబునం జని, యమ్మహోత్సవంబున నలంకృత లై యున్న
యంబయు నంబికయు నంబాలికయు ననుముద్దియల మువ్వురం బట్టి
రథంబుపయిఁ బెట్టికొని రా, నచ్చటిరాజు లెల్లను జతురంగబలంబు
లతోవచ్చి నన్నుం బొదివిరి. పటువిశిఖానల శిఖాకలాపంబున వేఁడిమి

చూపి, వారి నిలువరించి యరుగుదెంచి సత్యవతికి నప్పొలంతుల
నొప్పించితి. అద్దేవి, విచిత్రవీర్యునకు వారల వివాహంబు సేయ
నుద్యోగించె. అట్టియెడ నమ్ముగ్ధపుత్రికలయందుం బెద్దయదియైన యంబ
యనుకన్యక నాతో ని ట్లనియె: ౨౬౪

తే. 'సౌభపురవల్లభుండైన సాళ్వుమీఁదఁ
దలఁపుగలదునా; కతఁడును దగులు గలిగి
యుండు నాదెస; నీవు ధర్మోత్తరుండ;
వతనిపాలికిఁ దగ నన్ను ననుపవయ్య.' ౨౬౫

క. అన విని సత్యవతికిఁ జె
ప్పిన, నాయమ ననుప, నంబఁ బెంపుగ వృద్ధాం
గనలం దోడుగ నప్పుడ
పనిచి యనిచితిని జనంబు ప్రస్తుతి సేయన్.  ౨౬౬

వ. ఇట్లు పనిచి తక్కినకన్నెల నిరువురం బాణిగ్రహణంబు సేయించితి.

క. అంబయు నట సాళ్వునికడ
కుం బోయిన, నతఁడు, '[1]భీష్ముఁకొనిపోయినదా
నిం బరచుం గైకొన ధ
ర్మం బే? కన్యాత్వ మెడలె, మగువా, నీకున్. ౨౬౮

వ. ఇంక నిన్ను భార్యఁ గా వరియింపం దగునె?' యనినఁ, గామశరపీడిత
యగుచు నక్కామిని యతని కి ట్లనియె: ౨౬౯

తే. 'తమ్మునికిఁ గాఁగ భీష్ముఁ డుదగ్రవృత్తిఁ
గన్నియలఁ గొనిపోయెడుఁ గాన, బలిమి
నన్నుఁ గొనిపోయె; నాచేత నిన్ను వినిన
యపుడె పుత్తెంచె, దూషింప ననఘ, తగునె? ౨౭౦

---

1. భీష్ము...బరచున్ = బలిదెగిపోయిన — పరుఁడెత్తికొనిపోయిన — దానిని.

వ. మాతండ్రి యెఱుంగక స్వయంవరాలంకారంబు నాకుం జేయించిన
కతంబున నింత పుట్టె. భీష్ముండు నా చెలియండ్రం దనతమ్మున కిచ్చి
నన్ను నీకడకుం దగ ననిచె; దీన నేమితప్పు?' అని మఱియు ననేక
ప్రకారంబులం బలికిన వినక, తన్నుం జేకొనక, సాళ్వుండు— ౨౮౧

క. కరుణంబుగ నేడ్చుతలో
దరిఁ 'బో పొమ్మిచట నింకఁ దడయకు' మని మం
దిరము వెడలంగ నడిచిన,
సరిగ నదియు నార్తచిత్తయై వికలగతిన్. ౨౮౨

వ. చని చని యవ్వేలంది యిట్లని వితర్కించు: ౨౮౩

తే. 'సాళ్వునకుఁ గానియపుడ సంసారమునకుఁ
బాసితిన! ఇంక భీష్మునిపాలి కేల
యరుగ? ఆతండు మూఁడు మోహాని కెల్లఁ;
గాన, నాతని సాధింతుఁగాక యేను! ౨౮౪

క. గాంగేయు గెల్వ నెవ్వరి
కిం గొలఁదియె? తపము పేర్మి గెలిచెదఁ గా' కం
చుం గాంత సనియె సంయమి
పుంగవు లొకకొండ నున్న పుణ్యస్థలికిన్. ౨౮౫

వ. చని వారలకుం దనవృత్తాంతం బెఱింగించె. వారు 'ఇది రాజులు సేసిన
పని; సాధులచేతఁ జక్కంబడునే?' యనిన, నవ్వనిత 'తపశ్చరణంబు
నకు వచ్చితి' ననుటయు, 'నీవు సుకుమారవు; నీ కిది సొప్పడునే?
తండ్రిపాలికిం బొమ్ము. ఇదియ పరమధర్మంబు' అని పలికిన వారి
కన్నారీరత్నం బిట్లనియె: ౨౮౬

క. 'ఎవ్వరు నెఱుఁగక యుండఁగ
నివ్వనమునఁ దపము సేఁత యిది నిర్ణయ; మే
నెవ్వారికడకు నే మని
యెవ్విధిఁ బో నేర్చుదాన, నేఁటికి బంధుల్?' ౨౮౭

వ. అని చెప్పునవసరంబున నయ్యాశ్రమంబునకు హోత్రవాహనుం డను రాజర్షి వచ్చె. అమ్మును లభ్యాగతపూజలు సేసినయనంతరంబ, యంబం గనుంగొని 'యిక్కన్నియ యెక్కడిది? దీని విషాదంబునకుం గారణం బేమి?' అని యడిగి, వారివలన దానిజన్మ ప్రకారంబును దద్వృత్తాంతంబును విని, తనకూఁతు కూఁతు రగుట యెఱింగి, యయ్యంగన వినం దపస్విజనంబులకుం జెప్పి యప్పొలంతిం దనయంక తలంబున నునిచికొని వెండియు నడుగ, నవిస్తరంబుగా నచ్చేడియ సెప్పిన విని, శోకించి యవ్విషమప్రకారంబునకు నిస్తారంబుఁ జింతించి

ఉ. 'నీ కిది యేటికిం దప, మనింద్యచరిత్రవు నీవు, నిన్ను నేఁ
జేకొని కాతు; నొక్కగతిఁ జెప్పెద, భార్గవరాము నాశ్రిత
శ్రీకరుఁ గాన్పు; మాపదలు సెందఁగ నీఁ డతఁ డాశ్రయించినన్;
శోకము దక్కు' మన్న, విని సుందరి యల్లన య త్తపస్వితోన్—

ఆ. 'పరశురాముఁ గానఁ బడయుట యెక్కడఁ
గలుగు? ఆతఁ డెట్లు కరుణసేయు
ననఁ, దపస్వి యిట్టులను: 'మహేంద్రం బను
పర్వతమునఁ జేయుఁ బరమతపము. ౨౯౦

వ. నన్ను మన్నించుం గావున, మదీయదౌహిత్రి వగుట యెఱింగిన నిన్ను రక్షించు. అందు బో' మ్మనుసమయంబునం బరశురామ శిష్యుండగు నకృతవ్రణుం డనుమునివచ్చి, యతిథిసత్కారంబులం బూజితుం డై యున్నఁ, బ్రియపూర్వకంబుగా నా హోత్రవాహనుండు, 'భార్గవుం డెయ్యెడ నున్నవాఁ' డని యడిగిన, నతం డిట్లనియె: ౨౯౧

క. 'తన ప్రియసఖుఁడవు నీ వని
మునిజనులకుఁ జెప్పు చుండు ముదమున; నిన్నుం
గనుఁగొనఁగ నెల్లి యిచటికిఁ
జనుదెంచు; ననేక శిష్యసంఘముతోడన్. ౨౯౨

వ. మాతండ్రి యెఱుంగక స్వయంవరాలంకారంబు నాకుం జేయించిన
కతంబున నింత పుట్టె. భీష్ముండు నాచెలియండ్రిం దనతమ్మున కిచ్చి
నన్ను నీకడకుం దగ ననిచె; దీన నేమితప్పు?' అని మఱియు ననేక
ప్రకారంబులం బలికిన వినక, తన్నుం జేకొనక, సాళ్వుండు— ౨౮౧

క. కరుణంబుగ నేడ్చుతలో
దరిఁ 'బో పొమ్మిచట నింకఁ దడయకు' మని మం
దిరము వెడలంగ నడిచిన,
నరిగె నదియు నార్తచిత్త యై వికలగతిన్. ౨౮౨

వ. చని చని యవ్వేలంది యి ట్లని వితర్కించు: ౨౮౩

తే. 'సాళ్వునకుఁ గానియపుడ సంసారమునకుఁ
బాసితిన! ఇంక భీష్మునిపాలి కేల
యరుగ? ఆతండు మూల మీహానికెల్లఁ;
గాన, నాతని సాధింతుఁగాక యేను! ౨౮౪

క. గాంగేయు గెల్వ నెవ్వరి
కిం గోలఁదియె? తపము పేర్మి గెలిచెదఁ గా' కం
చుం గాంత సనియె సంయమి
పుంగవు లొాకకొండ ఉన్న పుణ్యస్థలికిన్. ౨౮౫.

వ. చని వారలకుం దనవృత్తాంతం బెఱింగించె. వారు 'ఇదిరాజులు సేసిన
పని; సాధులచేతఁ జక్కంబడునే?' యనిన, నవ్వనిత 'తపశ్చరణంబు
నకు వచ్చితి' ననుటయు, 'నీవు సుకుమారవు; నీ కిది సొప్పడునే?
తండ్రిపాలికిం బొమ్ము. ఇదియ పరమధర్మంబు' అని పలికిన, వారి
కన్నారీరత్నం బి ట్లనియె: ౨౮౬

క. 'ఎవ్వరు నెఱుఁగక యుండఁగ
నివ్వనమునఁ దపము సేఁత యిది నిర్ణయ; మే
నెవ్వారికడకు నే మని
యెవ్విధిఁ బో నేర్చుదాన, నేటికి బంధుల్?' ౨౮౭

వ. అని చెప్పునవసరంబున నయ్యాశ్రమంబునకు హోత్రవాహనుం డను రాజర్షి వచ్చె. అమ్మునుఁ డభ్యాగతపూజలు సేసినయనంతరంబ, యంబం గనుంగొని 'యిక్కన్నియ యెక్కడిది? దీని విషాదంబునకుం గారణం బేమి?' అని యడిగి, వారివలన దానిజన్మ ప్రకారంబును దద్వృత్తాంతంబును విని, తనకూఁతు కూఁతు రగుట యెఱింగి, యయ్యంగన వినం దపస్విజనంబులకుం జెప్పి యప్పొలంతిం దనయంక తలంబున నునిచికొని వెండియు నడుగ, నవిస్తరంబుగా నచ్చేడియ సెప్పిన విని, శోకించి యవ్విషమప్రకారంబునకు నిస్తారంబుఁ జింతించి

ఉ. 'నీ కిది యేటికిం దప, మనింద్యచరిత్రవు నీవు, నిన్ను నేఁ
జేకొని కాతు; నొక్కగతిఁ జెప్పెద, భార్గవరాము నాశ్రిత
శ్రీకరుఁ గాను; మాపదలు సెందఁగ నీఁ డతఁ డాశ్రయించినన్;
శోకము దక్కు' మన్న, విని సుందరి యల్లన యత్తపస్వితోన్—

ఆ. 'పరశురాముఁ గానఁ బడయుట యెక్కడఁ
గలుగు? ఆతఁ డెట్లు కరుణసేయు
ననఁ, దపస్వి యిట్టులను: 'మహేంద్రం బను
పర్వతమునఁ జేయుఁ బరమతపము. ౨౮౦

వ. నన్ను మన్నించుం గావున, మదీయదౌహిత్రి వగుట యెఱింగిన నిన్ను రక్షించు. అందుఁ బో' మ్మనుసమయంబునం బరశురామ శిష్యుండగు నకృతవ్రణుం డనుమునివచ్చి, యతిథిసత్కారంబులం బూజితుం డై యున్నఁ, బ్రియపూర్వకంబుగా నా హోత్రవాహనుండు, 'భార్గవుం డెయ్యెడ నున్నవాఁ' డని యడిగిన, నతం డిట్లనియె: ౨౮౧

క. 'తన ప్రియసఖుఁడవు నీ వని
మునిజనులకుఁ జెప్పు చుండు ముదమున; నిన్నుం
గనుఁగొనఁగ నెల్లి యిచటికిఁ
జనుదెంచు; ననేక శిష్యసంఘముతోడన్. ౨౮౨

తే. అనిన, విని యెల్లవారును నధికహర్ష
మెసఁగ నున్నంత, మఱునాఁడ యేఁగుదెంచె
భార్గవుండు; దమ్మునీంద్రులు పరమభక్తి
నర్చ లిచ్చిరి; హోత్రవాహనుఁడుఁ గనియె. ౨౯౩

వ. కని, పరశురాముని సంభావనంబును సంభాషణంబును బడసి, కాశి రాజుకన్యకం జూపి, 'యిదినాదౌహిత్రి దీనివృత్తాంతం బంతయు విను' మని యమ్మౌని నిం గానిపించిన, నదియును — ౨౯౪

చ. కనుఁగవ నశ్రుధార లొలుకం జరణానత యైన, రాముఁ డి
ట్లను: 'విను, హోత్రవాహనునియట్టుల యేను నీకు; నీమనం
బునఁ గలచింత యంతయును బుచ్చెద. నాకడఁ జేరి, తింక నీ
వనటుఁ దొలంగఁ బెట్టి గరువంబుగఁ జెప్పుము దీని మూలమున్.'

వ. అనిన విని, యమ్మహాత్మునకు నంబ తనవృత్తాంతం బంతయు సవిస్తరంబుగాఁ జెప్పి, 'నీ వార్తశరణ్యుండవు; నాపరిభవంబుదీర్చి నన్ను రక్షింపు' మనవుడు, నతం డి ట్లనియె: ౨౯౬

క. 'పరిభవము రెండుదెఱఁగులఁ,
దరుణీ, తోఁచినది. సాళ్వుఁదగఁ దేర్తునా? యు
ద్ధురుఁ డగుభీష్ముని దేర్తునా?
శరము ప్రియం బెద్దిహృదయగతముం జెపుమా!' ౨౯౭

చ. అనవుడు, నింతి యి ట్లను: 'మహాపురుషా, నను సాళ్వుఁ డింకఁ గైకొనఁ; డది సాలు. భీష్ముదెసఁ గోపము నామదిఁ గల్గి యుండు. ఆతని వధియింపఁ బూని యిటు తాపసవృత్తికి వచ్చి యిచ్చటన్ నినుఁ గని యీపరాభవము నీఁగఁగ నీశరణంబుఁ జొచ్చితిన్.' ౨౯౮

తే. అనిన, 'నాచెప్పినట్ల గంగాత్మజుండు
సేయుఁ; జేయడే తక్కిన శితశరముల
నతనిఁ బడవైతు; నాఁడు మబల, నీకుఁ
దపము సేయంగ నేటికిఁ దనువు డయ్యె?' ౨౯౯

—: పరశురాముఁ డంబం దోడుకొని భీష్మునియొద్దకు వచ్చుట :—

క. అని పలికి, పరశురాముఁడు
సనుదెంచెను మునిజనంబు సమ్మోదమునఁ దోఁ
జనుదేరఁ గురుక్షేత్రం
బున కుద్ధతిఁ గాశిరాజపుత్రిం గొనుచున్. 300

వ. వచ్చి సరస్వతీ తీరంబున విడిసి, తనరాక నాకెఱింగించిన, నేను ఋత్విక్పురోహిత ప్రభృతి విశిష్టబ్రాహ్మణ సమేతంబుగాఁ బూజాద్రవ్యంబులు గొని తత్ప్రదేశంబున కరిగిన, నమ్మహాత్ముండును, మదీయ భక్తివినయ సంభ్రమంబులు సంప్రీతి నభినందించి యర్చనలు గైకొని, కాశిరాజు కన్యకం జూపి నాతో ని ట్లనియె : 30౧

తే. 'బలిమి ము న్నీల తెచ్చి తిప్పడఁతి ? మగుడఁ
ద్రోచి పుచ్చంగఁ దగునయ్య ? నీచవృత్తి
వచ్చె, దీనిఁ దమ్మునికి వివాహ మింక
నైనఁ జేయుము ; చెఱుచుట యనుచితంబు.' 30౨

క. అనుటయు ననఘా, తెలియన్
విను ; మిది నాతోడ 'సాళ్వవిభునకు నేఁ గూ
ర్చినదాన. అతని పాలికి
ననుపుము న' న్ననినఁ గాదె యనిచితి మగుడన్ ? 303

తే. ఇంక నాతమ్మునికి దీని నెట్లు పెండ్లి
సేయ నేరుతు ? ' ననుడు, 'నాచెప్పినట్లు
సేయ వైతేని నిన్ను నీచెలులఁ జుట్ట
ములను జంపుదు ' ననియె నమ్మునివరుండు. 30౪

వ. ఏను వినయంబు వదలక వినతుండ నగుచు వివిధవాక్యంబులం దెలుప నంత కంతకు నతనికిఁ గోపం బగ్గలం బైన, వెండియు — 30౫

ఆ. 'గురుఁడ వై సమగ్ర కోదండ విద్యామ
హాస్త్ర మిచ్చినాఁడ ; వలుగఁ దగునె
కారణంబు లేక యీరస మెత్తి యి ?'
ట్లనినఁ, బరశురాముఁ డాగ్రహమున — ౩౦౬

మ. 'గురుఁ డని నన్నెఱుంగు, దనఘుండవు ; నావచనంబునం దనా
దరణము సేసి ; తెన్నియొ విధంబులఁ బల్కెదు భక్తితోడ ! నీ
వెరవులు దక్కె, మీయబల వేగమ పెండిలి సేయు, మంతతో
మరలు మదీయకోపశిఖ ; మానదు వేఱొక వేయుఁ జేసినన్.' ౩౦౭

వ. అనిన విని, 'ధర్మాచరణంబున కింత పట్టి పెనంగ నగునె ? పరాను
రక్తచిత్తయగు మగువ నిల్లాలిం జేయువారుం గలరె ! ఇట్టి యకృత్యం
బాచరించుటకంటె నీచేత నెట్లయిననులెస్స. తొల్లి పెద్దలు సెప్పిన
చొప్పవధరింపు' మని యి ట్లంటి : ౩౦౮

తే. 'గర్వియై కార్య మిట్టి, దకార్య మిట్టి
దని యెఱుంగక, లోకంబు చనుపథమునఁ
దిరుగ, కున్మదవృత్తి వర్తించునట్టి
వాని గురు నైన దండింపవలయు నండ్రు.' ౩౦౯

క. అనుమాటకుఁ గాలానల
మునుబోలెను మండి 'కయ్యమున కాయిత మై
మొన లేర్చి వేగ యిచటికిఁ
జనుదె' మ్మని భార్గవుండు సంరంభమునన్. ౩౧౦

వ. పలికిన, నేనును— ౩౧౧

క. 'అలుకఁదనంబున విప్రున
కలుగంగాఁ దగదు ? గురుఁడు నై యున్నాఁ డం
చలయక తలఁచితిఁ గా, కిటు
నిలుమీ నీరణము సేఁత నిజమగునేనిన్. ౩౧౨

క. క్షత్రియులఁ ద్రొల్లియలుకకుఁ
బాత్రము సేసితట! నాఁడు బలియుఁడు గంగా
పుత్త్రుఁడు పుట్టమిఁ గా, కిది
యీతఁడు నిం కేల చెల్లు? ఎఱుఁగవె నన్నున్? ౩౧౩

క. ఏ నొకరుండన వచ్చెదఁ
గాని బలము దేను? నీదు గఱపిన శస్త్రా
స్త్రానేకవిధవిలాసము
దాన వలయు నేన గాదె తథ్యం బరయన్.' ౩౧౪

వ. అని పలికి యతనికిం బ్రణమిల్లి, చనుదెంచి సత్యవతి కింతయు విన్న
వించి, యద్దేవి యనుమతి వడసి, సర్వసన్నాహసమేతం బగురథం
బెక్కి, విప్రాశీర్వాదంబులు సెలంగ వెడలి వచ్చి, కురుక్షేత్రంబుఁ
దఱియం జనునెడ, భాగీరథి భామినీరూపంబున నరుగుదెంచి తన్నెఱిం
గించి, మదీయభక్తి నభినందించి, యే నాయితంబై పోవుటకుఁ గార
ణం బడిగి, నాచేత నత్తెఱం గెఱింగినదియై, నన్నుం గినిసి, భార్గవు
పాలికిం జని, 'నీశిష్యుండు నిరపరాధుండు. నా కొడుకున కలుగం
దగునే?' యనిచెప్పి, [1]యతనియందుఁ బిక్కగానక మగుడ నేతెంచి,
నావలనను మొత్తంబాటు లేకున్నం జనియె. అప్పుడు సిద్ధవిద్యా
ధరమునిగణంబులు గౌతుకంబునం గనుంగొనుచుండ, నేను జమదగ్ని
తనయున కనతిదూరంబునం దేరు డిగి వినతుండనై నిలిచి, 'నీవు
భూచారివై యున్నవాఁడవు. రథికుండనై ననాకు నీతోడ సమరంబు
సేయ నగునే!' యనిన యనంతరంబ యతండు దివ్యంబు లగురథ
రథ్యంబులు శస్త్రాస్త్రంబులునుం గలిగి, యకృతవ్రణుండు సారథిగా
సమరసన్నద్ధుండై తోఁచినం జూచి, రథారోహణంబు సేసి, శం
ఖంబు పూరించి, గుణంబు సారించి, సూతు నగ్గించి, తనకు నమస్క
రించి కడంగిన, నప్పరశురామదేవుండు — ౩౧౫

---

1. అతనియందుఁ బిక్కగానక = పెనుదివిరియుట గానక.

—: భీష్ముండు పరశురామునితో యుద్ధంబు సేయుట. :—

క. శరవర్షము నామీఁదం
గురిసిన, నే నాకసమునఁ గుదియించితి: నా
యరదంబు పొంతకును న
చ్చెరువుగ నొకబాణ మైనఁ జేరక యుండన్. ౩౦౬

క. ఒక మొగి నలువదియమ్ములఁ
బ్రకటబలుం డైనపరశురాముఁడు నాయం
గకములు డాఁకఁగ, [1]నశ్వ
ప్రకరము నో నాట, సూతుపైఁ బడ నేసెన్. ౩౦౭

క. దానికి నవ్వుచు, వేగం
బే నొకభల్లంబు దొడిగి యేసితి సాంద్ర
జ్యానాదభరితరోదసి యైన
తదీయోగ్రచాప మఱిమునిఁ దునియన్. ౩౦౮

ఉ. ఒండొకవిల్లు పుచ్చికొని, యుజ్జ్వలరోషమహోనలార్చు లొం
డొండ మొగంబుపై నెగయ, నుర్వి చలింప, గుణధ్వనిన్ సము
ద్దండతఁ దీవ్రమార్గణశతంబున నాయరదంబు ముంచె రా
ముండు; వియచ్చరప్రకరముల్ వెఱఁ గందుచుఁ బ్రస్తుతింపఁగన్

క. ఉఱక మదీయాంగంబులు
గిఱికొన న ల్లొయుటయును, గినుక గదిరినన్
మెఱుఁ గారునారసమ్ములు
దఱచుగ నించితిఁ గడంగి తద్గాత్రమునన్. ౩౧౦

---

1. అశ్వప్రకరము నోనాట = గుఱ్ఱపుజంట నొవ్వ నాటఁగా.

నాటు రూ. నాడు (దే. అ. క్రి.) క్రుచ్చుకొను (అం. ప్రే.) గ్రుచ్చు (దే. వి.) నాటు = (గ్రుచ్చుట) నాడు=(దే వి.) దేశము, జనపదము. నాడు (దే. అ. క్రి.) నాటు.

ప్రి: 'తోడన హయ సూతుల నో । నాడఁగ నేయుటయు నతఁడునలిగి కడఁకన్ విల్
గీఁడియపోలెన్ గొని సెయి । నాడఁగ నిగిడించెఁ ద్రిదళ నారాచంబుల్.

కర్ణ. ౮. ౨

తే. [1]ఉచ్చిపోయిన యేటుల నొలుకుశోణి
తమున సర్వాంగకంబులుఁ దడిసి యొప్పెఁ—
జిగురుఁ గలచునఁ గెంజాయ మిగిలిచెలువు
వడయుకొ్రమ్మావిచాడ్పున భార్గవుండు. 3_౨౧

క. నెత్తురు వడిసిన మూర్ధా
యత్తుం డై సొగయుటయును, నాతనిఁ గని [2]యు
ద్వృత్తక్షత్రియధర్మో
పాత్తం బగు తేజ మొల్లఁబా టై తోఁచెన్. 3_౨౨

వ. అప్పుడు మనంబున నన్నే నేన గర్వించుకొను చుండితి. 3_౨౩

ఆ. అంతఁ దెలిసి రాముఁ డతికుపితాత్ముఁ డై,
యేటువాటు తెంచునెసక మెసఁగ,
నప్రమేయశరము లడరించె; నవి సత్వ
రముగ నేను బ్రతిహతములు సేసి — 3_౨౪

క. మరుదస్త్ర మేయ, గుహ్యక
శరమున వారించె నతఁడు; సరభసముగ ను
ద్ధురశిఖిబాణం బేసిన,
గురుఁడు వరుణవిశిఖనిహతిఁ గుదియం జేసెన్. 3_౨౫

క. ఇమ్మెయి నతఁడును దివ్యా
స్త్రమ్ములు నామీఁద నేయ, రయమునఁ బ్రతిఘా
త మ్మొనరించితి; దివిజగ
ణ మ్మంబరవీథిఁ గీర్తన మ్మొనరింపన్. 3_౨౬

---

1. ఉచ్చిపోయిన...శోణితమున = దూటిపోయిన అలుగుపోటువలనఁగాఱు నెత్తురుచే.
2. యుద్వృత్త...తోఁచెన్ = గర్వముఁ బెంచు క్షత్రియ ధర్మావలంబనము వెగ టై తోఁచెను. ఒల్లఁబాటు =(ద్వ. వి. ఒల్లమి + పాటు) అనపేక్షితము, అనిష్టము, వెగటు.
ప్ర: 'ప్రాణములు నగ్గములు నొల్లఁబాటుసేసి'—భీష్మ. ఆ. ౧.

తే. రాముఁ డంత్యకాలానలోద్దామలీల
మండి, నాయురస్థస్థలి యొక్కమార్గణమున
నేసె: నంతంత నున్నమునీశ్వరులును,
గాశిరాజుకన్యకయును గడఁగి యార్వ. ౩౨౭

క. ఆ నిశితాస్త్రం బెయ్యది
యో నాకుం దెలియ! దది మహోగ్రత నాటం
గా నొచ్చిపడితి నరదము
పై; నప్పుడు సూతుఁ డచటు వాపె రథంబున్. ౩౨౮

తే. చేతనుఁడ నయి యేను మత్సూతుఁ గినిసి,
రాముఁ డున్నెడ కప్పుడు గ్రమ్మఱంగ
రథముఁ దోలించి, బాణపరంపరాని
మగ్నుఁ జేసితి; నంబనెమ్మనము దలఁక. ౩౨౯

వ. ఇట్లు బహుప్రకారంబులం బోరుచుఁ, బ్రొద్దు గ్రుంకినప్పుడు రణం
బుపసంహరించుచు, రేపకడ దొడంగుచుం బెనంగ, నిరువది రెండు
దివసంబులు చెల్లిన మఱునాఁటి కయ్యంబున నేనునుం గడంగి — ౩౩౦

క. కడుబెట్టిదముగఁ గదియం
బడి, హయములు నొవ్వ, ధనువు భగ్నంబుగఁ, జే
డ్పడి సారథి దెరలఁగఁ, దన
యొడలు సిరుఁగ నేసినను, మహోద్ధతి గురుఁడున్— ౩౩౧

క. ఒకశక్తి వైవ నఱికితి;
నకుటిలముగ శక్తిదశక మడరించిన, స్రు
క్కక త్రుంచితి; బహుశక్తుల
నికరము పరఁగించినం, దునిమితిం బెలుచన్. ౩౩౨

క. విస్మయము నొందు భార్గవు
నస్మత్కర మపుడు లాఘవారూఢముగా

సస్మితుం డగుచుం బటుదీ
ప్తిస్మ్మె రాస్త్రముల నేసితిం బరవశుఁ గాఁగ. 333

వ. ఇట్లతండు మూర్ఛిల్లిన మునిజనంబులును నంబయు నధికశోకసమాకు
లత్వంబునొంది హాహాకారంబులు సెలంగఁ బొదివిరి. అంత— 334

ఆ. తెలిసి భార్గవుండు దృఢతీవ్రనారాచ
పంక్తి గురిసి, నన్నుఁ బారవశ్య
మంది నేల కొఱగునట్లుగాఁ జేసి, మ
త్స్నాతుమస్తకంబుఁ దునియ నేసె.

వ. అట్టియెడ నెనమండ్రు విప్రులు, సమానవయోరూపంబుల నొప్పు
వారలు న న్నెత్తి నేడదేర్చి రథంబుపయిం బెట్టి, గగన గమనంబునం
బోయిరి. అంతకు మున్న మందాకిని మున్ను నాకన్నచందంబున
నొగలపయి నుండి మదీయరథ్యంబుల పగ్గంబులు ధరియించి యున్న
యది. ఏనునుం గనుంగొని నమస్కరించిన దీవించి చనియె. వెండియు

క. సారథ్యంబును జేయుచు,
ధీరత వాటించి రామదేవునితోడం
గ్రూరాస్త్రంబులఁ జతుర వి
హారం బొనరించితిని, సురావలి వొగడఁగ. 335

—: భీష్మునకు వసువులు స్వప్నసాక్షాత్కారంబున మోహనాస్త్రం బిచ్చుట. :—

వ. ఇవ్విధంబునం బోరి, సూర్యాస్తమయం బగుటయు నెప్పటియట్లచని,
యే నారాత్రి యేకాంతంబున దర్భశయనంబున నుండి, సుర భూసుర
వర్గంబులం దలంచి భక్తిం బ్రణామంబులు నేసి, 'పరశురాముని
జయింప రా దయ్యెడు దినంబులు పెక్కులు సనియె. అతని నాజి
జయించుట గలుగునేని మీరు నాకుం దోఁచి యూఱడింపవలయు'
నని ప్రార్థించి నిద్రించు చుండం, బవలు న న్నెత్తి రథంబు పయిం
బెట్టిన యెనమండ్రనుం బ్రభాతసమయంబునం గలలోన వచ్చి—

తే. 'నీవు నేమును నొక్కటి; నీకు వెఱవ
నేల? గాంగేయ, రాము జయించునట్టి
శరము సుమ్మని మోహనాస్త్రంబు నాకు
నిచ్చి పోయిరి, కర్మమ్ములి నెక్కుడేని. ౩౩౯

వ. ఏను మేలుకాంచి సంతోషించి, తన్మంత్ర స్వరూపంబును బ్రయోగోపసంహార ప్రకారంబులును జిత్తంబున నిలిపికొనుచుఁ, గాలోచిత కృత్యంబు లాచరించి, యొక్క సారథి నంగీకరించి, యరదంబు పూన్పించి, సన్నద్ధుండ నై సత్వరంబుగా సమరంబున కరిగినం, బరశురామదేవుండు — ౩౪౦

క. 'నిన్న యిటు నచ్చి పోయితి!
ఉన్నయిటియు నేఁడు దీర్చి యుడిపెద నీ గ
ర్వోన్నతి! ఇం కెట వోయెదు?
నన్ను నెఱుఁగ వెట్టు' లనుచు నాపైఁ గవిసెన్. ౩౪౧

క. కవిసినఁ గడంగి యేనును
గవియించితి నంపవెల్లిఁ గడుఁ గ్రూరత; భా
ర్గవుఁడును మద్గాత్రంబున
వివిధాస్త్రప్రతతి నించి, వెగ డొందించెన్. ౩౪౨

వ. ఏనుం గోపించి — ౩౪౩

తే. రయము మెఱయంగ నొక్కనారసము ఫాల
దేశమునయందు నాటించి, తీవ్రశక్తి
నరము వైచినఁ, దూఁగాడి యొఱగ, నూఁది
పట్టి యకృతవ్రణుఁడు దేర్చెఁ బరశురాము. ౩౪౪

క. అప్పుడు దెప్పిఱి కన్నుల
నిప్పులు రాలంగ నన్ను నిశ్చలదృష్టిం

దప్పక చూచి యలంతి న
వ్వొప్పఁగ బ్రహ్మాస్త్ర మాత్తఁ బునరిత సేసెన్. ౩౪౫

క. తెగఁగొని బ్రహ్మాస్త్రము యేఁ
దగ నేసిన, నొకటి నొకటి దాఁకొని, రెండున్
గగనం బంతయుఁ దేజ
స్సగితముగాఁ జేసె, సురలు దైత్యులుఁ దలఁకన్. ౩౪౫

తే. సకలభూత సంక్షోభసంజనక మైన
యట్టియెడఁ గని, యిది దఱి యని తలంచి,
మోహనాస్త్రంబు సంచితావాహనంబు
సేయుటయును, జరాచర శ్రేణి మోహెసె. ౩౪౬

వ. తదవసరంబున— ౩౪౭

క. 'ఉడు గుడుగు! మోహనాస్త్రము
విడువకు' మనునెలుఁగుతోడ వేగంబున న
య్యెడ కేఁగుదెంచి నారదుఁ
డెడపడు టించుకయు లేక యి ట్లను నాతోన్. ౩౪౮

క. 'గురునకు నవమానము ని
ష్ఠురవృత్తిం జేసె దీవు! సూచితిమే యి
ప్పురుసునఁ బరుసఘనడవడిఁ
గురువంశపవిత్ర, యిట్లు గూడునె చేయన్ ? ౩౫౦

వ. అని సువ్యక్తంబుగాఁ జెప్పి— ౩౫౧

క. 'వీరె వసువు లాకసమున
గారవమున బుద్ధి సెప్పఁగా నీకడకుం
దా రేఁగుదెంచి' రని క
న్నారంగాఁ జూపె నాకు నయ్యెనమండ్రన్. ౩౫౨

వ. ఇవ్విధంబున నెప్పటివిప్రవరులు సన్నిధి సేసి నన్నుం జూచి నగు
మొగంబులతో నెఱుఁగనివారపోలె ని ట్లనిరి; ౩౫౩

క. 'నారదముని త్రైలోక్యస
మారాధ్యుం; డితనిపలుకు లాగమవాక్యో
దారములు; వినుము పీనిం;
గూ్రరత వాటింపఁ దగదు గురువిషయమునన్.' ౩౫౪

వ. అనిన విని, యేను సమ్మోహనాస్త్రంబేయుట యుడిగి, బ్రహ్మా
స్త్రంబు దీపింపంజేసితి. అప్పుడు జామదగ్న్యుం డది యెల్ల నెఱింగి
యోటమి యెక్కించుకొని, చలంబు మిగిలి యున్నం, దజ్జనకుండు
జమదగ్నియుఁ దదీయపితృవర్గంబును నతనికి సన్నిధిసేసి వేఁడికొని
శాంతవచనంబులం దేర్చి యి ట్లనిరి : ౩౫౫

క. 'వినుము, వసుమూర్తి యీతం;
డనన్యసామాన్యతేజుఁ; డాహవభూమిన్
మనకు జయింప వశమె భీ
ష్మuని? విప్రున కగునె రోషమును మత్సరమున్.' ౩౫౬

తే. సమర ముడుగు! నారాయణసఖుఁడు నరుఁడు
సవ్యసాచి నా నిం కొకజన్మ మొంది
యితని వధియించుఁ గాని, తక్కితరజనము
లకు నసాధ్యుండు భీష్ముఁ డాలంబులోన. ౩౫౭

వ. అనిన, నతండు వోక పెనంగిన, వెండియు ననేక ప్రకారంబులఁ జెప్పి
యమ్మునులు నాకడకుం జనుదెంచి, యుపశమన వాక్యంబులు పలికి,
జామదగ్న్యుతోడం దమ యాడినమాటలు దేటపఱిచి, యప్పుడు
పొడసూపినజాహ్నవియుం దారు, బహువిధంబుల నన్ను ననున
యిచి, భార్గవుపాలికి నమ్మహాదేవిం దోడ్కొని యరిగియుం,
గ్రమ్మఱ మత్సమీపంబునకు వచ్చియు, నెట్ట కేలకుం జలం బుడిపిన,

నే మిరువురమును దివ్యాస్త్రంబు లుపసంహరించి సమరంబుడిగితిమి. అట్టియెడ నయ్యెనమండ్రు విప్రులుం జేరి నాతో నిట్లనిరి: ౩౫౮

ఆ. 'గురుఁడు బ్రహ్మవిదుఁ డకుంఠిత తేజుండు
పరశురాముఁ; డతనిపాలి కీవు
భక్తిమెఱయ నేఁగి, ప్రణమిల్లి తదనుగ్ర
హంబు పడయవలయు ననఘ, యిప్పుడు.' ౩౫౯

వ. అని చెప్పి యతనికడకుం దారును నారద మునీశ్వరుండును జమదగ్ని ప్రముఖులును భాగీరథియును జని, 'నీశిష్యుండు దేవవ్రతుండు. వానియెడ నలుగం దగునె? వాఁడు నగవు మాలినపనిఁ జేయం జాలక పెనంగె; నింతియ కాని విరోధిగాఁడు. వానిం గరుణింపు' మని తెలిపి నన్నుం బిలిచినం బోయి యే నమ్మహాత్మునకు సాష్టాంగ దండ ప్రణామంబు సేసితి. అతండు దీవనతో గ్రుచ్చి యెత్తి కౌఁగిలించి కొని, 'గాంగేయా, నీశక్తికి భక్తికిం బ్రీతుండ నైతి' నని సస్నేహంబుగా సంభావించి, యంబ నవలోకించి, 'నన్ను భీష్ముండు గెలిచె, నావలన నయ్యెడుపని యింతియ. నీ వింక నీకుం జూడం బోలినగతిం బొ' మ్మనిన, నమ్మానిని, 'దేవా, యిదియిట్టిద నీయోపినంతయుం జేసితి. నీచేతం బోకున్న నేమి సేయుదు? నేను దపంబు పెంపున భీష్ముని వధించెద. జన్మాంతరంబున నైననుం జలంబు సాధ్యంబు సేయుదు. అటు సూడు' మని పలికిపోయె. తదనంతరంబ, యమ్మునిజన పితృదేవతా సమూహంబును భృగునందను నన్ను నామంత్రణంబు సేసి యంతర్ధానంబు సేసె. భార్గవుండును నన్ను వీడ్కొలిపి మున్ను దనతో వచ్చిన తపోధనవర్గమున దానును మహేంద్ర శైలంబునకుం జనియె. నేను మగిడి యెడ నెడ సర్వ సురుల యాశీర్వాదంబులు సంభావనంబులుఁ బ్రస్తుతి వాక్యంబులుఁ గర్ణంబుల కింపు సేయ, నిట వచ్చి సత్యవతికి నమస్కార పూర్వకంబుగా నంతయు నెఱింగించిన, నద్దేవి యభినందించి — ౩౬౦

—: నారదుఁడు భీష్మున కంబవృత్తాంతం బంతయుం జెప్పుట :—

తే. అంబవృత్తాంత మరయంగ ననుదినంబుఁ
దగినవారలఁ బుచ్చుచుఁ దలఁకు చుండు,
నేను, నది యాదిగాఁ జింత నేపు దక్క
నుగ్రికి యుండియు రాజుల నుక్కు మడఁతు. ౨౬౧

వ. ఒకనాఁడు పారాశర్య నారదులం గని యక్కార్యంబు భయంబుదోఁప విన్నవించిన, వారలు, 'దైవాధీనం బగుదాని మానుషంబున మాని పింప వశంబు గాదు ; ఆచింత విడువు' మనిరి. అందు నారదుండు, 'అక్కాశీశ్వర కన్యక తెఱంగు విను' మని యి ట్లనియె: ౨౬౨

సీ. 'ఆతన్వి యమునానదీతీరమున కేఁగి
యత్యుగ్రవ మగుతప మాచరించి,
యందుండి కౌశికునావాస మాదిగాఁ
గలుగు సిద్ధాశ్రమంబులకు నెల్లఁ
జని చని, తత్ప్రదేశంబుల నిష్ఠుర
వ్రతములు సలుపంగ, వచ్చి నీదు
జనని జాహ్నవి, 'యిట్లు వనితల కతిదుష్క
రము లగుబహునియమములు నీకు

తే. నడపఁ గత మేమి ?' యనుడు, నన్నాతి పలుకుఁ ;
'దగ్ధ యవమానపడితి శాంతనవుచేత ;
నపరజన్మంబునం దైన నతనిఁ జంప
నేను జాలుట కై యిట్టిదాన నైతి ?' ౨౬౩

వ. అనిన విని, భాగీరథి 'కుటిల ప్రచార వగుట నీ వీతనువు విడిచి యేఱు యి పాఱంగలదానవు. ఇంతియ కాని యొండు గానేరవు' అనిన, నవ్వేలంది నవ్వుచు నరకుసేయక తిరిగి తొంటికంటెను దీవ్రం బగు తపశ్చరణంబునం బ్రవర్తిల్లుచు, మత్స్యదేశ వాసినియై యుండి, యొక్కనాఁడు, నిజవ్రతఫలంబుల్లో సగంబున నంబ యను పేర నది

ద్యము యమ్మండలంబునఁ బరఁగి, యున్నసగంబునను దనమూపు పెడ
కుండ వహించుకొని, జాహ్నవీపరిభావంబు నాత్మీయ ప్రభావంబున
గెలిచి, వెండియు — ౩౬౪

క. పుణ్యాశ్రమదేశముల న
గణ్యాం బగుతపము సేయఁ గా, రుద్రుఁడు గా
రుణ్యము వాత్సల్యము దా
క్షిణ్యము మెఱయంగ నింతికిం బొడసూపెన్. ౩౬౫

క. మును లచ్చెరు వంది కనం
గొన, శంభుఁడు నిల్చి, 'వరముఁ గోరు' మనుడు, 'భీ
ష్ముని నాకుఁ జంపఁగా దొర
కొనునట్లుగ నొసఁగు' మనియెఁ గోమలి యెలమిన్. ౩౬౬

వ. అనవుడు, నద్దేవుఁ, 'డట్ల కాక' యని యనుగ్రహించిన నంబ,
'యెత్తెఱంగున నది యయ్యెడు' నని యడిగిన — ౩౬౭

సీ. 'ఈమేను విడిచి నీ వేఁగినయప్పుడు,
ద్రుపద భూవిభునకుఁ దొల్త పుత్త్రి
వై పుట్టి, పిదపఁ బుత్త్రాకృతిఁ గాంచి శి
ఖండినామమున, నుద్దండబాహు
బలమునఁ గోదండ పాండిత్యమును జటు
శౌర్యంబు నొప్పఁ బ్రశస్తి కెక్కి
యన్నిఁ జంపఁగలదాన వాతని ; నామాట
దప్పు ; దూఱడు' మని చెప్పి హరుఁడు

తే. సనియె. నాపొద్దు సమిధలు సాలఁ గూడ
వైచి యనలంబు గూర్చి యవ్వనిత క్రోధ
దీప్తమూర్తియై, 'భీష్ము వధించుదాన'
ననుచు నొడసెచ్చె ; మునులకు నద్భుతముగ. ౩౬౮

వ. అట్టియెడ, ద్రుపదుం డనపత్య యగు తన మహిషివిషాదంబు దీర్పం దివురుటను, గాంగేయుతోడిరోషంబునను శివుని నుద్దేశించి తపంబు సేసిన, నద్దేవుండు ప్రత్యక్షుండయి, 'వరంబు వేడు' మనిన, 'భీష్ము వధియించునట్టివాని నొక్క పుత్త్రుని నొసంగ వలయు' ననుడు —

తే. 'కూఁతురై పుట్టి పదపడి కొడుకుఁ దనను
గాంచి, భీష్ముని నాజిరంగమునఁ జంపు
నట్టి యుజ్జ్వలాపత్యంబు పుట్టు నీకుఁ;
దప్ప దిది' యని రుద్రుండు సెప్పి చనియె. ౩౭౦

వ. ద్రుపదుండును బ్రీతుం డయి నిజప్రియకు నవ్విధం బెఱింగించె. తద నంతరంబ కాశీశ్వర కన్యాచైతన్యం బుదరంబు ప్రవేశించిన — ౩౭౧

క. పాంచాల రాజభార్య స
మంచితగర్భంబు దాల్చి, మఱువడఁ గూఁతుం
గాంచి, నిజపతియుఁ దానును
వంచనఁ గొడు కనిరి యెల్ల వారును వినఁగన్. ౩౭౨

వ. ఇట్లుపుట్టిన బిడ్డకుఁ బుత్త్రప్రకారంబున జాతకర్మాది కృత్యంబులు నిర్వర్తించి, శిఖండి యనుపేరు పెట్టి, యతిప్రచ్ఛన్నంబుగాఁ బెనిచి, రహస్యంబు తెలియ కుండ కన్నియకుం జెప్పి, యక్షరశిక్షాదు లాచరించి, ద్రోణాచార్యుకడ శస్త్రాస్త్ర పరిశ్రమంబు సేయించుచుండ, జవ్వ నంబు చేరవకుం దఱియగుటయు నమ్మగువం జూచి, వగచి తల్లిదం డ్రులు దమలో విచారించి, 'వేగంబ వివాహంబు సేయవలయుఁ; బరమేశ్వరు వరంబుకొలంత [1]దన నెఱిసినప్పుడ నెఱియుంగాక!' యని నిశ్చయించి, దశార్ణ దేశాధీశుండగు హేమవర్మ యను రాజుకన్యకం దగిన తెఱంగునఁ బాణిగ్రహణంబు సేయించి తెచ్చి యున్నంత —

1. తన నెఱిసినప్పుడ నెఱియుంగాక = నెఱవేఱినపుడే నెఱవేఱుగాక!

ఆ. అక్కుమారి చతుర యగుట, శిఖండివ
ర్తనమునెడఁ బ్రమాదమున నెఱింగి,
యుగ్గడింప నొల్ల కూరక యెఱుఁగని
యదియపోలె నుండె నాత్మ నొచ్చి. ౩౨౪

వ. ఇట్లు దశార్ణ విభుపుత్రి యెఱింగి, శిఖండి పురుషుండు గామి దనదాసి
కిం జెప్పిన, నదియు నప్పు డన్నరనాథున కెఱింగించి పుచ్చిన, నతండు
విషాదరోషంబుల నొంది దూతం బుత్తెంచె. వాఁడువచ్చి పాంచాల
పతిం గాంచి యి ట్లనియె : ౩౨౫

చ. 'కొడు కని తెచ్చి, యి ట్లగునె కూఁతు వివాహము సేయ ; దీన నీ
పడసిన లాభ మేమి ? నగుఁబా టగు నింతియ కాక ! ఎల్ల నే
ర్పడ నెఱుఁగంగ వచ్చితి ; నరాతిభయంకరు హేమవర్మ నా
గడమున గాసిచేసితి ! మగంటిమి నీదెస నైనఁ జూపుమా !' ౩౨౬

ఆ. అనిన, నగుచు వాని కను ద్రుపదుం 'డివి
యేటిమాట ! లిట్టు లేల చేయ
వచ్చు ? ఇంతవెట్టి వారును గలరె ! ఇ
త్తెఱఁగు వోసఁగ కునికి యెఱుఁగరాదె !' ౩౨౭

వ. అని వెండియు నేర్పునం దీర్పుమాట లనేకంబు లాడి, నిక్కం బరయం
జూచిన వానికిం జొరవ యీక త్రోపుసేసి వీడ్కొలిపి పుచ్చినం,
బోయి వాఁడును నిజనాథున కవ్విధంబు విన్నవించె. ౩౨౮

క. కోపోద్రేకంబున నతఁ
డాపాంచాలపతి మీఁద నతులితసైన్యా
టోపమున వచ్చి పురిపరి
ఖాపరిసరతలముచుట్టుఁ గ్రైకొని విడిసెన్. ౩౨౯

వ. ఇట్లు విడిసిన — ౩౩౦

ఆ. పట్టు వడ్డ ముచ్చుపగిదిఁ బాంచాల భూ
నాయకుండు [1]దనకు నానచేటు
రాక కుమ్మలించి, యేకాంతమునఁ బత్ని
యొక్కతియును గొల్వ నూరకుండె. ౩౮౧

వ. తదీయదండనాథులు సమరోత్సాహంబునం బ్రవర్తిల్లిరి. అంత సూర్యాస్తమయ సమయం బగుటయు, రెండువీళ్లును భండనంబు తోడి వేడుకం జేసి, వేగుటయు వేచియుండె. ౩౮౨

క. అప్పుడు శిఖండి మరణము
తప్పఁగ, నడి కొండు ప్రతివిధానము సేయం
జొప్పడమిఁ దలఁచి, యొరులకుఁ
జెప్పక వెస నరిగెఁ బురముచెంత యడవికిన్. ౩౮౩

—: శిఖండి యక్షునివలనఁ బురుషత్వంబు నొందిన వృత్తాంతము. :—

వ. అవ్విపినంబు స్థూలకర్ణుం డనునొక్క యక్షునికి నివాసం బై యునికిం జేసి, నిర్జనంబై యుండు. శిఖండియు నత్తెఱం గెఱుంగుం గావున, నతని నుద్దేశించి యందుఁ జొచ్చి తత్ప్రదేశంబున మహనీయసుందరం బగుతదీయ మందిరంబున కరిగి, యచ్చటఁ బ్రాణవియోగం బగువిధం బాచరింపం బూనిన — ౩౮౪

ఉ. యక్షుఁ డెఱింగి వచ్చి, 'యిటు లాఱడి చావఁగ నేల చెప్పు? మ
బ్జాక్షి, భవన్మనోరుజకు నౌషధ మే నొనరింతు' నన్న, 'ఫా
లాక్షుఁడు వక్క నొడ్లకును నాపని సేయఁగ రాదు; నాదుచి
త్తక్షతి పుంస్త్వమేను దగఁ దాల్పక మానదు గుహ్యకోత్తమా.'

క. అని తనవృత్తాంతం బా
తని కెఱిఁగించుటయు, నతఁడు దన దగుచిత్తం

---

1. తనకు...... రాకకుమ్మలించి = ......సిగ్గుచేటు వచ్చినందులకు వగచి.

బునఁ గరుణ వుట్టి, 'యెంతటి
పని యిది యే నిత్తు [1]సమయపరిపాలనతోన్. ౩౮౬

క. నాపురుషత్వము గైకొని
నే పోయి, దశార్ణపతికి వెలయించిన, మీ
యాపదలు దొలఁగి చనఁ, బోడ
సూపుము పదినాళ్ళయంత సూనృత మొప్పన్. ౩౮౭

క. అం తవునంతకు నీ దగు
కాంతారూపంబు నేను గైకొనియెద; ని
శ్చింతమున మగుడఁ జను' మని
యింతికిఁ బురుషత్వ మిచ్చె నెంతయు వేడ్కన్. ౩౮౮

తే. ఇచ్చి తాను భామాకృతి నెలమిఁ దాల్చి
వీడుకొల్ప, శిఖండియు వీటి కేఁగు
దెంచి, నిజమందిరంబు సొత్తెంచి, తల్లి
దండ్రులకు మ్రొక్కి నిలిచి ముఖం బెలర్ప — ౩౮౯

క. తన తెఱఁ గంతయు నెఱిఁగిం
చిన సద్భుతహర్ష మగ్నచేతసు లై త
జ్జననీ జనకులు బహువిధ
వినుతులఁ గొనియాడి; రంత వేకువ యయ్యెన్. ౩౯౦

వ. తదనంతరంబ సూర్యోదయం బగుటయుఁ, గాలోచిత కరణీయంబులు నిర్వర్తించి పాంచాలవిభుండు సంబంధితో వలయుమాట లాడం దగు వారలం బనిచి రావించి, సంభ్రమంబు లేక వేగిరపడక నాగరిక ప్రకారంబున శిఖండి పురుషత్వంబు దేటపఱచి, యతనిమాట గీడ్పఱచి సపరివారంబుగా నద్దశార్ణపతికి విందు పెట్టి, కట్నంబు లిచ్చి, యతని

1. సమయపరిపాలనతోన్ = ప్రతిజ్ఞా నిర్వహణముతో.

యనునయాలాపంబులు గైకొని యనిచిపుచ్చె. అతండు దన్నుం దాన నిందించుకొనుచు నిజపురంబునకుం బోయె. అట్టియెడ నయ్యక్షపతు మందిరంబుచక్కటికిం గ్రీడార్థంబు గిన్నరవిభుండు విమానారూఢుం డయి చని, దాని యొప్పు గనుంగొని యగ్గించుచు నిల్చి, యొక్కింత సేపునకుం జుట్టు నున్న గుహ్యకులతో ని ట్లనియె : ౩౯౧

క. ' మన మిచట నిలిచి యుండఁగ
మనమున శంకింప కిట్లు మసలినవాఁ డీ
తనిగర్వ మేల యిక్కడఁ
జనుదేరఁగ నిచ్చు? నెట్లు సైఁపఁగ వచ్చున్ ? ' ౩౯౨

వ. అని పలికి యలుక మొగంబున ముడివడ నున్నంతఁ గిన్నరు లా గుహ్యకు నరసి తద్వృత్తాంతం బంతయు నెఱిఁగించి, ' దేవా సిగ్గు పెంపున రా నేర కున్నవాఁ ' డని విన్నవించిన — ౩౯౩

ఆ. ' అయిన నేమి పిలువుఁ ' డని పిలిపించిన,
వచ్చి మ్రొక్కుటయును, వనిత యైన
యతనిఁ జూచి, ' యింక నవుదాని కిట్టుల
యుండుఁ గాక ' యని విభుండు పలికె. ౩౯౪

—: స్థూలకర్ణునకుఁ గుబేరునివలన స్త్రీత్వము గలుగుట. :—

వ. స్థూలకర్ణుండును దలరి దండప్రణామంబు సేసి యుండె. అప్పుడు గొలిచియున్న దొరలు ధనదునకుం గృప వుట్ట నల్లన తెలిపిన, నట్లేని వీఁడు శిఖండి యాయువు గలంతకాలంబును గాంతాకృతి నై యుండి పదంపడి నిజరూపంబు దాల్చుంగాక యని యనుగ్రహించి యరిగిరి. ౩౯౫

తే. గుహ్యకుండు విషాదంబు గూరి యుండ,
నచ్చటికిఁ గొన్నిదినముల కరుగుదెంచెఁ :

దల్లిదండ్రుల కెఱిఁగించి తగవు మెఱయ
సమయనిష్ఠ వాటించి పాంచాలసుతుఁడు. ౩౯౬

క. వచ్చినఁ గనుఁగొని: 'నీదెసఁ
బొచ్చెము లే; దిట్లు మగిడి పో; మ్మిది విధి నీ
కిచ్చినదిహ' యని గుహ్యకుఁ
డచ్చపడం బలికి, యెల్ల నతనికిఁ జెప్పెన్. ౩౯౭

వ. చెప్పి వీడుకొలిపిన, శిఖండి, యత్యంత పరిమోదంబునం దండ్రికడకు వచ్చి, యత్తెఱం గెఱింగించె. ఆతండు ప్రీతుం డయి దేవగురుద్విజపూజనంబు లాచరించి, ద్రోణాచార్యుపాల సవిశేషంబుగా శిష్యభావంబు ప్రతిష్ఠించె, ౩౯౮

క. అని చెప్పి నారదుఁడు దా
నును సత్యవతీసుతుండునుం దమయిచ్చం
జనిరి. శిఖండిచరిత్రము
జనకర్ణపరంపరం బ్రశస్తం బయ్యెన్. ౩౯౯

వ. ఇవ్విధంబునఁ గాశీపతికన్యక సిద్ధమూర్తి యయి నెగడె. నేను నంగనల, నంగనాపూర్వుల, నంగనాభిధానుల, నంగనాకారులను వధియింప కుండ వ్రతంబు పూనినవాఁడం గావున, నంగనాపూర్వుం డగుశిఖండి నాకు ఖండనంబునం గోదండ పాండిత్యంబు మెఱసినను జంపను నొంపనుఁ గడంగితినయేని, నింతకంటెను దుర్యశంబు గలదె? ఎట్టయిన నగుదుం గాని భగ్నవ్రతుండ నగుట కోర్వను. ఇది నా తెఱంగు." ౪౦౦

క. అని చెప్పిన దేవవ్రతు
వినుతవచనములు విభుండు విని, తనచిత్తం
బున నొక్కింత వగచి, 'యీ
తనికి మగతనంబుపూన్కి దగు'నని పలికెన్. ౪౦౧

వ. తదనంతరంబ కొలువునం గలయ సమరవిషయంబు లయినసల్లాపం
బులు సెల్లుచుండఁ, గొండొకసేపు విను చుండి సుయోధనుండు
సురనదీసూనున కి ట్లనియె: ౪౦౨

ఆ. "పాండవులకుఁ గలుగుబలము లన్నియు సమ
యింప నీకు దినము లెన్ని వట్టు?
గురుఁడు కృపుఁడు గురునికొడుకుఁ గర్ణుండు [1]నెం
తెంతమానమున వధింతు రనఘ?" ౪౦౩

వ. అనిన విని, గాంగేయుం డతని కి ట్లనియె: ౪౦౪

క. "అనిఁ బాండవసేనలఁ జం
పను జెలువను నేము చాలుభంగుల, నీ కి
ట్లనుమానము వాయఁగ నడు
గన తగుఁ; గడు లెస్స; విందుగాక నరేంద్రా! ౪౦౫

వ. ఏను నాచాలెడుకొలంది సెప్పెద. తక్కటివారుఁ దమతమచాలుటలు
దార చెప్పెదరు. అది యెల్లను బిదప విందు గాని, మున్న నీ
కొక్కబాస యిచ్చెద నాకర్ణింపుము. ౪౦౬

క. [2]మీఁటు గలరాజరథికుల
నాఁటికి వేవుర వధింతు; నరుశరములు నో
నాఁటి పడ నైచునంతకు
వేఁ టాడెదఁ బ్రతిబలంబువీరుల నెల్లన్. ౪౦౭

వ. అట్లుగా నాకయ్యంబు సేయుదివసంబులలోన — ౪౦౮

---

1. ఎంతెంతమానమున వధింతురు = ఎంతెంత కాలపరిమాణమున....
2. మీఁటుగల...వధింతు = పెంపు ... ప్రసిద్ధిగల – రాజులగు రథికులను దినదినము వేయి మంది వంతునఁ జంపుదును. మీఁటు = (దే. స. క్రి.) ఎగఁజిమ్ము; పొడుచు; (తేలు) కుట్టు (దే. వి.) ఉద్రేకము; పెంపు; అధిక్యము; ప్రసిద్ధి.

క. [1]బదివేలఁ జంపఁగా నో
పుదు నే ననునెత్తికోలు పుట్టినయది ; నీ
పదునొకఁడక్షౌహిణులను
జదురున నడపింతు ; నెదిరిసైన్యము గలఁతుక్. ౪౦౯

వ. అని పలికి వెండియు— ౪౧౦

క. "నీ వడిగినపని యేర్పడఁ
గా విను, మే నొక్కనెలఁ దెగం జేయుదు, నా
నావిధదివ్యాస్త్రంబుల
లావున నప్పాండవులబలంబుల నెల్లక్. ౪౧౧

వ. అనవుడు, గురు కృప శ్వత్థామ కర్ణులం గనుంగొని, గాంధారీనంద
నుండు, 'మీమీ చందంబు లె' ట్లనిన, నాచార్యుండు మందస్మితా
ననుం డగుచు ని ట్లనియె : ౪౧౨

తే. "ఏను ముదిసినవాఁడ ; మహీశ, యెట్టు
లయిన నోపినభంగి, [2]నీ యనుఁగుఁదాత
సాలినన్నిదినంబులఁ జాల వచ్చు
నబ్బలంబుల నని సమయంగఁ జేయ. ౪౧౩

క. అనినఁ, గృపాచార్యుం '[3]డీ
యినుమడిదివసములఁ దీర్ప నే నోపుదు ' నా,

---

1. పదివేలఁ...పుట్టినయది = నేను...అను (ఎత్తికోలు) తలంపు — నిశ్చయము పుట్టినది.
ఎత్తికోలు = (దే. వి.) సంకల్పము ; తలంపు, పూన్కి ; జతనము
ప్రి. 'తరతరమ ప్రిజలఁ దనివోడు
నరునప్పటి యెత్తికోలునకు...' విరాట. ఆ. ౫.
'ఎప్పుడేని మీర లక్కమాడను = రప్పుడ శపింతు,
ఇదియ నాయెత్తికోలు' — అను, ఆ. ౨.

2. తా...అబలమును పోరున సమయఁజేయుటకు మీయనుఁగుఁ దాత ఓపినన్నిదినములే నాకు బట్టవచ్చును. 3. ఈ యినుమడి...నే నోపుదు నా విని = ఈ రెండంతల దివసములలో నేను దీర్పఁగల ననఁగా విని.

వినీ, గురుతనూభవుఁడు, 'పది
దినములఁ గడతేర్తు' ననియె ధీరవిచారా. ౪౧౪

వ. అందఱపలుకు లాకర్ణించి కర్ణుండు — ౪౧౫

క. "నానాస్త్రశస్త్రచయబడ
బానలముం గవియఁ జేసి యత్యుగ్రత నే
నేనాళ్ళన యప్పాండవ
సేనాసాగరము నివురఁ జేయుదు నధిపా." [1] ౪౧౬

వ. అని ప్రతిన సేసినఁ గలకల నవ్వి గాంగేయుండు— ౪౧౭

ఉ. "పలికిన నేమి! అన్నియును బల్కఁగ నగుఁ; మనరాజునొద్ద మా
ర్పలికెడువారు లేరు; విను, పాండవమధ్యముగాండివంబు దీ
ప్తుల మిఱుమిట్లు గొన్నకనుదోయి, గుణధ్వని వ్రయ్యలైన వీ
నులు, నయినన్ బలే, పలుకు నూల్కొన కుండుదు సూతనందనా.

వ. అనియె. ఇవ్విధంబున నీకొడుకుకడం బుట్టినవిశేషంబులు ధర్మతన
యుండు చారుల వలన, విని, తమ్ములఁ రాఁ బనిచి వారలతో
ని ట్లనియె: ౪౧౯

సీ. "మనచారు లిప్పుడు చనుదెంచి రా వీట
నుండి; దుర్బుద్ధి సుయోధనుండు
గొలువున గాంగేయ కుంభసంభవ కృపా
శ్వత్థామ కర్ణులవలను సూచి,
'యనిఁ బాండవుల బలమంతయు సమయింపఁ
జాలుదు రెం తేసికాలమాన

1. నేనేనాళ్ళన...జేయుదు = నేను ఐదునాళ్ళలోనే ఆపాండవ సేనాసముద్రమును ఇంకిపోవఁ జేయుదును. 2. తా...బలేపలుకు! — బలేమాటగా! ఒప్పుకొనకుండుదువు. సొలుకొను. రూ. నూల్కొను = (దే. అ. కి౨.) ఒప్పుకొను; కుదుగుకొను; చక్కఁబడు;

మును నన్ను, భీష్ముండు దన కొక్క నెలపట్టు
నని యాడె; ద్రోణుండు నట్లపలికెఁ;
ఆ. కృపుఁడు రెట్టి సెప్పెఁ; గృపికొడుకు కొప్పుదుఁ
బదిదినముల ననియె; బాహువీర్య
ఘనుఁడు గాన సూతతనయుఁ డేనాళ్లన
తీర్ప నేర్తు నని ప్రతిజ్ఞ సేసె." ౪_౨౦

వ. అని చెప్పి, యర్జునుం గనుంగొని, "వారు దమతమ యోపిన చందంబులు సెప్పిరి. నీచేతం గౌరవబలంబు లెంత దడవునకుం దెగు నాకుం జెప్పుము" అనిన, నతం డిట్లనియె: ౪_౨౧

తే. "వార లంతకుఁ జాలనివారె? నీ బ
లముల సమయింపఁ జాలెదులావు వెంపుఁ
గలర కాక, యారాజుతోఁ బలికి బాస
దప్ప వచ్చునె వారికి ధరణినాథ!" ౪_౨౨

వ. అని దరహాసోల్లాసభాసితవదనుండై — ౪_౨౩

మ. "అనుమానం బది యేల నీమది? మదీయస్ఫారబాహాబలం
బు నిరూపింపఁ దలంచితేని, విను మీవుం, జేవయుం జూపి, కృ
ష్ణునితోఁ డ్వాటునఁ జేర్చియేఁ గడఁగినం, జూర్ణంబు గావింతు నొ
క్కనిమేషంబున దేవదానవులతోఁ గూడం ద్రిలోకంబునున్. ౪_౨౪

వ. అది యెట్లంటేనిఁ, గృత్రిమకిరాతుండైన పశుపతి మెచ్చి జగత్సంహార సమయంబునం దాను బ్రయోగించునట్టి పాశుపతమహాస్త్రంబు నాకిచ్చె. అది నాయందు సన్నిహితం బయి యున్నయది గావున, శత్రునిరాసం బనాయాసంబై యుండు. అప్పాశుపతంబు మహనీయ ప్రభావంబు భీష్ముం డున్నరూ పెఱుంగుఁ. ద్రోణ కృప పాశ్వత్థామలు నెఱుంగరు? కర్ణున కెఱుంగ నెంతదవ్వు! అట్టి ఘోరసాధనంబున సమస్తంబును సమయించుట యుక్తంబుగాదు. తక్కిన యా-యుధంబులం బోరి వైరులం బరిమార్చినం బౌరుషంబు దీపించు నని తలంచెద. అప్పటికి వలయు విధం బయ్యెడు. అది యట్లుండె-

నీవా రక్కడివారికిం బెక్కువవారె? భీమసేనుండు, గదలు, అభి-మన్యుండు, ద్రౌపదేయులు, సాత్యకి, విరాట ద్రుపదులు, ధృష్ట ద్యుమ్నుండు, శిఖండి, యుత్తమౌజుండు, యుధామన్యుండు, ఘటో త్కచుండు—జెట్టానజెట్టులున్నవారు. మఱియు, ననేకులు వీరలయట్టి వార. అందఱం జెప్పనేల? ఏనుంగువోలె నీలావు నీ వెఱుంగవు! దివిజులకు నజేయుండవు! నీ యొక్కనికిం ద్రిభువనంబు నెదురె? నీవు నిక్కం బలుగవుగాక, నీ పలిగిన నెవ్వ రెట్లయ్యెదరో యెఱుఁగుదుము. నీసైన్యంబుల నెవ్వరికి నేమి సేయవచ్చు? మనకు విజయానందంబు సులభంబ." అని పలికె నని, సంజయుండు ధృతరాష్ట్రున కెఱిం-గించె నని, వైశంపాయనుండు జనమేజయునకుం జెప్పుటయు — ౮_౨౫

చ. కమలభవాదిదైవతముఖస్ఫుటనిర్గళితప్రశస్తవా
గమృతరసప్రసారకలితాంచితసేకవిధిప్రకర్ష సం
గమసముదీరితోల్లసనకందళితప్రహసద్యయాలతా
సుమహదుపాశ్రియప్రమదశోభితవిశ్వజగన్మధుప్రతా. ౮_౨౬

క. సమయబహుత్వారణ్య
భ్రమణపరిశ్రాంత్యదంతరంగనితాంతో
త్తమసరళమార్గదర్శన
సమర్థపుణ్యాభిధానసకృదుచ్చరణా. ౮_౨౭

మాలిని. అవగమితరహస్యాష్టాంగసమ్యక్ప్రకారో
త్సవగురుకరుణావిస్తారగాఢప్రశాంతి
ప్రవణహృదయపద్మోద్భాసివిజ్ఞానసారా
వ్యవహితపరమానందానుభూత్యేకరూపా. ౮_౨౮

గద్యము.

ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి
తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబున
యుద్యోగపర్వంబునందు సర్వంబును జతుర్థాశ్వాసము. ౮_౨౯

ఉద్యోగపర్వము సమాప్తము.

# శుద్ధి పత్రిక.

## ఆశ్వాసము ౧

| పుట | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౪౭ | ౧౯ | దృఢథైర్యులు | ...ధైర్యులు |
| ౫౩ | ౨౬ | వినుచుండెదరయ్యా, | వినుచుండెద: రయ్యా |
| ౫౫ | ౨ | యోధులె | యోధుల |
| ౫౮ | ౪ | నడపుఁ | నడవుఁ |
| | ౭ | ...నురడచిన | ...రడిచిన |
| ౮౦ | ౧౩ | బలహీనుల | బలవిహీనుల |
| ౮౨ | ౨౦ | నీర్వృతి | నిర్వృతి |

## ఆశ్వాసము ౨

| పుట | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౯౪ | ౭ | య్యర్ఘ్యపాద్యం | యర్ఘ్యపాద్యం |
| ౧౧౨ | ౧౫ | థైర్యం బేది | ధైర్యం... |
| ౧౩౬(నోట్సు) | ౧ | చక్కట | చక్కటి |
| ౧౩౮ | ౨౨ | దిట్టయవి నీతులు | దిట్టియవినీతులు |
| ౧౩౯ | ౧౭ | నప్యరత్న | నవ్యరత్న |
| | ౧౯ | ...దోఃక్రిడన | దోఃక్రీడన |

## ఆశ్వాసము ౩

| పుట | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౧౪౦ | ౧౦ | నిట్టులనయె: | నిట్టు లనియె: |
| ౧౪౬ | ౧౬ | పలుకులను | పల్కులను |
| ౧౪౮ | ౫ | నడచునప్పుడు | నడుచు... |
| (నోట్సు) | ౨ | సంకోచింతలు | సంకోచము |
| ౧౫౬ | ౭ | నడచిన | నడిచిన |
| ౧౬౪ | ౨ | దా వలచేత | దావలచేత |
| (నోట్సు) | ౧ | వల చేత | ,, |
| ,, | ౧౧ | దానముసుకొని | దాన మునుకొని |
| ,, | ౧౪ | మహాగమనముల | ...గమానముల |
| ౧౬౬ | ౫ | యట్టియల్క | యిట్టియల్క |
| ౧౮౨(నోట్సు) | ౪ | అకౌరవులపక్షు | ఆ కౌరవులపక్షు |
| ౧౮౩ ,, | ౧ | దారకుని | దారుకుని |
| ౧౮౬ | ౨ | దుశ్శాసనుని కేతము | దుశ్శాసను నికేతము |

| | | | |
|---|---|---|---|
| ౧౭౭(నోట్సు)-౨ | | ఒచ్చమైనజా | ఒచ్చె మైనజా |
| ౧౯౩ | ౫ | పుడమియెల్ల | 'పుడమియెల్ల |
| | ౧౦ | 'దొరకొని | దొరకొని |
| ౧౯౪ | ౯ | వచ్చితి; భారతాన్య | వచ్చితి: భారతాన్వ |
| ౨౦౦ | ౧౨ | గాని; ధర్మని | గాని, ధర్మని |
| ౨౦౯ | ౧౪ | వెఱ్ఱు లగుదెరే! | ...లగుమరే! |
| | ౨౨ | బుణ్యాంబు సేయనెట్లు | బుణ్యాంబు; సేయనెట్లు? |
| | ౨౪ | సేయువాఁడ,= | సేయువాఁడ? |
| | | నొండెద్దియుఁ జెప్పలేను. | నొండెద్దియుఁ జెప్పలేను! |
| ౨౧౦ | ౩ | చెప్పితి నాకుం | ...నాకుం; |
| ౨౨౨ | ౧౧ | వారివా రికిజా. | వారివారికిజా ! |
| ౨౨౩ | ౧౦ | చెడియొ దిట్లు? | .........?" |
| ౨౨౫ | ౨ | అంతర్థానంబు | అంతర్ధానంబు |
| | ౧౪ | సుఝైక | సుఖైక |

ఆశ్వాసము ౪

| | | | |
|---|---|---|---|
| ౨౩౮ | ౬ | కౌరవనాధుం | ...నాథుం |
| | ౮ | దగునె; | దగునె: |
| ౨౪౦ | ౩ | బలికితి: నె; | బలికితినే: |
| ౨౪౧ | ౯ | వెడలిపోయెం; | వెడలిపోయెం: |
| ౨౫౪ | ౧౮ | నిందొక్కఁడు, | నిం దొక్కఁడు, |
| ౨౫౬ | ౩ | భీష్ముఁడయ్యగ్గలికఁ | భీష్ముఁ; డయ్యగ్గలికఁ |
| ౨౬౩ | ౧౧ | దుస్సనేను | దుస్ససేను |
| ౨౬౫ | ౧౯ | నూతసుతుఁ | సూతసుతుఁ |
| ౨౭౨(నోట్సు)-౨ | | సుతులను= | సుతులకు= |
| ౨౭౭ | ౧౨ | వారియుటి దిలావు | వారియుటిది లావు. |
| ౨౮౪ | ౨౩ | కలుగంగాఁ దగదు? | ......దగదు! |
| ౨౮౫ | ౬ | బలము దేను? | ......దేను; |
| ౨౯౫ | ౨౫ | సొదసెచ్చె; | ......సొచ్చె: |
| ౩౦౩ (నోట్సు) | ౪ | యె కోలునకు | యె త్రికోలునకు |
| | ౫ | లడ్డమాడను= | లడ్డమాడుదు |
| ౩౦౪ | ౫ | యత్న్యగ్రితనే | ..'...[1]నే |
| | ౧౨ | బలే, పలుకు | [2]బలే,... |

# పాఠాంతర సూచిక.

## ప్రథమాశ్వాసము.

| పద్య సంఖ్య. | పంక్తి. | పాఠాంతరము. |
|---|---|---|
| ౧ | ౪ | ర్యాగమపరిపాకరూప |
| ౫ | ౪ | గొలిచి |
| ౧౨ | ౧ | గపటంబున |
| ౧౭ | ౨ | ఎదిరితలం పెఱుంగక |
| | ౩ | నేరనగు నే? |
| ౨౦ | ౧ | నికొక్కలంబునకెడ |
| ౨౨ | ౭ | వచ్చె నట్లగుట |
| ౨౩ | ౪ | జెవులొడ్డి... శౌరినందుఁ గాక |
| | | జెవియొగ్గి... శౌరి |
| ౩౦ | ౧ | సహాయుఁడుగా |
| ౩౩ | ౧ | పాటిగాదు |
| ౩౭ | ౪ | పిలిచిపుచ్చు |
| ౪౧ | ౧ | కౌరవులును పాండవులును |
| | | నారాయ నాకొక్కరూప |
| ౪౨ | ౧ | పెండ్లికిని బిల్వ |
| | | పెండ్లికె బిల్వ |
| ౪౬ | ౩-౪ | నుత్సాహము సేసెఁ |
| ౫౬ | ౨ | క్రొవ్వినతిండికోఁడు |
| ౬౦ | ౮ | నియ్యాడినసూత్రం |
| ౬౩ | ౨ | బటుతరగతి వి |
| ౬౯ | ౩ | గౌరిశవక్త్రపాదమునకుం |
| ౭౨ | ౩ | సద్భావముతోడ నెంతయును దప్పక |
| ౭౪ | ౨ | సేయువలనుగలరు నే |
| ౭౯ | ౪ | నిభపుర...పుట్టదే యీవు వినఁ |
| ౮౩ | ౨ | బోరెడు నెడ నెవ్వరెట్లు |
| ౯౩ | ౩ | బరపులై చెలువంబు |

| పద్య సంఖ్య. | పంక్తి. | పాఠాంతరము. |
|---|---|---|
| | ౫ | బాడవునై |
| | | బాడవులై |
| | ౧౧ | ఖాణములును |
| ౯౫ | ౨-౩ | నియావా స్త్ర్యంబు |
| ౯౭ | ౧ | విఛ్ఛేదబుద్ధి నా |
| ౧౦౪ | ౨ | కృత... లై |
| ౧౦౬ | ౩ | లైన...యాసుకృతాదుల |
| ౧౦౯ | ౧ | మేలుసేసితి రొక్కట మెచ్చివారి |
| | | ...రొక్కని మెచ్చివాని |
| ౧౧౪ | ౩ | హృదయము...నల్లనో |
| | ౪ | యదియును...యక్కట |
| ౧౧౯ | ౧ | తలఁకి... |
| ౧౨౩ | ౧ | పనిచిన... బేర్చి వాసవుం |
| ౧౨౭ | ౧ | ఇట్లవికలబలుండై |
| ౧౩౧ | ౪ | బునఁదేఁకువ... |
| ౧౬౫ | ౧ | అల్లన......లేమి యేఁ |
| ౧౭౧ | ౨ | సత్యంబువలనం గను దని |
| ౧౭౩ | ౩ | బొచ్చెము...పోకులు దాని కిం దగం |
| ౧౭౬ | ౪ | చ్చట.....దెమ్మను నంతఁ |
| ౧౮౩ | ౪ | దానను మునియానమున |
| ౧౮౭ | ౨ | గాని విశంకతఁ |
| ౧౯౨ | ౪ | వాఁడిమగఁడు...వర్గము నేముఁ |
| ౧౯౫ | ౩ | స్పృహ...తన్ను నెప్పుడు |
| ౨౦౧ | ౧౧ | ...సురగంబపై యుండు |
| ౨౦౨ | ౧ | స్వర్గపదభ్రష్టుండై |
| ౨౦౫ | ౪ | దేవియు... దేవి రక్షిష్ట |

## ద్వితీయాశ్వాసము.

| పద్య సంఖ్య. | పంక్తి. | పాఠాంతరము. |
|---|---|---|
| ౧ | ౧ | శ్రీ విస్తారకవరకరు |
| ౪ | ౪ | వసులు...సుఖమున్న నార |
| ౧౨ | ౨-౩ | సముద్రంలేరు శ్రీ కొనందలంచి కాడి వ్రాసిన |
| | | .............డీ కొనంగాను తగరువాసిన |
| | | .............డీ కొనంజగరానివాసిన |
| | | .............డీ కొనంగం దగరాతివాసిన |
| ౧౪ | ౧ | ఘనలమా వృత్తి జూదమున |
| ౨౧ | ౨-౩ | ముచ్చిలివేంగు నతేండు |
| ౨౫ | ౩ | ...పిల్లిపట్టిన యీలువు! |
| | ౪ | సేసి నుండ సేల చెల్లివచ్చు? |
| ౪౭ | ౪ | ...యుడుగుచునచ్చుక. |
| ౫౨ | ౪ | ...వల్లమున నిన్నిటులారంగూరు నే? |
| | | ...నన్నిటులాడెంగూడు నే? |
| | | ...నం దిటులారంగూరు నే? |
| ౫౬ | ౧ | కమియంబంపెమంపెంగాయం గోసినం జవి |
| | ౩ | బక్వమైనం గోయఫలమించు |
| ౬౪ | ౩ | దగినయట్లతోంచు |
| ౬౬ | ౪ | కలిమియంద పెద్ద గాని పించె. |
| ౮౦ | ౩ | ...ఘటించిన సిక్కము లేని |
| ౮౪ | ౨ | ...సజ్జనమతమా [దేనిం |
| ౭౭ | ౪ | ...సల్పినంబరుల |
| ౭౯ | ౬ | ...తప్పులంబు వలుకువారు. |
| | | ...దోంక నిరుముట్టి తల్ల |

| పద్య సంఖ్య. | పంక్తి. | పాఠాంతరము. |
|---|---|---|
| ౯౧ | ౮ | ...వెనుకం బశ్చాత్తాపంబు |
| ౯౨ | ౧-౨ | తపములోని పాళ్ళకును సమరము సేసినంగాని చావురాంజనదె |
| ౧౦౯ | ౩ | .....యెలర్చె చెయ్యులం. |
| ౧౧౦ | ౪ | ...షుమృబ్బి |
| | | ......వృబ్బి |
| ౧౧౧ | ౪ | బల్కుంగూయ సోగియింపుగ మోయంగ. |
| ౧౧౨ | ౧ | ...బరంగించు నరుణోద |
| | ౭ | ...క్కువలు చందోయి |
| | ౯ | తెల్లవాఱుచున్న దివియ లల్లార్చుచు. |
| | ౧౨ | ...ననల మోచు. |
| | | ......దోచు. |
| ౧౧౩ | ౨ | ...గాంచి చారు భంగి |
| ౧౧౪ | ౪ | వముల కటెలుకుం బన్ను వోసంగి |
| ౧౨౮ | ౩ | ...సేయకునికి. |
| ౧౪౧ | ౨ | పాంచాలుండు నేపారు |
| ౧౪౩ | ౪ | కునోగ్యగించుటకేల |
| ౧౪౪ | ౮-౭ | మెదడును నెమ్ములును నెఱచియు నెసని. |
| | ౧౨ | ...మానండు రాజరాజు. |
| | | ......పాలీండు |
| ౧౪౫ | ౪ | ...యందెగేమి |
| | | ......దేనితి |
| ౧౪౯ | ౧ | అనిమిషజయము |
| ౧౫౧ | ౧ | ఆయిరువు నొకతలంపున |
| | ౩ | వేయేల మనమ కా |
| ౧౬౦ | ౨ | చిఱుతవానినింబోలండు |
| ౧౬౭ | ౨ | యొట్టులిందుల సైన్యంబు |

| పద్య సంఖ్య. | పంక్తి. | పాఠాంతరము. |
|---|---|---|
| ౧౬౯ | ౨ | మొగుడం జేసలు |
| ౧౭౪ | ౨ | లెక్కింపు మం |
| | | రట్టించు |
| ౧౭౮ | ౩ | త్కృష్ణ ప్రితాపమూరులు |
| ౧౭౯ | ౭ | శ క్తి యు సడు |
| ౧౮౫ | ౨ | యేమియు నిద్ర |
| ౧౮౮ | ౩ | గదయంగ భీముఁ గని |
| ౧౯౪ | ౩ | నో క్షినమంట |
| ౧౯౮ | ౧౩ | కౌలవిపర్యయంబున |
| ౨౧౨ | ౩ | గలఁ డెవ్వఁ డెన్ను మా |
| ౨౧౫ | ౪ | మునిధృతిచేట |
| ౨౨౫ | ౧ | నార్చుచు మూరెడు |
| | | యంతన |
| ౨౨౬ | ౪ | గవిసియుపుడు |
| ౨౩౪ | ౨ | వారమునిపూని రివ్వి |
| | | వారని పూని పలికి రివ్వి |
| ౨౩౫ | ౪ | యీ కౌరవ సెనికులకు |
| ౨౪౦ | ౨ | మమ్ము నంతయుం |
| ౨౫౬ | ౧ | మొగుడం బెట్టికొని |
| ౨౭౩ | ౨ | దొసరఁ దలఁచెను |
| ౨౭౫ | ౨ | చేతో మోదమునఁ బెరఁగి |
| ౨౭౮ | ౪ | మొలకులై చటిలోని నుటికి |
| | | ......యాచటి నుటికి |
| | | మోలకులై చటి నుటికి |
| ౨౮౪ | ౧ | బరవసము గా గ |
| | ౩ | పసులఁ బట్టించునపుడు |
| ౨౮౭ | ౨ | తెంపునఁ జచ్చి |
| | ౪ | పాడితలంచెద |
| ౨౮౮ | ౨ | తక్కినప్పటికి నదియట్లుం డె |
| | | నిరాకరించిన ఫలంబు |
| ౨౯౫ | ౪ | లిట్టిద యనీతియు |
| | | చూడుమీ తజిఁ. |
| ౨౯౭ | ౧ | మీ దెఱుఁగక. |
| ౩౦౪ | ౧౨ | పూని మాన్పంగ |
| ౩౧౦ | ౨ | ప్రాపుగ నేర్చినయట్టి |
| ౩౧౧ | ౩ | నెనసి యేకొత్తుఁడై |
| ౩౧౨ | ౨ | సూక్ష్మరూప వ్యాప్తమై |
| ౩౨౨ | ౨ | సర్వము గ్రాఁగె నేనియుం |
| | | ...గ్రాఁచె |
| | ౪ | ...నతని నొక్కజాము |
| | | నకుఁగా |
| ౩౨౩ | ౧ | ...డీసుమానఁడు బుద్ధి |
| ౩౩౧ | ౨ | వాసుదేవుని మఱువు |
| ౩౩౨ | ౩-౪ | ...సంపత్సమాధాన దౌర్గ |
| | | త్యవ్యాహృతి |
| ౩౩౩ | ౪ | ద్భాసిత పోస్య |
| ౩౩౪ | ౪ | ...లలితవిలాసా |

## తృతీయాశ్వాసము.

| | | |
|---|---|---|
| ౧ | ౨ | ...భావమహిమ |
| ౫ | ౪ | ...యతండునుం దారుని |
| | | సుఖాసీనులై |
| ౯ | ౫ | ...మేలిమాటలన |
| ౧౭ | ౧ | ...లక్ష్మిగారించు |
| ౨౧ | ౪ | మేలిమి లేదు |
| ౨౫ | ౧ | ...దగం జేయ కౌ |
| | ౨ | ...సాధింపంగ రా దంచు |
| ౪౮ | ౧ | తన పోలివోవు |
| | ౪ | ఘటించిన యంత యొప్పునే |
| ౬౩ | ౪ | ...దక్క నొకంటఁగలనే |
| ౬౫ | ౩ | ...చూచెదము గా కీసారికిం |

| పద్య సంఖ్య. | పంక్తి. | పాఠాంతరము. |
|---|---|---|
| ౬౮ | ౨ | ...నిన్నుఁజేపగాఁ |
| ౮౩ | ౩ | ...పాటియ కలిన |
| ౮౭ | ౪ | ...నియతిఁ బూను టిదియ |
| ౯౬ | ౩ | తక్కుమాట లే |
| ౧౦౪ | ౩ | చ్చోట నసంగతంబులకు... సైచి పాండవుల్ |
| ౧౦౭ | ౩ | గాలులు పీరెదన్ వినుము |
| ౧౦౮ | ౩ | ...సహజన్ముల పౌత్రపు గాంచితిన్ |
| ౧౧౦ | ౪ | ...కులాంగన లిట్టులొక్కురే! |
| ౧౧౨ | ౩ | చ్చెరఁ జని కోద్రేకంబుదగఁ |
| ౧౩౨ | ౧౦ | పొడసూపిన |
| ౧౩౯ | ౪ | ...నడపు మాదరము |
| ౧౫౮ | ౩ | దనులకు నైదునూళ్ళ |
| ౧౭౪ | ౬ | ...బ్రమోద భరితంబునైన |
| ౧౯౧ | ౨ | దగ్ధివైకొన్న శోకంబువెల్లి దిగఁ బాఱ |
| ౧౯౭ | ౪ | ...జనులు వీచి యొలుకరే! |
| ౨౦౧ | ౩ | గుర్రిల కలరారు |
| | ౪ | నాయలఁతె యూఁపుము |
| ౨౦౩ | ౪ | గలఁ కఁ జేయుమీ |
| ౨౧౪ | ౪ | ...నేల పడియెదు బిదపన్ |
| ౨౧౬ | ౪ | బాంధవంబుననీతికి . బాంధవంబున కిదినీతి |
| ౨౨౨ | ౨ | క్కయునది హీనతం |
| | ౩ | ...ననలేమి కూడెదిరి ...ననలేనిరూడు దిన |
| ౨౨౪ | ౪ | దగ దొడ్డకు నెప్పుడెవ్విధ |
| ౨౨౮ | ౬ | ...నెదురు చూచుచున్న |
| ౨౩౫ | ౧౬ | నీమోఁది భక్తివిశేషంబునం |
| ౨౪౨ | ౨ | ...తాను వారితో మాట లాడి |

| పద్య సంఖ్య. | పంక్తి. | పాఠాంతరము. |
|---|---|---|
| | | నదిమి కదిమి |
| | ౩ | రైన నుడుపంగ |
| ౨౪౪ | ౩ | బాలకడలి కడలపాటి |
| ౨౪౯ | ౩ | దారకంబుల చందం |
| ౨౬౩ | ౧ | నీవు వలచినఁదీర్పంగ |
| ౨౬౮ | ౩ | ట్లూరక యుండఁ బోలు |
| ౨౭౩ | ౨ | చేడఁ బాలిదియైన.. ...బాళినదైన |
| ౨౭౯ | ౧ | ...దేనునుం జెప్పెద |
| ౨౮౧ | ౨ | బూని...బొగులుగాఁ బేడ |
| ౨౮౩ | ౧ | ... నీసంధానం బిదు దెటఁ గులకు |
| ౨౯౫ | ౪ | ...నొగిలించి చంపుదమ |
| ౨౯౬ | ౪ | దామును |
| ౨౯౮ | ౪ | వెమ్మెయిఁ దూలపుచ్చి తని |
| ౩౦౨ | ౫ | ...కన్యావరణ కార్యంబు నకు |
| ౩౦౯ | ౨ | ...శిలసకల దిక్కులలో |
| ౩౧౦ | ౨-౩ | ..............జే నెటి దప్పినిలువఁ |
| ౩౧౮ | ౬ | ...దొరకొన నెర వని |
| ౩౨౩ | ౩ | దోర్బల మెు పాండవులుగా దౌర్బల్యము వాయుశుభము |
| ౩౨౭ | ౨ | ...బుణ్యంబు సేయమెట్లు! |
| ౩౨౮ | ౪ | జనవు మనువు జన వేదియు |
| ౩౩౪ | ౧ | ...దోర్దర్పముల్ లాఁతిగా |
| | ౨ | ...జొచ్చి దైన్యంబునం |
| ౩౩౭ | ౨ | ...యొతెవాఁ డలిగిన |
| | ౪ | ...బెనఁగు టడుగుధీర |
| ౩౪౧ | ౧౨ | ...నడుమ ...మానిపోదురు |

| పద్య సంఖ్య. | పంక్తి. | పాఠాంతరము. |
|---|---|---|
| ౩౪౧ | ౧-౨ | ...తోడుసు |
| | | మాలి |
| ౩౪౪ | ౪ | ...వీరల పంచానరింపఁ |
| | | జేసెపగుణా. |
| ౩౫౧ | ౨ | నాకృష్ణుని...ననిఁ బోఁచక |
| ౩౫౩ | ౯ | వారు......బోఁటివి. |
| ౩౫౪ | ౨ | ...రమణం బెసఁగఁగ |
| ౩౫౮ | ౪ | ...దనయిచ్చలోఁ బడియె |
| ౩౬౧ | ౩ | ...చక్కసగ మక్కట |
| ౩౬౬ | ౧౧ | గనలి జూద |
| | ౧౨ | ...దాన నిట్టిచేటు |
| ౩౬౭ | ౩ | ...యెట్టివారు నెంచుఁ |
| | ౪ | దగవుమాలి నీవోకఁడవు |
| | | దక్క |
| ౩౭౪ | ౪ | వేఱయెంతయు...కేఁడమున |
| ౩౭౬ | ౨ | ...దనుఁదర్పిన్వ నిట్లసంపతు |
| | | లన వీరుగొంద అతి పౌరుష |
| | ౪ | పతులను |

| పద్య సంఖ్య. | పంక్తి. | పాఠాంతరము. |
|---|---|---|
| ౩౭౮ | ౪ | ...బొందే నీచుఁడే |
| | | జాతికిణా. |
| ౩౯౦ | ౩ | .. గడఁగి తనుఁ |
| ౩౯౪ | ౪ | ...నిర్భయముసఁ జెప్పి. |
| ౪౦౦ | ౪ | ...యంతటఁ బోయి |
| ౪౦౩ | ౨-౩ | జోఁ |
| | | కలవడఁ |
| | | జే |
| | | నలవడఁ |
| ౪౦౭ | ౧ | ...విశ్వరూపవిజృంభణంబు |
| ౪౧౩ | ౨ | స క్తిమయ |
| | ౪ | వ్యక్త కృతాభిరామ |
| ౪౧౪ | ౨ | సువ్యక్త సుశ్లోక దీప్త |
| | | సుభగానుభావా |
| | ౪ | సేవ్య సాంగత్య |
| ౪౧౫ | ౪ | ...నిగమ చర్యా వృత్తచి |
| | | పరిసాద్యా |

చతుర్థాశ్వాసము.

| పద్య సంఖ్య. | పంక్తి. | పాఠాంతరము. |
|---|---|---|
| ౩ | ౩ | ...బడు దుఃఖపాటు నీ |
| ౧౩ | ౪ | ...వినఁడోకోయని |
| ౨౦ | ౩ | ...నొల్లక పాపము సేసి |
| | | కట్టిమై |
| | | ...నొల్లర పాపము |
| ౨౨ | ౨ | ...గార్యభాగముం |
| ౩౧ | ౨ | ...నాలవ వరుసణా |
| ౩౫ | ౧ | ...నేఁటేఁగి యెరవుల |
| | ౪ | వాఁడిమిగదె నీకు |
| | | వాఁడిగదే నీకు |
| ౩౭ | ౪ | ...పనుచు టుచితమె |
| ౩౯ | ౪ | నే తగ వేది |

| పద్య సంఖ్య. | పంక్తి. | పాఠాంతరము. |
|---|---|---|
| ౪౪ | ౪ | ...వసుధ కెల్ల |
| ౪౬ | ౨ | ...సత్యవిదయుదమగాక. |
| ౫౯ | ౩ | ...భాస్కరుని నారాధించు |
| ౬౮ | ౧ | ...వో వినను |
| ౭౫ | ౩ | నెయ్యది శుభంబు |
| ౭౬ | ౨ | జేఁద కన్నిడి. |
| | | జేఁద కనుపెట్టి. |
| | | జెఱుత కనుపెట్టి. |
| ౮౩ | ౨ | గురుక్షేత్రంబున విడి |
| | | యుండని |
| ౮౬ | ౩ | పెరవునఁ దొరకొనఁ దగదే. |
| ౮౮ | ౧ | ...కార్యమను... |

| పద్య సంఖ్య. | పంక్తి. | పాఠాంతరము. |
|---|---|---|
| ౮౮ | ౧ | నొండొక చెయ్యదిగలుఁ జెప్పుమా ! |
| ౯౦ | ౩ | ...నూల్కొన కున్నది. |
| | | ...గూర్కొన |
| | | ...గొరకయున్నది. |
| ౯౪ | ౧ | ...దమ్మలకుం గొడుకులకుం జెగువ సెప్పి |
| ౧౦౯ | ౧౧ | రక్కుముట్టి నటింపఁగలరు. |
| ౧౧౨ | ౩ | తోయజనాళము. |
| ౧౧౪ | ౨ | ...బొరలారసి యొజ్జ చాడ్పునన్. |
| ౧౧౫ | ౨ | చి తంబులారసి |
| ౧౧౬ | ౧ | బిట్టెండ...వాసిన |
| | ౭ | యులసీనభయమున |
| ౧౧౮ | ౨ | ...దమ్మగ నుజ్జ్వల |
| ౧౨౩ | ౪ | .. నాసిరులు బెరయంగన్ |
| ౧౨౯ | ౨-౩ | ...వాహన వీరోత్కృష్ట గతిన్ |
| ౧౪౩ | ౨-౩ | ...లందఱ కని |
| ౧౪౬ | ౨ | ...నింకొక్కరు నీవ |
| | ౩ | పంపుమా |
| ౧౫౦ | ౨-౩ | ...రూ |
| | | పఱసేయఁ జేతు లాడవు |
| ౧౬౨ | ౧ | ...మనమున |
| | ౩ | 'నొల్లక పయనము వీడ్కొ |
| | | ల్లెల్లను దనయిచ్చఁ దెల్పి |
| | | యిట్లనియెఁ దగన్' |
| ౧౬౫ | ౧ | ...కృష్ణుని రాకయుఁ |
| ౧౬౯ | ౩ | దెలపం |
| | | దెలుపం |
| ౧౭౬ | ౩ | నపుడు...యరయనైతి |
| ౧౭౯ | ౨ | ...గీర్చెద రొల్ల నిన్ను |
| ౧౮౦ | ౩ | యాతాయాత విన్నాణం |
| ౧౯౧ | ౬ | ...బన్నంబు దైన్యరు నకు |
| | ౧౧ | ...వడ జంకె పోటింక |
| | ౧౨ | దప్ప...తతియఁ జోరము |
| ౧౯౨ | ౨ | చేతిబరువు |
| ౧౯౫ | ౪ | దాని...గాదె యింకఁ |
| ౨౦౬ | ౪ | ...జూచెదవు గితకసుతా |
| ౨౦౮ | ౧ | తనతలఁ పిట్లు |
| ౨౨౪ | ౨ | ...గోలలలనేయన్ |
| ౨౨౫ | ౧-౨ | ...చిచ్చునైనం బిడికిలింతు |
| | | ననుచుండు దండధారుఁడు |
| ౨౨౮ | ౩ | ...దనినభావం బూనఁగా |
| ౨౨౯ | ౩ | నేచిన మొన లితం |
| ౨౩౪ | ౩-౪ | ...నిన్నెసకొల్పి |
| ౨౩౭ | ౧ | కొలఁపున ఒంటికి లేనివి |
| | | యొంటర ఒంటమి లేనివి |
| ౨౪౬ | ౪ | మిడియును నీకుమారతయు |
| | | మున్వరునన్ |
| ౨౪౭ | ౪ | సున నినుఁ జెడకుండఁబోలి |
| ౨౪౯ | ౩ | ... నెట్లు జొచ్చెదు |
| ౨౫౨ | ౩ | ...గార్యభాగఁబునుంజూచి |
| ౨౫౩ | ౧ | పాండు...నద్దస...మగలఁ గం |
| ౨౫౬ | ౪ | ...బిట్టు దాఁకుదు రధిపా |
| ౨౫౮ | ౨ | ...బుట్టరాపురికి |
| ౨౬౦ | ౪ | ధరణి |
| ౨౬౧ | ౩ | ...సైన్యములకంగా నొచ్చి |
| ౨౬౮ | ౧ | ...కెల్లఁ దలిదండ్రి యట్టి వాఁడు |
| ౨౭౦ | ౪ | ...జెప్పఁ గానిక్కమారా |
| ౨౭౬ | ౩ | గనలఁ దగుదోడు నప్పడ |

| పద్య సంఖ్య. | పంక్తి. | పాఠాంతరము. |
|---|---|---|
| ౨౭౯ | ౪ | ...యిట్లును న తపస్వితోఁ |
| ౨౯౦ | ౩ | ననినఁ దపసి యిట్టులనియె |
| | | మహేంద్ర మఁ |
| | ౪ | పర్వతమున...బరమతపము |
| ౨౯౮ | ౨-౩ | ...దగఁ గూడునో: |
| | | భీష్మునిఁ దీడునో ! |
| | | జేడునో భీష్మునిఁ దీడునో ! |
| ౩౦౨ | ౩ | దీనికి దీని వివాహమింక |
| ౩౦౮ | ౨ | ...సేసి తన్నియు విధంబుల |
| | | ...తిన్నియు |
| ౩౧౧ | ౩ | మొనవేర్చి |
| ౩౧౩ | ౨ | ...సేని తవి...గా కిట |
| | | ఈత్రియి నీకేల ? |
| ౩౧౫ | ౭ | ...బన్యగానక |
| ౩౧౯ | ౨ | ...మొగంబుపై నెఱయు |
| | | ...మొగంబు నం గవియు |
| ౩౨౧ | ౧ | ...చోటుల |
| ౩౨౨ | ౨ | ...సాగియుటయును |
| ౩౩౧ | ౨ | సిమగ నేసినను |
| ౩౪౪ | ౩ | ...నొగలనూఁది |
| ౩౪౮ | ౧ | ...విక్షోభనం |

| పద్య సంఖ్య. | పంక్తి. | పాఠాంతరము. |
|---|---|---|
| ౩౪౯ | ౪ | డెపముడుగించుకయు |
| ౩౫౫ | ౫ | సాంత్వవచన |
| ౩౬౦ | ౫ | వానికిం గరుణింపు |
| ౩౮౩ | ౨ | యతి యత్నంబు గా |
| | ౫ | ...జవ్వనంబు చేసువకుం |
| ౩౯౧ | ౬ | కట్టనిచ్చి యతని |
| ౩౯౨ | ౪ | జను దేరక నిలుచు టెట్లు. |
| ౩౯౩ | ౧ | మనంబున ముడివడ |
| ౩౯౪ | ౩ | ...వవుగదా యిది యిట్లు |
| ౪౦౮ | ౧ | నీటుగల |
| | | మేటులగు |
| ౪౦౯ | ౧ | పదివేవురఁ జంపఁగ |
| ౪౧౬ | ౪ | ...నింకఁ జేయుము |
| ౪౧౭ | ౪ | నూఱ్ఱన కుండుట |
| ౪౨౧ | ౨ | తెంతవడికిం దెగు |
| ౪౨౪ | ౪ | క్షణనిమేషంబున...గా నీ త్రిలోకంబునుఁ |
| ౪౨౫ | ౧౨ | ...జగజెట్టులున్న వారు |
| ౪౨౬ | ౩ | ...వితతోల్లసన్నయన |
| | | ...ముదితోల్లసన్నయన |
| ౪౨౮ | ౩ | తమచరమార్గాదర్శన. |

సం॥